# వీక్షణం

VEEKSHANAM, TELUGU MONTHLY

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 15 సంచిక : 7 హైదరాబాద్ 192 జూలై 2017 పేజీలు : 68 రు. 20

- బహుళజాతి సంస్థల కోసమే జిఎస్‌టి
- అంబేడ్కర్‌ను గౌరవిస్తే సాంఘిక బహిష్కరణ?
- నరేంద్ర మోడీ మూడేళ్ల పాలన
- తెలంగాణ - పాత సీసాలో పాత సారా
- పశువధ నిషేధ చట్టం పూర్వాపరాలు
- రైతు ఆందోళనపై పోలీసు దమనకాండ
- వ్యాపార రహదారిలో చైనా వ్యూహం

# వీక్షణం రచయితల సమావేశం

## జూలై 9, 2017 ఆదివారం, మహబూబ్‌నగర్

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక గత తొమ్మిది సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు జరిపి, వీక్షణం పనితీరు మీద సమీక్ష, భవిష్యత్తుకు సూచనలు చర్చిస్తున్న సంగతి మీకు తెలుసు. రాష్ట్ర విభజన తరువాత తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలో విడివిడిగా ఈ సమావేశాలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం నుంచి ఈ సమావేశాలు జిల్లాలలో కూడా జరుగుతాయి. తెలంగాణ సమావేశం మొదటిసారిగా మహబూబ్‌నగర్ జిల్లాలో **జూలై 9 ఆదివారం, మధ్యాహ్నం 2 గంటలకు, టిఎన్‌జిఒ హాల్, తెలంగాణ చౌరస్తా, మహబూబ్‌నగర్**‌లో జరగనుంది. ఈ సందర్భంగా **'మూడేళ్ల తెలంగాణ తీరుతెన్నులు'** అనే అంశంపై చర్చ కూడా ఉంటుంది. వీక్షణం రచయితలు, పాఠకులు, శ్రేయోభిలాషులు అందరికీ ఆహ్వానం.

**వై. రామచంద్రం** (9949391028) ను సంప్రదించండి

# ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం - 2017

## జూన్ 17, 2017 శనివారం, షోయెబ్ హాల్, సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్















192 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2017
సంపుటి : 15
సంచిక : 07







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌పై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 జూన్ నెలలో వచ్చిన విరాళాలు - కిరణ్ గొడిశాల, యు.ఎస్.ఎ. - రు. 5,000; వై. రాజేశ్వరి, నెల్లూరు- రు. 500; బాలాజీ వరప్రసాద్, విజయవాడ - రు. 10,000; పి. సుధాకర్ రెడ్డి, భువనగిరి - రు. 1,000; కాకరాల, హైదరాబాద్ - రు. 2,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.***

*వీక్షణం జూన్ సంచికలో 'దేశ భవిష్యత్తుకు సూచిక ఉత్తరప్రదేశ్' అనే సంపాదకీయం అమూలాగ్రం చదివింపజేసేదిగా ఉండడమేగాకుండా ఆలోచింప చేసేదిగా ఉంది. అలాగే 'మిర్చీ రైతుల మృత్యుఘోష' మనసును కలవర పరిచింది. ఈ నేల, ఇరుగు-పొరుగు, భూగోళం మంచి సమాచారాన్ని అందించాయి.*

**- బిక్కునూరు రాజేశ్వర్**
*పొన్కల్, నిర్మల్*

*వీక్షణం జూన్ సంచికలో విద్య అంశానికి సంబంధించి ప్రచురితమైన రెండు వ్యాసాలు బాగున్నాయి. ప్రాథమిక విద్య నుండి యూనివర్సిటీ విద్య వరకు దేశంలో విద్య ఒక ప్రధాన వ్యాపారంగా మారుతున్న వైనాన్ని, సదరు పరిణామంలో ప్రభుత్వాలు ఆదినుంచి అంచలంచలుగా అందిస్తున్న అండదండల గురించి ఈ వ్యాసాలు స్పష్టం చేస్తున్నాయి.*

**- ఎస్. కిశోర్ కుమార్**
*హైదరాబాద్*

*వీక్షణం మే సంచికలో ప్రచురించిన 'అడవిలో ప్రవేశించాలనే ఆశయం నెరవేరిన రోజు'...అన్న డా. శ్రీనివాస్ వ్యాసం బావుంది. ఆనాటి విశాఖ పరిస్థితిని గుర్తుచేసింది. కాని అందులో ఒక దగ్గర కా. అప్పలసూరి (ఎఎస్) కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీకి ఆగస్టు తీర్మాణాన్ని పంపలేదనే కారణం జూపి పార్టీ నుండి వైదొలిగారు అని రాశారు. ఇది తప్పు. అలాగే పాణి కూడా తన జనతన రాజ్యం అన్న పుస్తకంలో కూడా ఇలాంటి అభిప్రాయాన్నే ప్రకటించారు. కాబట్టి ఆ శ్రేణులలో ఇలాంటి అభిప్రాయమే అప్పల సూరి ఎడల ఉన్నట్టు లేదా ప్రచారంలో పెట్టినట్టు అనిపిస్తుంది. కాని, ఇది తప్పు. అవాస్తవం. వైదొలిగారు, వదిలిపోయారు అనే కంటే వదిలించుకున్నారనడం, తొలగించారనడం కరెక్టు. సిఓసి అస్తిత్వం మీద ఆయన అభిప్రాయం వేరేగా ఉంది. అయినా భిన్నాభిప్రాయంతోనే పార్టీలో కొనసాగుతానన్నారు. అందుకు కెఎస్/ఎస్ఎలు అంగీకరించలేదు. ఏదైనా ఊపులో, వాపులో ఉంటే నిజాలు నిష్ఠూరాలుగా, వాస్తవాలు చాదస్తాలుగా కనపడతాయట. వాస్తవానికి కెఎస్/ఎస్ఎంలే సిఓసిని వదిలిపెట్టి పిడబ్ల్యుని ఏర్పాటు చేసుకున్నారు. ఎఎస్ మాత్రం సిఓసి గానే కొనసాగారు. సిఓసిలో కొనసాగుతూనే మిగతా రాష్ట్రాల నాయకులతో సంబంధాలను పునరుద్ధరించుకొని తరువాత పార్టీ యూనిటీ (పియు) ఏర్పడ్డం జరిగింది. 1998లో అదే పిడబ్ల్యు/పియులు విలీనమవడం, ఆపాయ నుండే కా. గంటి ప్రాసాదం రావడం, తరువాత 2004లో పిడబ్ల్యు/ఎంసిసి కలిసి సిపిఐ మావోయిస్టుగా ఏర్పడ్డం, ఆ రకంగా మావోయిస్టు పార్టీ మూలాల్లో ఓ మూలన కా. అప్పల సూరి ఉంటారు. ఏమైనా తన పరిధిలో, తన పరిమితులలో కా. అప్పల సూరి విప్లవోద్యమంలోనే ఉన్నారు. విప్లవ కారునిగానే జీవించారు. విప్లవకారునిగానే మరణించారు. అలాగే శ్రీనివాస్ దీన్నొక సంక్షోభంగా చిత్రీకరించారు. కాని పిడబ్ల్యు అవిర్భావంలోనే సంక్షోభ బీజాలున్నాయనడానికి ఇది సూచిక మాత్రమే. తర్వాత చరిత్ర దీన్ని రుజువు పరిచింది. ప్రస్తావించకపోయినా ఫరవాలేదు. కానీ తప్పుగా ప్రస్తావించడం, వక్రీకరించడం సరికాదు. ఇది చిన్న చూపుగా, కించ పరచడంగా, అవమానించడంగా అనిపించింది. అందుకే ఈ ఉత్తరం.*

**- ఓఎఎస్ అభిమాని**
*విశాఖపట్నం*

*వీక్షణం జూన్ సంచికలో వచ్చిన టి. శ్రీరామమూర్తి లేఖ చదివాను. నాకు తెలిసిన రెండు ముక్కలు పరిష్కార సూచనగా తెలియజేస్తున్నాను. ఆలోచించమని మనవి చేసుకుంటున్నాను. విప్లవోద్యమ నిర్మాత కొండపల్లి సీతారామయ్య 1980ల్లో ఖమ్మంలో ఓ మీటింగ్‌లో మాట్లాడుతూ "ప్రజాస్వామ్య ప్రియులందరూ విప్లవ ఊహాగానాల్లోంచి విప్లవాచరణకి తక్షణం దిగాల్సిన సమయం" అని చెప్పారు. శ్రీరామ్మూర్తి ఆవేదనకి ఆచరణయే పరిష్కారం. తక్షణం చేయాల్సింది కార్యాచరణ. నిర్మాణం వైపు పరుగిడమని మనవి చేసుకుంటున్నాను.*

**- ఎస్.పి. రామం**
*విశాఖపట్నం*

*ఒడిశా రాష్ట్రం మల్కన్‌గిరి జిల్లా కప్పతొట్టి అటవీ ప్రాంతంలో జూన్ 3న మావోయిస్టు కార్యకర్త చిన్నబ్బాయి (సురేష్) ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడని పోలీసులు చేసిన ప్రకటన పూర్తిగా అవాస్తవం. ఇతను పార్టీ అనుమతితో లొంగిపోయి స్వగ్రామంలో ప్రశాంత జీవనం గడపడానికి నిర్ణయించుకొని కోరాపుట్ పడావు అటవీ ప్రాంతానికి వెళ్లాడని తెలుస్తున్నది. అక్కడ జూన్ 1న నిర్బంధంలోకి తీసుకున్న పోలీసులు తీవ్రంగా చిత్రహింసలు పెట్టి కాల్చి చంపారు. భౌతిక కాయాన్ని పౌరహక్కుల బాధ్యులు, ఆదివాసి సంఘ బాధ్యులు పరిశీలించగా శరీరంపై తీవ్రగాయాలు, గొడ్డలితో, పదునైన ఆయుధంతో నరికిన గుర్తులు కనబడ్డాయి. గూడా నాగేశ్వరరావు అనే అసలు పేరుగల చిన్నబ్బాయి పెదబయలు మండలం, రాపల్లి పంచాయతీ, కొండమోలు గ్రామస్థుడు. రెండు దశాబ్దాలుగా అజ్ఞాతవాసంలో ఉండి మార్చిలో పోలీసుల ముందు లొంగిపోయాడు. ఈ హత్యపై హైకోర్టు న్యాయమూర్తితో విచారణ జరిపించాలి. బాధ్యులైన పోలీసులపై హత్యానేరం మోపి విచారణ జరపాలి.*

**- టి. శ్రీరామమూర్తి**
*విశాఖపట్నం*

*(జూన్ సంచికలో పాఠకుల వీక్షణంకు తుంపాల శ్రీరామమూర్తి రాసిన ఉత్తరంలో మావోయిస్టు పార్టీ ఏర్పడిన సంవత్సరం 2004కు బదులు 2014గా అచ్చయింది. పొరపాటుకు చింతిస్తూ - సం)*

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ముత్తనగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# రాష్ట్రపతి ఎన్నికల అవకాశవాద రాజకీయాలు



**భా**రత రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ పదవీకాలం జూలై 25న ముగుస్తుంది గనుక వారం రోజుల ముందే జూలై 17న కొత్త రాష్ట్రపతి కోసం ఎన్నిక జరగనుంది. నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ అభ్యర్థిగా ఉత్తరప్రదేశ్ కు చెందిన భారతీయ జనతా పార్టీ నాయకుడు, ప్రస్తుత బీహార్ గవర్నర్ రామనాథ్ కోవింద్, యునైటెడ్ ప్రోగ్రెసివ్ అలయన్స్ అభ్యర్థిగా బీహార్ కు చెందిన కాంగ్రెస్ నాయకురాలు, లోకసభ మాజీ స్పీకర్ మీరా కుమార్ పోటీ పడుతున్నారు. ఎన్‌డిఎ భాగస్వామ్య పక్షాలకు సొంతంగా 48 శాతం బలమే ఉన్నప్పటికీ, జనతాదళ్ (యు), భారతీయ జనతాదళ్, తెలంగాణ రాష్ట్ర సమితి, అన్నా డిఎంకె, వైఎస్ఆర్‌సిపి వంటి పార్టీల మద్దతుతో 60 శాతం వోట్లు సంపాదించుకుని రామనాథ్ కోవింద్ రాష్ట్రపతిగా ఎన్నికవుతారనేది గోడమీది రాతలా స్పష్టంగా కనబడుతూనే ఉంది. కనుక ఈ ఎన్నికల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసిందేమీ లేదని అనిపించవచ్చు. పైగా రాష్ట్రపతి పదవి లాంఛనంగా దేశంలోకెల్లా అత్యున్నత పదవి అయినప్పటికీ, అది కేంద్ర మంత్రివర్గం చేతిలో, ఇంకా చెప్పాలంటే ప్రధానమంత్రి చేతిలో రబ్బర్ స్టాంప్ గా మారిపోయి చాల కాలం అయింది గనుక కూడ రాష్ట్రపతి ఎన్నిక గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసిందేమీ ఉండదు.

కాని ఈసారి రాష్ట్రపతి ఎన్నికకు ఇతర కారణాల వల్ల చెప్పుకోవలసిన ప్రత్యేకతలు వచ్చాయి. అధికారం తమ చేతుల్లో ఉందనే అహంకారంతో సంఘ్ పరివార్ శక్తులు గత మూడు సంవత్సరాలలో దేశవ్యాప్తంగా ముస్లింల మీద, దళితుల మీద, ఆదివాసుల మీద పెద్ద ఎత్తున నిందలకు, వేధింపులకు, దాడులకు, హింసకు తెగబడుతున్నారు. మరీ ముఖ్యంగా గత ఏడాది గుజరాత్‌లోని ఊనాలో పశు కళేబరం తీసుకుపోతున్న దళితుల మీద దాడితో ప్రారంభించి దేశంలో ఎన్నో చోట్ల గోమాంసం ఉందనే పేరుతో ముస్లింల మీద, దళితుల మీద దాడులు పెరిగిపోయాయి. చివరికి దళితులలో అత్యధికుల ఆహారపుటలవాట్లను కాలరాస్తూ పశువధ మీద ఆంక్షలు కూడ విధించారు. బహిరంగంగా ప్రకటించినా, ప్రకటించక పోయినా, నాయకత్వం ఉన్నా లేకపోయినా సంఘ్ పరివార్ పాలన పట్ల, హిందుత్వ రాజకీయాల పట్ల దళితుల అసంతృప్తి దేశంలో అనేకచోట్ల రగులుకోవడం మొదలయింది. దశాబ్దాలుగా అనామకంగా, కరుడుగట్టిన ఆర్‌ఎస్‌ఎస్ కార్యకర్తగా ఉన్న రామనాథ్ కోవింద్ పేరు రాష్ట్రపతి అభ్యర్థిగా ప్రతిపాదన రావడం ఈ నేపథ్యంలోనే చూడాలి. అప్పటిదాకా ఎల్‌కె అద్వాణీ, మురళీ మనోహర్ జోషి, సుష్మాస్వరాజ్ వంటి వారి పేర్లు ప్రచారంలో పెడుతూ వచ్చిన భారతీయ జనతా పార్టీ హఠాత్తుగా రామనాథ్‌కోవింద్ పేరు సూచించడం ఆయన విశ్వాసపాత్రుడైన దళితుడు అయినందువల్ల మాత్రమే. మనుస్మృతిని, చాతుర్వర్ణ వ్యవస్థను అక్షరాలా పాటిస్తూ ఆయా వర్గాలను అణచి ఉంచుతూనే, ఆ వర్గాల నుంచి ఒకరిద్దరు వ్యక్తులను ఏరి వారిని ప్రదర్శనా వస్తువులుగా ముందు పెట్టడం సంఘ్ పరివార్‌కు గతంలో కూడ అలవాటే. బాబ్రీ మసీదు విధ్వంసానికి మొదటి అడుగు, రామజన్మభూమి నిర్మాణానికి మొదటి ఇటుక దళితులతోనే వేయించిన ఘనత సంఘ్‌పరివార్‌దే. భాజపా ప్రదర్శించిన ఈ అవకాశవాదాన్ని కాంగ్రెస్ నాయకత్వంలోని ప్రతిపక్షాలు కూడ అంతే అవకాశవాదంతో ఎదిరిస్తున్నాయి. అప్పటివరకూ ఉమ్మడి అభ్యర్థి కోసం వెతుకుతున్నామనే పేరుతో తాత్సారం చేసి, ఒక దశలో గాంధీ మనుమడు గోపాలకృష్ణ గాంధీ పేరు ముందుకు తెచ్చి, చివరికి భాజపా దళిత అభ్యర్థిని ప్రకటించగానే తాము కూడ దళిత అభ్యర్థి కోసం వెతుకులాట ప్రారంభించారు. బాబాసాహెబ్ అంబేద్కర్ మనుమడినో, జగ్జీవన్‌రామ్ కూతురినో పోటీ పెట్టడానికి ప్రయత్నాలు మొదలుపెట్టారు. చివరికి జగ్జీవన్‌రామ్ కూతురు మీరా కుమార్ పేరు ప్రకటించారు.

ఇప్పుడిక రాష్ట్రపతి పదవికి ఇద్దరు దళితుల మధ్య పోటీ ప్రారంభ మయింది. ఈ పోటీలో కాంగ్రెస్ కు చెందిన దళిత మహిళ ఓడిపోయి, భాజపాకు చెందిన దళిత నాయకుడు గెలవవచ్చు. కాని ఎవరు గెలిచినా దళితుల జీవితాలలో ఎటువంటి మార్పూ రాబోదని గతంలో అత్యున్నత స్థానాలు అధిరోహించిన దళితుల అనుభవాలు చూపుతున్నాయి. దోపిడీ పీడనల వ్యవస్థ మారకుండా, అసమ ఆస్తి సంబంధాలూ, అసమ సామాజిక సంబంధాలూ మారకుండా, కులవివక్ష భావజాలం రద్దు కాకుండా గద్దె మీద ఎవరు కూచున్నా వాళ్లు పాలకవర్గాల రబ్బర్ స్టాంపులుగా ఉండవలసిందే తప్ప తాము పుట్టిన వర్గానికి ఇసుమంత మేలు కూడ చేయజాలరు. రోహిత్ వేముల అన్నట్టు ఈ దేశంలో అనేక మందికి పుట్టుక ఒక ప్రాణాంతక ప్రమాదంగా ఉన్నమాట నిజమే గాని, కొందరు ఆ పుట్టుకను చూపి పాలకవర్గాల దాసులుగా మారి, పైకి ఎదిగి, ప్రదర్శనావస్తువులుగా మారిపోతున్న ప్రమాదం కూడ ఉందనడానికి రామనాథ్ కోవింద్, మీరా కుమార్‌లే ఉదాహరణ. వారు పాలకవర్గాల చేతి పనిముట్లుగా మారిపోయారు. తాము పుట్టిన కులానికి సేవ చేయాలనే అవగాహన ఎప్పుడో వదులుకున్నారు. అసలు పుట్టుకతో ఒక మనిషి అస్తిత్వాన్ని నిర్ణయించడమే మనువాదానికి మూలధాతువు. పుట్టుకకు ఇవ్వవలసిన ప్రాధాన్యత ఇస్తూనే, అవగాహనను, విలువలను, ఆచరణను బట్టి ఏ వ్యక్తి అస్తిత్వాన్నయినా అంచనా కట్టవలసి ఉన్నది. అలా కాక పుట్టుకనే ప్రధానంగా పరిగణించినంత కాలం అది ప్రచ్ఛన్న మనువాదంగానే ఉంటుంది. పాలకవర్గాల దాసులుగా స్పష్టంగా కనబడుతున్న వాళ్లను కూడ కేవలం పుట్టుక చేత దళితుల, బాధితుల ప్రతినిధులుగా పొరపాటు పడే ప్రమాదం పొంచి ఉంటుంది. నిజానికి గత ఏడు దశాబ్దాల భారత పార్లమెంటరీ రాజకీయాల చరిత్రలో పాలక వర్గాల, అగ్రవర్ణాల చేతి పనిముట్లుగా, పాలకవర్గ పార్టీల ప్రదర్శనా వస్తువులుగా ఉపయోగపడిన దళితుల, అణగారినవర్గాల, బాధితుల బిడ్డలు ఎందరో ఉన్నారు. ప్రతిభావంతులుగా, జనసమూహాలను ఆకర్షించగల, మెప్పించగల నాయకులుగా ఉండిన ఆ నాయకులందరూ నిజంగా తమ సమూహాలకు మేలు చేయగల అవగాహనలను, విలువలను, ఆచరణను అలవరచుకుని ఉంటే, కనీసం తమ మీద పెత్తనం చేస్తున్న పాలకవర్గ, అగ్రవర్ణ ప్రయోజనాలకు అడ్డుకట్ట వేయగలిగి ఉంటే దేశ చరిత్రే భిన్నంగా ఉండేది. ఇప్పుడు రాష్ట్రపతి కాబోయే రామనాథ్ కోవింద్ గతంలో ప్రకటించిన అభిప్రాయాలు చూసినా, ఐదు దశాబ్దాల సంఘ్ పరివార్ నిబద్ధ జీవితం చూసినా ఆయన నుంచి దళితులు గాని, దేశం గాని ఆశించవలసిందేమీ లేదు. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# గొల్లన్నే తన బొచ్చు మొలిపిస్తాడనుకునే గొర్రె

సరిగ్గా యాభై ఏళ్ల కింద 1967లో ప్రజాకవి కాళోజీ 'గొర్రెదాటు' అని ఒక కవిత రాశారు. "దగాగడ్డి కరుస్తాంది గొర్రె/ .../బయళ్ల గడ్డి గొల్లన్నే మొలిపిస్తాండనుకుంటాంది గొర్రె/సెలయేళ్ల నీళ్లన్నీ గొల్లన్నే ఒలికిస్తాండనుకుంటాంది గొర్రె/ గొల్లన్న పెయ్యొలిచిన గొంగడి బొచ్చే/ తన మెయి నిండా మొలుస్తాందనుకుంటాంది గొర్రె/ గొల్లన్న యాతనంతా తన కోసమే అనుకుంటాంది గొర్రె..." అని సాగే ఆ దీర్ఘ కవిత ప్రజలను అమాయకంగా మోసానికి బలి అయిపోతున్న గొర్రెలుగా, వారిని దగాచేసే రాజకీయ నాయకులను గొల్లన్నగా చిత్రించారు. ప్రజలను ప్రతిఘటన లేని గొర్రెలుగా చిత్రించినందుకు ఈ కవిత మీద విమర్శలు వచ్చాయి గాని, యాభై ఏళ్లు గడిచినాక, మరీ ముఖ్యంగా ఏ తెలంగాణ గురించి కాళోజీ ఈ మాటలు రాశాడో ఆ తెలంగాణలో గత మూడేళ్ల పరిణామాలు చూస్తుంటే ఆ కవిత అక్షరసత్యం అనిపిస్తున్నది. మరీ ముఖ్యంగా గొర్రెల పెంపకానికి ప్రోత్సాహం పేరుతో తెలంగాణ ప్రభుత్వం చెపుతున్న అబద్ధాలు, ప్రగల్భాలు, చేస్తున్న మోసాలు, వాటిని మౌనంగా సహిస్తున్న తెలంగాణ సమాజం సరిగ్గా కాళోజీ మాటలకు సరిపోతున్నాయి. గొర్రె మాంసానికి మార్కెట్ లో ఎక్కువ డిమాండ్ ఉన్నందువల్ల, ఆ డిమాండ్ ను తీర్చి మార్కెట్ వాటా పెంచుకోవడానికి, తద్వారా ఆయా పెంపకందారుల కుటుంబాలకూ, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకూ ప్రయోజనం చేకూర్చడానికీ ప్రయత్నించడం అవసరమే, ఉపయోగకరమైన ఆలోచనే. కాని అవసరమైన పనులు కూడ మన రాజకీయ నాయకుల కనుసన్నల్లో ఎట్లా కుంభకోణాలుగా, అబద్ధాలుగా, మాయ చేసే సాధనాలుగా మారిపోతాయో ఈ గొర్రెల పథకమే మంచి ఉదాహరణ. ఒక జీవనోపాధి అవకాశం గురించి మాట్లాడుతున్నప్పుడు కులవృత్తిని ముందుకు తీసుకువచ్చి హిందూ బ్రాహ్మణీయ భూస్వామ్య నిచ్చెనమెట్ల కులవ్యవస్థను ప్రోత్సహించే చర్యలు చేపట్టడం ఈ పథకపు మౌలిక ప్రమాదం. రాష్ట్రం ఇప్పటికే గొర్రెల జనాభాలో అగ్రస్థానంలో ఉండగా, మరొక కోటి గొర్రెలను కొత్తగా ప్రవేశపెట్టాలని ఆలోచించడం, వాటి మేతకు తగిన భూమి ఉన్నదా లేదా కసరత్తు చేయకపోవడం, బడ్జెట్ కేటాయింపులు లేకుండానే భారీ పథకాలు ప్రకటించడం, పొరుగు రాష్ట్రాల నుంచి కొనుగోలు చేస్తామని అన్నప్పుడు ఆ పొరుగు రాష్ట్రాల మార్కెట్లు అందుకు అనువుగా ఉన్నాయో లేదో చూడకపోవడం, పెరిగిన గొర్రెల సంఖ్యకు అనుగుణంగా పశువైద్యశాలలు, పశువైద్యులు ఉన్నారో లేదో పరిగణనలోకి తీసుకోకపోవడం, రాష్ట్రంలో గొర్రెల జనాభా రెట్టింపు అయిన తర్వాత కూడ మాంసానికి ఇప్పటి ధరలే ఉంటాయన్నట్టుగా ఆదాయపు కాకిలెక్కలు వేసి అతిశయోక్తులతో వేలాది కోట్ల రూపాయల ఆదాయం వస్తుందని ప్రగల్భాలు పలకడం, గ్రామస్థాయిలో గొల్ల, కుర్మల సంఘాలు ఏర్పాటుచేసి, ఆ సంఘ సభ్యులకే గొర్రెలు ఇస్తామని షరతుపెట్టి ఈ సంక్షేమ పథకం ద్వారా వోటు బ్యాంకును స్థిరపరచుకోవడానికి ప్రయత్నించడం, గొర్రెల కొనుగోలులో, పంపిణీలో అక్రమాలు వంటి సమస్యలెన్నో ఉండగా, ఆ సమస్యలన్నిటినీ మూసిపెట్టి ప్రజలను మాయ చేయడానికి, గొర్రెలుగా మార్చడానికి మాత్రమే ఈ పథకం ఉపయోగపడుతున్నది. యాభై ఏళ్ల తర్వాత కూడ పరిస్థితి మారలేదని, మార్చవలసిన ప్రజాచైతన్యం ఇంకా వికసించలేదని విచారించడం కన్న చేయగలిగింది లేదు. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# పాలన పాలకుల దయాధర్మం కాదు, అది బాధ్యత

తాను రాజకీయ నాయకుడిని కానని, ప్రపంచ బ్యాంకు తరఫున ప్రధాన కార్య నిర్వహణాధికారిని మాత్రమేనని గత పాలనా కాలంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు బహిరంగంగానే, స్పష్టంగానే ప్రకటించారు. ప్రజాసమస్యలకు సృజనాత్మకమైన, అర్థవంతమైన పరిష్కారాలు అన్వేషించడమే రాజకీయం అని, అటువంటి రాజకీయాలు నడిపేవారికి పాలనాధికారం ఇవ్వడమే ప్రజాస్వామిక ఎన్నికల లక్ష్యమని ఆయనకు తెలియదు. పాలన అంటే ప్రజలు ఇచ్చిన బాధ్యత అని ఆయన అనుకోవడం లేదు. పాలన తన దయాధర్మం అని, తాను తన ఇష్టప్రకారం ప్రజలకు మేలు చేస్తున్నానని, అందుకు ప్రతిఫలంగా ప్రజలు తనకు వోట్లు వేయాలని ఆయన సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని ఆయన చాల స్పష్టంగా, కుండబద్దలు కొట్టినట్టుగా జూన్ 23న నంద్యాలలో బహిరంగంగానే ప్రకటించారు. "మీకు మేలు చేయడానికి అన్నివిధాన ప్రయత్నం చేస్తున్నా. ఎవరు చేశారు? ఇరవై నాలుగు వేల కోట్లు రుణవిముక్తి చేశా. పదివేల కోట్లు డ్వాక్రా సంఘాలు పెట్టా. నా దగ్గర డబ్బులుండి కాదు.... నాకు వోటెయ్యక పోతే ఆ గ్రామం వైపు కూడ చూడను. నేను వేసిన రోడ్డు మీద నడుస్తూ, నేను ఇచ్చే పెన్షన్ తీసుకుంటూ నాకు వోటు వెయ్యరా?... అవతలి పార్టీ వాళ్లు ఇచ్చినట్టు నేను కూడ వోటుకు వెయ్యి, ఐదువేలు ఇవ్వగలను...." ఇలా ఆయన ఉపన్యాసం సాగింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుమీద ఈ దేశంలో సాగుతున్న ప్రహసనానికి తార్కిక ఫలితం ఇది. ప్రజల సమస్యల పరిష్కారం కోసం పనిచేస్తూ, ఆ పని చేసినందుకు ప్రతిఫలంగా జీతభత్యాలు పొందుతూ ప్రజాసేవకులుగా ఉండవలసిన ప్రభుత్వం, ప్రజా సమస్యలను పరిష్కరించకపోగా, మాయచేస్తూ, అబద్ధలు చెపుతూ, న్యాయమైన జీతభత్యాల కన్న ఎన్నోరెట్లు ఎక్కువ విలాసాలు అనుభవిస్తూ యజమానులుగా భావిస్తున్న తీరు ఇది. కొన్ని ఎంగిలి మెతుకులు విసిరి నందుకు ప్రజలు కృతజ్ఞులై వోట్లు వేస్తూ తమను ఎల్లకాలానికీ అధికారంలో ఉంచాలని బెదిరించే రాజకీయ నాయకుల పాలన సాగుతున్నదనడానికి ఈ ఉపన్యాసం నిదర్శనం. వ్యవసాయ రుణాల మాఫీ, డ్వాక్రా సంఘాల ఏర్పాటు, రోడ్ల నిర్మాణం, పెన్షన్లు వంటివి ప్రభుత్వాలు తప్పనిసరిగా చేయవలసిన అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలలో భాగం. ఆ పనులు చేయడానికే ప్రజలు ఆ రాజకీయ నాయకులకు అధికారం ఇచ్చారు. ఆ పనులు చేశాం గనుక అధికారం ఇవ్వండి, అధికారం ఇవ్వదలచుకోకపోతే ఆ పనుల ఫలితాలు పొందకండి అనడం తలకిందుల వాదనే అవుతుంది. ప్రభుత్వాధి నేతలు ఆ పనులన్నీ కూడ ప్రజాధనాన్ని వినియోగించి, లేదా భవిష్యత్ ప్రజాధనాన్ని చూపి అప్పులు తెచ్చి అమలు చేసినవే. అవేమీ వారి సొంత ఖజానాల నుంచి వెచ్చించి చేసినవి కావు. పైగా ఈ పనుల క్రమంలో అక్రమంగా వారి సొంత ఖజానాలు నింపుకుంటున్నారు కూడ. అలా తప్పనిసరిగా, బాధ్యతగా, విధ్యుక్తధర్మంగా చేసిన పనులకు ప్రజలు కృతజ్ఞత చూపాలని, వోట్లు వేయాలని అడగడం రాజకీయాలపట్ల, పాలనపట్ల, ప్రజా ధన వినియోగం పట్ల కనీస అవగాహన లేదనడానికి చిహ్నం. అటువంటి అవగాహనా రాహిత్యమే పాలకుల అర్హతగా చలామణీ కావడం విచారకరం. వీ

# బ్రిటన్ ఎన్నికల్లో ప్రజల అసంతృప్తి ప్రకటన

ఫ్రాన్స్ ఎన్నికల్లో కొత్తగాలులు వీచి నెల గడవకముందే బ్రిటన్ ఎన్నికల్లోనూ అనుకోని పరిణామాలు సంభవించాయి. ఇంకా మూడు సంవత్సరాల పదవీకాలం ఉండగానే, ప్రస్తుత పార్లమెంట్ 2020 మే దాకా కొనసాగే అవకాశం ఉండగానే, ప్రధానమంత్రి థెరెసా మే మధ్యంతర ఎన్నికలు జరపాలని తలపెట్టి, హౌజ్ ఆఫ్ కామన్స్‌లో ప్రతిపాదించి అనుకూలంగా 522 వోట్లు, ప్రతికూలంగా 13 వోట్లతో నెగ్గారు. ఆ నిర్ణయం ఫలితంగా హౌజ్ ఆఫ్ కామన్స్‌లోని 650 స్థానాలకు జూన్ 8న ఎన్నికలు జరిగాయి. మర్నాడు వెలువడిన ఫలితాలలో అధికార కన్సర్వేటివ్ పార్టీ 42.3 శాతం వోట్లతో 317 స్థానాలు సంపాదించుకోగా, ప్రధాన ప్రతిపక్షమైన లేబర్ పార్టీ 40 శాతం వోట్లతో 262 స్థానాలు గెలుచుకుంది. కన్సర్వేటివ్ పార్టీ అతి ఎక్కువ స్థానాలు సంపాదించిన పార్టీగా నిలిచినప్పటికీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి అవసరమైన సాధారణ ఆధిక్యత కూడ రాలేదు. గత ఎన్నికలలో వచ్చిన స్థానాలకన్న 13 స్థానాలు తక్కువ వచ్చాయి. లేబర్ పార్టీ గతంలో కన్న 30 స్థానాలు ఎక్కువ సంపాదించుకుంది. క్రియాశీల రాజకీయవాదిగా పేరుపొందిన లేబర్ నాయకుడు జెరెమీ కార్బిన్ ప్రతిష్ఠ మరింత పెరిగింది. ఫలితాలు విడుదలైన తర్వాత కూడ అతిపెద్ద పార్టీగా కన్సర్వేటివ్ పార్టీ అధికారమే కొనసాగుతున్నప్పటికీ, అది ఆధిక్యత కోసం డెమొక్రటిక్ యూనియనిస్ట్ పార్టీ అనే మరింత మితవాద పార్టీతో ఐక్యసంఘటన కట్టవలసి వచ్చింది. లేబర్‌పార్టీ పేరుకు మాత్రమే లేబర్‌గా మిగిలిందనీ, దాని వామపక్ష వాసనలన్నీ పోగొట్టుకుందనీ ఎన్ని విమర్శలు ఉన్నప్పటికీ, మార్గరెట్ థాచర్ విధానాల మీద నిప్పులు కురిపించిన వామపక్ష వాదిగా, ఇప్పటికీ సైకిల్ మీద తిరిగే నిరాడంబరుడిగా, తన సొంత పార్టీలోనే ఎంతో అసమ్మతిని, ప్రత్యర్థులను ఎదుర్కొంటున్న వ్యక్తిగా కార్బిన్ ఈ ఎన్నికల్లో నిజమైన విజేత అయ్యాడు. కన్సర్వేటివ్ పార్టీ, లిబరల్ డెమొక్రటిక్‌పార్టీ, స్కాటిష్ నేషనల్‌పార్టీ వంటివన్నీ బలహీనపడగా, కార్బిన్ నాయకత్వంలో లేబర్ పార్టీ గత ఎన్నికల కన్న ఎక్కువ విజయాలు సాధించింది. ఆ మాటకొస్తే టోనీ బ్లెయిర్ 2005లో సాధించినదానికన్న ఎక్కువ సాధించింది. గత ప్రభుత్వాలు బలహీనపరచిన నేషనల్ హెల్త్ సర్వీస్‌ను పునరుద్ధరించాలనీ, సంపన్నుల మీద పన్నులను పెంచాలనీ, బ్యాంకులు, మీడియా, "ప్రజా శత్రువులు" సాగిస్తున్న పెత్తందారీతనానికి అడ్డుకట్ట వేయాలనీ, ప్రైవేటీకరించిన రైల్వేలను మళ్లీ ప్రభుత్వ రంగంలోకి తీసుకురావాలనీ కార్బిన్ ఇచ్చిన ప్రగతిశీల నినాదాలకు బ్రిటిష్ వోటర్లు సానుకూలంగా స్పందించారు. అన్నిటికన్న ముఖ్యంగా యువతరం ఆయన వెనుక బలంగా నిలబడింది. నిజంగా లేబర్ పార్టీకి అధికారం వచ్చినా ఈ ప్రగతిశీల లక్ష్యాలను అమలులోకి తేలేరనీ, ప్రపంచీకరణలో, యుద్ధోన్మాదంలో అమెరికా పాలకవర్గాల అడుగులకు మడుగులొత్తుతారనీ గత లేబర్ ప్రధానమంత్రి టోనీ బ్లెయిర్ రుజువుచేసి ఉన్నాడు. కాని ఆ నినాదాలకు ప్రజలలో ఆదరణ ఉన్నదనీ, ఆ నినాదాలు ఇస్తున్నవారు అమలు చేయబోరని తెలిసినా ప్రజలు ఆ నినాదాలకు అనుకూలంగా తమ అభిమతం ప్రకటిస్తున్నారనీ ఈ ఎన్నికల ఫలితాలు తెలియజేస్తున్నాయి. మార్పు కోసం ప్రజల ఆకాంక్షలకు ఈ ఫలితాలు అద్దం పడుతున్నాయి. వీ





❖ **ఒక దేశద్రోహి ప్రేమకథ** – కవిత్వం – సాబిర్ – 104 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సయ్యద్ సాబిర్ హుసేన్, డోర్. నం. 22-143, కట్టకింద బజారు, వినుకొండ – 522 647, గుంటూరు జిల్లా. సెల్: 94493620796, 9154705556



❖ **కలచాలనమ్** – బుర్రా లక్ష్మీనారాయణ – పాలపిట్ట బుక్స్ – 176 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నం. 2, బ్లాక్-6, ఎపిఎచ్‌బి, బాగ్ లింగంపల్లి, హైదరాబాద్-44; ఫోన్: 040 27678430
ఈమెయిల్: palapittabooks@gmail.com



❖ **నేను తెలుసుకున్న కామ్రేడ్ సుందరయ్య** – డాక్టర్ ఎ.పి. విఠల్ – సాహితీ మిత్రులు – 144 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100



❖ **గెలుపు సరే... బతకడం ఎలా?** – కె.ఎన్.వై. పతంజలి – సాహితీ మిత్రులు – 1118 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100



❖ **కవిత 2016** – సాహితీ మిత్రులు – 160 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150
పై మూడు ప్రతులకు: సాహితీ మిత్రులు, 28-10-16, మస్జిద్ స్ట్రీట్, అరండల్‌పేట్, కార్ల్‌మార్క్ రోడ్, విజయవాడ – 520002; ఫోన్:0866 2433359; సెల్: 9392971359
ఈమెయిల్: www.kinige.com



❖ **చైతన్య శిఖరాలు** – (వ్యాసాల సంకలనం) – వి. జయరాముడు – 272 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150, ప్రతులకు: వి. జయరాముడు, ఇ.నం. 3-3-76/1, చైతన్య విలాస్ కాలనీ, హైదర్‌గూడ, హైదరాబాద్ – 500 048. సెల్: 9848215650



❖ **గతితప్పిన గమ్యం** – విద్యారంగం తీరు తెన్నులు – ఎడమ శ్రీనివాసరెడ్డి – నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌస్ – 216 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 120



❖ **కవిత్వం** – సృజనానుభవం – యాకూబ్ – తిరంగ పబ్లికేషన్స్ – 152 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, పై రెండు ప్రతులకు: నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌస్, ఎం.ఎచ్. భవన్, ప్లాట్ నం. 21/1, ఆజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణ మండపం దగ్గర, హైదరాబాద్-20. ఫోన్: 040 27660013



❖ **అలుకుపిడుచ** – కవిత – కందుకూరి శ్రీరాములు – ఝరీ పొయిట్రి సర్కిల్ – 120 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: ఝరీ పొయిట్రి సర్కిల్, 16-2-740/75/40, వి.కె. ధాగె నగర్, గడ్డి అన్నారం, హైదరాబాద్ – 60; ఫోన్: 040 24064195



❖ **గుర్నూలు పూలు** – కర్నూలు కథలు – కర్నూలు బుక్ ట్రస్ట్ – 102 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: డా. ఎం. హరికిషన్, 45/205-1, లేబర్ కాలనీ చర్చ్ ఎదురుగా, టీచర్స్ కాలనీ, కర్నూలు. సెల్: 9441032212;
ఈమెయిల్: drmharikishan@rediffmail.com



❖ **ఉత్తర తెలంగాణ పల్లెసంస్కృతి** – శాతవాహన పరిశోధక వ్యాసాలు – సంపాదకుడు: డా. కె. ముత్యం – శాతవాహన విశ్వవిద్యాలయం – 188 పేజీలు, 1/4 క్రౌన్, వెల రు. 250, ప్రతులకు: తెలుగు విభాగం, శాతవాహన విశ్వవిద్యాలయం, మల్కాన్‌పూర్ రోడ్, కరీంనగర్ – 505001. అన్ని ముఖ్య పుస్తక కేంద్రాలలో



❖ **స్వప్న సాధకులు** – విద్యార్థుల కవిత్వం – సంపాదకత్వం: బాలసుధాకర్ మౌళి – 80 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: ఎస్. బాలసుధాకర్ మౌళి, ఎస్‌బిఐ దగ్గర, బోయ స్ట్రీట్, నెల్లిమర్ల ఎస్.ఒ., విజయనగరం – 535 217; సెల్: 9676493680
ఈమెయిల్: champaavathi@gmail.com



❖ **రెండు పక్షులూ... ఒక జీవితం** – కవిత్వ సంభాషణ – బూర్ల వెంకటేశ్వర్లు – సాహితీ సోపతి – 90 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: బి. సంతోష, ఇ.నం. 2-10-1524/10, ఫ్లాట్ నం. 403, వెంకటేశ్వర టవర్స్, జ్యోతినగర్, కరీంనగర్-505 001; సెల్: 949198040
ఈమెయిల్: boorla@datamail.in



❖ **టోపీ జబ్బార్** – కథలు – వేంపల్లె షరీఫ్ (కేంద్ర సాహిత్య అకాడెమి యువ పురస్కార గ్రహీత) సూఫీ ప్రచురణలు – 142 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 125, ప్రతులకు: సూఫి ప్రచురణలు, సబీన పర్లపాటి, ఎస్ఎఫ్ 3, అబ్దుల్ వాహెద్ అపార్ట్‌మెంట్స్, మస్జిద్ స్ట్రీట్, భవానీపురం, విజయవాడ – 520 012; సెల్: 9603429366



❖ **కథలు రాయడమెలా?** – శౌంఠి కృష్ణమూర్తి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 88 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60

❖ **ప్రసిద్ధ బాలల నాటికలు** (1912-2000) – సంపాదకుడు: వల్లూరు శివప్రసాద్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్– 380 పేజీలు, 1/8 డెమీ, వెల రు.280



పై రెండు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్-500 068, తెలంగాణ
ఫోన్ : 040-24224453/54
ఈమెయిల్: navachethanaph@gmail.com

# కార్పొరేట్ల కోసమే 'ఒక దేశం ఒకే పన్ను'

***దేశపు పన్నుల విధానంలో కీలకమైన, విప్లవాత్మకమైన సంస్కరణగా పాలకవర్గాలు ప్రచారం చేస్తున్న వస్తు, సేవల పన్ను - గూడ్స్ అండ్ సర్వీసెస్ టాక్స్ - అసలు స్వభావాన్ని, పరిణామాలను వివరిస్తున్నారు ఎన్ వేణుగోపాల్***

**పరిచయం**

ఫ్లిప్ కార్ట్ అనే ఇ కామర్స్ సంస్థ స్థాపకుడు, ఎగ్జిక్యూటివ్ చైర్మన్ సచిన్ బన్సల్ ఏడాది కింద ఎకనమిక్ టైమ్స్‌లో ఒక వ్యాసం రాస్తూ, "భారత దేశం గురించి చెప్పుకోదగిన పుస్తకాలలో ఒకటి విపి మీనన్ రాసిన ది ఇంటిగ్రేషన్ ఆఫ్ ఇండియన్ స్టేట్స్. 1947 నాటికి 40 శాతం భారత భూభాగం, 25 శాతం జనాభా, 562 మంది మహారాజుల పాలనలో ఉండేది. వారందరినీ 1951 నాటికి భారత రాజ్యంలో విలీనం చేసి, భారత రాజకీయ ఐక్యత సాధించడానికి సర్దార్ పటేల్ నాయకత్వాన జరిగిన ప్రణాళికను ఆ పుస్తకం అద్భుతంగా వర్ణిస్తుంది. జిఎస్‌టిని ఆమోదించడం మన ఆర్థిక ఐక్యత మీద అటువంటి ప్రభావమే వేస్తుంది" అన్నాడు.

వేరువేరు రాజకీయ పాలనలో ఉన్న వేరువేరు చరిత్రల, సంస్కృతుల, సంప్రదాయాల, వనరుల, అవసరాల ప్రాంతాలన్నిటినీ ఒకే ముద్దగా కలిపి భారత యూనియన్ అనే "రాజకీయ ఐక్యత" సాధించడానికి వల్లభ్ భాయి పటేల్ నాయకత్వంలో నాటి సంస్థాన మంత్రిత్వ శాఖ సామ, దాన, భేద, దండోపాయాల్ని ప్రయోగించింది. కశ్మీర్, హైదరాబాద్ వంటి రాజ్యాల మీద సైనిక చర్యలు కూడ జరిపింది. ఇప్పుడు ప్రభుత్వం ప్రవేశపెడుతున్న జిఎస్‌టి అనే కొత్త పన్నుల విధానాన్ని ఆ విలీనాల, ఆక్రమణల, దురాక్రమణల చర్యతో పోల్చడం భారత దళారీ బూర్జువా వర్గ నాయకుడు సచిన్ బన్సల్ తెలిసి చేశాడో, తెలియక చేశాడో గాని సరిగ్గా సరిపోయే పోలిక అది.

సరిగ్గా ఆ పాత రాజకీయ ఐక్యత లాగనే ప్రస్తుత ఆర్థిక ఐక్యత కూడ అంతే నిరంకుశంగా, ప్రజాభిప్రాయంతో సంబంధం లేకుండా జరుగుతున్నది. ఆ రాజకీయ ఐక్యత ఎట్లా సామ్రాజ్యవాదుల, బడా బూర్జువాల, దళారీ బూర్జువాల ప్రయోజనాల కోసం, ఏకైక సువిశాల మార్కెట్ స్థాపన కోరికతో జరిగిందో, ప్రస్తుత ఆర్థిక ఐక్యత కూడ అవే వర్గాల అవే ప్రయోజనాల కోసం, అవే కోరికలతో జరుగుతున్నది. ఆ రాజకీయ ఐక్యత ఎట్లా ఏడు దశాబ్దాల తర్వాత కూడ నిజమైన ప్రజా ఐక్యతగా, సమగ్రతగా మారకుండా ప్రాంతీయ, భాషా, జాతి అనైక్యతలతో విలసిల్లుతున్నదో, ఈ కొత్త ఆర్థిక ఐక్యత కూడ ప్రజలకు అంతే గందరగోళంగా, విధ్వంసకరంగా, బహుళ జాతి సంస్థలకూ, దళారీలకూ ఇష్టారాజ్యంగా మారబోతున్నది. దేశ పాలకవర్గాలు అప్పుడు దేశ ఐక్యత, సమగ్రత అనే భ్రమగొలిపే నినాదాలతో ఎలా వేరువేరు జాతులు తమ ప్రత్యేకతలను వదులుకొని, ఒకే దేశంలో రాజకీయంగా సంఘటితం కావాలని పిలుపునిచ్చి, ప్రజలను, ముఖ్యంగా మధ్యతరగతిని మోసపుచ్చి, తమ సువిశాల ఏకీకృత రాజకీయ రంగస్థలం సిద్ధం చేసుకున్నారో, సరిగ్గా అలాగే ఇప్పుడు ఏకీకృత ఆర్థిక విపణివీథిని ఏర్పాటు చేసి, దేశీయ ఉత్పత్తులనూ, వ్యాపారాలనూ తొక్కివేసి, తమ విచ్చలవిడి లాభార్జనా అవకాశాల మార్కెట్‌ను విస్తరించుకోదలిచారు.

**జిఎస్‌టి అంటే ఏమిటి?**

గూడ్స్ అండ్ సర్వీసెస్ టాక్స్ (జిఎస్‌టి – వస్తువుల మీద, సేవల మీద విధించే పన్ను, క్లుప్తంగా వస్తు, సేవల పన్ను) దేశ ఆర్థికవ్యవస్థ చరిత్రలో ఒక విప్లవాత్మకమైన, కనీ వినీ ఎరగని సమూలమైన మార్పు తెచ్చే చర్య అని, అది అమలు లోకి వస్తే దేశవ్యాప్తంగా ప్రజలకు, వినియోగదారులకు పన్ను భారం తగ్గిపోతుందని, పన్ను చెల్లింపు సులభతరం అవుతుందని, జాతీయాదాయంలో రెండు శాతం పైన వృద్ధి ఉంటుందని పాలకవర్గాలు ఆర్భాటంగా ప్రచారం చేస్తున్నాయి. ఇంతకూ ఈ జిఎస్‌టి ఏమిటి?

జిఎస్‌టి అంటే వస్తువుల, సేవల ఉత్పత్తి, రవాణా, అమ్మకాల మీద ప్రభుత్వం వేసే పన్ను. ప్రభుత్వాలు శతాబ్దాలుగా పన్నులు వేస్తూనే ఉన్నాయి గదా, ప్రజలకు చెప్పీ చెప్పకుండా, ప్రత్యక్షంగా, పరోక్షంగా గోళ్లూడగొట్టి వసూలు చేస్తూనే ఉన్నాయి గదా, ఇది ఇంకో కొత్త పన్ను, దానిలో అంత గగ్గోలు పెట్టవలసింది ఏముంది అనిపించవచ్చు. అయితే ఇది ఒకానొక కొత్త పన్ను మాత్రమే కాదు. ఇది మొత్తంగా ఒక కొత్త పన్నుల విధానం. ఇంతకాలంగా అమలులో ఉన్న పన్నుల విధానానికి భిన్నమైన పన్నుల విధానం. ఈ కొత్త పన్నుల విధానం 2017 జూలై 1 నుంచి దేశవ్యాప్తంగా అమలులోకి రాబోతున్నది. ఎన్నో దశాబ్దాలుగా కొనసాగుతూ వస్తున్న రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల పరోక్ష పన్నులన్నిటినీ తొలగించి వాటి స్థానంలో ఈ కొత్త పన్నుల విధానం రానున్నది.

**దేశంలో ప్రస్తుత పన్నుల విధానం**

కొత్త పన్నుల విధానం గురించి చర్చించబోయే ముందు ప్రస్తుతం అమలులో ఉన్న పన్నుల విధానంలో ఏ లోపాలు ఉన్నాయో వాటిని సంస్కరించడం సాధ్యమో కాదో, ఆ విధానాన్ని పూర్తిగా రద్దు చేసి, సంపూర్ణంగా కొత్త విధానాన్ని ప్రవేశపెట్టవలసిన అవసరం ఉందో లేదో చూడాలి.

ఏ దేశంలోనైనా ప్రజల వినియోగం మీద, ప్రజల మధ్య జరిగే వినిమయం మీద, వేరువేరు ప్రజా రంగాల మధ్య జరిగే పంపిణీ మీద, ఆ ప్రజా సమూహాలకు అవసరమైన సరుకుల, సేవల ఉత్పత్తుల మీద

ప్రభుత్వం పన్నులు విధిస్తుంది. ప్రభుత్వ నిర్వహణ అంతా కూడ ఆ పన్నుల ఆదాయంతోనే సాధ్యమవుతుంది. దాదాపుగా రాజరికాలు ఏర్పడిన నాటి నుంచీ ప్రజల మీద పన్నులు వేసి, ఆ పన్నుల ఆదాయంతో రాజ్యాంగయంత్రాన్ని నిర్వహించడం అమలులో ఉంది. భూస్వామ్య, రాచరిక యుగాలలో విస్తారంగా విధించిన పన్నులను, పెట్టుబడిదారీ విధానం తర్వాత కొంత క్రమబద్ధం చేయడం జరిగింది. అంతకుముందు జుట్టు పన్ను, వక్షోజాల పన్ను, పండుగల పన్ను, శుభకార్యాల పన్ను వంటి సహజమైన, నైసర్గికమైన, సాంస్కృతికమైన అంశాల మీద కూడ రాజులు పన్నులు విధించారు. కాని, పారిశ్రామిక విప్లవం, పెట్టుబడిదారీ విధానం తర్వాత పన్ను విధింపు ఉత్పత్తి, పంపిణీ, వినిమయం, వినియోగం అనే నాలుగు స్థాయిలకు పరిమితమయింది.

భారతదేశంలో కూడ క్రీ.పూ. రెండో శతాబ్దం నాటికే ప్రభుత్వాల పన్నుల విధానం పకడ్బందీగా తయారయి ఉందని కౌటల్యుడి అర్థశాస్త్రం, మనుస్మృతి వంటి గ్రంథాలు తెలియజేస్తాయి. అటువంటి పన్నుల విధానమే తరతమ భేదాలతో వలసపాలన వరకూ కొనసాగింది. బ్రిటిష్ వలసవాదం పారిశ్రామిక విప్లవంతో, బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలతో వచ్చిన మార్పులను కొనసాగుతున్న భూస్వామ్య పన్నుల విధానానికి జత చేసింది. అదే పన్నుల విధానం చిన్న చిన్న మార్పు చేర్పులతో 1947 తర్వాత కూడ కొనసాగింది. అయితే దేశం విభిన్న రాష్ట్రాల సమాఖ్య గనుక, రాజ్యాంగం పన్నుల విధింపు, వసూలు అధికారాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య పంపిణీ చేసింది. ప్రత్యేకంగా రాజ్యాంగపు ఏడో షెడ్యూల్‌లో కేంద్ర ప్రభుత్వ అధికారాలు, రాష్ట్ర ప్రభుత్వ అధికారాలు, ఉమ్మడి అధికారాలు జాబితా తయారుచేసి, ఏ పన్నులు విధించే, వసూలు చేసే అధికారం ఎవరికి ఉందో విస్పష్టంగా నమోదు చేసింది.

కేంద్ర ప్రభుత్వమైనా, రాష్ట్ర ప్రభుత్వమైనా విధించే పన్నులను మరొక రకంగా విభజిస్తే ప్రత్యక్ష పన్నులు, పరోక్ష పన్నులు అని రెండు రకాలు. ప్రత్యక్ష పన్నులు స్పష్టంగా కనబడేవి, పరోక్ష పన్నులు ధరలో ఇమిడి కనబడకుండా ఉండేవి. ఒక సంస్థ అయినా, వ్యక్తి అయినా నేరుగా తమకు తాము చెల్లించవలసిన పన్నులు ప్రత్యక్ష పన్నులు. తాము ప్రత్యక్షంగా అది చెల్లించనవసరం లేకపోయినా ఉత్పత్తిలో, పంపిణీలో, వినిమయంలో, వినియోగంలో చెల్లించే పన్నులు పరోక్ష పన్నులు. ప్రత్యక్ష పన్నులను విధించడానికి, వసూలు చేయడానికి కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ కింద సెంట్రల్ బోర్డ్ ఆఫ్ డైరెక్ట్ టాక్సెస్ అనే యంత్రాంగం ఉంది. పరోక్ష పన్నులు విధించడానికి, వసూలు చేయడానికి కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ కిందనే సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఎక్సైజ్ అండ్ కస్టమ్స్ అనే యంత్రాంగం ఉంది. ఈ రెండు యంత్రాంగాల అజమాయిషీలో రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక మంత్రిత్వ శాఖల పన్నుల యంత్రాంగాలు కూడ పని చేస్తాయి. ప్రతి సంవత్సరం బడ్జెట్‌లలో కేంద్ర, రాష్ట్ర ఆర్థిక మంత్రులు తమ పరిధిలోని పన్నులలో మార్పులు, చేర్పులు ప్రకటిస్తుంటారు.

దేశంలో ప్రస్తుతం అమలులో ఉన్న ప్రత్యక్ష పన్నులు వ్యక్తిగత ఆదాయ పన్ను, కార్పొరేట్ పన్ను, మూలధన ఆదాయ పన్ను అనే మూడు రూపాలలో ఉన్నాయి. సంపద పన్ను అనే ప్రత్యక్ష పన్ను 2015 వరకూ అమలులో ఉండేది గాని, 2015లో దాన్ని రద్దు చేశారు. దేశంలో ప్రత్యక్ష పన్ను విధించగల అవకాశం ఉన్న సంపన్నులు కొన్ని కోట్ల మంది ఉన్నప్పటికీ పాలకవర్గాలు ఈ పన్ను పరిధిలోకి రావలసిన వారందరినీ తీసుకురావడం లేదు. దేశ జనాభా 120 కోట్లలో ప్రత్యక్ష పన్ను పరిధిలోకి వచ్చేవారు నాలుగు కోట్ల మంది మాత్రమే. అందులోనూ దాదాపు మూడు కోట్ల మంది ఉద్యోగులే. వారిలో కూడ మినహాయింపులు పోగా సగం మంది దగ్గర మాత్రమే ప్రభుత్వం నిర్బంధంగా ఆదాయపన్ను వసూలు చేస్తున్నది. దేశంలో దాదాపు ఆరు కోట్ల ముప్పై లక్షల వ్యాపార సంస్థలు, పదహారు లక్షల రిజిస్టర్డ్ కంపెనీలు ఉండగా ఎనభై లక్షల వ్యాపార సంస్థలు, తొమ్మిది లక్షల కంపెనీలు మాత్రమే కార్పొరేట్ పన్ను పరిధిలో ఉన్నాయి. వారు కూడ ఎటువంటి దొంగలెక్కలు సమర్పించి ఎంత పన్ను ఎగ్గొడుతున్నారో పరిశోధించవలసిందే. కార్పొరేట్ పన్ను చెల్లింపులలో 70 శాతం ప్రభుత్వ రంగ సంస్థల నుంచే వస్తున్నదని ఒక అంచనా. తమ వార్షికాదాయం పది లక్షల రూపాయల కన్న ఎక్కువ అని చెప్పి పన్ను చెల్లించినవారు 24 లక్షలలోపు ఉండగా, సాలీనా 25 లక్షల పైన కార్లు, ఖరీదైన, విలాసవంతమైన కార్ల అమ్మకం అవుతున్నా యంటే పన్ను చెల్లింపు లెక్కలలోకి రాని ఆదాయం దేశంలో విపరీతంగా ఉన్నదని అర్థం. ఎందరో నిజమైన సంపన్నులు, పెట్టుబడిదారులు, భూస్వాములు, కంట్రాక్టర్లు, రాజకీయ నాయకులు, సినిమా నటులు, క్రీడాకారులు వంటి ప్రత్యక్ష ఆదాయ వర్గాలు చెల్లించవలసిన పన్ను చెల్లించకుండానే పబ్బం గడుపుతున్నాయి. వారిని అంతకంతకూ ఎక్కువగా పన్ను పరిధిలోకి తీసుకువచ్చి, వారి మీద పన్నులు పెంచి ఆదాయం పెంచుకోవలసిన ప్రభుత్వం, అందుకు బదులుగా పరోక్ష పన్నుల మీదనే ఎక్కువగా ఆధారపడుతున్నది.

ప్రత్యక్ష పన్నులు నేరుగా కొద్ది మంది వ్యక్తులు, లేదా సంస్థలు వారి ఆదాయాన్ని, సంపదను బట్టి చెల్లించేవి కాగా, ప్రతి ఒక్కరూ చెల్లించక తప్పని, పైకి కనిపించని నిర్బంధంతో చెల్లించే పన్నులు పరోక్ష పన్నులు. అవి ప్రతి మనిషీ వినియోగించే ప్రతి సరుకు మీద, ప్రతి సేవ మీద వేరు వేరు స్థాయిల్లో విధించే పన్నులు. చిట్టచివరి వినియోగదారు ఆ వస్తువును కొనేటప్పుడు, ఆ సేవను వినియోగించుకుని దాని ధర చెల్లించేటప్పుడు ఆ వినియోగదారుకు తెలిసినా తెలియకపోయినా ఈ పరోక్షపన్ను ఆ ధరలో భాగం అయి ఉంటుంది.

ప్రస్తుతం దేశంలో పరోక్ష పన్నులు ఎక్సైజ్ డ్యూటీ, కస్టమ్ డ్యూటీ, సర్వీస్ టాక్స్, సేల్స్ టాక్స్, ఎంటర్‌టెయిన్‌మెంట్ టాక్స్, ఆక్ట్రాయి వంటి చాల రూపాల్లో ఉన్నాయి. ఎక్సైజ్ డ్యూటీ సాధారణంగా ఉత్పత్తి అయిన వస్తువులు కార్ఖానా దాటి బైటికి వచ్చేటప్పుడు వాటి విలువ మీద నిర్ణీత శాతం పన్నుగా విధించేది. ఉత్పత్తిదారులు దాన్ని కూడ ధరలో కలుపుతారు. కస్టమ్ డ్యూటీ ఎగుమతి, దిగుమతి వస్తువుల మీద విధించే పన్ను. అమ్మకపు పన్ను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ వసూలు చేసేవి గాని, అది పన్ను మీద పన్నుగా మారుతున్నదనే కారణంతో దాని స్థానంలో 2005లో విలువ ఆధారిత పన్ను (వాల్యూ ఆడెడ్ టాక్స్) ప్రవేశపెట్టారు. వినోదపు పన్ను రాష్ట్ర ప్రభుత్వాలు విధించే పరోక్ష పన్ను. ఆక్ట్రాయి స్థానిక సంస్థలు విధించే పన్ను. ఇవి కాక ఎప్పటికప్పుడు సర్‌చార్జి, సెస్ పేరుతో అదనంగా విధించే పరోక్ష పన్నులు ఎన్నో ఉంటున్నాయి. మొత్తంగా పరోక్ష పన్నుల ద్వారా కేంద్ర ప్రభుత్వానికి 2016-17 ఆర్థిక సంవత్సరంలో రు. 8.63 లక్షల కోట్లు అందాయి. ఇవి రోజురోజుకూ పెరుగుతున్నాయి కూడ.

## జిఎస్‌టి నుంచి పెట్రోలియం ఉత్పత్తులను ఎందుకు మినహాయించారు?

**భా**రత ప్రభుత్వానికి పెట్రోలియం ఉత్పత్తులు బంగారు గుడ్లు పెట్టే బాతు. అయితే పాతకథలో లాగ ఈ యజమాని బాతును కోయదలచుకోలేదు. రోజు రోజూ బంగారు గుడ్లు పోగేసుకోదలచుకున్నాడు. అందుకే పెట్రోల్‌నూ డీజిల్‌నూ జిఎస్‌టి నుంచి మినహాయించారు. 2017 జూన్ 16 నాటి లెక్కల ప్రకారం అంతర్జాతీయ మార్కెట్‌లో క్రూడ్ ఆయిల్ ధర బారెల్ కు 45 డాలర్లు. దానికి సముద్ర రవాణా ఖర్చు బారెల్‌కు రెండు డాలర్లు కలిపితే భారత సముద్ర తీరానికి చేరేటప్పటికి ఒక బారెల్ ధర 47 డాలర్లు (రు. 3,050) అవుతుంది. ఒక బారెల్ క్రూడ్ ఆయిల్‌ను శుద్ధిచేస్తే 159 లీటర్ల పెట్రోల్ గాని, 159 లీటర్ల డీజిల్ గాని తయారవుతాయి. అంటే ముడి క్రూడ్ ఆయిల్ ధర లీటర్‌కు రు. 19.18 అవుతుంది. ఇక చమురు వ్యాపార సంస్థల లెక్క ప్రకారం, ప్రవేశ పన్ను (ఎంట్రీ టాక్స్), చమురు శుద్ధి పనులు, ఓడ నుంచి దించే ఖర్చు, నిర్వహణా వ్యయం, లాభం కలుపుకుని లీటర్ రు. 5.65 అవుతాయి. శుద్ధి అయిన పెట్రోల్‌ను, డీజిల్‌ను రవాణా చేయడానికి అయ్యే ఖర్చు, అక్కడ లాభం కలుపుకుంటే లీటర్‌కు రు. 2.68 అవుతుంది. అంటే చమురుశుద్ధి కర్మాగారం నుంచి బైట పడే సమయానికి పెట్రోల్, డీజిల్ లీటర్ు రు. 27.51 అవుతుంది. దీని మీద కేంద్ర ప్రభుత్వం ఎక్సైజ్ డ్యూటీ విధిస్తుంది. అది పెట్రోల్ మీద లీటర్‌కు రు. 21.48గా, డీజిల్ మీద రు. 17.33 గా ఉంది. ఆ తర్వాత లీటర్ పెట్రోల్ రు. 48.99కి, లీటర్ డీజిల్ రు. 44.84 అవుతుంది. దీనికి పెట్రోల్ పంపు డీలర్ కమిషన్ పెట్రోల్ లీటరుకు రు. 2.57, డీజిల్ లీటరుకు రు. 1.65 కలుస్తుంది. అంటే అప్పటికి పెట్రోలు ధర లీటరుకు రు. 51.56 గా, డీజిల్ ధర లీటరుకు రు. 46.49 అవుతుంది. దీనిమీద ఆయా రాష్ట్రాలలో వేరువేరుగా అమలవుతున్న విలువ ఆధారిత పన్ను విధిస్తారు. ఇది సగటున పెట్రోల్ మీద 27 శాతంగా, డీజిల్ మీద 16.75 శాతంగా ఉంది. అలాగే ప్రతి లీటర్ మీ కాలుష్య సెస్, సర్‌చార్జి మరొక 25 పైసలు కలుపుతారు. ఇవన్నీ కలిసి పెట్రోల్ మీద అదనంగా రు. 13.92. డీజిల్ మీద రు. 8.18 కలుస్తాయి. అలా వినియోగదారు పెట్రోల్ కు రు. 65.48, డీజిల్ కు రు. 54.67 చెల్లించవలసి వస్తుంది. తాజా అంచనాల (2015) ప్రకారం భారతదేశం మొత్తం రోజుకు 41,59,000 బారెళ్ల (66 కోట్ల లీటర్ల) చమురు వినియోగిస్తుంది. ఈ అంచనా వేసి రెండు సంవత్సరాలు గడిచాయి గనుక ప్రస్తుతం ఇది 70 కోట్ల లీటర్లను కూడ దాటి ఉండవచ్చు. భారత ప్రభుత్వం, లేదా ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి ప్రతి లీటర్ పెట్రోల్ మీద రు. 35.40, ప్రతి లీటర్ డీజిల్ మీద రు. 25.51 పన్ను సంపాదిస్తాయని అనుకుంటే రోజుకు రు. 175 కోట్ల నుంచి రు. 240 కోట్లు పన్ను ఆదాయం సంపాదిస్తాయి. అంటే సంవత్సరానికి రు. 9,300 కోట్ల నుంచి రు. 13,000 కోట్లు సంపాదిస్తున్నాయి. ఈ స్థిరమైన, నమ్మకమైన రాబడిని పోగొట్టుకోదలచుకోలేదు గనుకనే జిఎస్‌టి గురించి అన్ని గొప్పలు చెప్పే కేంద్ర ప్రభుత్వం పెట్రోలియం ఉత్పత్తులను మాత్రం జిఎస్‌టి పరిధిలోకి తీసుకురాలేదు.

ఏ వస్తువైనా, సేవ అయినా ఉత్పత్తి అయ్యే చోటు నుంచి చివరి వినియోగదారు దగ్గరికి చేరేసరికి నాలుగైదు మజిలీలు దాటవలసి ఉంటుంది. దీన్ని ఆయా వస్తువుల, సేవల విలువ చక్రం (వాల్యూ చెయిన్) అంటారు. ఈ విలువ చక్రంలో ఉత్పత్తిదారు నుంచి దేశవ్యాపిత లేదా రాష్ట్రవ్యాపిత పంపిణీదారుకు చేరడం మొదటి ప్రయాణం. ఆ పంపిణీదారు ప్రాంతీయ, జిల్లా స్థాయి శాఖకు గాని, బడా టోకువ్యాపారికి గాని ఆ వస్తువులు పంపుతారు. అది రెండో ప్రయాణం. ఆ శాఖ లేదా బడా టోకువ్యాపారి అంతకన్న కింది స్థాయిలో ఉండే టోకు వ్యాపారులకు పంపుతారు. అది మూడో ప్రయాణం. సాధారణంగా ఈ టోకు వ్యాపారులు పట్టణ స్థాయిలో, తాలూకా/మండల స్థాయిలో ఉండి తమ పరిధిలో ఉండే చిల్లర వ్యాపారులకు సరుకులు పంపుతారు. ఇది నాలుగో ప్రయాణం. ఆ చిల్లరవ్యాపారుల దగ్గర వినియోగదారులు కొనుక్కుంటారు. అది ఐదో ప్రయాణం. కొన్ని వస్తువులలో ఇంతకన్న ఎక్కువ స్థాయిలు, ప్రయాణాలు ఉండవచ్చు. కొన్ని వస్తువులలో ఒకటి రెండు స్థాయిలు తగ్గవచ్చు కూడ. ఇప్పుడు ఉన్న పన్నుల వ్యవస్థలో ఇన్ని మజిలీలలో ఏ మజిలీలోనైనా పన్ను మీద పన్ను పడే అవకాశం ఉంది. అంటే అంతిమంగా వినియోగదారు వస్తువు ఉత్పత్తి ధర మీద ఒకే పన్ను మాత్రమే కాక, అప్పటికే ముందరి మజిలీలలో చెల్లించిన పన్ను మీద పన్ను కూడ చెల్లించవలసిన పరిస్థితి ఉంది. ఉత్పత్తిదారు కొన్న ముడిసరుకుల మీద పన్ను, ఉత్పత్తి అయిన వస్తువు మీద పన్ను, ఆ వస్తువు రవాణా మీద పన్ను, ఆ వస్తువు నిలువ మీద పన్ను, ఆ వస్తువు అమ్మకం మీద పన్ను అనే పద్ధతిలో పన్నులు ఉన్నట్టయితే పన్ను భారం మితిమీరుతుందని, ఏ వస్తువు మీదనైనా గత మజిలీలో చెల్లించిన పన్నును తీసివేసి, కొత్తగా చేరిన విలువ మీద మాత్రమే పన్ను విధించే పద్ధతి ప్రవేశపెట్టాలని ఒక వాదన సుదీర్ఘకాలంగా ఉంది. అందువల్లనే అమ్మకపు పన్నును తొలగించి, విలువ ఆధారిత పన్ను ప్రవేశపెట్టారు.

అయితే ఇదంతా సైద్ధాంతిక వాదన మాత్రమే. పన్నులు ఎలా ఉన్నప్పటికీ, ఉత్పత్తిదారులే ఉత్పత్తి వ్యయం కన్న చాల ఎక్కువ ధరలు పెట్టడం, మధ్య దళారీలు మితిమీరిన లాభాలు వేసుకోవడం వల్ల ధరలు పెరుగుతున్నాయి. పన్నులు ఇబ్బడి ముబ్బడిగా ఉండడం వల్ల వాటిని కూడ చివరి వినియోగదారులే భరించవలసి వస్తున్నది. అందువల్ల వినియోగదారులలో ధరల పెరుగుదల గురించి అసంతృప్తి, వ్యతిరేకత పెద్ద ఎత్తునే ఉన్నాయి. ఈ అసంతృప్తిని చల్లార్చడానికి వ్యాపారస్తులు సాధారణంగా నెపం పన్నుల వ్యవస్థమీదికి నెడుతుంటారు. అలా పన్నుల వ్యవస్థ మీద ప్రజల్లో చాల కోపం, అసహనం పేరుకుని ఉన్నాయి. ఈ కోపావేశాలను పునాదిగా వాడుకుని పాలకులు పన్నుల సంస్కరణకు జనామోదం సంపాదిస్తున్నారు. ప్రజల్లో అక్రమధనం మీద, అవినీతి మీద ఉన్న కోపావేశాల పునాదిపై పెద్దనోట్ల రద్దుకు మౌనాంగీకారం సాధించినట్టుగానే ధరల పెరుగుదల మీద అసంతృప్తిని పన్నుల వ్యవస్థ మీదికి మళ్లించి, పన్నుల వ్యవస్థ మార్పుకు రంగం సిద్ధం చేసుకున్నారు.

ఉత్పత్తిదారులు ముడిసరుకులు కొనేటప్పుడు పన్ను చెల్లించి, తయారైన వస్తువు మీద ఎక్సైజ్, రవాణా, నిలువ, అమ్మకం పన్నులు చెల్లించడం వల్ల వినియోగదారుకు ధరలు పెరుగుతున్నాయని, ఈ పన్నులన్నీ తొలగిస్తే ధరలు తగ్గుతాయని ఒక అబద్ధాన్ని ప్రచారం చేస్తున్నారు. అలాగే రాష్ట్రాల పన్నులు తొలగిపోతే అన్ని చోట్లా ఒకే రకమైన తక్కువ ధరలు ఉంటాయని అంటున్నారు. ఇన్ని రకాల పన్నులు, ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క రకమైన పన్నులు, ఆ పన్నుల మధ్య హెచ్చుతగ్గులు వంటివన్నీ కలిసి చాల గందరగోళాన్ని సృష్టిస్తున్నాయనీ, ఈ అన్ని పన్నులను రద్దు చేసి, వాటి స్థానంలో ఒకే పన్నును ప్రవేశపెట్టడం హేతుబద్ధమైన విధానమనీ అంటున్నారు. ప్రస్తుతం దేశంలో ఉన్న 17 పరోక్ష పన్నుల స్థానంలో ఒకే పన్నుగా జిఎస్‌టి ఉంటుందని అంటున్నారు.

### ఈ పన్నుల విధానంతో సమస్యలు

ప్రస్తుత పన్నుల విధానంతో కొన్ని సమస్యలు ఉన్నమాట నిజమే. వాటిని పరిష్కరించవలసిన, సంస్కరించవలసిన అవసరమూ నిజమే. ఒక వస్తువు విలువ చక్రంలో అనేక చోట్ల పన్నులు ఉండగూడదు. ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క రకమైన పన్నులు ఉంటే రాష్ట్రాల పారిశ్రామికీకరణ మీద, జన జీవితం మీద ప్రభావాలు ఉంటాయి గనుక అది వీలైనంతవరకు తగ్గాలి. పరోక్ష పన్నులు తగ్గి ప్రత్యక్ష పన్నులు పెరగాలి. పన్నులు ఎగవేతకు అవకాశం లేని స్థితి ఉండాలి. పన్ను చెల్లింపుల లెక్కలు, పర్యవేక్షణ, నిఘా వ్యవస్థలు సులభంగా ఉండాలి. మొత్తం మీద ఆర్థిక వ్యవస్థ పెరుగుదలకు సమానంగా పాలనా నిర్వహణా వ్యవస్థ పెరుగుతూ దాని వ్యయానికి తగినట్టుగా పన్నుల ఆదాయం పెరగాలి. ప్రస్తుత పన్నుల విధానంలో ఈ మార్పులు అవసరమైనవి కాగా, కొత్తగా ప్రవేశపెడుతున్న జిఎస్‌టి ఈ సమస్యలను సాకుగా చూపుతున్నది గాని, నిజంగా వాటిని పరిష్కరించబోవడం లేదు.

### సమాఖ్యకు తగిన పన్నుల విధానం

అసలు ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క పన్ను ఉండవలసిన అవసరం ఎందుకు వచ్చిందో అర్థం చేసుకోకపోతే, దేశమంతా ఒకే రకమైన పన్ను అనే వాదన హేతుబద్ధమైనదనే అనిపిస్తుంది. భారతదేశం ఒక ఉపఖండం. ఇక్కడ వేరు వేరు వాతావరణాలు, వస్త్రధారణలు, ఆహారపు టలవాట్లు, సాంస్కృతిక ఆచారాలు, జాతులు ఉన్నాయి. ఆయా సమాజాలలో మనుషులు వాడే వస్తువులు, సేవలు ఆ భిన్న సంస్కృతిని బట్టి ఉంటాయి. ఉన్ని దుస్తులు వాడకుండా కశ్మీర్ లో మనుగడే కష్టం, ఉన్ని దుస్తుల వాడకం దక్షిణ భారతదేశంలో అవసరమే లేదు. గోధుమ తినే ప్రాంతాలు వేరు, వరి తినే ప్రాంతాలు వేరు. వర్గాల మధ్య మాత్రమే కాదు, ప్రాంతీయ పరిస్థితులను బట్టి కూడ ఒక ప్రాంతంలో అత్యవసరమైన వస్తువు, మరొక ప్రాంతంలో సౌకర్యంగా, మరొక ప్రాంతంలో విలాసంగా కనబడే ప్రత్యేక పరిస్థితి భారతదేశానిది. అటువంటప్పుడు దేశవ్యాప్తంగా ఒకే ధర, ఒకే పన్ను అనే పద్ధతి అసహజం మాత్రమే కాదు, అసాధ్యం, అర్థరహితం. ఒక వస్తువు ఎక్కువ వినియోగంలో ఉన్నచోట, నిత్యజీవితావసరమైతే తక్కువ పన్ను, తక్కువ వినియోగంలో ఉన్నచోట, విలాసంగా ఉన్న చోట ఎక్కువ పన్ను అనేది సహజ న్యాయసూత్రం. అలా దేశంలో విభిన్న జీవన ప్రమాణాలు, పరిస్థితులు ఉన్నందువల్లనే పన్నుల విధానం విభిన్నంగా ఉంది.

అలాగే రాజ్యాంగ రచనలో ఈ జాతుల సమాఖ్య అవగాహన ఉన్నందువల్ల కొంత, ఏ రాష్ట్ర ప్రభుత్వానికి ఆ రాష్ట్ర ప్రభుత్వం తన వనరులను, అవసరాలను బట్టి ఎటువంటి పన్ను విధానం అవలంబించా లో స్వేచ్ఛ ఇవ్వాలనే ఆలోచన కొంత కలిసి పన్నుల విధానంలో కేంద్ర, రాష్ట్ర, ఉమ్మడి జాబితాలు రూపొందించడం జరిగింది. తమ ప్రాంతీయ పరిస్థితులను బట్టి ఏ వస్తువుల మీద పన్ను మినహాయింపు ఇవ్వాలో, ఏ వస్తువు మీద ఎంత పన్ను విధించాలో రాష్ట్ర ప్రభుత్వాల అధికార పరిధిలోకి తేవడం జరిగింది. ఇప్పుడు ఆ భిన్నత్వాన్ని, వైవిధ్యాన్ని బలవంతంగా తొలగించి దేశమంతటా ఒకే రకమైన పన్నుల విధానం అమలు చేస్తామనడం నిరంకుశత్వమే అవుతుంది.

ప్రపంచీకరణ విధానాల తర్వాత, దేశంలోకి విదేశీ పెట్టుబడులు, వ్యాపారాలు రావడం మొదలయ్యాక, వాటిని ఆకర్షించడానికి కూడ అన్ని రాష్ట్ర ప్రభుత్వాలూ తమ పన్నుల విధానాలను, పన్ను రేట్లను మార్చే వైఖరి అవలంబించాయి. ఇది పెట్టుబడి ప్రవేశానికి కొన్ని అవకాశాలు కలిగించినట్టు కనిపించింది గాని వాస్తవంగా ఈ ఎర్రతివాచీ పరిచే పద్ధతి పెట్టుబడి చలనానికి అవరోధాలను కల్పించి, గందరగోళం సృష్టించింది. తమ అవకాశాలు పెరుగుతూ, గందరగోళం తగ్గాలని విదేశీ, స్వదేశీ పెట్టుబడి ప్రస్తుతం కోరుకుంటున్నది.

### జిఎస్‌టి గురించి ప్రభుత్వ ప్రకటనలు

జిఎస్‌టి అమలులోకి వస్తే జాతీయ మార్కెట్ ఏకీకృతమవుతుందనీ, పన్నుల మీద పన్నులు ఉండవనీ, దేశమంతా ఒకే పన్ను ఉంటుందనీ, వ్యాపార లావాదేవీల గురించి ప్రభుత్వానికి సమర్పించవలసిన పత్రాలు తగ్గి, పన్నుల చెల్లింపు సులభతరమవుతుందనీ, పన్నుల వసూళ్లలో సమర్థత పెరుగుతుందనీ, అందువల్ల ఎక్కువ పన్నులు వసూలవుతాయనీ, జాతీయాదాయంలో 2 శాతం పెరుగుదల ఉంటుందనీ, ఒక లక్ష కొత్త ఉద్యోగాలు వస్తాయనీ, రాష్ట్ర ప్రభుత్వాలు కొంత పన్ను కోల్పోయే మాట నిజమే అయినప్పటికీ ఆ కోల్పోయే పన్ను ఆదాయానికి నష్టపరిహారం చెల్లిస్తామనీ ప్రభుత్వం చాల ప్రకటనలు చేస్తున్నది. కాని ప్రభుత్వ ప్రచారంలో అతి ఎక్కువ భాగం అతిశయోక్తులు, అబద్ధాలు, అర్ధసత్యాలు. ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగా, కుట్రపూరితంగా వాస్తవాలను, నిజంగా ఉండగల పర్యవసానాలను తొక్కిపెట్టి, మరుగుపరచి అవాస్తవాలు ప్రచారం చేస్తున్నది.

### జిఎస్‌టి అమలయ్యే పద్ధతి

జిఎస్‌టి గురించి ప్రభుత్వం చెపుతున్న అబద్ధాలను విశ్లేషించు కోబోయే ముందు, 2017 జూలై 1 నుంచి జిఎస్‌టి ఎలా అమలవు తుందో చూడాలి. ఇప్పటికే జిఎస్‌టి కౌన్సిల్ అనే ఒక దేశస్థాయి విధాన నిర్ణాయక సంస్థ 2016 సెప్టెంబర్ లో ఏర్పాటయింది. కేంద్ర ఆర్థిక మంత్రి, కేంద్ర ఆర్థిక శాఖ సహాయమంత్రి, అన్ని రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక మంత్రులతో కూడిన ఈ జిఎస్‌టి కౌన్సిల్ గత పది నెలల్లో పదిహేను సార్లు సమావేశమై ఏయే వస్తు, సేవల మీద ఎంత శాతం

పన్ను విధించాలో చర్చలు జరిపి నిర్ణయాలు తీసుకుంది. జూన్ 3న జరిగిన పదిహేనో సమావేశంలో 1211 వస్తువుల మీద, సేవల మీద ఎంతెంత శాతం పన్ను విధించాలో నిర్ధారించింది.

జిఎస్‌టి కౌన్సిల్ నిర్ణయించిన ప్రకారం, వార్షికాదాయం రు. 20 లక్షలు, ఆ పైన ఉండే వ్యాపార, సేవా సంస్థలన్నీ కూడ జిఎస్‌టి చెల్లింపుదార్లుగా నమోదు చేసుకోవాలి. ఈశాన్యరాష్ట్రాలకు మాత్రం ఈ వార్షికాదాయ పరిమితి రు. 10 లక్షలుగా నిర్ణయించారు. అలాగే ఆన్ లైన్ లావాదేవీలు నడిపే సంస్థలన్నీ కూడ తమ ఆదాయంతో నిమిత్తం లేకుండా జిఎస్‌టి నమోదు చేయించుకోవాలి. ఇతర రాష్ట్రాల నుంచి, ఇతర దేశాల నుంచి ఆదాయం పొందుతున్న ప్రతి వ్యక్తీ ఆ ఆదాయపు పరిమాణంతో సంబంధం లేకుండా జిఎస్‌టి నమోదు చేయించుకోవాలి.

అయితే ఈ జిఎస్‌టి కౌన్సిల్ గురించి గుర్తించవలసిన విషయమేమంటే, దీనిలో ఏ నిర్ణయమైనా జరిగేందుకు సమావేశంలో పాల్గొన్నవారిలో నాలుగింట మూడు వంతుల (75 శాతం) మంది ఆమోదించాలి. ఆ కౌన్సిల్‌లోని 29 రాష్ట్రాల ప్రతినిధుల వోట్ల విలువ 67. కేంద్ర ప్రభుత్వం తరపున ఉన్న ఇద్దరు మంత్రుల వోట్ల విలువ 33. అంటే కేంద్ర ప్రభుత్వం తలచుకుంటే ఏ ప్రతిపాదన కూడ నెగ్గే అవకాశం లేదు. వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు ఒకే మాట మీద నిలబడినా వారి వోట్లు 75 శాతం కావు గనుక వారి మాట నెగ్గదు. కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీ తన రాష్ట్ర ప్రభుత్వాలను, ప్రభావంలో ఉండే రాష్ట్ర ప్రభుత్వాలను కలిపి ఎప్పుడైనా తన మాట చెల్లించుకోవచ్చు. మరో మాటల్లో చెప్పాలంటే రాష్ట్రాలకు ఏ అధికారమూ లేకుండా చేసి కేంద్రమే అన్ని అధికారాలనూ గుప్పిట్లో పెట్టుకోవడానికి ఈ జిఎస్‌టి కౌన్సిల్ ఒక ప్రధాన సాధనంగా ఉంటుంది.

**ప్రభుత్వం చెపుతున్న అబద్ధాలు**

ఒకవైపు ఇంత అక్రమంగా జిఎస్‌టి కౌన్సిల్‌ను ఏర్పాటు చేసి, జిఎస్‌టి అమలు చేయడానికి శరవేగంగా ముందుకు కదులుతున్న ప్రభుత్వం మరొకవైపు జిఎస్‌టికి అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి చెపుతున్న మాటలన్నీ అబద్ధాలే.

దేశమంతా ఒకే పన్ను అని చెపుతున్నప్పటికీ వాస్తవంగా మూడు రకాల పన్నులు ఉండబోతున్నాయి. ఆ మూడురకాల పన్నుల మధ్య గందరగోళాన్ని ఇప్పటివరకూ పరిష్కరించలేదు. అంతేకాదు, వస్తువుల మీద, సేవల మీద ఆరు స్థాయిల పన్నులు ఉండబోతున్నాయి. కొన్ని వస్తువులు, సేవలు పన్ను నుంచి మినహాయింపు (0 శాతం పన్ను) పొందగా, మరికొన్ని వస్తువులు, సేవల మీద 3 శాతం, 5 శాతం, 12 శాతం, 18 శాతం, 28 శాతం పన్నులు ఉండబోతున్నాయి. అంతేగాక, ప్రభుత్వాలకు బంగారు గుడ్లుపెట్టే బాతు వంటి పెట్రోలియం ఉత్పత్తులను, మద్యాన్ని అసలు జిఎస్‌టి పరిధి నుంచే మినహాయించారు. నిత్య జీవితంలో ప్రతి ఒక్కరూ వినియోగిస్తున్న, వినియోగించక తప్పని పెట్రోల్, డీజిల్, ఎల్‌ఎన్‌జి, సిఎన్‌జి వంటి పెట్రోలియం ఉత్పత్తుల మీద పాత పన్నుల విధానమే కొనసాగితే జిఎస్‌టి విప్లవాత్మకమైనదనడంలో అర్థం లేదు. అలాగే ప్రభుత్వాల ఎక్సైజ్ ఆదాయానికి పెద్ద వనరు అయిన మద్యాన్ని జిఎస్‌టి పరిధి నుంచి మినహాయించడం పాలకులు చెపుతున్న జిఎస్‌టి ఘనతను తామే అపహాస్యం చేసుకుంటున్నారనడానికి సూచన. అలాగే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇప్పటికే విధించి ఉన్న సెస్సు (అదనపు పన్ను)లను కూడ జిఎస్‌టి నుంచి మినహాయించారు. అంటే పేరుకు జిఎస్‌టి గరిష్ఠంగా 28 శాతం అన్నప్పటికీ, సెస్సులు కలిసి మొత్తం పన్నులు 43 శాతం దాకా చేరే అవకాశం ఉంది. ఈ మినహాయింపులు, చేర్పులు అన్నీ చూస్తే జిఎస్‌టి పట్ల ఏకాభిప్రాయం కూడగట్టడానికి, ప్రజలను భ్రమల్లో ముంచడానికి ప్రభుత్వం లేని గొప్పలు చెపుతున్నది గాని, స్వయంగా దానికే జిఎస్‌టి సాధించే ప్రయోజనాల మీద నమ్మకం లేదని అర్థమవుతుంది.

అలాగే పన్ను చెల్లింపు పద్ధతులు, పన్ను లెక్కలకు సంబంధించిన పత్రాల సమర్పణ విషయంలో కూడ జిఎస్‌టి ప్రభుత్వం చెపుతున్నంత విప్లవకరంగా, వినూత్నంగా, ప్రయోజనకరంగా ఉండబోవడం లేదు. ఇప్పుడు వేరువేరు రకాల పన్నులు వేరువేరు స్థాయిల్లో చెల్లిస్తున్న ఉత్పత్తిదారులు, అమ్మకందారులు, వివిధ సేవలు అందించే వృత్తి నిపుణులు అందరూ కూడ ఇకనుంచి తమ జిఎస్‌టి చెల్లింపును ఆన్‌లైన్‌లో మాత్రమే చెల్లించవలసి ఉంటుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఆర్థిక సంస్థల భాగస్వామ్యంతో ఏర్పాటయిన జిఎస్‌టి నెట్‌వర్క్ అనే వ్యవస్థ డాటాబేస్‌ను నిర్వహిస్తుంది, సేవలు అందిస్తుంది. అంటే ఇక ప్రతి ఒక్క వ్యాపార సంస్థ తప్పనిసరిగా కంప్యూటర్ నిపుణుల సహాయం తీసుకోవాలి.

పన్ను చెల్లింపుదారులు తాము చెల్లించవలసిన పన్ను లెక్కలు వివరించే, చివరికి ఎంత పన్ను చెల్లించాలో నిర్ధారించే పత్రాలను రిటర్న్ అంటారు. ఇప్పటివరకూ ప్రతి పన్ను చెల్లింపుదారూ ఏడాదికి ఒకసారి రిటర్న్ ఆదాయ పన్ను శాఖకో, వాణిజ్య పన్నుల శాఖకో సమర్పించవలసి ఉండేది. జిఎస్‌టి అమలులోకి వచ్చాక ప్రతి పన్ను చెల్లింపుదారూ ప్రతి నెలా మూడుసార్లు (10వ తేదీ, 15వ తేదీ, 20వ తేదీ) ఆన్‌లైన్ రిటర్న్ సమర్పించాలి. అవి కాక ఒక వార్షిక రిటర్న్ సమర్పించాలి. అంటే ఒక రాష్ట్ర పరిధిలోపలే లావాదేవీలు నడిపే చెల్లింపుదారు సంవత్సరానికి ముప్పై ఏడు రిటర్న్ సమర్పించాలి. ఒకవేళ ఆ పన్ను చెల్లింపుదారు ఇతర రాష్ట్రాలతో కూడ సంబంధంలో ఉన్నట్టయితే కేంద్ర జిఎస్‌టి రిటర్న్, అంతర్రాష్ట్ర జిఎస్‌టి రిటర్న్ కూడ సమర్పించాలి. ఏ లెక్కా భౌతికరూపంలో, పత్రాలలో ఉంచుకోనక్కరలేదు. కాగితపు లెడ్జర్లు, ఖాతా పుస్తకాలు అవసరం లేదు. ఇవన్నీ కూడ ఆన్‌లైన్‌లోనే, డిజిటల్ రూపంలోనే ఉండాలి. ఒక్క రిటర్న్ బదులు ముప్పైఏడు రిటర్న్ సమర్పించవలసి రావడం సరళీకరించడం ఎలా అవుతుందో పాలకులకే తెలియాలి.

ఇక జిఎస్‌టి వల్ల ధరలు తగ్గుతాయనేది ప్రజలను మాయచేసే మరొక పెద్ద అబద్ధం. వస్తువుల, సేవల ధరలు కేవలం పన్నుల విధానం వల్ల మాత్రమే పెరగడం లేదు. ఉత్పత్తిదారుల, మధ్య దళారీల లాభాపేక్ష, ఉత్పత్తి వ్యయానికన్న ఎంతో ఎక్కువ ధర నిర్ణయించడం, సుదీర్ఘమైన విలువ చక్రాలు, ధరల నియంత్రణకు ప్రభుత్వ యంత్రాంగం లేకపోవడం, ఉన్నా పనిచేయకపోవడం వంటి ఎన్నో కారణాల వల్ల ధరల పెరుగుదల జరుగుతున్నది. ఆ కారణాలలో ఏ ఒక్కదాన్నీ పరిష్కరించకుండా, పన్నుల విధానాన్ని మార్చడం ధరల సమస్యను పరిష్కరించదు.

జిఎస్‌టి వల్ల ఒక లక్ష ఉద్యోగాలు వస్తాయనేదీ, జాతీయాదాయం 2 శాతం పెరుగుతుందనేదీ ఏ ఆధారమూ, ఏ తార్కిక వాదనా లేని

పచ్చి అబద్ధాలు. నిజానికి ఈ విధానం వల్ల చిన్న వ్యాపారస్తులు ఎందరో వ్యాపారం నుంచి తోసివేయబడతారు గనుక ఉన్న ఉద్యోగాలే ఊడిపోతాయి. అలాగే రాష్ట్ర ప్రభుత్వ పన్నుల శాఖల పని చాలవరకు తగ్గిపోతుంది గనుక ఆ ఉద్యోగులందరినీ తొలగించడమో, ఇతర ఉద్యోగాల్లో సర్దడమో చేయవలసి వస్తుంది. కొత్త ఉద్యోగాలు రావడం కల్ల. జాతీయాదాయం పెరుగుతుందనే అంచనాకు కూడ ఎటువంటి ఆధారమూ లేదు. అలా పన్నుల విధానంలో ఈ మాత్రం మార్పు చేస్తే జాతీయాదాయం రెండు శాతం పెరిగే అవకాశమే ఉంటే సంక్షోభంలో ఉన్న ఇతర దేశాల ఆర్థిక వ్యవస్థలన్నీ కూడ ఈ పరిష్కారం వైపు చూసి ఉండేవే. పైగా ఈ రెండు శాతం పెరుగుదల అనే అబద్ధాన్ని జిఎస్‌టి కౌన్సిల్ పన్ను రేట్లు నిర్ణయించడానికి చాల ముందునుంచే ఊదర కొడుతున్నారు. పన్ను రేటు 5 శాతం ఉండబోతుందా, 28 శాతం ఉండబోతుందా తెలియకుండానే, దాని ఫలితంగా జాతీయాదాయం 2 శాతం పెరుగుతుందని ప్రభుత్వ అధికారిక ఆర్థికవేత్తలు చేసిన ప్రగల్భాల ఊహాగానాలు అదిగో పులి అంటే ఇదిగో తోక అనడమే.

రాష్ట్ర ప్రభుత్వాలు కోల్పోయే పన్ను ఆదాయానికి నష్టపరిహారం ఇస్తామని ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం హామీ ఇస్తున్నది గాని ఆ నష్ట పరిహారాన్ని ఐదు సంవత్సరాలకు కుదించింది. దేశ చరిత్రలో కేంద్ర, రాష్ట్ర సంబంధాలలో, నిధుల పంపిణీలో జరిగిన అవకతవకలు చూస్తే ఈ హామీ కూడ అనుమానాన్ని మిగులుస్తుంది.

**జిఎస్‌టి ప్రతిపాదనల చరిత్ర**

ఇంతకూ ఈ కొత్త పన్నుల వ్యవస్థను ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు ప్రపంచీకరణ ఆర్థిక విధానాలలో భాగంగా మొదలయ్యాయి. దేశమంతా ఒకే మార్కెట్‌గా మార్చదలచిన బహుళజాతిసంస్థల, దళారీ పెట్టుబడిదారుల కోరికల్లో పన్నుల విధానాన్ని మార్చడం ఒక ముఖ్య అంశం. అందువల్లనే 1990లలోనే అమ్మకపు పన్ను నుంచి విలువ ఆధారిత పన్నుకు మారడానికి ప్రయత్నాలు మొదలై, 2005లో ముగిశాయి. పరోక్షపన్నుల పద్ధతిలో సంస్కరణలు సూచించడానికి పాత ఎన్‌డిఎ ప్రభుత్వం నియమించిన కేల్కర్ టాస్క్‌ఫోర్స్ 2003లో ఇచ్చిన నివేదికలో ఇన్నిరకాల పరోక్ష పన్నులను రద్దు చేసి విలువ ఆధారిత పన్ను (ఏ మజిలీలో ఎంత విలువ సమకూరిందో ఆ విలువ మీద మాత్రమే పన్ను) వేసే సమగ్ర జిఎస్‌టి రూపొందించాలని సూచించింది. యుపిఎ పాలనలో 2006-07 బడ్జెట్‌లో 2010 ఏప్రిల్ నాటికి జాతీయ స్థాయి జిఎస్‌టి ప్రవేశపెట్టాలని అప్పటి ఆర్థికమంత్రి చిదంబరం ప్రతిపాదించాడు. ఆ కొత్త పన్ను నమూనాను, దాని మార్గదర్శక సూత్రాలను రూపొందించడానికి రాష్ట్రాల ఆర్థిక మంత్రుల ఉన్నతస్థాయి కమిటీని నియమించారు. అ కమిటీ 2009 నవంబర్‌లో తన తొలి చర్చా పత్రాన్ని విడుదల చేసి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సలహాలు, సూచనలు కోరింది. పన్నుల విధింపులో, వసూళ్లలో రాజ్యాంగం రాష్ట్ర ప్రభుత్వాలకు కూడ అధికారం ఇచ్చింది గనుక రాజ్యాంగ సవరణ బిల్లును 2011 మార్చ్‌లో లోకసభలో ప్రవేశపెట్టారు. ఈ బిల్లును పరిశీలన కోసం ఆర్థిక వ్యవహారాల స్థాయీ సంఘానికి పంపించారు.

మరొకపక్క కేంద్ర ఆర్థికమంత్రి, రాష్ట్రాల ఆర్థిక మంత్రుల ఉన్నతాధికార సంఘం నిర్ణయం మేరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అధికారులతో జిఎస్‌టి నమూనా రూపొందించడానికి ఒక కమిటీని 2012 నవంబర్‌లో నియమించారు. ఆ కమిటీ తన నివేదికను 2013 జనవరిలో సమర్పించగా, రాజ్యాంగ సవరణ బిల్లులో మార్పులు చేయాలని రాష్ట్ర ఆర్థిక మంత్రుల బృందం నిర్ణయించింది. జిఎస్‌టి గురించి మరింత వివరమైన అధ్యయనం జరిపి, ఆచరణయోగ్యమైన సూచనలు చేసేందుకు మరో మూడు అధికారుల కమిటీలను నియమించారు. ఈలోగా పార్లమెంటు స్థాయీ సంఘం తన మార్పులు, చేర్పుల సూచనలతో 2013 ఆగస్టులో నివేదిక సమర్పించగా రాజ్యాంగ సవరణ బిల్లు కొత్త ముసాయిదా తయారయింది. ఆ బిల్లు ముసాయిదా మీద కూడ ఎన్నో చర్చలు జరిగి, మార్పులు చేర్పులు జరుగుతూ 2015 మే వరకూ ఆ బిల్లుకు తుది మెరుగులు దిద్దుతూనే ఉన్నారు. చివరికి ఆ బిల్లు 2015 మే 6న లోకసభలో ఆమోదం పొందింది. కాని రాజ్యసభలో ఆ బిల్లుకు ఆటంకాలు వచ్చాయి. అక్కడ కూడ ఒక పరిశీలనా బృందాన్ని నియమించగా అది 2015 జూలై 22న తన నివేదిక ఇచ్చింది. చివరికి 2016 ఆగస్ట్ 3న ఆ బిల్లు రాజ్యసభలో కూడ ఆమోదం పొందింది. అలా రాజ్యాంగ సవరణ జరిగి, పన్ను విధింపు మీద రాష్ట్రాల హక్కు తొలగించిన తర్వాత కేంద్ర జిఎస్‌టి, సమీకృత జిఎస్‌టి, కేంద్రపాలిత ప్రాంతాల జిఎస్‌టి, కొత్త పన్ను వల్ల రాష్ట్రాలకు జరిగే నష్టానికి పరిహారం అనే నాలుగు బిల్లులను 2017 ఏప్రిల్ 5న లోకసభ ఆమోదించడంతో జిఎస్‌టి చట్టబద్ధంగా మారింది. ఈలోగా ఏర్పడిన జిఎస్‌టి కౌన్సిల్ పది నెలల్లో పదిహేనుసార్లు సమావేశం కావలసి వచ్చింది. ఇవన్నీ ముగిసి జూలై 1 నుంచి ఇది అమలులోకి వస్తుందని కేంద్ర ప్రభుత్వ ప్రకటించింది.

ఇంత గందరగోళం, పద్నాలుగు సంవత్సరాల వెనుకాముందులు, చర్చోపచర్చలు, వివాదాలు, అభ్యంతరాలు ఎందుకు వెల్లువెత్తాయో అర్థం చేసుకోవాలంటే భారత పాలకవర్గాల ముఠాతగాదాలు అర్థం చేసుకోవాలి. బహుళ జాతి సంస్థల ఆదేశాలు, దళారీ బూర్జువా వర్గపు బేరసారాలు, వ్యాపార ప్రయోజనాలకు అనుగుణంగా రాజకీయ వాదనలు ఈ గందరగోళానికి కారణం. ఈ వ్యవహారంలో ప్రజా ప్రయోజనాలు అనేవేమీ లేవని, కేవలం భారత మార్కెట్‌ను పంచుకోవడానికి, మార్కెట్ నుంచి రాగల లాభాలను పంచుకోవడానికి బహుళజాతి సంస్థలు, వారి దళారీలు ఆడుకున్న బేరసారాల వల్లనే, ఎత్తులు పై ఎత్తుల వల్లనే ఈ రచ్చ అంతా జరిగింది.

**భారత పాలకుల అసలు ప్రయోజనాలు**

జిఎస్‌టి వల్ల నెరవేరే అసలు మేలు భారత ప్రజలకూ కాదు, భారత ఆర్థిక వ్యవస్థకూ కాదు. దేశవ్యాప్తంగా ఒకే రకమైన పన్నుల విధానంతో ఏకీకృత మార్కెట్ ఏర్పాటు చేసుకుని, దానిమీద తిరుగులేని అధికారం సంపాదించడానికీ, ఆయా రాష్ట్రాలలో బలంగా ఉన్న చిన్న ఉత్పత్తిదారులను, వ్యాపారులను దెబ్బతీసి సువిశాల మార్కెట్ మీద గుత్తాధిపత్యం సంపాదించుకోవడానికీ ఉవ్విళ్లూరుతున్న బహుళజాతి సంస్థలకు, వారి దళారులకు మేలు చేకూర్చేటందుకే జిఎస్‌టి అమలులోకి వస్తున్నది. వారి ఆర్థిక ప్రయోజనాలూ, సంఘ్‌పరివార్ సామాజిక, సాంస్కృతిక ప్రయోజనాలూ కలిసి మార్కెట్ ఏకీకరణ – ఒకే జాతి, ఒకే పన్ను అనే లక్ష్యాలు తీర్చడానికే జిఎస్‌టి.

# అంబేడ్కర్ విగ్రహాన్ని స్థాపిస్తే సాంఘిక బహిష్కరణ?

*గ్రామంలో చెరువుకట్ట మీద ఇతర విగ్రహాలతోపాటు అంబేడ్కర్ విగ్రహం పెడతామన్నందుకు దళితులకు సాంఘిక బహిష్కరణ విధించిన ఉదంతం గురించి వివరిస్తున్నారు* **బెజవాడ కృష్ణ**

పశ్చిమ గోదావరి జిల్లా పాలకోడేరు మండల గరగపర్రు గ్రామంలోని దాదాపు 800 మంది దళితులమీద ఆ గ్రామంలోని ఇతర కులాల వారు గత రెండు నెలలుగా సాంఘిక బహిష్కార శిక్ష అమలు చేస్తున్నారు. వారి మీద ఆర్థిక ఆంక్షలు విధించారు. వారిని పనులకు పిలవడాన్ని నిషేధించారు. ఇతరుల దగ్గర భూమి కౌలుకు తీసుకుని సాగు చేస్తున్నవారి కౌలు రద్దుచేశారు. ట్రాక్టర్ డ్రైవర్లుగా ఉన్నవారిని పని నుంచి తొలగించారు. స్థానిక పరిశ్రమలలో, రొయ్యల చెరువులలో పనిచేస్తున్న వారిని తొలగించారు.

ఇంత పెద్దఎత్తున శిక్షలకు గురికావడానికి ఆ గ్రామ దళితులు (ప్రధానంగా మాల కులస్తులు) చేసిన నేరం తమ గ్రామంలో బాబాసాహెబ్ అంబేడ్కర్ విగ్రహాన్ని స్థాపించుకోవాలని అనుకోవడం మాత్రమే. ఒకవైపు దళితుడిగా పుట్టిన వ్యక్తిని దేశంలోని అత్యున్నత పదవికి ఎంపిక చేసిన ఘనత తనదేనని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ ప్రభుత్వం గొప్పలు చెప్పుకుంటుండగా, ఆ ఎన్‌డిఎ లో భాగస్వామ్య పక్షమైన తెలుగుదేశం పార్టీ పాలనలోని ఆంధ్రప్రదేశ్ లో, ఆ పార్టీకే చెందిన క్షత్రియుల ఆధిపత్యంలోని గ్రామంలో రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ అంబేడ్కర్ విగ్రహానికి దక్కిన గౌరవం ఇది.

ఈ సాంఘిక బహిష్కరణ శిక్షా వ్యవహారం ఏప్రిల్ 24న మొదలై 29 దాకా జరిగితే, రెండు నెలల వరకూ బైటికి కూడ రాలేదంటే స్థానిక ప్రచార సాధనాల మీద కూడ పెత్తందారీ కులాల ఆధిపత్యం ఎంతగా సాగుతున్నదో అర్థమవుతుంది.

భీమవరం – తాడేపల్లిగూడెం రహదారి మీద ఉన్న గరగపర్రు గ్రామంలో క్షత్రియులు, కాపులు, వెనుకబడిన కులాలు వంటి పన్నెండు, పదమూడు కులాల ప్రజలున్నారు. ఊరికి ఒక చివరన పాతపేట, కొత్తపేట అనే రెండు దళితుల వాడలు ఉన్నాయి. గ్రామం మధ్యనుంచి యనమదుర్రు డ్రెయిన్ అనే కాలువ ప్రవహిస్తుంది. అది గ్రామం దగ్గర రెండుగా చీలుతుంది. పాతపేట గ్రామానికి ఆనుకుని ఉండగా, కొత్తపేట కాలువకు అవతలి పక్కన కొత్తగా వెలిసింది. అయితే రెండు దళితవాడల

---

భారతదేశంలో 6 కోట్ల 30 లక్షల వ్యాపార సంస్థలున్నాయని, దానికి భిన్నంగా భారత ఆర్థిక వ్యవస్థతో తొమ్మిది రెట్లు పెద్దదయిన అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో మాత్రం మొత్తం వ్యాపార సంస్థల సంఖ్య రెండు కోట్ల ఇరవై లక్షలు మాత్రమేనని సచిన్ బన్సల్ ఇంతకు ముందు ప్రస్తావించిన వ్యాసంలో రాశాడు. అంటే ఆ మేరకు భారత దేశంలో ముప్పై లక్షల వ్యాపార సంస్థలు ఉంటే సరిపోతుందని, మిగిలిన ఆరు కోట్ల సంస్థలు మూతబడడమో, పెద్దవాటిలో కలిసిపోవడమో జరగాలని ఆ బడా దళారీ గుత్త పెట్టుబడి ప్రతినిధి కోరుకుంటున్నాడన్నమాట.

రాష్ట్ర ప్రభుత్వాలకు ఇప్పుడున్న అధికారాలన్నిటినీ తొక్కివేసి, కేవలం కేంద్ర ప్రభుత్వపు బొటనవేలి కింద పనిచేసేలా, కేంద్ర ప్రభుత్వ దయా దాక్షిణ్యాలకు లొంగిపోయేలా చేయడానికి జిఎస్‌టి ఉపయోగపడుతుంది. ఇరవై తొమ్మిది రాష్ట్రాల అధినేతలతో బేరసారాలు జరిపి, ఒక్కొక్కరినీ సంతృప్తి పరిచే బదులు ఒకే గుత్తాధిపత్య కేంద్ర ప్రభుత్వ అధినేతలను తమ గుప్పిట్లో పెట్టుకోవడం సులభమని బహుళ జాతి సంస్థలు చేసిన దురాలోచన ఫలితమే జిఎస్‌టి. దేశపు వైవిధ్యాన్ని, ఆయా రాష్ట్రాల వనరులను, అవసరాలను బట్టి తన ప్రత్యేక పన్నుల విధానాన్ని రూపొందించుకునే అధికారాన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు ఇవ్వకుండా దేశపు సమాఖ్య స్వభావాన్ని దెబ్బ తీస్తుంది జిఎస్‌టి. కొత్త పన్నుల విధానపు భారంతో, ప్రత్యేకించి ప్రతి అంశమూ ఆన్‌లైన్, కంప్యూటర్ పరిజ్ఞానంతో చేయవలసి రావడంతో దేశవ్యాప్తంగా లక్షలాది చిన్న ఉత్పత్తిదారులు, చిన్న వర్తకులు చితికిపోయి, కేవలం బహుళజాతి సంస్థల, దళారీల ఉత్పత్తులు, వ్యాపార శాఖలే దేశమంతా రాజ్యం చేసే పరిస్థితి తీసుకు రావడానికే జిఎస్‌టి. పన్నుల భారం తగ్గుతుందనీ, కొన్ని వస్తువులు చౌకగా మారుతాయనీ ప్రభుత్వం చెపుతున్నవి పచ్చి అబద్ధాలని గతంలో ఎన్నో బడ్జెట్లలో పన్నులు తగ్గినప్పుడు ప్రజలు గుర్తించారు. పన్నులు తగ్గినప్పటికీ, తగ్గిన పన్నుల లాభాన్ని ఉత్పత్తిదారులు, వ్యాపారులు పంచుకున్నారు గాని ప్రజలకు బదిలీ చేయలేదు. దేశవ్యాప్తంగా కోట్లాది మంది వినియోగించే బీడీలు, వస్త్రాలు, స్త్రీలకు అత్యవసరమైన సానిటరీ నాప్‌కిన్స్ వంటి సరుకుల మీద, ఎన్నో అత్యవసరమైన సేవల మీద 18 శాతం, 28 శాతం గరిష్ట పన్నులు విధిస్తున్న కొత్త పన్నుల విధానం బంగారం వంటి విలాస సరుకుల మీద అతి తక్కువగా 3 శాతం పన్ను విధించింది. అంటే పన్నుల విధింపులో ఎంత మాత్రం హేతుబద్ధత లేని, ప్రజా ప్రయోజనాల దృష్టిలేని పన్నుల విధానం ఇది. సరిగ్గా పెద్దనోట్ల రద్దు నిర్ణయం లాగనే సామ్రాజ్యవాద యజమానులకు జీ హుజూర్ జో హుకుం అని తీసుకున్న నిర్ణయమే తప్ప ఇది మరేమీ కాదు. సరిగ్గా పెద్దనోట్ల రద్దు లాగనే దేశ ఆర్థిక వ్యవస్థను, ప్రజా జీవనాన్ని మరింత సంక్షోభంలోకి నెట్టే చర్య ఇది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

మధ్య కాలువ మీద చిన్న వంతెన ఉంది. గ్రామం మధ్యలో మూడు ఎకరాల విస్తీర్ణంలో మంచినీటి చెరువు ఉంది. ఆ చెరువు కట్ట మీద ఇప్పటికే పొట్టి శ్రీరాములు, సర్ ఆర్థర్ కాటన్, అల్లూరి సీతారామరాజు, తాండ్ర పాపారాయుడుల విగ్రహాలున్నాయి. ఆ కట్ట మీదనే రామాలయం, కృష్ణుడి గుడి కూడ ఉన్నాయి.

అలా అక్కడ ఎందరో మహానుభావుల విగ్రహాలు ఉన్నాయి గనుక వాటి సరసనే డా. బి ఆర్ అంబేద్కర్ విగ్రహం ఉంటే బాగుండునని ఆ గ్రామ దళితులు అనుకున్నారు. కొందరు వెళ్లి గ్రామ సర్పంచి ఉన్నాబట్ల ఎలిజబెత్‌ను, స్థానిక ఎంపిటిసి సిరింగుల వెంకటరత్నంను కలిసి తమ ఆలోచన చెప్పారు. ఆ ఇద్దరూ కూడ మాల కులస్తులే. ఎస్‌సి కోటాలో అధికార తెలుగుదేశం పార్టీ టికెట్ పైనే ఆ పదవులకు గెలిచారు. అయినా అన్ని గ్రామాల్లో లాగనే నిర్ణయాధికారం వాళ్ల చేతుల్లో లేదు. నిర్ణయాధికారం గ్రామంలోని భూస్వాములైన అగ్రకులస్తులదే. సర్పంచ్, ఎంపిటిసి ఇద్దరూ వెళ్లి గ్రామంలోకెల్లా శక్తిమంతుడూ, క్షత్రియ కులానికి చెందిన అధికారపార్టీ నాయకుడూ అయిన వ్యక్తిని సంప్రదించారు. ఆయన ఆ విగ్రహం పెట్టడానికి వీలు లేదన్నాడు. ఆయనకు ఇది గ్రామంలోని దళితులు తమ హక్కును స్థిరపరచుకునే ప్రయత్నంగా కనబడింది. ఈ ప్రయత్నాన్ని మొగ్గలోనే తుంచివేయాలని అనుకున్నాడు.

అలా గ్రామ పెద్దలు తిరస్కరించడంతో దళిత యువకుల్లో పట్టుదల పెరిగింది. వాళ్లు ఏప్రిల్ 23/24 రాత్రి చెరువుకట్ట మీద బాబాసాహెబ్ విగ్రహం నెలకొల్పారు. కొద్దిసేపట్లోనే 'గుర్తు తెలియని వ్యక్తులు' ఆ విగ్రహాన్ని అక్కడి నుంచి తొలగించగా మర్నాడు ఉదయం దళితులు అది గుర్తించారు. ఈ 'గుర్తు తెలియని వ్యక్తులు' అగ్రవర్ణాలకు చెందిన వారేనని దళితులు అనుమానించారు. రెండు వర్గాల మధ్య ఘర్షణ మొదలు కాబోతుండగా కొందరు అగ్రవర్ణాల పెద్దలు కావాలంటే అంబేద్కర్ విగ్రహాన్ని దళితవాడకు దగ్గరగా కాలువ కట్ట మీద పెట్టుకొమ్మని సలహా ఇచ్చారు.

విగ్రహం తొలగించడాన్ని నిరసిస్తూ స్త్రీలు, పిల్లలతో సహా దళితులు పెద్ద ఎత్తున భీమవరం – తాడేపల్లిగూడెం రహదారి మీద రాస్తారోకో చేశారు. ఆ నిరసన ప్రదర్శన దగ్గరికి వచ్చిన నర్సాపురం సబ్ కలెక్టర్ సుమిత్ కుమార్ గాంధీ విగ్రహం తొలగించడం సబబేనన్నాడనీ, ప్రభుత్వానికి చెందిన చెరువు కట్టను ఎలా ఆక్రమిస్తారని అడిగాడని నిరసనకారులు అంటున్నారు. అలాగైతే, చెరువు కట్ట మీద ఉన్న ఇతర ఆక్రమణలను, విగ్రహాలను కూడ తొలగించండి అని దళితులు అడిగితే ఆ అధికారి జవాబు చెప్పలేక వెళ్లిపోయాడు. అప్పుడే రెవెన్యూ అధికారులు, పోలీసు అధికారులు అంబేద్కర్ విగ్రహం దాచిన ఇల్లు గుర్తించి తీసుకు వచ్చి, చెరువు పక్కన ఉన్న పంచాయతీ కార్యాలయం దగ్గర పెట్టారు.

ఈ పరిణామాల తర్వాత ఏప్రిల్ 29న మిగిలిన కుల పెద్దలతో సమావేశం ఏర్పాటు చేసిన గ్రామ భూస్వామి, గ్రామ టిడిపి అధ్యక్షుడు బలరామరాజు, విగ్రహం గురించి దళితులు పంతానికి పోతున్నారని, వద్దన్నా వినడం లేదని, దళితులకు పాఠం నేర్పాలని వారిని రెచ్చగొట్టాడు. మాలలను ఎవరూ పనికి పిలవగూడదు, వారితో ఎవరూ మాట్లాడ గూడదు. మాట్లాడిన వారికి వెయ్యి రూపాయలు, పనికి పిలిచినవారికి పదివేల రూపాయలు జరిమానా అని నిర్ణయించాడు. ఈ సాంఘిక బహిష్కరణ మే మొదటి వారం నుంచి అమలవుతూ ఉండగా జూన్ మూడో వారానికి గాని బైటపడలేదు.

నిజానికి దళితులు కోరుకున్న విగ్రహావిష్కరణను అడ్డుకోవడం, దళితుల మీద సాంఘిక బహిష్కరణ విధించడం ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల (నిరోధ) చట్టం ప్రకారం శిక్షార్హమైన నేరాలు. ఆ నేరం జరిగిందని తెలిసిన వెంటనే అనుమానితులను నిర్బంధంలోకి తీసుకుని, విచారణ ప్రారంభించాలి. కాని జిల్లా అధికారులు విగ్రహం తొలగింపు మీద ఇప్పటివరకూ ఏ చర్యా తీసుకోలేదు, సాంఘిక బహిష్కరణ జరుగుతున్నదని స్థానిక పోలీస్ స్టేషన్‌లో బాధితులు ఫిర్యాదు చేసినా పట్టించుకోలేదు. కాని రాస్తారోకోలో పాల్గొన్నందుకు ఇరవై మంది దళితుల మీద మాత్రం కేసులు నమోదు చేశారు. పైగా సాంఘిక బహిష్కరణ అనే ఆరోపణ నిజం కాకపోవచ్చునని, దాన్ని రుజువు చేయలేమని, ఈ ఆరోపణలు రాజకీయ దురుద్దేశాలతో జరుగుతున్నాయని పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టర్ భాస్కర్ కాటంనేని పత్రికలతో అన్నాడు.

సాంఘిక బహిష్కరణ ప్రారంభమైన ఆరు, ఏడు వారాల తర్వాత మెల్లగా వార్తలు బైటికి పొక్కడంతో ఉండి శాసనసభ్యుడు వేటుకూరి శివరామరాజు గ్రామానికి వచ్చాడు. ఇన్నిరోజులు రాకుండా, పత్రికల్లో వార్తలు వచ్చాక ఇప్పుడు ఓదార్చడానికి వచ్చారా అనీ, సాంఘిక బహిష్కరణ విధించిన పెద్దలు మీ కులస్తులు గనుక వారిని వెనకేసుకు రావడానికి వచ్చారా అనీ దళితులు నిరసన తెలిపారు. నెలన్నరగా ఊరి రైతులు తమకు పనులు ఇవ్వక పస్తులు ఉంటున్నామని అన్నారు.

క్రమంగా ఈ ఘటన వివరాలు వెలుగులోకి రావడంతో రాష్ట్ర వ్యాప్తంగానూ, తెలంగాణ నుంచీ దళిత, ప్రజా ఉద్యమాల నాయకులు, కార్యకర్తలు, రాజకీయ నాయకులు గ్రామానికి రావడం మొదలయింది. సోషల్ మీడియాలో విస్తృతంగా ప్రచారం జరిగి జూన్ 24న 'చలో గరగపర్రు' పిలుపు కూడ ఇచ్చారు. కాని, ఆ రోజు పశ్చిమ గోదావరి జిల్లాలోని పోలీసులందరూ అక్కడే ఉన్నారా అన్నట్టుగా వేలాది మంది పోలీసులను మోహరించి, ఎవరినీ గ్రామంలోకి వెళ్లకుండా అడ్డుకున్నారు. గ్రామంలోకి వెళ్లిన నాయకులను కొందరిని నిర్బంధించారు.

మరొకవైపు చాలరోజులుగా పనులు లేక పస్తులుంటున్నారు గనుక దళితులకు ఆహార పదార్థాలు సరఫరా చేస్తామని, పనులు కల్పిస్తామని అధికారులు హామీలు ఇవ్వడం మొదలు పెట్టారు. తమ ఆకలి తీర్చడం, పనులు కల్పించడం కన్న తమ పట్ల నేరం చేసిన నిందితులను అరెస్టు చేసి విచారణ జరపడం ముఖ్యమని, అది వెంటనే జరగాలని దళితులు పట్టుబడుతున్నారు. ఇది రాస్తున్న సమయానికి (జూలై 27) ఆ అరెస్టులు మాత్రం జరగలేదు.

దళితుడిని రాష్ట్రపతి చేయడానికి అన్ని రాజకీయ పక్షాలూ ఎక్కడలేని ఉత్సాహం ప్రదర్శిస్తున్న సమయంలోనే, దళిత ప్రజల అతి చిన్న కోరిక ఇలా అణచివేతకు గురికావడం, దళితుడిగా పుట్టి రాజ్యాంగ నిర్మాత అయిన బాబాసాహెబ్ అంబేద్కర్ విగ్రహం విషయంలోనే ఇటువంటి పరిణామాలు జరగడం, అధికారవర్గాలు ఎటువంటి చర్యలూ తీసుకోక పోవడం అగ్రకుల నాయకుల అసలు స్వభావాన్ని బైటపెడుతున్నాయి.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# తెలంగాణలో అమిత్‌షా పర్యటన

***అమిత్ షా తన తెలంగాణ పర్యటనలో మావోయిస్టు ఉద్యమాన్ని, ముస్లింలను ప్రజలకు శత్రువులుగా చూపే ప్రయత్నం చేశారని అంటున్నారు* బి. రామకృష్ణ**

మే 22, 23, 24 తేదీలలో బిజెపి జాతీయ అధ్యక్షుడు అమిత్ షా తెలంగాణలో పర్యటించి కొన్ని సంకేతాలను వదిలివెళ్లాడు. కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో జరిగిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాల గడ్డ అయిన నల్లగొండలో అమిత్‌షా తన పార్టీ విస్తరణ కార్యక్రమాన్ని నిర్వహించాడు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కాలంలో మట్టి మనుషులు, ఎట్టి మనుషులు వీరోచితంగా స్థానిక భూస్వాములు, వారికి మద్దతిస్తున్న నిజాం అధికారానికి వ్యతిరేకంగా పోరాడారు. ఖాసీంరజ్వీ నాయకత్వంలోని ప్రైవేటు సైన్యం నిజాంకు మద్దతుగా, నిజాం అండదండలతో తెలంగాణ గ్రామాల్లోకి చొరబడి చేయని అరాచకాలు లేవు. వీటిని అడ్డుకోవడంలో ఆనాటి కమ్యూనిస్టులు చారిత్రాత్మకమైన పాత్రను నిర్వహించారు. ఆ పోరాటాలలో నల్లగొండ ప్రాంతానికి గొప్ప చరిత్ర ఉన్నది.

రజాకార్లంటే ముస్లింలనే తప్పుడు భావన నేటికీ కొనసాగుతున్నది. చరిత్రను సక్రమంగా అధ్యయనం చేసినవారెవరు ఇలా అనుకోరు. ఖాసీంరజ్వీ సైన్యం గ్రామాల్లోకి చొరబడి నానా బీభత్సం చేయడానికి ఆ సైన్యంకు వెన్నుదన్నుగా నిలిచింది స్థానిక భూస్వాములేనన్నది మరుగున పడిన సత్యం. నిజాం సైన్యం, రజాకార్లతో కలిసి రజాకార్లుగా గ్రామ ప్రజలపై దారుణాలను చేసింది ఆయా గ్రామాల భూస్వామ్య, పెత్తందారీ వర్గాలు వారీ తాబేదార్లేనన్నది చారిత్రక సత్యం. అటువంటి భూస్వామ్య వర్గాల, కనుసన్నల్లో, ఆ భూస్వామ్య భావజాలంతో విస్తరిస్తూ కేంద్రంలో అధికారం చలాయిస్తున్న పార్టీ బిజెపి అన్నది మరువగూడదు.

హైదరాబాద్ సంస్థానాన్ని సైనిక చర్య ద్వారా భారత యూనియన్‌లో కలుపుకోవడానికి ఆపరేషన్ పోలోను పటేల్ నాయకత్వాన నిర్వహించారు. ఆ ఆపరేషన్ నైజాం నుండి సంస్థానాన్ని ఆక్రమించు కోవడం కంటే కూడా ఈ ప్రాంతంలో కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో జరుగుతున్న సాయుధ రైతాంగ పోరాటాన్ని, కమ్యూనిస్టుల ఉద్యమాన్ని అణచివేయడమే ప్రధానమైనది.

నిజాం ప్రభుత్వ ఆస్తులను ప్రజల పరం చేయలేదు. నిజాంకున్న ఆస్తులన్నీ కూడా హైదరాబాద్ సంస్థాన ప్రజలవే. రాజరికం పోయి ప్రజాస్వామిక వ్యవస్థ ఏర్పడినప్పుడు రాజులకు ప్రత్యేకించి విపరీతమైన ఆస్తులు, సంపదలు ఎందుకుంటాయి. నైజాం వారసులకు ఆ ఆస్తులు ఎందుకు చెందుతాయి? నిజాం, అతని వారసుల ఆస్తులన్నీ ప్రజలపరం చేయబడి వారందరూ సాధారణ పౌరులుగానే గుర్తించబడాలి. కాని అలా జరుగలేదు.

అందుకే హైదరాబాద్ సంస్థానంపై దురాక్రమణ అసలు ఉద్దేశం ఇక్కడ కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని తుడిచి పెట్టే పన్నాగమేనని అనుకోవాలి. ఆ కాలంలోనే చైనాలో మావో నాయకత్వాన కమ్యూనిస్టు విప్లవం విజయవంతం అయింది. అదే ఇక్కడ కూడా ఆవిష్కృతం అవుతుందేమోనన్న శంక నెహ్రూ ప్రభుత్వాన్ని వేధించాయి. ఆదిలోనే తుంచేయాలనే తలంపు ఈ ఆపరేషన్ పోలో వెనుక దాగి ఉన్న అసలు విషయం. అందుకే నిజాం లొంగిపోయాక కూడా సుదీర్ఘకాలం పాటు సైన్యం ఈ ప్రాంతంలో తిష్ట వేసి కూర్చున్నది.

మట్టి మనుషులు భూస్వాముల నుండి స్వాధీనం చేసుకున్న భూములను తిరిగి లాక్కోవడం, ఉద్యమ శక్తులను, కార్యకర్తలను వేలాదిగా చంపేయడం, రజాకార్ల పేర్ల మీద ఎంతో మంది అమాయక ముస్లింలను చంపేయడం జరిగింది.

గ్రామాలను వదిలిన భూస్వాములు, పెత్తందారీ శక్తులు గాంధీ టోపీలతో తిరిగి తమ రాజకీయ ప్రాబల్యాన్ని, ఆధిపత్యాలను పునరుద్ధరించుకున్నారు. సర్పంచ్‌లుగా, పటేల్, పట్వారీలుగా, ఎంఎల్‌ఏలు, మంత్రులుగా రకరకాల రాజకీయాధికార స్థానాల్లో స్థిరపడిపోయారు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాన్ని రక్తపుటేరుల్లో ముంచిన ఘనత నిజాం ప్రభుత్వం కంటే కూడా ఆనాటి కాంగ్రెస్ పార్టీకే ఎక్కువగా దక్కుతుంది.

అప్పటి భారత హోం మంత్రి సర్దార్ వల్లభాయ్‌పటేల్ నాయకత్వంలో సైనికచర్య ద్వారా నిజాం పాలనలో ఉన్న హైదరాబాద్ సంస్థానాన్ని బలవంతంగా భారత యూనియన్‌లో కలిపేశారు. ఆ చర్యను గొప్పదిగా భావిస్తూ పటేల్‌ను తమ ఆదర్శ వ్యక్తిగా కీర్తిస్తున్నారు. ఒక ప్రాంతాన్ని బలవంతంగా కలుపుకోవడం అనేది సామ్రాజ్యవాద దురాక్రమణ అవుతుంది.

ఈ సామ్రాజ్యవాద దురాక్రమణను హైదరాబాద్ సంస్థాన విముక్తిగా బిజెపి పిలవమంటుంది. ముస్లింలపై విద్వేషాన్ని నింపుకున్న వారికి నిజాం ముస్లిం కాబట్టి పటేల్ చేసిన దురాక్రమణ విముక్తిగానే తోస్తుంది. ఆ పార్టీ ఎన్నడూ కూడా తెలంగాణ ప్రాంతంలోని రజాకార్లుగా చెలామణి అయిన దొరలు, దేశ్‌ముఖ్‌ల ప్రజా వ్యతిరేకచర్యలను నిరసించిందీ లేదు. దొరల, భూస్వాముల అరాచకాలను, దోపిడీ పీడనలను వ్యతిరేకించిందీ లేదు. వారికి వ్యతిరేకంగా పోరాడిందీ లేదు.

తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో గాని, స్వాతంత్రోద్యమ కాలంలో గాని బిజెపి లేనేలేదు. పోని దాని మాతృ సంస్థ అయిన ఆర్ఎస్ఎస్ సహితం పాల్గొన్నది లేదు. ప్రజల పక్షం నిలిచిన ఏ చిన్న చరిత్ర లేనట్టిది బిజెపి.

హిందూమతం పేరుమీద ఈ దేశంలో కుల అరాచక వ్యవస్థను మరింతగా బలోపేతం చేయడం, అసమానత్వాలను, మూఢనమ్మకాలను, అశాస్త్రీయ ధోరణులను పెంచి పోషించడాన్ని పనిగా పెట్టుకున్న సంస్థ అది. దాని ప్రధాన వైరివర్గం కమ్యూనిస్టులు, ముస్లింలు, క్రిస్టియన్లు. అంతే తప్పిస్తే భూస్వామ్య పీడక వర్గం అలాగే దోపిడీ పాలకులైన బ్రిటిష్ వలసవాదులు కానేకాదు.

నల్లగొండ జిల్లా గుండ్రాంపల్లి గ్రామంలో రజాకార్లకు వ్యతిరేకంగా పోరాడిన వారిని అమిత్ షా స్మరించుకున్నాడు. వారి త్యాగాలను గొప్పగా కీర్తించాడు. వారి త్యాగాలను, రక్త బలిదానాలను ఇంకా వందేళ్లయినాసరే మరవబోమని ప్రస్తావించాడు. రజాకార్లకు వ్యతిరేకంగా ప్రజలను సంఘటిత పరిచింది, పోరాడింది ఆనాటి కమ్యూనిస్టు పార్టీ అన్నది చారిత్రక వాస్తవం. దాని వారసత్వం నేటి మావోయిస్టు ఉద్యమాల్లో కనిపిస్తుంది. ఆ పార్టీ కృషిని గాని, త్యాగాలను ప్రస్తావించకుండా చాలా కన్వీనియంట్‌గా ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమాన్ని, దాని త్యాగ నిబద్ధతలను నిస్వార్థతను మరుగున వేసే ప్రయత్నం చేశాడు.

తెలంగాణ రాష్ట్రానికి కేంద్రం ఒక లక్ష కోట్లు సహాయం చేసిందని, కేంద్ర ప్రభుత్వ పథకాలను వేటినీ ఇక్కడ అమలు చేయడం లేదని, కనీసం మరుగుదొడ్లను నిర్మించలేదని, దేశవ్యాప్తంగా మోది 4.5 కోట్ల మరుగుదొడ్లను నిర్మించాడని అమిత్‌షా చెప్పాడు. కేంద్ర పథకాల గురించి ఏకబిగిన రిథమిక్‌గా చెపుతూ ఒక్కసారిగా మధ్యలో ఆపి ఎన్నని చెప్పను వందకు పైగా ఉన్నాయని మోదీ ప్రభుత్వాన్ని ఆహా! ఏమి గొప్పతనం! ఎంత మంచితనం! అనేంతగా తనివితీరా పొగుడుతూపోయాడు.

అయితే మోడీ ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాలు కంటితుడుపు చర్యలే గాని వాటి ద్వారా ప్రజల మౌళిక సమస్యల్లో ఏ ఒక్కటీ పరిష్కారం అయ్యేది కాదు.

అమిత్‌షా తప్పుడు మాటలను కెసిఆర్ స్వయంగా ఖండిస్తూ తీవ్రస్థాయిలో మాట్లాడాడు. 19వేల కోట్లు మిషన్ భగీరథకు ఇమ్మనంటే 19 పైసలిచ్చింది లేదని, 5వేల కోట్లు మిషన్ కాకతీయకు ఇమ్మనంటే 5 పైసలిచ్చిందిలేదని తీవ్రంగా వ్యతిరేకించాడు. కేంద్రానికి తెలంగాణ ఇచ్చిందే ఎక్కువని తేల్చిచెప్పాడు.

తెలంగాణతో పాటుగా గుజరాత్, మహారాష్ట్ర లాంటి ఏడు రాష్ట్రాలు కేంద్రానికి అధిక మొత్తంలో నిధులు సమకూరుస్తున్నాయి. ఆ నిధులతోనే కేంద్ర ప్రభుత్వం నడుస్తున్నది. తెలంగాణ రాష్ట్రమే కేంద్రానికి ఇచ్చిందని అధికారిక లెక్కలతో ముఖ్యమంత్రి హోదాలో కె.సి.ఆర్. స్పష్టం చేశాడు.

నిధులు రాష్ట్రానివైనా, కేంద్రానివైనా నిజానికి అవి ఎవరివి? కష్ట జీవులవి, శ్రామికులవి, కార్మికులవి, రైతులవి, మొత్తంగా అశేష ప్రజానికానివి. ఈ సంపద సృష్టికర్తలు కనీస జీవనానికి నోచుకోవడం లేదు. సంపదను చేజిక్కించుకున్న అతికొద్దిమంది సంపన్నవర్గాలు విలాసాలను అనుభవిస్తున్నారు. ఈ విలాసాలను అడ్డుకోలేని ప్రభుత్వాలు తాము చేపట్టిన సంక్షేమ పథకాలను గ్లోరిఫై చేస్తున్నాయి.

ఈ సందర్భంలో బిజెపికి తామెంత విధేయులమో చెబుతూ, మోదీ పాలనా విధానాలకు తాను మద్దతిచ్చిన తీరును కెసిఆర్ వివరించాడు. డిమానిటైజేషన్‌ను వారి పార్టీ వారే కొందరు వ్యతిరేకించినప్పటికీ బయట పార్టీగా ఉంటూ కూడా బలంగా మోదీని సమర్థించిన ఏకైక ముఖ్యమంత్రిని తానేనని, అలాగే జి.ఎస్.టి. విధానాన్ని సమర్థించామని కెసిఆర్ స్పష్టం చేశాడు. ఇంతలా వినయ విధేయతలతో ఉన్నప్పటికీ తమను బిజెపి జాతీయ అధ్యక్షుడు అవమానిస్తాడా అన్నదే కెసిఆర్ ఆక్రోశం అంతా.

రాష్ట్రపతి ఎన్నికల్లో ఆర్ఎస్ఎస్ వ్యక్తికి మోదీ కోరిన వెంటనే మద్దతు ప్రకటించిన కెసిఆర్ మోదీకి ఎంత సన్నిహితుడో చెప్పకనే చెబుతున్నాడు. ఇవన్నీ గమనిస్తుంటే బిజెపి, టిఆర్ఎస్‌ల మధ్య ఉన్న సాన్నిహిత్యం ఎంత బలమైందో తేలిపోతున్నది. అమిత్ షా పర్యటన సందర్భంగా ఈ రెండు పార్టీల మధ్య జరిగిన మాటల వాడీ, వేడి అంతా కూడా టీ కప్పులో తుఫాన్ వంటిదే కాక మరేమికాదు. ఈ రెండు పార్టీలు సంపన్నులు, కార్పొరేటు శక్తులు, సామ్రాజ్యవాదుల నమ్మిన బంట్లేననేది మరుగున వేయాలన్న ప్రయత్నమే ఈ వ్యవహారం అంతాకూడా.

ప్రజలకేదో సొంత ఖజానా నుండి ఇచ్చినట్లుగా ఘనంగా లెక్కలు చెబుతున్నారు. ప్రత్యక్ష, పరోక్ష పన్నుల రూపంలో నిత్యావసర సరుకుల నుండి మొదలుపెట్టి అనేక రకాల పన్నులు వసూలు చేస్తే గాని ప్రభుత్వ ఖజానా నిండదు. ఈ ఖజాన అంతా కూడా ప్రజల శ్రమ సంపదే తప్ప ఏ పార్టీ స్వంతమో, ప్రభుత్వానికి ఆకాశం నుండి వచ్చిన రొక్కమో కాదు. ప్రజల సొమ్మును ప్రజలకివ్వడానికి తామేదో గొప్పగా చేస్తున్నట్లుగా ఫోజులు పెట్టడం పరిపాటిగా మారింది.

నిజానికి పోగైన ప్రజల శ్రమసంపదలో చాలా తక్కువ భాగం మాత్రమే సంక్షేమ పథకాల రూపంలో ఖర్చు చేయబడుతుంది. అందులో కూడా ఎంతో అవినీతి చోటు చేసుకుంటుంది. అధిక భాగం ప్రజా శ్రమ సంపదంతా సంపన్నుల, పెట్టుబడిదారీ కార్పొరేటు శక్తుల, సామ్రాజ్య వాదుల, సామ్రాజ్యవాద దళారుల, భూమి, విద్యా తదితర మాఫియా చేతుల్లో కేంద్రీకృతమవుతున్నది. దీన్ని మరుగునపరుస్తూ విదిలించే మెతుకుల వంటి సంక్షేమ పథకాల గురించి చాలా గొప్పగా ప్రచారం చేస్తూ ప్రజలను నమ్మించే, భ్రమల్లో ముంచే ప్రయత్నం చేస్తున్నారు.

గుణాత్మకమైన, ఉచిత విద్యను కె.జి. నుండి పి.జి. వరకు అందించడం లేదు. పాఠశాల స్థాయిలో సగానికి పైగా, ఆపై స్థాయిల్లో 80-90 పైగా ప్రజానీకం ప్రైవేటు సంస్థల్లో చదువుల వ్యాపారానికి బలైపోతున్నారు. నేడు స్థానిక కార్పొరేట్ శక్తులకు అదనంగా ప్రపంచస్థాయి విద్యా వ్యాపార శక్తులకు గేట్లు బార్లా తెరిచారు. ఈ దుర్మార్గాన్ని ఎక్కడా కూడా ప్రస్తావించరు.

ఆరోగ్యం అంగడి సరుకయింది. ప్రభుత్వ ఆధీనంలో పేద గొప్ప అనే తేడా లేకుండా అందరికి నాణ్యమైన వైద్యం అందడం లేదు. ఉన్నోడికి ఒక వైద్యం, లేనోడికి ఒక వైద్యం, అసలేమిలేనోడి ప్రాణాలు గాల్లోనే కలుస్తున్నాయి. వీటి గురించి ఏ పథకమూ లేదు.

విద్య, వైద్యాలను పేదవారికి అందకుండా చేస్తూ ప్రైవేటీకరిస్తారు. మరోవైపు బేటీ పడావో, బేటీ బచావో అంటుంటారు. స్కిల్ ఇండియా పేరుతో చిన్నచిన్న పనుల్లో నియమించబడే పద్ధతిని అవలంబిస్తూ పిల్లలు పాఠశాల స్థాయిలో నుండే విద్యా సంస్థల నుండి గెంటేయబడుతూ, ఉన్నత చదువుకు దూరం చేయబడే విధానాలు తెస్తున్నారు.

మేక్ ఇన్ ఇండియా పేరుతో అంతర్జాతీయ, బహుళజాతి సంస్థలకు ఇక్కడి కార్మిక శ్రమశక్తిని చౌకగా, సహజ వనరులను అప్పనంగా

అందించడం చేస్తున్నారు. మరోవైపు ప్రజల పక్షం అని మాట్లాడడం వారికి మంచినీళ్ల ప్రాయం అయింది.

భూముల పంపకం ద్వారా ప్రజలకు జీవితంపై భరోసా వస్తుంది. అలాంటి కార్యక్రమం ప్రభుత్వాల వద్ద లేనే లేవు. దేశ సంపదంతా కొద్దిమంది చేతుల్లోకి వెళ్లడాన్ని ఆపే కార్యక్రమమే లేదు. నోరుందికదా అని, మాటల గారడీలు చేయగల సామర్థ్యాలున్నాయి కదా! అని, తూతూ మంత్రం తుమ్మకాయమంత్రం లాంటి పథకాలను గొప్పగా కీర్తించడం ద్వారా ప్రజలకేదో బిజెపి ప్రభుత్వం చేసేస్తోందని చెప్పుకోవడం వారి అవివేకానికి, కపటత్వాలకు, మోసాలకు, మాయోపాయాలకు నిదర్శనం.

ప్రజానుకూల భూసేకరణ చట్టం 2013ను వ్యతిరేకిస్తూ సవరణలు తెచ్చారు. ఈ సవరణల విషయంలో వీరిరువురికి ఏ మాత్రం తేడా లేదు. దొందూదొందే. విద్యా, వైద్య ప్రయివేటీకరణలో గాని, కార్పొరేట్ సంస్థలకు ఎర్ర తివాచీ పరచడంలో గాని, ప్రపంచబ్యాంకు నమూనాను పాటించడంలో వీరిద్దరికీ తేడాలేమిలేవు.

కంటితుడుపు చర్యలుగా సంక్షేమ కార్యక్రమాలను ప్రకటించి వాటినే గొప్పవిగా, సమాజ సంక్షేమాలుగా, ప్రజల అభివృద్ధికి దోహదపడేవిగా చూపించడంలో వీరిద్దరూ సమానులే. దేశ సంపదను ప్రజలందరికి చెందేలా చేయకుండా, ఆ సంపదను కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం చేసే ప్రజావ్యతిరేక విధానాలు బాహాటంగానే చేపట్టడంలో ఇద్దరూ పోటీ పడుతున్నారు. అంతర్జాతీయ పెట్టుబడిదారులకు దాసోహం అంటున్నారు.

అమిత్‌షా తన తెలంగాణ పర్యటనలో దళితవాడల్లో భోజనం చేసినట్లు చూపించారు. నిజానికి ఎక్కడో వండి తెచ్చినదాన్ని టేబుల్లపై పెట్టుకుని తిన్నారని స్వయంగా ముఖ్యమంత్రి కెసిఆర్ రుజువులతో సహ ప్రకటించాడు. దళితవాడల్లో తినడం ద్వారా బిజెపి దళితుల కోసం పాటుపడుతున్నదని చెప్పుకోవాలనుకుంటున్నారు.

ఇదే తంతును అమిత్‌షా పశ్చిమబెంగాల్‌లోని నక్సలైట్ ఉద్యమం పుట్టిన నక్సల్బరీలో చేపట్టాడు. ఎంతో కొంత నక్సల్బరీ వాసనలతో ఉన్న నల్లగొండ ప్రాంతంలో పర్యటించి తెలంగాణలో తమ టార్గెట్ శక్తులు ఎవరంటే మావోయిస్టు రాజకీయ భావజాలం అని స్పష్టంగానే తమ క్షేత్రస్థాయి నాయకులకు, కార్యకర్తలకు ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉద్బోధించాడు.

నిజంగానే దళితుల ఇళ్లల్లో కాసేపు ఉన్నంత మాత్రాన, తిన్నంత మాత్రాన బిజెపి దళితుల పార్టీ అయిపోదు. ఎంతోమంది దళితులకు, ముస్లింలకు, క్రిస్టియన్లకు, ఇతర సెక్షన్ల ప్రజలకు ఆహారమైన పశుమాంసం పై ఎన్నో ఆంక్షలు విధిస్తున్నారు. ఆహారపు అలవాట్లపై చిన్నచూపు, ఆంక్షలు కొనసాగుతున్నాయి.

గో రక్షకుల పేరుతో దళితులపై, ముస్లింలపై దాడులు పెరిగిపో తున్నాయి. ఈ గో రక్షకులకు అండగా, వెన్నుదన్నుగా ఉన్న సంస్థలు, రాజకీయ పార్టీలు ఎవరనేది బహిరంగ రహస్యమే. ఓవైపు పశువుల విక్రయాలపై నిషేధం విధించారు. గోవుల వధపై, పశుమాంస క్రయ విక్రయాలపై, పశుమాంస ఆహారపు అలవాట్ల పై తీవ్రంగా విరుచుకుపడుతున్నారు. మరోవైపు దళితుల, మైనారిటీల పక్షం అని చెబుతుంటారు.

ఇప్పట్లో బిజెపికి తెలంగాణలో విస్తరించగలిగే శక్తి గాని, భౌతిక పరిస్థితులు గాని లేవు. అయినా సరే 2019 ఎన్నికల్లో అధికారంలోకి వస్తామని ఉత్తర కుమారుని ప్రగల్బాలు పలికాడు అమిత్‌షా. ఇక్కడ ప్రశ్నించే గొంతులు, హక్కుల స్పృహ, ప్రజాస్వామిక మేధావులు, చైతన్య స్రవంతులు మిగిలి ఉండడం బిజెపికి మింగుడు పడని విషయం. ఇది కెసిఆర్‌కు మింగుడు పడడం లేదు. అందుకే ధర్నాచౌక్‌ను ఎత్తివేసే ప్రయత్నం చేస్తున్నాడు.

బిజెపికి మించిన రీతిలో హిందూ మతాన్ని అనధికారికంగా అధికారమతంగా చేస్తున్నాడు. ఏ ప్రభుత్వ కార్యక్రమమైనా, శంకుస్థాపనలైనా బ్రహ్మణుల మంత్రాలతో, పూజలతో మొదలవు తున్నాయి. యాదాద్రికి కోట్ల రూపాయలు, ఇతర ఎన్నో మత సంస్థలకు, మత పెద్దలకు విరాళాలు ఇస్తున్నారు. వారికి విపరీతమైన గౌరవాదరణలు ప్రభుత్వ పరంగా లభిస్తున్నాయి.

యాగాలు చేయడం, ముఖ్యమంత్రి కార్యాలయంలో పూజలు చేయడం, బ్రహ్మణున్ని ముఖ్యమంత్రి కుర్చీలో కూర్చోబెట్టి ప్రజలిచ్చిన అధికారాన్ని అవమాన పరిచాడు. కెసిఆర్ హిందూ మతానికిస్తున్న ప్రోత్సాహం అనేది అధికారం కోసం ప్రయత్నిస్తున్న బిజెపికి కొంతవరకు ఇబ్బందికరమే. కాని ఇది లోలోన బిజెపి మాతృసంస్థ ఆర్ఎస్ఎస్‌కు సంతోషదాయకమే.

గుళ్లు, గోపురాలకు నిధులు, విరాళాలు ఇవ్వడం, యాగాలు నిర్వహించడంలో బిజెపికి తాతయ్యి కూర్చున్నాడు కెసిఆర్. తెలంగాణలో బిజెపి అధికారంలోకి వచ్చే ఛాయలు లేనేలేవు. అసలిది సాధ్యామూ కాదనేది వారికి తెలియనిదేమికాదు. బూత్ స్థాయి నుండే ప్రచారం చేయడం అంటే వారికి ఎన్నికలు, అధికారమే తప్ప ప్రజల సమస్యలు కానేకావు. ప్రజల సమస్యల పేరు చెప్పి అధికారం చేజిక్కించుకోవడం వారికనవసరం.

అమిత్‌షా మే 2017లో చేసిన తెలంగాణ పర్యటనలో టిఆర్ఎస్‌ను లక్ష్యం చేసుకుని విమర్శించినట్లుగా అనిపించినప్పటికీ అది నిజం కాదు. కొంచెం లోతుగా అమిత్ షా మాటలు, తను పర్యటించిన గ్రామాలను పరిశీలిస్తే అతని టార్గెట్ మావోయిస్టు భావజాలం, ముస్లింలని తెలుతుంది. మొదటిరోజు తేరట్‌పల్లిలో నక్సలైట్ల చేతిలో హతుడైన మైసయ్యగౌడ్ విగ్రహాన్ని ఆవిష్కరించి తమ పార్టీ ఎవరిని లక్ష్యం చేసుకుందో స్పష్టం చేశాడు. బిజెపి వంటి పార్టీ కమ్యూనిస్టు ఉద్యమ ప్రాంతాన్ని తన పర్యటనకు ఎంచుకోవడం అంటేనే ఆ భావజాలంపై దాడిచేయడం అని అర్థం చేసుకోవాలి. తమ పార్టీ శ్రేణులకు ఈ సంకేతం పంపాలనుకున్నాడు.

పైకి చెప్పనట్లుగా వారి లక్ష్యం టిఆర్ఎస్ కాని, కాంగ్రెస్ కాని కాదు. ఓట్ల కోసం అంటే అనుండవచ్చు గాని పునాది పరంగా చూసినప్పుడు ఆ పార్లమెంటరీ పార్టీల వారి లక్ష్యంలో తేడాలేమి లేవు. బిజెపి, ఆర్ఎస్ఎస్ భావజాలం రూపకర్తల్లో ఒకరిగా గుర్తింపబడిన దీన్‌దయాళ్ ఉపాధ్యాయ ఆలోచనలను ముందుకు తీసుకుపోవడం అని పదేపదే వివరించాడు. ఆర్ఎస్ఎస్ భావజాలం సమాజంలోని అట్టడుగు ప్రజలైన దళిత, ఆదివాసీ, ముస్లిం, క్రిస్టియన్ మైనారిటీలకు వ్యతిరేకమైనది. కులవ్యవస్థను నిలబెట్టే భావజాలం, ఆచరణ దానిది. మైనారిటీ మతస్థులపై విద్వేషాలను రెచ్చగొట్టి రాజకీయ లబ్దిపొందడం దాని కార్యాచరణగా ఉంటున్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# రైతు ఆందోళనపై పోలీసు దమనకాండ

***ఎన్నికల ముందు రైతులకిచ్చిన హామీలను నెరవేర్చకపోగా, వారిని మార్కెట్ దళారులకు వదిలేసి, గిట్టుబాటు ధర కోసం పోరాడితే కాల్పులు జరిపి వారి ప్రాణాలను బలిగొనడంలోనే పాలకుల స్వభావం బయటపడిందని అంటున్నారు* షేక్ కరిముల్లా**

'ధనాజీ చంద్రకాంత్ జాదవ్ అను నేను రైతును...
ఈ రోజు ఆత్మహత్య చేసుకుంటున్నా...
సిఎం దేవేంద్ర ఫడ్నవీస్ ఇక్కడకు వచ్చేవరకు...
రుణమాఫీ చేసే వరకు...
దయచేసి నా అంత్యక్రియలు జరపొద్దు'.

రుణవిముక్తి కోసం తల్లడిల్లుతున్న అన్నదాతల్లో సహనం చచ్చిపోయింది. వ్యవసాయ రుణాలను మాఫీ చేస్తామంటూ ఓట్లు దండుకున్న బిజెపి ప్రభుత్వాలు రైతులను పచ్చిగా దగా చేశాయి. ఈ నమ్మక ద్రోహాన్ని తట్టుకోలేక మహారాష్ట్ర రైతన్నలు వారం రోజులుగా ఆందోళనలు చేస్తున్నారు. ప్రభుత్వంలో ఉలుకు లేదు, పలుకు లేదు. దీంతో ఓ రైతు తన బలిదానంతో సర్కారులో చలనం తీసుకు రావాలనుకున్నాడు. తన పొలంలోనే ఉరివేసుకుని ఉసురు తీసుకున్నాడు. ఈ విషాదం మహారాష్ట్ర రైతులను కలచివేసింది. ప్రభుత్వాన్ని కుదిపేసిన వైనం ఇది. సంఘటన స్థలిలో పడున్న ఓ సూసైడ్ నోట్‌లో రైతుల రుణాలను ప్రభుత్వం మాఫీ చేసేవరకు తన మృతదేహానికి అంత్యక్రియలు నిర్వహించవద్దని రైతు చంద్రకాంత్ జాదవ్ కోరినాడు. ఇలాంటి కడు విషాదాలు దేశంలో రైతుల ఇంటా ఎన్నో జరుగుతున్నాయి.

దేశ వ్యాప్తంగా వివిధ రాష్ట్రాలలో రైతుల ఆందోళనలు ఉద్రిక్తంగా మారుతున్న స్థితిలో కేంద్రంలో మోడీ సర్కారు ఉక్కిరి బిక్కిరి అవుతుంది. మొదట తమిళనాడులో రాజుకున్న నిప్పురవ్వ మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో దావానలంలా వ్యాపించింది. రాజస్థాన్ రగులుతుంది. పంజాబ్ రాజుకుంది. యుపిలో యోగికి అల్టీమేటం ఇచ్చారు. మధ్యప్రదేశ్‌లో రైతుల ఆందోళన తీవ్ర స్థాయికి చేరింది. మంద్‌సౌర్‌లో ఆందోళనలు చేస్తున్న రైతులపై పోలీసులు కాల్పులు జరిపి ఐదుగురు రైతులను చంపేశారు. అనేక మంది రైతులు తీవ్ర గాయాల పాలయ్యారు. అయినా ఆందోళనలు ఆగలేదు. సరికొత్త ప్రాంతాలకు విస్తరించాయి. అనేక చోట్ల కర్ఫ్యు ధిక్కరించి రాస్తారోకోలు నిర్వహించారు. రైతుల డిమాండ్‌లు గొంతెమ్మ కోరికలేమి కాదు. పండిన పంటలకు తగిన గిట్టుబాటు ధర, రుణమాఫీ చేయాలంటున్నారు. ఇందులో మొదటి డిమాండ్ సార్వత్రిక ఎన్నికలలో (2014) బిజెపి ఇచ్చిన హామీయే. రెండోది యుపి ఎన్నికలలో బిజెపి అక్కడ రైతులకిచ్చిన వాగ్ధానం. ఇంత జరుగుతున్నా మోడీ నోరు తెరవలేరు. 'రోం నగరం తగలబడుతుంటే రాజు ఫిడేలు వాయించుకున్నాడంటా' అన్న చందంగా ఉంది ఈయన వైఖరి.

పాలకులెవరైనా రైతుల పట్ల నిర్లక్ష్య వైఖరి చూపిస్తున్నారు. ఆత్మహత్యలతో దేశ రైతాంగం కుంగి, కుమిలి కడుపు మండి సహనం కోల్పోతే మాత్రం లాఠీ ఛార్జీలు, కర్ఫ్యులు, కాల్పులు, కేసులు, అదనపు బలగాలు దిగుతున్నాయి. ఈ బలగాలు, మిలటరీలు ఎందుకున్నాయి? దేశ రక్షణ పేరుతో న్యాయం కోసం పోరాడే ఈ దేశ పౌరులను శాంతి భద్రతల పేరుతో చంపడానికా? రైతాంగ ఆత్మహత్యలు అరికడతామని, రైతుల ఆదాయం రెట్టింపు చేస్తామని హామీలిచ్చి కేంద్రంలోను, రాష్ట్రాలలోను అందలమెక్కిన బిజెపి ప్రభుత్వాలు అధికార మదంతో అన్నదాతల పైనే తుపాకీ ఎక్కుపెట్టడం హేయాతి హేయమైన చర్య. ఒకవైపు కార్పొరేట్లకు ఊడిగం చేస్తూ మరోవైపు రైతులను పిట్టలను కాల్చినట్లు కాల్చిపడేసిన పాలకుల కిరాతకాన్ని ఎంత ఖండించినా తక్కువే. మధ్యప్రదేశ్‌లో రైతులు చేసిన నేరమేంటి? తాము పండించిన పంటలకు గిట్టుబాటు ధర కావాలని అడిగారు. బిజెపి ఎన్నికల హామీని నిలబెట్టుకోవాలని మాత్రమే అడిగారు. అదేదో నేరం, ఘోరం అన్నట్లుగా రైతులను కాల్చి చంపడం దుర్మార్గం. ఇలా తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించి రైతుల పోరాటాలను అణచివేయాలని చూడడం పాలకుల అవివేకం.

దేశంలో రైతాంగ పోరాటాలు చరిత్రకు కొత్తకాదు. బ్రిటిష్ వలస పాలన దోపిడీ విధానాలే ఆనాడు రైతు ఉద్యమాలకు ఊపిరి పోశాయి. 1859-60 మధ్య కాలంలో తలెత్తిన నీలి మందు ఉద్యమం, 1875 - 76లో మహారాష్ట్రలో 'దక్కన్ తిరుగుబాటు' పేరుతో జరిగిన రైతు ఉద్యమం, 1890 - 1900ల మధ్య పంజాబ్‌లో రైతాంగ తిరుగుబాటు, 1917-18లో బీహార్ రైతుల నీలి మందు తోటల యజమానులకు వ్యతిరేకంగా జరిగిన చారిత్రాత్మకమైన చంపారన్ తిరుగుబాటు. 1920-23లో సాగిన సహాయ నిరాకరణ ఉద్యమంలో రైతులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. ఈ పోరాటాల్లో హింస చోటు చేసుకోవడంతో కాంగ్రెస్ వర్గాల్లో భయం పుట్టి సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఆపివేయడం జరిగింది. 1928-29లో బర్డోలి రైతుల ఉద్యమం కొంత విజయాన్ని సాధించడంతో, పోరాడితే సాధించగలమన్న విశ్వాసాన్ని బర్డోలి రైతులు భారత రైతాంగానికి కలిగించారు. కాంగ్రెస్ మంత్రివర్గ వైఫల్యాల ఫలితంగా బీహార్, యుపిలలో తలెత్తిన ఉద్యమం రుణభారం, శిస్తుల భారం నుంచి విముక్తి పొందడానికి బెంగాల్‌లో తలెత్తిన ఉద్యమం, కోయల తిరుగుబాటు, మయూర్ భంజ్‌లోని భిల్లుల తిరుగుబాటులు రైతుల వీరోచిత పోరాటాలకు నిదర్శనం.

1937-46 ప్రాంతాలలో ఫ్యూడల్ భూస్వామ్య దాష్టికానికి వ్యతిరేకంగా భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో రైతు విప్లవాలకు దారి తీశాయి. అయితే అప్పటి రైతు ఉద్యమాలను సరైన దిశలో ఉపయోగించుకునేటంతగా అప్పటి రాజకీయ సంస్థలు ఎదగలేదు. ఉన్న జాతీయ కాంగ్రెస్ బ్రిటిష్ వారి జేబు సంస్థగా పనిచేస్తుండడంతో ఈ రైతు ఉద్యమాలు తేలి పోయాయి. ముఖ్యంగా 1942లో భారత రైతులు కాంగ్రెస్ శాసనోల్లంఘన ఉద్యమ పిలుపునకు వీరోచితంగా ప్రతిస్పందించారు. ఉత్తరప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, తమిళనాడుల్లో

వారు సమాంతర ప్రభుత్వాలను ఏర్పాటు చేశారు. బెంగాల్‌లోని మిద్నపూర్‌లో రైతుల తిరుగుబాటు కారణంగా కొన్ని సంవత్సరాల పాటు బ్రిటిష్ వారు ఆ ప్రాంతాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకోలేకపోయారు. భారతదేశంలోని రైతు ఉద్యమాలకు చైనాలోని మావో లాగా సరైన నాయకత్వం గనుక లభించి ఉంటే భారతదేశ చరిత్ర మరోలా ఉండేది. ఇప్పుడు రైతులకు కావాల్సింది సరైన దశ దిశ నిర్దేశించే మంచి నాయకత్వం లభిస్తే ఈ దేశం దోపిడీ దారుల నుండి విముక్తి కాగలదు.

నేడు దేశంలో అనేక చోట్ల రైతులు ఆందోళన బాట పడుతున్నారు. అన్నదాతల నిరసనాగ్రహం విస్తరిస్తుంది. బాధ్యత మరచిన పాలకులు అమాయక రైతులపై లాఠీలు ఝుళిపిస్తున్నారు. తుపాకులు ఎక్కుపెట్టి తూటాలు కురిపిస్తున్నారు. రైతు జీవన భద్రత గాలిలో దీపమైంది. ఈ పరిస్థితిలో దేశానికి వెన్నెముక అన్నదాత స్థితి రోజు రోజుకు దిగజారుతుంది. సకాలంలో నిర్దిష్ట చర్యలతో ఆదుకోలేకపోతే మొత్తం దేశానికే విపత్తు వాటిల్లనుంది. ప్రకృతి ప్రతికూలతలు, నకిలీ విత్తనాలు, వర్షాభావ పరిస్థితి, రుణ భారాలు ఇలాంటి వాటికి తట్టుకొని కొద్దో గొప్పో మిగులు దిగుబడి సాధిస్తే గిట్టుబాటు ధరలు లభించక దళారీ మార్కెట్ మాయాజాలంలో సమిధై పోతున్న రైతన్నలు నిరాశ, నిస్పృహలకు లోనవుతున్నారు.

ఐదేళ్లలో రైతుల ఆదాయం రెట్టింపు చేస్తానని, 'జై జవాన్, జై కిసాన్' అని మాట్లాడిన మోడీ మాటలు రైతుల ఓట్ల కోసమేనని తేలిపోయింది. మార్కెట్ శక్తుల మాయాజాలం నుంచి రైతుకు రక్షణ కల్పించి, గిట్టుబాటు ధర కల్పించడంలో బిజెపి ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. మధ్యప్రదేశ్ విషయమే తీసుకుంటే అక్కడ నిరుడు ఫిబ్రవరి నుంచి మొన్నటి ఫిబ్రవరి వరకు (ఏడాది) 1982 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ రాష్ట్రంలో గత 15 ఏళ్లలో ఇలా ఆత్మహత్యలు చేసుకున్న రైతుల సంఖ్య దాదాపు 20,000. ఈ సంవత్సరం వాతావరణం అనుకూలించి పంటలు బాగా పండినా మార్కెట్‌కు వచ్చే సరికి గిట్టుబాటు ధరలు లేవు. ఆ రాష్ట్రంలో మాల్వానిమడ్ ప్రాంతం, ఇప్పుడు పోలీసు కాల్పులు జరిగిన మంద్‌సౌర్ జిల్లాతో సహా 15 జిల్లాలలో వరుసగా రెండు సంవత్సరాలుగా ఉల్లి దిగుబడులు బాగున్నాయి. మార్కెట్‌కి తీసుకొచ్చాక ఉల్లి ధర అమాంతంగా పడిపోయింది. కిలో ఉల్లి రూపాయి ధరకి పడిపోవడంతో ఆగ్రహించిన రైతులు ఉల్లిని రోడ్లపై పారబోయాల్సి వచ్చింది. టమాట, ఆలుగడ్డల రైతుల స్థితి సైతం ఇదే. పొరుగునున్న మహారాష్ట్ర రైతులది ఇంచు మించు ఇవే పరిస్థితులు. ఇక్కడ ఈ ఏడాది కంది పంట బాగా పండింది. దాని ధర క్వింటాకు రు. 12,000 నుంచి ఒక్కసారిగా రు. 3,000 లకు పడిపోయింది. ఇక తెలుగు రాష్ట్రాలలో మిర్చి రైతులు గిట్టుబాటు ధర కోసం ఉద్యమిస్తే ఎలాంటి పరాబవం ఎదురైందో అందరూ చూశారు.

మొజాంబిక్‌తో ఒప్పందం కారణంగా లక్షల టన్నుల పెసరపప్పు దిగుమతి అయ్యింది. మన పెసర రైతుల పరిస్థితి ఏమిటి? ఇప్పుడు కనీస గిట్టుబాటు ధరలు లేక అటు పంట దిగుబడిని నిల్వ ఉంచుకోలేక వృథాగా పారబోయవలసిన పరిస్థితిలోకి రైతు నెట్టబడడం ఈ వ్యవస్థ విషాదం. దారుణ సంక్షోభానికి సంకేతం. దేశానికే ధాన్యాగారం, ఐదు జీవ నదులు ప్రవహించే ప్రాంతం పంజాబ్‌లో కూడా ఇప్పుడు రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు అంటే మన పాలకుల వ్యవసాయ విధానంలోని డొల్లతనం ఇట్టే తెలిసిపోతుంది. ఇక తమిళనాడు రైతులు న్యూఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద నెల రోజులు వివిధ వినూత్న రూపాలలో ఆందోళనలు చేసినా బిజెపి ప్రభుత్వానికి చెవికెక్కలేదు. దున్నపోతు మీద వర్షం పడిన చందాన వ్యవహరించింది. తమిళనాడులో గత 140 ఏళ్లలో ఎన్నడూ లేనంతగా కరువు ఏర్పడింది. ఈ కరువు రక్కసి భారిన పడి ఇప్పటివరకు 400 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ కరువు పరిస్థితి నుంచి తమిళ రైతులను ఆదుకోవాలని, దానికి 40 వేల కోట్ల ప్యాకేజీ ఇవ్వాలని తమిళ రైతులు గత కొన్ని రోజుల నుంచి ఆందోళన బాట పట్టారు. రైతుల గోడు ఏమాత్రం పట్టని సంపన్న ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఆదుకునే ప్రసక్తే లేదని తెగేసి చెప్పాడు. ఇంత జరుగుతున్నా ఇంత వరకు రైతులకు పైసా కూడా సాయం చేయలేదు. పైగా సుప్రీంకోర్టులో దీనిపై కేంద్రం తన వాదన వినిపిస్తూ తమిళనాడులో రైతులెవరూ ఆత్మహత్య చేసుకోలేదని చెప్పిందంటే ఎంత అమానుషం.

రైతును ఉద్ధరించడానికే తెచ్చానని ఘనంగా డప్పుకొట్టుకొని చెప్పుకొన్న ప్రధాన మంత్రి 'ఫసల్ భీమా' పథకం రైతులకు ఏమాత్రం అక్కరకు రాలేదు. కానీ కార్పొరేట్ బహుళజాతి కంపెనీలకు దండిగా కాసుల పంట పండించింది. ఫసల్ భీమా పథకం కింద 2016 – 17లో ప్రైవేట్ భీమా కంపెనీలు ప్రీమియం రూపంలో రైతుల నుంచి 21,500 కోట్లు దండుకున్నాయి. గత ఖరీఫ్ సీజన్‌లో రైతులు పరిహారం కింద 4,270 కోట్లు క్లైమ్ చేయగా 714 కోట్లు మాత్రమే ఇచ్చాయి. దీనిని బట్టి ఫసల్ భీమా పథకం ఎవరికి ఉపయోగపడుతుందో అర్థం చేసుకోవచ్చు. మరోవైపు వేల కోట్ల రూపాయలు ఎగ్గొట్టి బ్యాంకులకు కుచ్చుటోపి పెట్టిన విజయ మాల్యా లాంటి కార్పొరేట్ పెద్ద మనుషుల రుణాలను ఇట్టే మాఫీ చేసింది కేంద్రం. అలాగే 2015లో భారత స్టాక్ మార్కెట్ కుప్పకూలిన సందర్భంలో పారిశ్రామిక రంగాన్ని ఆదుకునే పేరుతో బడా బాబులకు భారీ ప్యాకేజీలతో ఆర్థిక సహాయాన్ని అందించిన బిజెపి ప్రభుత్వం కనీస గిట్టుబాటు ధర లేక ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతులను ఆదుకోవడం లేదంటే రాజ్యం ఎవరి ప్రయోజనాలకు ఉందో అర్థం చేసుకోవచ్చు.

1991 నుండి నూతన ఆర్థిక విధానాల పేరిట దేశం ప్రపంచ బ్యాంకు కబంధ హస్తాలలో చిక్కుకున్న ఫలితమిది. ప్రపంచ వాణిజ్య సంస్థలో మన వ్యవసాయ రంగ నడ్డి విరిచే ఒప్పందాల ఫలితమిది. మన వ్యవసాయ రంగంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానించిన ఫలితమిది. కాబట్టి తక్షణం దేశం ఈ ఊబిలో నుంచి బయటపడే విధంగా రైతాంగ ఉద్యమాలు కొనసాగాలి.

అన్నం పెట్టే 70 శాతం మంది ఆధారపడుతున్న మన వ్యవసాయ రంగాన్ని కాపాడుకోవాలి. మానవ నాగరికతకు తొలి నిర్మాతలైన రైతులను కాపాడుకోవాలి. భారత వ్యవసాయ మార్కెట్ వ్యవస్థను బలోపేతం చేయాలి. మధ్య దళారుల పాత్ర లేకుండా చేయాలి. విదేశాల నుండి వచ్చే దిగుమతుల్ని నివారించాలి. అందుకు దిగుమతి సుంకాన్ని భారీగా పెంచాలి. ప్రపంచ వాణిజ్య సంస్థ నుండి భారతదేశం వైదొలగాలి. అప్పుడు మాత్రమే భారత రైతులను, వ్యవసాయ కూలీలను, మన వ్యవసాయరంగాన్ని రక్షించుకోగలం. ప్రముఖ వ్యవసాయ రంగ నిపుణులు పి.ఎ. చౌదరి, జయతి ఘోష్, ఎం.ఎస్. స్వామినాథన్ కమిషన్ల సిఫార్సులను అమలు చేయాలి. ఈ వ్యవసాయ సంక్షోభం ఒక్క రైతుల సమస్యే కాదు, ప్రజలందరి సమస్య. ఈ సంక్షోభం నుండి బయట పడే వరకు అన్నదాతలకు ప్రజలందరి అండగా నిలవాలి. రైతును రాజు చేయాలి.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వి

# ప్రగతి లేని నరేంద్ర మోడీ పాలన

***మూడేళ్ల మోడీ పాలనలో మతోన్మాదం మితిమీరడం, కార్పొరేట్ అనుకూల విధానాలు పెరగడంతో రైతులు, దళితులు, మైనారిటీలపై దాడులు పెరిగాయనీ, సామాన్య ప్రజల జీవన పరిస్థితులు దిగజారిపోయాయనీ అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

కేంద్రంలో నరేంద్ర మోడీ నేతృత్వంలోని ఎన్.డి.ఏ ప్రభుత్వానికి మూడేళ్లు పూర్తయ్యాయి. ఈ మూడేళ్లలో సాధించిన ఘన కార్యాలంటూ మీడియాలో ప్రకటనల వర్షం కురిపిస్తోంది. 'దేశం ముందుకు సాగుతోంది' అంటూ మోడీ నిలువెత్తు చిత్రాలతో ప్రకటనలతో మాయ చేస్తోంది. ఏం సాధించారని ఈ వేడుకలు? ఎవరి జీవితాలు బాగుపడ్డాయని ఈ ఉత్సవాలు? అడుగడుగునా అసహనపు జాడలు, దారిపొడవునా విద్వేషపు నీడలు, మరి ఎందుకీ వేడుకలు? అధికార లాలసలో మూడేళ్లుగా మునిగి, తేలుతున్నందుకా? లేదా ప్రజలను మభ్య పెట్టడంలో జయప్రదం అవుతున్నందుకా? వాస్తవమేమిటి? నిజానికి 2014 ఎన్నికల వేళ గుప్పించిన హామీలను గంగలో కలిపేసింది. అధికారంలోకి వచ్చిన వంద రోజుల్లోనే విదేశాల్లో దాగి ఉన్న 70 లక్షల కోట్ల అక్రమ సంపదను వెనక్కి రప్పిస్తామనే వాగ్దానం కానీ, ధరల స్థిరీకరణ నిధి ఏర్పాటు విషయం కానీ, ప్రతి ఏటా కోటి ఉద్యోగాల కల్పన హామీ కానీ, రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తామన్న హామీ కానీ మూడేళ్లవుతున్నా కార్యరూపం దాల్చలేదు. మతం పేరుతో సామాజిక విద్వేషాలు పెంచి ప్రజలను విభజించడం, గోరక్షణ పేరుతో దళితులపై, మైనారిటీలపై దాడులు, హత్యలు చేయడం తప్ప ప్రజలకు చేసిందేమీ లేదు. బిజెపి చేసిన ప్రతి వాగ్దానమూ శుష్క వాగ్దానంగా మిగిలిపోయింది.

**పౌర ప్రజాతంత్ర హక్కులపై దాడి**

ప్రజల భావవ్యక్తీకరణ స్వేచ్ఛను పరిరక్షిస్తామని బిజెపి ఇచ్చిన హామీని ఆ పార్టీ పూర్తిగా విస్మరించింది. పాలక పార్టీతో విభేదించిన వారిని వేధింపులకు గురిచేయడం, దాడులకు దిగడం, అసహన ధోరణులతో రెచ్చిపోవడం పలు సంఘటనలతో తేటతెల్లమైంది. జెఎన్‌యు ఘటన నుంచి గోరక్షక గూండాల దాడుల వరకూ ప్రతి అంశంలోనూ బిజెపి శ్రేణుల బరితెగింపుతో భావవ్యక్తీకరణ స్వేచ్ఛకు భంగం కలిగిస్తూనే ఉన్నారు. మరోవైపు మతోన్మాదం గజ్జెకట్టి నర్తిస్తోంది. గోగూండాలు, లవ్ జిహాద్ వంటి ఆరాచక శక్తులు అమాయకులైన దళితులు, ముస్లింలపై పడి హత్యాకాండ సాగిస్తున్నాయంటే అది కాషాయ సర్కార్ చలువే. మోడీ మూడేళ్ల పాలన ఒకవైపు పచ్చి మితవాదం, మరోవైపు కార్పొరేట్ అనుకూల విధానాల కాక్‌టైల్‌గా సాగింది. దేశంలోని అన్ని రంగాల్లోకి మితవాద హిందూత్వ భావజాలాన్ని, హిందూత్వ వాదులను చొప్పించడం ద్వారా పచ్చి నియంతృత్వానికి బాటలు వేసింది.

ప్రజాస్వామిక హక్కులు, భావ ప్రకటనా స్వేచ్ఛ, హేతువాద ప్రశ్నలు, సామాజిక న్యాయం, కార్మిక ఉద్యోగ హక్కులు-భద్రతలు, సమాఖ్య వ్యవస్థలో ఉండాల్సిన రాష్ట్రాల పాత్ర, లౌకిక సూత్రాలు వంటివన్నీ పూడ్చి పారేశారు. ఆహార విహార స్వేచ్ఛ, వస్త్రధారణ, విద్యా పరిశోధన, కళాసృజన, స్త్రీ పురుష సమాన భావన వంటి వాటిపై దాడులు సాగించడమే గాక అధికార సోపానాలుగా చేసుకున్నారు. కార్మికులకు కనీస వేతనాలు, అల్ప సంఖ్యాక మతాల వారికి రక్షణ వంటివన్నీ అపరాధాలై పోయాయి. నెహ్రూ ప్రవేశపెట్టిన ప్రణాళికా విధానానికే మంగళం పాడి 'నీతి ఆయోగ్' అంటూ అంతా మోడీ తన గుప్పిట్లో పెట్టుకున్నారు. మరోవైపున సంపన్న వర్గాలకు, కార్పొరేట్లకు, యాజమాన్యాలకు ప్రభుత్వం ఎర్ర తివాచీ పరిచింది. 'ఈజ్ ఆఫ్ లివింగ్' లేకున్నా 'ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్' అనేది మంత్రమైపోయింది.

గ్రీన్‌హంట్ పేరుతో అటవీ సంపదను కార్పొరేట్ కంపెనీలకు కట్టబెట్టేందుకు దండకారణ్యంలోని ఆదివాసులపైకి సైన్యాన్ని పంపింది. బస్తర్‌లో మహిళలపై అత్యాచారాలు, హక్కుల కార్యకర్తలపై దాడులు, నిజనిర్ధారణకు వెళ్లినవారిపై హత్యానేరారోపణలు సాధారణమయ్యాయి. సోనీ సోరీపై మానభంగం, యాసిడ్ దాడి పోలీసు మిలిటరీ దాష్టికానికి పరాకాష్ట. జమ్మూకశ్మీర్ నిత్యం అశాంతితో రగిలిపోతోంది. పౌరులు, సైన్యం నిత్యం శత్రువులుగా ఒకరిపై ఒకరు యుద్ధం ప్రకటించినంతగా రగిలిపోతున్న తీరు మోడీ సర్కార్ దారితెన్నూ లేని వినాశకర విధానాల ఫలితమే. 'స్వదేశీ భక్తులం' అని పదేపదే రొమ్ములు చరుచుకునే సంఘ పరివార్ అధికారంలోకి వచ్చింది మొదలు విదేశీ పారాయణంలో పరవశించిపోతూ, స్వదేశీ ప్రజలకు కుచ్చుటోపి పెడుతూ, విదేశీ భక్తులుగా, స్వదేశీ ద్రోహులుగా ఆచరణలో ప్రవర్తించే 'గోముఖ వ్యాఘ్రాలను' ప్రతిఘటించాల్సిన బాధ్యత ప్రజాస్వామ్య లౌకిక శక్తులపై పడింది.

న్యాయవ్యవస్థపైనా రకరకాల రూపాల్లో ఒత్తిళ్లు తెచ్చి దాడులు చేసి దారికి తెచ్చుకోవడానికి పెద్ద ప్రయత్నమే జరుగుతున్నది. భారత సైన్యాన్ని కూడా రాజకీయాల్లోకి లాగి ఎన్నికల ప్రచారంలోనూ వాడుకున్న వైపరీత్యం ఇప్పుడే చూశాం. వ్యవస్థాపరమైన ఏర్పాట్లనే గడ్డిపోచ కింద తీసేసిన ఈ ప్రభుత్వం వ్యక్తి స్వేచ్ఛలను రక్షించడం, ప్రతిపక్షాలను గౌరవించడం ఊహకందని విషయం. మౌలికంగా సంఘపరివార్ భావజాలానికి అంటే హిందూత్వ పేరిట చలామణి అవుతున్న మతతత్వ భావజాలాన్ని గుజరాత్ తరహాలోనే దేశమంతా రుద్దగలమన్న భరోసాతోనే సంఘపరివార్ మోడీని ఆ పదవికి ఎంపిక చేసింది. గోసంరక్షణ పేర హత్యలు, దాడులు, అయోధ్య రామమందిర నినాదం పునరుద్ధరణ, మత కలహాలు, దళితులపై దాడులు, స్త్రీలను కించపర్చే ధోరణులు, కవ్వించే వ్యాఖ్యానాలు, యోగులను ముఖ్యమంత్రులను చేయడం అన్నీ ఆ పరంపరలో భాగాలే.

**రైతు వేదన... ఆరణ్య రోదన**

దేశానికి వెన్నెముక అన్నదాత. ఈ అన్నదాత పరిస్థితి రోజు రోజుకూ దిగజారుతోంది. ప్రకృతి ప్రతికూలతలు, నకిలీ విత్తనాలు, వర్షాభావ పరిస్థితులు, రుణభారాలు ఇలా అన్నిటినీ తట్టుకుని సాధించిన మిగులు ఉత్పత్తులు ఒక వరంగా కాక రైతుల పాలిట శాపంగా నిలుస్తున్నాయి. గిట్టుబాటు ధర లభించక దేశ వ్యాపితంగా రైతులు నిరాశా నిస్పృహలకు

లోనవుతున్నారు. రైతు పండించిన పంటకు గిట్టుబాటు ధర కల్పించడంలో ప్రభుత్వాలు ఉపేక్ష వహిస్తున్నాయి. ఐదేళ్లలో రైతాంగ ఆత్మహత్యలు నివారిస్తామని, రైతుల ఆదాయం రెట్టింపు చేసేస్తామన్న ప్రధాని నరేంద్రమోడీ మాటలు రైతు ఓటు బ్యాంకును కొల్లగొట్టేందుకేనని తేలిపోతోంది. మార్కెట్ శక్తుల మాయాజాలం నుంచి రైతుకు రక్షణ కల్పించడంలో కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. దళారీలు, కమీషన్ ఏజంట్ల కుయుక్తులకు రైతుకు దక్కాల్సిన శ్రమఫలం పరాధీనమవుతోంది.

బిజెపికీ మిత్రపక్షంగా వ్యవహరిస్తున్న శివసేన, తెలుగుదేశం, తెలంగాణ రాష్ట్ర సమితి, తమిళనాడులో అన్నాడిఎంకె వంటి ప్రాంతీయ పార్టీలు, బిజెపి అధికారంలో ఉన్న మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, చత్తీస్‌గడ్, జార్ఖండ్, హర్యానా, రాజస్థాన్‌లలో రైతాంగ పోరాటాలు సాగుతున్నాయి. గోధుమ దిగుబడులు అధికంగా సాధించి గిట్టుబాటు ధర డిమాండ్ చేస్తూ బజారుకెక్కి ఉద్యమిస్తున్న మధ్యప్రదేశ్ రైతు గుండెల్లోకి పోలీసు తూటాలు దింపారు. 8 మంది రైతులు పోలీసు కాల్పుల్లో మరణించారు. దేశవ్యాప్తంగా ఈనాడు మోడీ ప్రభుత్వ విధానాలపై భారత రైతాంగం తిరుగుబాటు చేస్తోంది. ముఖ్యంగా ఉల్లిగడ్డ, గోధుమ, చెరకు, పసుపు, మిర్చి, పత్తి వంటి వాణిజ్య పంటలు పండించిన రైతులు గిట్టుబాటు ధర కోసం ఉద్యమిస్తున్నారు. కూరగాయల సాగు మీద ఆధారపడిన రైతులు ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, పంజాబ్ తదితర రాష్ట్రాల్లో మార్కెట్ చేసుకోలేక అవస్థలు పడుతున్నారు. గత సంవత్సరం గిట్టుబాటు దక్కని మార్కెట్ పరిస్థితిని నిరసిస్తూ బంగాళా దుంపలు, టమాటో వంటి కూరగాయలను బజారున పోసేశారు. ఈ యేటా రాజస్థాన్, మహారాష్ట్రాలలో రైతులు ఇంచుమించు ఇదే స్థాయి ఉపద్రవాన్ని ఎదుర్కొంటున్నారు.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు, ప్రపంచ వాణిజ్య సంస్థ షరతుల వల్ల సంక్షుభితంగా మారిన వ్యవసాయరంగం మోడీ ప్రభుత్వ నిర్వాకం వల్ల మరింత తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడింది. వ్యవసాయ రంగంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానించడం, మేడ్ ఈజీ బిజినెస్ వంటి విధానాల ద్వారా మోడీ సర్కార్ ఈ రంగాన్ని మరింత సంక్షోభంలోకి నెడుతున్నది. రైతులను ఉద్ధరించేందుకే తెచ్చానని ఘనంగా చెప్పుకున్న ప్రధానమంత్రి ఫసల్ బీమా యోజన రైతులకు అక్కరకు రాలేదు. కానీ కార్పొరేట్ బహుళజాతి కంపెనీలకు దండిగా కాసులపంట పండించింది. ఫసల్ బీమా యోజన కింద 2016-17లో ప్రైవేట్ బీమా కంపెనీలు ప్రీమియం రూపంలో రైతుల నుంచి 21,500 కోట్లు దండుకున్నాయి. ఇప్పటికీ జనాభాలో 60 శాతం మందికి ఉపాధి వనరు భరోసా కల్పించేది వ్యవసాయ రంగమే. 2013-14లో జిడిపిలో 18 శాతంగా ఉన్న వ్యవసాయరంగం వాటా 2016-17 లో 14 శాతానికి దారుణంగా పతనమైంది. భవిష్యత్తులోనూ ఈ పతనం కొనసాగుతుందని, 2020 నాటికి 10-12 శాతం వరకు పతన ప్రభావం పొడసూప వచ్చంటూ నేషనల్ ఇన్‌స్టిట్యూషన్ ఫర్ ట్రాన్స్‌ఫార్మింగ్ ఇండియా (నీతి) అయోగ్ ముందస్తు అంచనాగా పేర్కొంది.

ఉత్పత్తిలో 35 శాతం మాత్రమే నిల్వచేయగల అరకొర వ్యవస్థ దేశంలో ఉంది. ఫలితంగా గిట్టుబాటు ధర వచ్చే వరకు వివిధ వ్యవసాయ ఉత్పత్తులను నిల్వ చేయడం సాధ్యంకాక ఏటా సుమారు రు.96,000 కోట్ల రూపాయల విలువైన ఆహార ధాన్యాలు వృథా అవుతున్నాయి. రైతులలో 85 శాతం మంది చిన్న, సన్నకారు రైతులు. రెండెకరాల కంటే తక్కువ కమతాలు ఉన్నవారే. పట్టా ఉన్న రైతులు పట్టణాలలో ఉంటే కౌలు చేసుకునే రైతు పొలంలో ఉంటాడు. పట్టా లేనందున కౌలు రైతుకు బ్యాంకు రుణాలు ఇవ్వవు. ప్రైవేటు వడ్డీవ్యాపారుల దగ్గరే అప్పు చేయాలి. అప్పుల భారం పెరిగి, తిరిగి చెల్లించలేక వడ్డీవ్యాపారులు అవమానిస్తుంటే తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుంటున్నారు. గత రెండు దశాబ్దాల కాలంలో (1998-2017) రెండున్నర లక్షల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. మోడీ మూడేళ్ల పాలనలో 36 వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు.

మోడీ ప్రభుత్వ పాలనలో వ్యవసాయం ఆధారంగా జీవించే ప్రజల వాస్తవ తలసరి ఆదాయం స్థంభించడానికో లేక కొద్దిగా క్షీణించడానికో కేవలం మోడీయే కారణమని చెప్పలేం. హేతుబద్ధంగా ఆలోచించే, అతిశయోక్తులను ఆశ్రయించని వాళ్లం గనుక వ్యవసాయాభివృద్ధిలో స్థంభనకు కారణం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలను అవలంభించడమే. రైతులకు, చిన్న ఉత్పత్తిదారులకు ఇస్తున్న మద్దతును ప్రభుత్వం ఉపసంహరించుకున్నది. ఆ స్థానంలో భారతదేశంలోని కార్పొరేట్ పెట్టుబడి ప్రయోజనాలను, అది మిలాఖతు అయిన అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిదారీ ప్రయోజనాలను పరిరక్షిస్తోంది. ఈ విధానాలను మోడీ మరింత వేగంగా అమలు చేస్తున్నాడు. దీనితో తీవ్ర పరిస్థితులను ఎదుర్కొంటున్న గ్రామీణ ప్రజానీకానికి రాబోయే రోజుల్లోనైనా మంచి జరుగుతుందనే ఆశ లేదు. దేశ జనాభాలో సగానికి పైగా ఉన్న ప్రజల జీవన ప్రమాణాలు ఏమాత్రం మెరుగవకపోవడం చాలా నిస్పృహకు గురిచేసే విషయం. ఈ కాలంలో స్థూల జాతీయోత్పత్తి పెరగడమే 'గొప్ప ఘనకార్యం' అని సంబరాలు చేసుకుంటున్నారు.

అన్నదాతను ఆదుకోవాలనే చిత్తశుద్ధి పాలకులకు ఏ మాత్రం ఉన్నా ప్రొ. స్వామినాథన్ నేతృత్వంలోని 'నేషనల్ కమిషన్ ఆఫ్ ఫార్మర్స్' సమర్పించిన నివేదికలపైన పార్లమెంటులో చర్చ జరిపేవారు. వ్యవసాయం గిట్టుబాటు కావడానికి ఏయే చర్యలు తీసుకోవాలో నిర్ణయించేవారు. అమలు చేసేవారు. స్వామినాథన్ మొత్తం ఐదు విడతల రిపోర్టు సమర్పించారు – మొదటి నివేదిక 2004 డిసెంబర్‌లో, రెండో నివేదిక 2005 ఆగస్టులో, మూడోది అదే సంవత్సరం డిసెంబర్ మాసంలో, నాలుగోది 2006 ఏప్రిల్‌లో, చివరిది అదే సంవత్సరం అక్టోబర్‌లో సమర్పించారు. ఈ నివేదికల పైన పార్లమెంటు ఒక్క గంట కూడా చర్చించలేదు. రైతుల పట్ల పాలకుల్లో మార్పు రానంత వరకు రైతాంగానికి నిష్కృతి లేదు. రైతులను ఓటు బ్యాంకుగా వాడుకోవడానికి మాత్రం అంతా సిద్ధం. రైతాంగం సంఘటితం కానంతవరకూ, మూడో కన్ను తెరవనంత వరకూ రాజకీయ నాయకుల ఆటలు సాగుతాయి.

### వృద్ధికి చేటు చేసిన నోట్ల రద్దు

గతేడాది నల్లధనంపై యుద్ధం పేరుతో మోడీ సర్కార్ చేసిన నోట్ల రద్దు ప్రకటన ద్వారా సృష్టించిన ప్రహసనం అంతా ఇంతా కాదు. ఇటు రాజ్యాంగ సంస్థ అయిన రిజర్వు బ్యాంకు స్వతంత్రను ప్రశ్నార్థంలోకి నెట్టడమేగాకుండా యావత్ భారత ఆర్థిక వ్యవస్థ, ప్రధానంగా గ్రామీణ ప్రజల జీవనాన్ని, సహకార రంగాన్ని, వ్యవసాయాన్ని, అసంఘటిత రంగాన్ని కోలుకోలేని దెబ్బతీసిందంటే అతిశయోక్తి కాదు. క్యాష్‌లెస్ అంటూ డిజిటల్ లావాదేవీల ద్వారా పేటిఎం లాంటి సంస్థలకు కనక వర్షం కురిపించాడు. ఉగ్రవాదులకు నిధులు అందకుండా చేసేందుకు కూడా నోట్ల రద్దు ఉపయోగపడుతుందని నమ్మబలికిన బిజెపి సర్కార్ వాస్తవంలో చేసిందేమిటీ? అస్సాంలో నార్త్ కచార్ హిల్స్ అటానమస్ కౌన్సిల్‌కు చెందిన దాదాపు వెయ్యి కోట్ల ప్రజాధనాన్ని డిఎచ్‌డి(జె) ఉగ్రవాద సంస్థకు ఆయుధాల కొనుగోలు కోసం బిజెపి నేత నిరంజన్ హోజాయ్ మరో 14 మంది కలిసి అక్రమంగా తరలించారు.

సి.ఎస్.ఒ. విడుదల చేసిన గణాంకాలను బట్టి సమకూరిన స్థూల నికర పెట్టుబడి ప్రకారం నికర పెట్టుబడులు తగ్గాయి. 2016-17లో సమకూరిన స్థూల నికర పెట్టుబడి జి.డి.పి. 30.9 శాతం ఉండగా నోట్ల రద్దు తర్వాత 29.5 శాతానికి పడిపోయింది. 2016 జనవరి మార్చ్ త్రైమాసికంలో 25.5 శాతానికి తగ్గింది. "నోట్ల రద్దు నిర్ణయం దేశ ఆర్థిక వ్యవస్థపై, బ్యాంకింగ్ వ్యవస్థపై దీర్ఘకాల ప్రభావం చూపించవచ్చు, బ్యాంకు వ్యాపారాన్ని బాగానే దెబ్బ తీయవచ్చు"నని ఎస్‌బిఐ తన అభిప్రాయాన్ని తెలిపింది. సమకూరిన స్థూల నికర పెట్టుబడి తగ్గడం అంటే ఉత్పత్తి, ఉపాధి ఆదాయాలు తగ్గడమే. 2016-17 ఆర్థిక సంవత్సరంలోని మూడవ, నాల్గవ త్రైమాసికాలలో ఆర్థికాభివృద్ధి తగ్గిందని 2017 మే 31న సి.ఎస్.ఓ. తెలియజేసింది. ఈ వాస్తవాలు పెద్ద నోట్ల రద్దు వల్ల ఆర్థిక వ్యవస్థపై ప్రతికూల ప్రభావం ఉందని రుజువు చేయడమే కాక మోడీ 'అసత్యాలను' కూడా బయట పెట్టాయి.

**మందగించిన పారిశ్రామికాభివృద్ధి**

2011-12 అంచనాల ప్రకారం 48 కోట్ల 40 లక్షల కార్మికులు ఉన్నారు. వీరిలో వ్యవస్థీకృత రంగంలో ఉన్నవారు కేవలం మూడు కోట్ల మందే. అంటే 93 శాతం అవ్యవస్థీకృత రంగంలోనే పని చేస్తున్నారు. అవ్యవస్థీకృత రంగంలో పనిచేసేవారి తగ్గిన వినియోగం, పరిశ్రమల పొదుపు మొత్తాలు తగ్గడం వల్ల కచ్చితంగా వృద్ధి తగ్గుతుంది. వస్తూత్పత్తి, వాణిజ్యం, హోటళ్లు, రవాణా, ఆర్థిక, స్థిరాస్తి, వృత్తిపరమైన సేవలు మొదలైన రంగాలలో కూడా వృద్ధి రేటు మందగించింది. ఈ సకల రంగాలలోనూ అవ్యవస్థీకృత కార్మికులు ఎక్కువే. ఈ రంగాలు వారికి ఎక్కువ ఉపాధి అవకాశాలు కల్పిస్తాయి. పెద్ద నోట్ల రద్దు వల్ల భారత ఆర్థిక వ్యవస్థకు విపరీతమైన నష్టం కలిగింది. ఆయా రంగాల మీద ఆధారపడ్డవారి మీద కూడా ఈ ప్రభావం ఉంది. అనేక సంవత్సరాలుగా భారత ఆర్థిక వ్యవస్థలో పారిశ్రామికాభివృద్ధి నిరపేక్షంగా మందగించిన విషయాన్ని మరువకూడదు. ప్రస్తుతం దేశంలోని డిమాండ్ స్తబ్దతకు గురికావటంతో పాటు ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో కొనసాగుతున్న సంక్షోభం వల్ల నికర ఎగుమతులు కూడా దెబ్బతిన్నాయి. అయితే ఇది సరిపోదన్నట్టుగా ఎటువంటి సహేతుక కారణం లేకుండా నోట్ల రద్దును పెద్ద ఎత్తున ఆర్థిక వ్యవస్థపై మోడీ ప్రభుత్వం రుద్దింది. ఇది పారిశ్రామిక మాంద్యాన్ని మరింతగా తీవ్రతరం చేసింది.

2016 ఫిబ్రవరిలో ఉన్న పారిశ్రామిక ఉత్పత్తి సూచీ కంటే 2017 ఫిబ్రవరిలో పారిశ్రామిక ఉత్పత్తి సూచీ తక్కువగా ఉన్నది. తయారీ రంగంలో గత సంవత్సరం కంటే ప్రస్తుతం రెండు శాతం తక్కువగా ఉన్నది. పారిశ్రామిక రంగంలోని వినియోగ సరుకుల విభాగంలో 2016 ఫిబ్రవరిలో సాధించిన 0.6 శాతం వృద్ధితో పోల్చినప్పుడు ప్రతికూలంగా -5,-6 (మైనస్ 5.6) శాతం వృద్ధి పతనమయ్యింది. నోట్ల రద్దుతో పడిపోయిన ప్రజల కొనుగోలు శక్తిని ఇది సూచిస్తున్నది. 2016-17 ఏప్రిల్-ఫిబ్రవరి మధ్యకాలంలో వినియోగ వస్తువులు తయారుచేసే పరిశ్రమల వృద్ధిరేటు 0.1 శాతం. ఈ పరిశ్రమలలో అంతకు ముందు సంవత్సరం ఇదే కాలంలో వృద్ధి రేటు 3.2 శాతం ఉన్నది. పారిశ్రామిక రంగాన్ని మొత్తంగా చూసినప్పుడు 2016-17 ఏప్రిల్-ఫిబ్రవరి మధ్యకాలంలో వృద్ధిరేటు -0.3 శాతం. అంతకు ముందు ఏడాది ఇదే కాలంలో వృద్ధిరేటు 2.3 శాతంగా ఉన్నది.

**పెచ్చరిల్లిన అవినీతి**

బిజెపి అధికారంలోకి వస్తే అవినీతిరహిత పారదర్శక పాలన అందిస్తామని హామీ ఇచ్చింది. తమ పార్టీ అధికారంలోకి వస్తే దేశం రూపురేఖలు, ప్రజల జీవితాలు మారిపోతాయని ఎన్నికల సమయాన మోడీ ఊదరగొట్టారు. కుంభకోణాల ఊబిలో కూరుకుపోయిన కాంగ్రెస్‌పై ప్రజల్లో ఉన్న ఆగ్రహాన్ని సొమ్ము చేసుకొని అధికారంలోకి వచ్చిన మోడీ ప్రభుత్వం అవినీతిలో తానేమీ తక్కువ తినలేదనీ నిరూపించుకుంది. భారత్‌లో నగదుకు కొరత ఉందేమో కానీ, అవినీతికి ఆకాశమే హద్దుగా పెరిగిపోయిందనీ పెద్ద నోట్ల రద్దు సమయంలో పోర్బ్స్ వంటి సంస్థలే మోడీ సర్కార్‌కు సర్టిఫికెట్ ఇచ్చాయి. బిజెపి పాలిత రాష్ట్రాల్లో విచ్చలవిడిగా కుంభకోణాలు చోటు చేసుకున్నాయి. మధ్యప్రదేశ్‌లో వెలుగుచూసిన వ్యాపం స్కామ్, చత్తీస్‌గడ్‌ను కుదిపేసిన ఫుడ్ స్కామ్ ఇలా ఎన్నో అవినీతి కుంభకోణాలు పెచ్చుమీరాయి.

పదమూడు లక్షల కోట్ల రూపాయలకు పైగా ఎగ్గొట్టిన కార్పొరేట్ కంపెనీల రుణాన్ని నిరర్థక ఆస్తుల కింద రహస్యంగా ఉంచుతున్నది మోడీ ప్రభుత్వం. 9 వేల కోట్ల రూపాయలతో విజయమాల్యా, 6 వేల కోట్ల రూపాయలతో లలిత్‌మోడీ పరారయి లండన్‌లో విలాసవంతమైన జీవనం గడుపుతున్నారు. వీరంతా కూడా బిజెపికి చెందిన వారే. కింగ్‌ఫిషర్ విజయమాల్యా బిజెపి ఓట్లతో రాజ్యసభ సభ్యుడయ్యారు. లండన్‌లో ఉంటేనేం విజయమాల్యా, లలిత్‌మోడీలకు అన్ని రకాల సహాయాలు బిజెపి ప్రభుత్వం అందిస్తుంది. ఈ మూడేళ్లలో కేంద్ర ప్రభుత్వ అవినీతి 67 శాతం మేర పెరిగిందనీ స్వయాన కేంద్ర విజిలెన్స్ సంస్థ ప్రకటించడం గమనార్హం.

**మూడేళ్లలో పెరిగిన నిరుద్యోగం**

ఏటా ఒక కోటి మందికి ఉపాధి కల్పిస్తామన్నది 2014 ఎన్నికల మోడీ వాగ్దానం. దేశంలో విద్యావంతులైన 18 కోట్ల మంది నిరుద్యోగులున్నారు. ఏటా 1 కోటి 30 లక్షల మంది డిగ్రీలు పట్టుకొని ఉద్యోగ మార్కెట్‌లోకి వస్తున్నారు. కేంద్ర ప్రభుత్వ యాజమాన్యంలో 44 లక్షలు ఖాళీలున్నాయి. మూడేళ్లలో మోడీ ప్రభుత్వం కల్పించిన ఉద్యోగాలు 2.5 లక్షలు మాత్రమే. మోడీ బాధ్యతలు స్వీకరించిన తరువాత ఉపాధి అవకాశాలపై జరిగిన అతి పెద్ద ఎకనామిక్స్ టైమ్స్ సర్వేలో కొత్త ప్రభుత్వం అవలంబిస్తున్న విధానాలు గతంలో యుపిఏ మాదిరిగా ఉన్నాయని, మౌలికంగా ప్రభుత్వ విధానంలో ఎలాంటి మార్పు లేదని ఈ సర్వే నిగ్గు తేల్చింది. వేగంగా పెరిగిపోతున్న నిరుద్యోగం, ఆర్థిక స్థితి గురించి ఈ సర్వే భయంకరమైన వాస్తవాలను వెలుగులోకి తెచ్చింది. యుపిఏ హయాంలో పేరుకుపోయిన సమస్యలను పరిష్కరిస్తున్నామని మోడీ ప్రభుత్వం గొప్పగా చెబుతున్నది. అయితే ఆ ప్రచార మంతా మోడీ అనుసరిస్తున్న విధానాలు బడా పెట్టుబడిదారులకు మాత్రమే ప్రయోజనం చేకూరుస్తున్నాయన్నది జగమెరిగిన సత్యం.

నూతన ఉద్యోగాలు రాకపోగా ఉన్న ఉద్యోగాలు ఊడిపోతున్నాయి. ఐటిరంగంలో రానున్న రెండు సంవత్సరాలలో 8 లక్షల ఉద్యోగాలు ఊడిపోతాయని ఐటి యాజమాన్యాలు చెబుతున్నాయి. పారిశ్రామిక రంగంలోనూ పురోగతిలేదు. ఇదిలా ఉండగా భారత్‌లోనే నిరుపేదలు ఎక్కువ మంది ఉన్నారని ఇటీవల ప్రపంచ బ్యాంకు నివేదిక వెల్లడించింది. ప్రపంచ వ్యాప్తంగా ప్రతి ముగ్గురు పేదల్లో ఒకరు ఇండియాకు చెందిన వారేనని ఆ నివేదిక స్పష్టం చేసింది. గడచిన ఐదు సంవత్సరాలతో పోల్చుకుంటే ఈ సంవత్సరం నిరుద్యోగులు 5 శాతం పెరిగారని కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో పనిచేస్తున్న లేబర్ బ్యూరో నిర్వహించిన సర్వేలో వెల్లడైంది. 2016లో ఆర్థిక వృద్ధి రేటు 7.1 శాతానికి పెరిగినా, నిరుద్యోగ సమస్య మాత్రం ఏమాత్రం తగ్గలేదు. పైగా 5 శాతానికి పెరిగింది. మేకిన్ ఇండియా, స్టార్టప్ ఇండియా, డిజిటల్ ఇండియా కార్యక్రమాలు నిరుద్యోగంపై ఏ మాత్రం ప్రభావం చూపలేక పోయాయి.

2011 జనాభా లెక్కల ప్రకారం 15 ఏండ్లకు మించి పనిచేస్తున్న కార్మికులు దేశంలో 45 కోట్ల మంది ఉన్నారు. జనాభాలో 47 శాతం మంది స్వయం ఉపాధి పొందుతున్నారని లేబర్ బ్యూరో సర్వే తెలిపింది. మనదేశంలో 42 శాతం మంది సంవత్సరంలో కొన్ని రోజులు మాత్రమే ఉపాధి పొందుతున్నారు. ఇలాంటి వారు వ్యవసాయధారిత పనులపై ఆధారపడి జీవనాన్ని వెల్లదీస్తున్నారు. అలాగే 77 శాతం మంది గ్రామీణులు నెలకు 10 వేల కంటే తక్కువ ఆదాయం పొందుతున్నారు. కార్మిక శాఖ అందించిన 2015 వివరాల ప్రకారం, మోడీ ఉద్యోగ కల్పన అవకాశాలు గత ఏడు సంవత్సరాల్లో ఏడు శాతం తక్కువని తెలుస్తోంది. ఐటి రంగం సంక్షోభంలో చిక్కుకుంది. 6 లక్షల మందికి ఉద్వాసన తప్పదని ఐటి యాజమాన్యాలే చెబుతున్నాయి. యేటా ఉద్యోగార్థుల క్యూ మాత్రం మరింతగా పెరిగిపోతూనే ఉంది. ఈ నేపథ్యంలో నీతి ఆయోగ్ వైస్‌చైర్మన్ అరవింద్ పనగారియా నేతృత్వంలో ప్రభుత్వం ఇటీవలనే ఉద్యోగ కల్పన అవకాశాలపై ఉన్నతస్థాయి టాస్క్‌ఫోర్స్‌ను నియమించింది. అయితే టాస్క్‌ఫోర్స్ ఇచ్చే నివేదిక ఉపాధి కల్పనకు సరైన విధాన నిర్ణయాలు చేసేందుకు తోడ్పడుతుందా? అంటే అనుమానమే.

### పశు విక్రయ నిషేధంపై నిరసన వెల్లువ

కేంద్ర ప్రభుత్వం జారీ చేసినా తాజా ఉత్తర్వుల ప్రకారం గోవధకు, పాలిచ్చే పశువుల అక్రమ రవాణాకూ పాల్పడేవారు జాతీయ భద్రతా చట్టం, గూండా చట్టం కింద శిక్షార్హులవుతారు. బిజెపి ప్రభుత్వం తీసుకున్న పశువధ నిషేధం నిర్ణయం వెనుక ఆర్థిక, రాజకీయ కోణాలు కనిపిస్తున్నాయి. బీఫ్ సమస్యను ముందుకు తెచ్చి ఓటు బ్యాంకును సమీకరించుకోవడం ఒక కోణమైతే, లక్షల కోట్ల విలువైన బీఫ్ పరిశ్రమను కార్పొరేట్ శక్తులకు ధారాదత్తం చేయడం మరో కోణంగా కనిపిస్తోంది. ప్రధానంగా ఈ పరిశ్రమ అంతా రైతులు, మధ్య తరగతి వ్యాపారుల చేతుల్లోనే ఉంది. స్థూల జాతీయోత్పత్తిలో ప్రధాన వాటా కలిగి ఉన్న ఈ పరిశ్రమపై ఇప్పుడు కార్పొరేట్ శక్తుల కన్నుపడింది. దేశవ్యాప్తంగా పశు విక్రయాలపై ఆంక్షలు విధిస్తూ ప్రజల తిండి తిప్పలను నిర్దేశించే నిరంకుశత్వ ధోరణులతో కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం అమలుపరుస్తున్న విధానాలను ప్రజలే కాదు సొంత పార్టీలోని సామాన్య కార్యకర్తలు సైతం జీర్ణించుకోలేని పరిస్థితి.

మేఘాలయ రాష్ట్రానికి చెందిన ఇద్దరు రాష్ట్రస్థాయి బిజెపి నేతలు కబేళాలకు పశువులను అమ్మడం చేయరాదన్న నోటిఫికేషన్‌ను వ్యతిరేకిస్తూ బిజెపికి రాజీనామా చేశారు. బిజెపి ఉత్తర గారోహిల్స్ జిల్లా అధ్యక్షులు బచ్చూ మారక్, పశ్చిమ గారోహిల్స్ జిల్లా అధ్యక్షులు బెర్నార్డ్ మారక్ 'బీఫ్ తినడం మా సంస్కృతీ సాంప్రదాయాలలో భాగం .. గారో ప్రజల మనోభావాలపై మేము రాజీపడబోము' అని రాజీనామా అనంతరం ప్రకటించారు. 'మా సంస్కృతిని వారు అవమానిస్తున్నారు. మా సంస్కృతీ సాంప్రదాయాలే మాకు ముఖ్యం'. వాస్తవానికి గిరిజనులు అధికంగా ఉన్న మేఘాలయలో ఎక్కువ మంది బీఫ్ తింటారు. వారికది తరతరాలుగా వస్తున్న సంప్రదాయ ఆహారం. ఒక్క మేఘాలయ గిరిజనులు మాత్రమే కాదు, దేశంలోని ఇతర ప్రాంతాలలోని గిరిజనులు, దళితులు, క్రిస్టియన్లు, బౌద్ధులు, ముస్లింలకు కూడా బీఫ్ ప్రధాన ఆహారమే. దేశంలోని 40 శాతం మంది వరకూ బీఫ్ తినేవారున్నట్లు ఒక అంచనా.

ఈ నేపథ్యాన్ని నిత్యం సంప్రదాయ హితోక్తులు వల్లించే కమలనాథులు తరతరాల ఆహారపు అలవాట్లను కాలదన్నుతూ పశు విక్రయంపై ఆంక్షలు విధించడం దుర్మార్గం. భిన్నత్వంలో ఏకత్వాన్ని నినదించే భారతీయ ఘన వారసత్వాన్ని, రాజ్యాంగ మౌలిక సూత్రావళిని విస్మరించి ప్రజల నోటి ముద్దపై ఆంక్షలు విధించడం సిగ్గుచేటు. దళితులు, ఆదివాసులు, క్రిస్టియన్లు, ముస్లింలకు బద్ధవ్యతిరేకమైన కమలనాథులు పశునిషేధం ద్వారా రాజకీయ లబ్ది పొందేందుకు ప్రయత్నిస్తున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే 'పెట్టుబడిదారీ ప్రయోజనాలను పరిరక్షించడం, సాంస్కృతిక ఆధిపత్యాన్ని చేలాయించడం' లక్ష్యంగా కమలనాథులు కార్పొరేట్ హిందూత్వ విధానానికి శ్రీకారం చుట్టారు. సాటి మనుషుల మధ్య ద్వేషం పెంచి సమాజాన్ని నిలువునా చీల్చే విధంగా సంఘ్ పరివార్ శక్తులు సాగిస్తున్న ఈ హిందూత్వ అరాచకాన్ని ఎక్కడికక్కడ ఎదుర్కోవాలి.

### అమెరికాకు లొంగుబాటు – దేశానికి ప్రమాదం

ప్రధాని మోడీ అమెరికాతో సైనిక బలగాల సహకార ఒప్పందం (లాజిస్టిక్స్ సపోర్టు అగ్రిమెంట్)పై సంతకాలు చేసిన కొద్దిరోజులకే రక్షణ రంగంలో 'ప్రధాన భాగస్వామి' హోదా లాజిస్టిక్స్ ఒప్పందానికి కొనసాగింపే తప్ప మరొకటి కాదు. 2016 జూన్‌లో మోడీ అమెరికా ఆధిపత్యాన్ని భారత్ అంగీకరిస్తుందని మాట ఇచ్చి వచ్చారు. బిజెపి ప్రభుత్వ చర్య దేశ సార్వభౌమత్వాన్ని ప్రమాదంలో పడవేసేదిగా ఉంది. వైమానిక, నావిక, పదాతి దళాధిపతుల మనోభావాలకు కూడా విలువ ఇవ్వకుండా మోడీ ప్రభుత్వం మొండిగా ముందుకెళ్లింది. బిజెపి ప్రభుత్వం ఎంతగా లొంగుబాటు ప్రకటించినా కొత్తగా ఎన్నికైన అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ పాకిస్తాన్ వైపే మొగ్గు చూపడం గమనార్హం. అమెరికాతో లాజిస్టిక్ ఒప్పందం భారత్‌ను అగ్రరాజ్యానికి సైనిక మిత్రునిగా మార్చేసింది. ఈ ఒప్పందం ప్రకారం అమెరికా యుద్ధ నౌకలు, విమానాలు భారతదేశ నావిక, వైమానిక స్థావరాల్లో ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు దిగడానికి, అవసరమైన ఇంధనం నింపుకోవడానికి, మరమ్మతులు వంటి సేవలు పొందడానికి వీలు కల్పిస్తుంది.

సిస్మోవా, బెకా వంటి ఒప్పందాలను త్వరలో తెచ్చి భారత్‌ను పూర్తిగా తన విషకౌగిలిలో బిగించాలని అమెరికా ప్రయత్నిస్తున్నది. ఈ రెండు ఒప్పందాలు కూడా త్వరలో ఖరారు కానున్నాయి. అదే జరిగితే రేపు మన రక్షణ మంత్రిత్వ శాఖ కార్యాలయంలో అమెరికా అధికారులు తిష్టవేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు. అమెరికాతో రక్షణ ఒప్పందం ప్రభావం మన విదేశాంగ విధానంపై ఇప్పటికే పడింది. వెనిజులా రాజధాని కారకస్‌లో 2016 సెప్టెంబర్‌లో జరిగిన అలీనోద్యమ శిఖరాగ్ర సమావేశానికి ప్రధాని మోడీ డుమ్మా కొట్టి భారతదేశ ప్రతిష్టను మంటగలిపారు. మోడీ అమెరికాతో ప్రత్యేక హోదా పొందినందున భారత్ ఇన్నాళ్లూ అనుసరిస్తూ వస్తున్న విదేశాంగ విధానంలో కీలకమైన అలీనాన్ని వదిలేశారు. దేశ స్వతంత్ర విదేశాంగ విధానాన్ని ధ్వంసం చేసి అమెరికాకు భారత్‌ను జూనియర్ భాగస్వామిగా మార్చే ఈ ఒప్పందాలపై పార్లమెంటులో చర్చించకుండానే మోడీ ప్రభుత్వం ఏకపక్షంగా ముందుకెళ్లింది.

### విద్యాలయాలలోకి మతతత్వం

సృజనకూ, హేతువుకూ, ప్రశ్నకూ, స్వేచ్ఛకూ కేంద్ర బిందువుగా వర్ధిల్లాల్సిన విశ్వవిద్యాలయాలు, వివక్షతా నిలయాలుగా, ఛాందసాలకు నిలయాలుగా మారిపోతున్నాయి. హిందూ మతోన్మాద రాజకీయాధికారంతో చరిత్రకు వక్రభాష్యాలు చెప్పి, చరిత్రను మార్చే వినాశకరమైన ప్రక్రియను మోడీ సర్కారు చేపట్టింది. విశ్వ విద్యాలయాలలో చరిత్ర పరిశోధనా సంస్థలలో అర్హతల ప్రమేయం లేకుండా సంఘీయుల నియామకం రివాజుగా మారింది. విద్యా వ్యవస్థలోకి చొరబడి

పాఠ్యాంశాలను మతోన్మాదాన్ని ప్రేరేపించేలా మార్పులు చేస్తోంది. విజ్ఞాన వికాస కేంద్రాలుగా ఉన్న విశ్వ విద్యాలయాల్లోనే మతతత్వ భావజాల వ్యాప్తికి ఆర్ఎస్ఎస్, ఎబివిపి ద్వారా పథక రచన చేసింది. హిందూత్వ మతతత్వ భావజాలం, మనువాద తాత్విక భావాలను చొప్పించడానికి ప్రధానంగా విద్యా, సాంస్కృతిక రంగాలను మోడీ ప్రభుత్వం ఎంచుకున్నది. కాబట్టి విశ్వవిద్యాలయాలను వివక్షత కోరల నుంచి విముక్తి చేసేందుకు, మట్టి నుంచి పుట్టుకొచ్చిన మేధను పరిరక్షించు కొనేందుకు ప్రజాస్వామ్య హితైషులందరూ అపర మనువులపై సమర శంఖం పూరించాల్సిన సమయం ఆసన్నమైంది.

హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో వేముల రోహిత్ ఆత్మహత్య, ఎచ్.సి.యు, ఢిల్లీ జెఎన్యులలో ప్రగతిశీల వామపక్ష, దళిత, బలహీనవర్గాల విద్యార్థులపై కులతత్వవాదులని, తీవ్రవాదులని, జాతి వ్యతిరేక శక్తులని ముద్రవేయడం, ఎఐఎస్ఎఫ్ నాయకుడు కన్నయ్య కుమార్ మరి కొంతమంది విద్యార్థులపై చేయని నేరానికి దేశద్రోహ నేరాలు మోపి అరెస్టులు చేయడం, ఢిల్లీ విద్యార్థులు, అధ్యాపకులు చేస్తున్న ర్యాలీపై జరిగిన దాడి హిందూత్వ వాదుల దాడులలో భాగమేనన్నది నిర్వివాదాంశం. ప్రతిష్టాత్మకమైన జెఎన్యు ఢిల్లీ విశ్వవిద్యాలయానికి చెందిన 27 ఏళ్ల ఎంఎస్సి బయాలజీ విద్యార్థి నజీబ్ అహ్మద్‌ను నెత్తురు కారేలా అక్టోబర్ 14న రాత్రి ఎబివిపి గూండాలు కొట్టారు. ఆ మరుసటి రోజు నుంచి ఆయన కనిపించడం లేదు. పది మాసాలు గడిచినా ఆచూకీ లేదు. దీని వెనుక మోడీ ప్రభుత్వం, అర్ఎస్ఎస్ మూకలున్నాయన్నది స్పష్టం.

జెఎన్యులో కులం, మతం, ప్రాంతం, భాషా భేదాలకతీతంగా విద్యార్థులు చర్చల్లో పాల్గొంటారు. పరస్పరం గౌరవం, లౌకిక వాదానికి నిలయాలుగా ఉన్న విశ్వవిద్యాలయాల్లో మతపరంగా విద్యార్థులను సమీకరించేందుకు ఆర్ఎస్ఎస్ –బిజెపి అనుబంధ విద్యార్థి సంఘమైన ఎబివిపి ప్రయత్నిస్తోంది. విద్యార్థుల మధ్య చీలిక తెచ్చి యూనివర్సిటీలో మనువాద సంస్కృతిని ప్రవేశపెట్టాలని చూస్తోంది. చైతన్యవంతులైన జెఎన్యు విద్యార్థుల ముందు దాని ఆటలు సాగకపోవడంతో కేంద్రంలో ఉన్న బిజెపి ప్రభుత్వం అధికారాన్ని ఉపయోగించుకుని ఇష్టానుసారంగా ప్రగతిశీల విద్యార్థులపై దాడులకు తెగబడుతోంది. నోరెత్తిన వారెవరైనా సరే కమ్యూనిస్టులంటూ అనుమానించడం, కాంగ్రెస్ అనుకూలురంటూ అవమానించడం ఒకప్పటి మెకార్తిజంను నాజీయిజంను మించి పోయింది. మేధావి అన్న మాట బూతులా తయారైంది. విజ్ఞాన శాస్త్ర రంగంలో కూడా చాందసాన్ని కూరే విధంగా వినాయకుడికి ప్లాస్టిక్ సర్జరీకి ముడి పెట్టడం ప్రధాని స్థాయిలోనే నడుస్తున్నది.

**రాష్ట్రాల్లో పార్టీ ఫిరాయింపులకు ప్రోత్సాహం**

గోవా రాష్ట్రంలో మొత్తం 40 అసెంబ్లీ స్థానాలుండగా కాంగ్రెస్ 17, బిజెపి 13, ఎంజిపి 3, ఎన్సిపి 1, జిఎఫ్పి 3 సీట్లు గెలుచుకోగా... మూడింటిని ఇండిపెండెంట్లు సొంతం చేసుకున్నారు. ప్రభుత్వ ఏర్పాటుకు కావాల్సిన మ్యాజిక్ ఫిగర్(21 సీట్లు) కోసం కాంగ్రెస్‌కు మరో నలుగురు ఎంఎల్ఏల మద్దతు కావాలి. కానీ, అనూహ్యంగా.. తొమ్మిది మంది బయటి ఎంఎల్ఏల మద్దతు కూడగట్టుకొని బిజెపి రాష్ట్రంలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. ఎంజిపి, జిఎఫ్పి ఎంఎల్ఎలు ఆరుగురు, ఇండిపెండెంట్లు ముగ్గురు బిజెపికి మద్దతు తెలిపారు. వీరిలో ఏడుగురికి మంత్రి పదవులు కట్టబెట్టడం గమనార్హం. పదిమందితో కూడిన మంత్రివర్గం (సిఎంతో సహా)లో ఏడుగురూ బిజెపియేతరులే ఉన్నారు. మణిపూర్‌లో కూడా ఇలానే జరిగింది. రాష్ట్రంలో మొత్తం 60 అసెంబ్లీ స్థానాలుండగా కాంగ్రెస్ 28 సీట్లు గెలుచుకొని అతిపెద్ద పార్టీగా అవతరించింది. బిజెపి 21 స్థానాలతో రెండో స్థానానికే పరిమితమైంది. అయినా తమకు 33 మంది ఎంఎల్ఏల మద్దతు ఉందంటూ గవర్నర్ నజ్మా హెప్తుల్లాకు బిజెపి శాసనసభా పక్ష నేత బీరెన్‌సింగ్ నివేదించారు. దీంతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాల్సిందిగా బీరెన్‌సింగ్‌ను గవర్నర్ కోరారు. ధనబలం, అధికార బలంతో రెండోస్థానంలో ఉన్న బిజెపి అధికారాన్ని చేజిక్కించుకున్నది.

**ముగింపు**

ఉన్మాదం తలకెక్కితే ఇంగితం మచ్చుకైనా కానరాదు. ప్రస్తుతం దేశంలో హిందూత్వ పరివారం, కాషాయ దళం రాజకీయ ఇంగితం విస్మరించి విద్వేష వ్యాఖ్యలతో విషం చిమ్ముతోంది. మనుషుల మధ్య విభజన రేఖలు సృష్టిస్తూ విద్వేషాలకు, విధ్వంసానికి ఆజ్యం పోస్తోంది. ఎచ్సియు, జెఎన్యు, ఢిల్లీ వర్సిటీ తదితర విశ్వవిద్యాలయాలు ఎబివిపి ఆగడాలతో యుద్ధ భూమిగా మారాయి. మరోవైపు గోరక్షణ ముసుగులో దళితులపై, ముస్లింలపై హత్యాకాండను సాగిస్తున్నది. ఒకవైపు ఉన్మాదాన్ని రెచ్చగొడుతూనే మరోవైపు దేశంలో కీలకమైన సాంస్కృతిక, మేధో సంస్థలన్నింటినీ హిందూత్వ శక్తులతో నింపుతూ దేశాన్ని మతరాజ్యంగా మార్చేందుకు వడివడిగా అడుగులు వేస్తోంది. నిజమైన జాతీయతను, లౌకిక ప్రజాతంత్ర విలువలను ధ్వంసం చేయడమే దాని లక్ష్యం. మోడీ ప్రభుత్వం ఏ వర్గ ప్రయోజనాలను కాపాడేందుకు పనిచేస్తున్నదో ఈ చర్యలు స్పష్టం చేస్తున్నాయి. బడ్జెట్‌లో ప్రతి సంవత్సరం రు. 5 లక్షల చొప్పున కార్పొరేట్ పన్ను రాయితీలను, మినహాయింపులను ప్రకటిస్తూ రావడం, బ్యాంకుల్లో కార్పొరేట్ మొండి బాకీలు 7.7 లక్షల కోట్లకు పెరగడం వంటివి గమనిస్తే తనను గద్దెనెక్కించేందుకు కృషి చేసిన అంబానీలు, ఆదానీల వంటి కార్పొరేట్ల రుణాన్ని మాత్రం మోడీ ఘనంగా తీర్చేసుకున్నారనే విధితమవుతుంది.

వ్యవస్థల విధ్వంసం ఒక ఎత్తయితే దేశంలో వెళ్లూనుకున్న ఆర్ఎస్ఎస్ మూకల అసహనం మరో ఎత్తు 'ప్రజలు ఏం తినాలో, ఏం ధరించాలో, ఏం నేర్చుకోవాలో' వారే నిర్ణయిస్తున్నారు. దీనినెవరైనా ప్రశ్నిస్తే జాతి వ్యతిరేకిగా ముద్ర వేస్తున్నారు. ఈ అసహనానికి ఇప్పటికే అపారమైన మూల్యం చెల్లిస్తున్నది దేశం. ఇది భవిష్యత్తులో ఎన్ని దాడులకు గురిచేస్తుందో, ఇంకెన్ని ప్రాణాలను బలితీసుకుంటుందో ఊహించడానికే భయంగా ఉంది.

మోడీ ఏలుబడిలో రకరకాల పేర్లతో నైతిక పోలిసింగ్‌కు పాల్పడుతున్న అనేక ప్రైవేటు సైన్యాలను సృష్టిస్తున్నది హిందూత్వ పరివారం. వీరంతా గోసంరక్షణ పేరిట, సంస్కృతీ సంప్రదాయాల పేరిట దళితులు, మైనారిటీలపై దాడులు చేసి హతమారుస్తూ ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తున్నారు. ప్రజాస్వామ్యం, లౌకికతత్వం అపహాస్యం పాలవుతున్నాయి. ఈ నేపథ్యంలో భారతదేశ వైవిధ్యాన్ని, సామరస్యతను పరిరక్షించుకోవడానికి, మతోన్మాదాన్ని ఎదుర్కోవడానికి దేశభక్తియుత ప్రగతిశీల ప్రజాస్వామ్య శక్తులన్ని ఐక్యం కావాల్సిన సందర్భం ఇది. ఈ హిందూత్వ మతోన్మాదం కేవలం దళితులకు, ముస్లింలకు, ఇతర మైనార్టీలకే కాదు, అణచివేతకు గురయ్యే ప్రజలందరికీ శత్రువే. దానిపై సంఘటితంగా నిరసన వెల్లువెత్తాలి. విద్యార్థులు, యువజనులు, ప్రజాస్వామిక లౌకికశక్తులు బ్రాహ్మణీయ హిందూత్వ ఫాసిస్టు శక్తులకు, విధానాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక ఉద్యమాన్ని చేపట్టాలి. అప్పుడే భారత ప్రజలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో జీవించగలుగుతారు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# మోడీ పాలనలో హిందూ మతోన్మాదం

**మోడీ మూడేళ్ల పాలనలో ఆర్ఎస్ఎస్ హిందూత్వ భావజాలాన్ని అమలుచేస్తూ దళితులపై, ముస్లింలపై దాడులు చేస్తున్నారనీ, అంబేద్కర్ రూపొందించిన లౌకికవాద, ప్రజాస్వామ్య, సామ్యవాద భావజాల పునాదులపై భారతదేశాన్ని నిర్మించుకోవాలనీ అంటున్నారు డా. కత్తి పద్మారావు**

భారత ప్రధానమంత్రి నరేంద్రమోడీ మూడేళ్ల పాలనలో భారత రాజ్యాంగాన్ని ఉల్లంఘించే ప్రయత్నం చేస్తూ వస్తున్నారు. నరేంద్రమోడీ ఆర్ఎస్ఎస్ భావజాలం కలవాడు. ఆర్ఎస్ఎస్ మొదటి నుండీ లౌకిక, ప్రజాస్వామ్య, సామ్యవాద భావాలకు వ్యతిరేకమైంది. అందులో పూర్తికాలం కార్యకర్తగా మోడీ ఆ భావాలను నమ్మాడు, అనుసరిస్తున్నాడు, ఆచరిస్తున్నాడు. మోడీని గొప్ప ఉపన్యాసకుడని ప్రణబ్‌ముఖర్జీ వర్ణించారు. నిజానికి ఒక మహోపన్యాసకుడు అంటే భారత ప్రజల్లో లౌకిక భావజాలాన్ని, సమైక్యతను, సముజ్వలతను ఉత్తేజపరిచేదై ఉండాలి. అలాంటి ఉపన్యాసాలు భారతదేశంలో ఇచ్చినవారిలో మహాత్మాపూలే, డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ ముఖ్యమైనవాళ్లు. ప్రణబ్‌ముఖర్జీ మళ్లీ ప్రెసిడెంట్‌గా నిలబడే ఉద్దేశం మనసులో ఉండి ఆ అభినందన వచ్చి ఉండవచ్చును. కానీ నరేంద్రమోడీ ఉపన్యాసాల్లో హిందుత్వ భావజాలం, వర్ణతత్వ భావజాలం, ముస్లిం వ్యతిరేకత భావజాలం ఎక్కువగా ఉన్నాయి. ఉపన్యాసం అంటే ఒకరిని ఇంకొకరి మీద రెచ్చగొట్టడం కాదు. సామాజిక సమతుల్యాన్ని సాధించటం. మతానికి, ప్రభుత్వానికి సంబంధం లేదని చెప్తూనే హిందూ మతతత్వ ఆధిక్యతకు లోబడి మైనార్టీ మతాలవారు జీవించాలనే భావాన్ని మోడీ తీసుకువస్తున్నాడు.

ఒకసారి మనం వెనక్కు వెళితే 'పాకిస్తాన్ ప్రత్యక్షంగా ఇస్లాం మత రాజ్యంగా రూపొందితే భారతదేశం లౌకికవాద ముసుగులో హిందూమత రాజ్యంగా రూపొందింది. పాకిస్తాన్‌లో ఇస్లామీయులు అధిక సంఖ్యాకులు కాబట్టి వారు ప్రత్యక్షంగా ప్రకటించుకోగలిగారు. అయితే భారతదేశంలో ఇస్లాం, క్రైస్తవ, సిక్కు, బౌద్ధ, జైన, జొరాష్ట్రియన్ వంటి ఇతర ప్రధాన మతాలు కాక ఎన్నో మతేతరమైన మతరూపాలు మనుగడలో ఉన్నాయి. భారతదేశంలో అత్యధిక శ్రామికవర్గం హిందూ మతేతర మతాల్లోనే ఉన్నారు.

1989 జనవరి నుండి సెప్టెంబర్ వరకు 336 మంది ముస్లింలు హిందూ మతోన్మాదుల దాడిలో చంపబడ్డారు. ఇంతవరకు పట్టణాలలో జరిగే దాడులు ఇప్పుడు గ్రామాల్లో కూడా జరుగుతున్నాయి. ఉత్తరప్రదేశ్ లోను, బీహార్‌లోని భగల్పూరు లోను అధికారులు చెప్తున్న లెక్కల ప్రకారం రెండు వందల మంది పైగా మత ఘర్షణల కాల్పుల్లో చనిపోయారని తెలుస్తుంది. నిజానికి 800 మంది అదృశ్యం అయినట్లు ఆనాడు రేడియన్స్ పత్రిక నవంబరు 12 నుంచి ప్రకటించింది. 1987లో బాబ్రీమసీదు రామజన్మ భూమి వివాదంలో దేశ విభజన తరువాత గిరిజన హిందూ ముస్లిం గొడవల్లో ఇది పెద్దది.

ఉత్తరప్రదేశ్‌లో హిందూ యాజమాన్యంలో ఉన్న జౌళి పరిశ్రమల్లో ముస్లిం కార్మికులు శ్రమశక్తిని ధారబోస్తున్నారు. ఉత్తరప్రదేశ్ కోటికిపైగా ఉన్న ముస్లిం శ్రామికులపై పెత్తనాన్ని స్థిరీకృతం చేసుకోవటానికి హిందూ పెట్టుబడిదార్లు చేస్తున్న కుట్రలో భాగంగా కొద్దిరోజుల్లోనే ఈ మత విద్వేషాగ్ని అల్లుకొని ఢిల్లీ వరకు వ్యాపించింది. ఉత్తరప్రదేశ్ పోలీసు జవానులు నిష్పక్షపాతంగా రక్షణ కల్పించాల్సిన బాధ్యత మరచిపోయి ముస్లింలను ఊచకోత కోశారు. ఒకే ఒక్క సంఘటనలో 50 మందికి పైగా ముస్లింలను ఈ పోలీసులు చంపారంటే ఎంత దారుణంగా ఈ మారణహోమం జరిగిందో ఊహించాలి.

ఉత్తరప్రదేశ్ అగ్రకుల పెత్తందార్లు హిందూ పెట్టుబడిదార్లు కలిసి ముస్లింల మీద ఈ మారణకాండ నిర్వహించారు. బి.జె.పి, ఆర్ఎస్ఎస్ ప్రత్యక్షంగానే ఈ దాడులను నిర్వహించగా కాంగ్రెస్ చిరునవ్వుతో నిలబడి చూసింది. రాజీవ్‌గాంధీ మీరట్ వచ్చిన సందర్భంలో పోలీసు జవానులు జిందాబాద్, వర్ధిల్లాలని నినాదాలిచ్చారు. 1984లో ఇందిర హత్య అనంతరం ఢిల్లీలో జరిగిన సిక్కులు ఏ విధంగా రక్తసిక్తమయ్యారో ఇప్పుడు ముస్లింలు అదేవిధంగా దాడులకు గురయ్యారు. రాను రాను మైనార్టీలు జీవించే హక్కును కోల్పోతున్నారనడానికి ఈ దాడులే నిదర్శనం.

ఆర్ఎస్ఎస్ మత ఘర్షణలను ప్రత్యక్షంగా ముస్లింలపై చేసినా అంతర్గతంగా దళితులను అణచివేస్తూ వచ్చింది. అనేక సందర్భాల్లో దళితులపై ప్రత్యక్ష దాడులకు దిగింది. ముస్లింలను, దళితులను కలవకుండా ఎన్నో ప్రయత్నాలు చేసింది. ఈ ఆర్ఎస్ఎస్ భావజాలంతో మునిగితేలిన మోడీకి ముస్లింలన్నా, పాకిస్తాన్ అన్న అనాలోచితమైన ఆగ్రహం. ముస్లింలు భారతీయులే.

దళితులు భారతదేశ మూలవాసులు సింధూ నాగరికత ఎక్కడిది, భారతదేశ మూలవాసులు సృష్టించిందే కదా! భారతీయ గిరిజనులు మన ప్రకృతిని, సంస్కృతిని రక్షించినవారు, దళితులు నదీ నాగరికతను సృష్టించినవారు. వీరి శ్రమ లేనిదే భారతదేశ సంపద లేదు. ఎవరు సంపద సృష్టిస్తున్నారో వారి రక్షణ కోసమే భారత రాజ్యాంగం రాయబడింది.

భారత దేశానికి మొదట వలస వచ్చిన ఆర్యులు వైదిక సాంప్రదాయాన్ని, వర్ణవ్యవస్థను ఇక్కడకు తెచ్చారు. ఆర్యులు భారత దేశానికి రాకముందు వర్ణ వ్యవస్థ భారతదేశంలో లేదు. భారతీయ తెగల మధ్యలో ద్వేషం లేదు. సవరులు, గోండులు, లంబాడీలు, యానాదులు ఎవరు ఎవరిని నిర్మించలేదు. వారు ఒకరి మీద ఒకరు దాడులు చేసుకోలేదు. బౌద్ధం వచ్చాక మళ్లీ సంఘనీతి ముందుకు వచ్చింది. ఆ సంఘ దృక్పథాన్నే అంబేద్కర్ రాజ్యాంగంలో పొందుపరిచారు.

నిజానికి భారతదేశ శాస్త్రవేత్తలైన కణాదుడు, ఆర్యభట్టుడు, వరాహమిహురుడు, భాస్కరాచార్యుడు వంటివారు ఎవరినీ మోడీ

చదవలేదు. అలా ఆయన అధ్యయనం చేసి ఉంటే ఇవాళ విశ్వ విద్యాలయాల్లో సైన్స్ అభివృద్ధికి బడ్జెట్ తగ్గించేవాళ్లు కాదు. శాస్త్రాభివృద్ధి ఇతర దేశీయమైందని అనుకుంటున్నాడాయన. అంతే కాకుండా వేదాల్లోనే అన్నీ ఉన్నాయనే కల్పనావాదానికి లోనవుతున్నాడు.

మోడీ పరిపాలనకు వచ్చిన తర్వాత మూఢ విశ్వాసాలు పెరిగాయి. స్త్రీ హింస పెరిగింది. నిరక్షరాస్యత పెరిగింది. భారతదేశవ్యాప్తంగా పాఠశాలలను ఎత్తివేస్తున్నారు. మద్యపానం పెరిగింది, జూదం పెరిగింది, అంటువ్యాధులు పెరిగాయి. పర్యావరణ సమతుల్యత లోపించింది. బడా పారిశ్రామికవేత్తలకు ఇతర దేశాల పారిశ్రామికవేత్తలకు భారతీయ భూమిని, సంస్కృతిని తాకట్టు పెట్టడం పెరిగింది. భారతీయ మూలవాసులు సంక్షోభంలో ఉన్నారు.

నరేంద్రమోడీ పుట్టిన బిసి కులాలు అయితే జీవన భద్రతను కోల్పోయారు. కుమ్మరులు, కమ్మరులు, నాయిబ్రాహ్మణులు, విశ్వకర్ములు, రజకులు వంటి కులాలన్నీ తమ వృత్తి పునాదిని కోల్పోయారు. పిల్లలను చదివించు కోవటానికి ధనం లేదు. ఆయా వృత్తుల్లో ఉత్పత్తి అవుతున్న వస్తువులను కొనేవారు లేరు.

బడా బడా బెస్ట్ ప్రైస్, రిలయన్స్, వాల్‌మార్ట్, స్పెన్సర్స్, మెట్రో, బిగ్‌బజార్ వంటి మాల్స్‌వల్ల చిన్న చిన్న వ్యాపారాలు చేసుకునే బి.సి. కులాలు రోడ్డున పడ్డాయి. అప్పడాల దగ్గర నుంచి కాటుక నుంచి, ప్లాస్టిక్, స్టీల్, ఎలక్ట్రానిక్ గూడ్స్ వంటివాటిని ఆన్‌లైన్‌లో ప్రచారాలు చేసుకుని భారతదేశంలో ఉండే ప్రజలందరినీ ఉత్పత్తిదారులుగా కాదు, కొనుగోలుదారులుగా మారుస్తున్నారు. దీనివల్ల ఇళ్లల్లో ఉండే గృహిణిలు వస్తువ్యామోహితులై భర్తలు ఇంటికి వచ్చేటప్పటికి ఆన్‌లైన్‌లో వచ్చే వస్తువులకు డబ్బు కట్టమనే ప్రవర్తనలు కుటుంబ సంక్షోభాన్ని తెస్తున్నాయి.

మోడీ వచ్చిన తర్వాత భారతీయ కుటుంబ వ్యవస్థ కూడా దెబ్బ తింటుంది. నిరుద్యోగంతో పెళ్లిళ్లు బాగా తగ్గిపోయాయి. మోడీ రాజ్యంలో అంతర్గత నియంతృత్వం రాజ్యమేలుతుంది. ఇందిరాగాంధీ కూడా ఎమర్జెన్సీని తెచ్చేముందు ఇటువంటి పోకడలే పోయింది. నిజానికి మహానాయకులు ఎవరూ ఎక్కువ మాట్లాడలేరు. ఎక్కువ మీడియాలో రావాలని ప్రయత్నించినా, ఎక్కువ మాట్లాడినా నాయకుడికి అభద్రత ఉందని మనోవిశ్లేషకులు చెప్తారు.

మోడీలో ఉన్న అభద్రతకు అర్థం లేదు. పాకిస్తాన్ భారత ఉపఖండంలో ఒకనాడు భాగమైందే. అనేక అంశాలు పాకిస్తాన్‌కు, మనకు అంతర్గతంగా కలిసి ఉన్నాయి. బి.జె.పి పార్టీలో ముఖ్యమైన నేత అధ్వానీ వంటివాళ్లు కూడా పాకిస్తాన్‌లో పుట్టినవారే. మన్మోహన్‌సింగ్ కూడా పాకిస్తాన్‌లో పుట్టినవాడే. కులదీప్‌నాయక్ కూడా పాకిస్తాన్‌లో పుట్టిన వాడే. పాకిస్తాన్‌లో ఉన్నవాళ్లందరూ ముస్లిం ఉగ్రవాదులు కాదు, ఇస్లాం ఉగ్రవాదులు కాదు. పాకిస్తాన్‌లో ఉన్న ఎంతోమందికి భారతదేశం అంటే ఎంతో ప్రేమ ఉంది. భారతదేశంలో తీసిన సినిమాను మనకంటే వాళ్లు ఎక్కువగా చూస్తున్నారు.

మతంలో ఉండే ఏ ఉగ్రవాదాన్ని అయినా మనం ఎదిరించాల్సిందే. సరిహద్దులను సమర్థవంతంగా రక్షించుకోవాల్సిందే. భారతదేశంలో ఉన్న ముస్లింలకు భారతీయ సామాజిక, సాంస్కృతిక భావాలు, దేశీయత బలంగానే ఉన్నాయి. ముస్లింలు, క్రైస్తవులు, బౌద్ధులు, జొరాస్టియన్‌లు ఎన్నో మతాలు తీసుకున్నవారందరు కూడా భారతీయులుగానే ఆలోచిస్తున్నారు. వీళ్లందరినీ కలుపుకుని వెళ్లాల్సిన బాధ్యత ప్రధానమంత్రి మీద ఉంది. అనవసరంగా మనం ఏ దేశాన్ని మతపరంగానో, జాతిపరంగానో రెచ్చగొట్టకూడదు. ఇది సెక్యులర్ భావాలకు విఘాతమే.

బిజెపి ఒక సార్వభౌమ అధికారాన్ని చలాయిస్తూ ఉంది. అమిత్‌షా దక్షిణ భారతదేశంలో బిజెపిని విస్తృతం చేయటానికి ముఖద్వారంగా విజయవాడను వర్ణించాడు. అమిత్‌షా మాటలను తెలుగుదేశం పార్టీ జాతీయ అధ్యక్షుడు చంద్రబాబునాయుడు, తెలంగాణ రాష్ట్ర సమితి అధ్యక్షుడు కెసిఆర్ వినీ, విననట్లు ఉన్నా రెండు రాష్ట్రాల్లో బిజెపి బూత్ కమిటీలు వేస్తుందంటే అర్థం వాళ్ల విశ్వహిందూ పరిషత్, ఆర్‌ఎస్‌ఎస్, బిజెపి కార్యకర్తలకు రాజకీయ దురాక్రమణ పాఠశాలలు నిర్వహిస్తుందని అర్థం చేసుకోవాలి.

ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా ఇవ్వకపోవటానికి కూడా చంద్రబాబుని తగ్గించి మెల్లగా ఆంధ్రప్రదేశ్‌లో విస్తరించాలనేదే భావం. తెలంగాణలో అయితే అమిత్‌షా దళితుల ఇళ్లల్లో బయట నుంచి తీసుకు వచ్చిన భోజనం చేశాడు. మరి ఆయనకు నిజమైన అభిమానం ఉంటే దళితులు నిత్యం వండుకునే మాంసాలు తినవచ్చు కదా! ఒకపక్కేమో ఆవు మాంసాన్ని నిషేధించి వాళ్ల నోళ్లు కొడతారు. మరొకపక్కేమో వాళ్ల ఇళ్లల్లో భోజనాలు చేస్తున్నట్లు మీడియాలో దృశ్యీకృతమవుతారు. వాళ్ల ద్వంద్వ వైఖరిని గమనించలేనంత అమాయకులుగా దళితులను భావిస్తున్నారా!

కెసిఆర్ కూడా ఎలక్షన్ ముందు దళిత ముఖ్యమంత్రిని ప్రకటించాడు. ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ ఆనాడు దళిత ముఖ్యమంత్రి కావాలని కెసిఆర్‌ను డిమాండ్ చేసింది. బహిరంగంగా ప్రకటించి ఎలక్షన్‌లో గెలిచేటప్పటికీ ఒకేఇంట్లో తనకు ముఖ్యమంత్రి, కొడుక్కి ఐటి, మేనల్లుడుకి జలవనరుల మంత్రి పదవి, కూతురుకు ఎంపి, ఇలా కుల కుటుంబ పాలనకు తెరతీశాడు. ఇక చంద్రబాబు అయితే కులాధిపత్యంలో పేరెన్నిక గన్నవాడు. అయితే కులాన్ని మతం మింగేస్తుందని వీళ్లెవరికి తెలీదు.

భారతదేశంలో హిందూ రాజ్యం రావాలంటే బ్యాలెట్‌ను మనం ఆక్రమించాలని అమిత్‌షా ప్రబోధిస్తున్నారు. మోడీ, అమిత్‌షా ఇద్దరు మనుస్మృతివాదులు. కానీ దక్షిణభారతదేశం లౌకికవాద శక్తులతో ప్రభావితమైంది. వైదికార్యులు, గుప్తులు, హిందుత్వ రాజ్యావాదులెవరూ వింధ్య పర్వతాలను దాటలేకపోయారు. వారు అనుకున్నట్లుగా బి.జె.పి దక్షిణ భారతదేశంలో చొచ్చుకురాలేదు. మోడీ, అమిత్‌షా ఒకపక్క కులం కత్తులకు పదును పెడుతున్నారు. మరోపక్క మతోన్మాదాన్ని రెచ్చగొడు తున్నారు. మరోపక్క చైనా ఉత్పత్తుల్లో ముందుకు వెళుతూ చైనాలో ఉన్న ప్రతి మనిషికి పని కల్పించి అక్కడ ఉత్పత్తి అయిన వస్తువులను ప్రపంచం అంతా అమ్ముకోవటానికి వారు వాయు, జల, రోడ్డు మార్గాల్లో విస్తృతమైన ఏర్పాట్లు చేసుకుంటుండగా మన ప్రధానమంత్రి 45 దేశాలకు వెళ్లి ఒప్పందాల మీద ఒప్పందాలు చేసుకుంటున్నారు. కానీ, భారతదేశంలో సామాజిక, సాంస్కృతిక, పారిశ్రామిక, విద్యా వ్యవస్థలను విస్తృతం చేయాలనే పథకాలను రూపొందించుకోలేకపోతున్నారు.

ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లో పరిశోధనా విభాగం సీట్లన్నీ తగ్గించేశారు. ఎస్.సి.లకు ఇస్తున్న ఉపకార వేతనాలను తగ్గించేశారు. మరో పక్క ముస్లిం, దళితుల జీవన వ్యవస్థలను దెబ్బతీయాలని ఆవును ఆరాధ్య దైవంగా ముందుకుతెచ్చారు. ఉత్పత్తి సాధనంగా ఉన్న ఆవును

# సహారన్‌పూర్ దళితులపై అగ్రకులస్థుల దాడి

***ఉత్తరప్రదేశ్‌లో బిజెపి పూర్తి మెజారిటీతో అధికారం చేపట్టిన తరువాత దళితులు, ముస్లింలపై దాడులు తీవ్రమయ్యాయనీ, వారిని ఆర్థికంగా, సామాజికంగా దెబ్బతీయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనీ అంటున్నారు*** **భాస్కర్ ఏంపెల్లి**

ఉత్తరప్రదేశ్‌లోని సహరాన్పూర్ జిల్లా శబ్బిర్పూర్‌లో దళితులమీద అగ్రకుల తాకుర్లు (రాజ్‌పుట్) లు దాడిచేసి ఇరవై ఐదు ఇండ్లను తగుల బెట్టారు. ఏప్రిల్ పద్నాలుగున అంబేద్కర్ జయంతి నాడు పండిత్ రవిదాస్ ఆలయం దగ్గర అంబేద్కర్ విగ్రహం ఆవిష్కరించడానికి, ఊరేగింపు జరపడానికి దళితులకు అనుమతినివ్వలేదు. కాని మహారాణ ప్రతాప్ జయంతి ఉత్సవాలు జరపడానికి ఊరేగింపుకు థాకుర్లకు అనుమతి నిచ్చారు. మే ఐదున పక్క గ్రామంలో జరుగుతున్న రాజ్‌పుట్ రాజైన మహారాణ ప్రతాప్ జయంతికి వెళ్తూ రెచ్చగొట్టే విధంగా దళితుల ఇళ్ల నుండి పెద్ద మైకులు పెట్టి ఉరేగింపుగా బయలు దేరిన ఠాకుర్లకు దళితులు అభ్యంతరం చెప్పారు. దాంతో రెచ్చిపోయిన ఠాకుర్లు దళితుల ఇళ్ల మీద దాడి చేసారు. ఈ ఘటనలో ఒకరు చనిపోగా పదిహేను మంది గాయపడ్డారు. దళితుల ఇరవైఐదు ఇండ్లు తగులబెట్టారు. అయితే అంతకు ముందు జరిగిన పంచాయతి ఎన్నికల్లో థాకుర్లకు పోటిగా దళితుడు సర్పంచ్‌గా గెలవడం కూడా వాళ్లకు కంటగింపుగా మారింది.

మే తొమ్మిదిన అక్కడ స్థానికంగా పనిచేస్తున్న భీం ఆర్మీ అనే దళిత సంస్థ దళితుల మీద దాడి చేసిన ఠాకుర్ల మీద చర్య తీసుకోవాలనీ దళితులకు న్యాయం చేయాలనీ కోరుతూ మహా పంచాయత్ నిర్వహించ తలపెట్టింది. దానికి ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. దానిని ధిక్కరించి మహా పంచాయత్ నిర్వహించడానికి ప్రయత్నించిన దళితుల మీద లాటిచార్జ్ చేసి వందమందికి పైగా గాయపరిచారు. భీం ఆర్మీ సభ్యులను అల్లరిమూకలుగా చిత్రిస్తూ, ఈ ప్రాంతంలో అల్లర్లు చేయడానికి ప్రయత్నిస్తున్నారని ఆరోపిస్తూ, పోలిసుల మీద రాళ్లురువ్విన పేరుతో ఇరవైనలుగు మంది దళితులను అదుపులోకి తీసుకున్నారు. దళితుల మీదనే అల్లరిమూకల పేరువేసి అరెస్టులు చేసారు. భీం ఆర్మీ వ్యవస్థాపకుడు లాయర్ కుడా అయిన చంద్రశేఖర్ ఆజాద్‌ను మరి కొంతమందిని ఠాకుర్ల మీద ప్రతీకార దాడికి దళితులను ఉసిగొల్పారని తప్పుడు కేసులు పెట్టారు. బిజెపి ప్రభుత్వం తనను నక్సలైట్‌గా ప్రచారం చేస్తుందని, తనని ఎన్‌కౌంటర్ చేసి చంపడానికి ప్రయత్నిస్తుంది అని భావించి చంద్రశేఖర్ ఆజాద్ వ్యూహాత్మకంగా అండర్‌గ్రౌండ్‌కి వెళ్లాడు. ఎన్ని భయభ్రాంతులకు గురిచేసినా దళిత హక్కుల కోసం వెనుకాడేది లేదని భీం ఆర్మీ ఢిల్లీలోని జంతర్‌మంతర్ దగ్గర మే ఇరవై మూడున ధర్నాకి పిలుపునిచ్చింది. అయితే శబ్బిర్పూర్ దళితులను పరామర్శించి వారికి బిఎస్పి అండగా ఉంటుందని చెప్పడానికి మాయావతి అక్కడ బహిరంగ సభ నిర్వహించింది. ఆ సభకు వెళ్లి వస్తున్న దళితుల మీద అగ్రకుల ఠాకుర్లు గ్రూపులుగా ఏర్పడి తుపాకులు, కత్తులతో దాడిచేసారు. శబ్బిర్పూర్‌లో బిఎస్పి అధినేత మాయావతి బహిరంగ సభలో పాల్గొని

---

ఆరాధ్య దైవంగా చేయడం వల్ల భారతీయ ఆహార సంస్కృతిని దెబ్బతీయాలనే దుర్వ్యూహాన్ని పన్నారు. నిజానికి బ్రాహ్మణులు పశ్చిమ బెంగాల్ మొత్తంగా చేపలు తింటారు.

అనేక సందర్భాల్లో వాళ్లు అవకాశవాదాన్ని ఆశ్రయించారని మనుస్మృతి ఇలా చెప్తుంది. "వైశ్యవృత్తిమనాతిష్ఠ బ్రాహ్మణః స్వే పథిస్థితః – అవృత్తికర్శితస్సీ దన్నిమం ధర్మం సమాచరేత్ (బ్రాహ్మణుడు వేఱు జీవనము లేక నశించును, క్షత్రియ వైశ్యవృత్తుల నవలంబింపవచ్చును. అట్లు తన వృత్తియందే యుండుచు, జీవికను జరుపజాలడేని యీ వక్ష్యమాణ ధర్మము నవలంబింపవచ్చును.) సర్వతః ప్రతి గృహీయా ద్బ్రాహ్మణ స్త్వనయం గతః – పవిత్రం దుష్యతీత్యేతద్ధర్మతో నోపపద్యతే (బ్రాహ్మణు డాపన్ను డైనచో నిందితకర్మలగువా రందఱకడు నుండి యైనను బ్రతిగ్రహము గైకొనవచ్చును. గంగా జలము బాటలలోని నీటితో గూడినను దాను జెడుచున్న దనుట శాస్త్రరీతిని సమకూరదుగదా.) నాధ్యాపనాద్యాజనాద్వా గర్హితాద్వా ప్రతిగ్రహాత్ – దోషో భవతి విప్రాణాం జ్వలనాంబు సమాహితే (విప్రులకు నిందితములైన యధ్యాపన యాజన ప్రతిగ్రహములవలన పెట్టి దోషమును గలుగనేరదు. వార లుదకముతోను, నగ్నిహోత్రునితోను సమానులు గదా. స్వభావముచే బరిశుద్ధులు గాన వారి కేదోషములు నంటవు)."

మోడీ బ్రాహ్మణుడు కాకపోయినా బ్రాహ్మణత్వ ఆచరణ ఉంది. బ్రాహ్మణత్వ ఆచరణ అంటే అవకాశవాదమే. ఇకపోతే సరిహద్దు సమస్యలను దుందుడుకు మాటలతో కొనితెచ్చుకోవటమే కాకుండా భారతదేశానికి అంతర్జాతీయ విధానాలలో ఉన్న సామరస్య ధోరణులను దెబ్బతీయకుండా విస్తృతం చేసుకునే వైపు ఆయన నడవలేకపోయాడు. భారత ప్రధానమంత్రి ఆర్‌ఎస్‌ఎస్ భావజాలం నుంచి బయటపడినప్పుడే లౌకికవాద శక్తిగా ఆయన ఎదగగలుగుతాడు. ఆర్‌ఎస్‌ఎస్ భావజాలం సంకుచితమైంది. మతోన్మాదంతో కూడుకున్నది. హింసాత్మకమైంది. శత్రు భావాలను ప్రేరేపించేది. కాబట్టి అంబేడ్కర్ రూపొందించిన లౌకికవాద, ప్రజాస్వామ్య, సామ్యవాద భావాజాల పునాదుల మీద భారతదేశ భవిష్యత్తును నిర్మించే ప్రయత్నాన్ని మార్క్సిస్టులు, అంబేడ్కరైట్లు, లౌకికవాదులు భుజానెత్తుకుని ముందుకు వెళ్లాల్సిన చారిత్రక సందర్భం ఇది.

*(రచయిత సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షులు, నవ్యాంధ్రపార్టీ)* వీ

తిరిగి వెళ్తున్న వారి మీద గ్రూపులుగా ఏర్పడి తుపాకులు, కత్తులతో వేరువేరు చోట్ల దాడిచేసారు. ఈ దాడిలో ఒకరు మరణించగా, ఒక ముస్లింతో సహా పదమూడు మంది గాయపడ్డారు. ఇంత జరిగినా ఎవరి మీద ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం కింద కేసులు నమోదు చేయలేదు. మమ్మల్ని ఎవరు ఏమీ చేయలేరు అని చెప్పడమే వారి ఉద్దేశం. ప్రభుత్వం నామమాత్రంగా అధికారులను శిక్షించి చేతులు దులుపుకుంది. ఇప్పుడు చనిపోయిన వ్యక్తికి పదిహేను లక్షలు, గాయపడ్డ వారికి యాభై వేలు చొప్పున పరిహారం ఇవ్వడానికి ప్రభుత్వం ఒప్పుకుంది. మరి నిందితులను శిక్షించడం గురించి మాట్లాడటం లేదు.

ఈ ఘర్షణను అడ్డుకోలేక పోయారని సహరాన్పూర్‌జిల్లా మేజిస్ట్రేట్‌ను, సీనియర్ ఎస్‌పిని విధుల నుండి తొలగించారు. అలాగే అక్కడి డిఐజిని, డివిజన్ కమిషనర్‌ను ట్రాన్స్ఫర్ చేసారు. కాని దాడిచేసిన ఏ ఒక్కరిని అరెస్ట్ చేయలేదు. చేసిన వారిని ఆధారాలు లేవని వదిలేసారు. కేవలం పద్దెనిమిది రోజుల వ్యవధిలో దళితులపై మూడుసార్లు దాడి జరిగింది. ఇద్దరు మరణించారు, ఇరవై మందికి పైగా గాయపడ్డారు, అలాగే ఇరవై ఐదు ఇండ్లు తగులపెట్టారు. అయినా అధికారులకు ఇదంతా చేసింది ఎవరు అని ఆధరాలు దొరకలేదు. ముప్పై మందిని అరెస్ట్ చేసి విచారిస్తున్నాం అని అధికారులు చెప్తున్నారు. ఇందులో దళితులు ఎంత మంది, ఠాకుర్లు ఎంతమంది తెలియదు. ఒక ఠాకూర్ చనిపోయినందునే దళితుల ఇళ్లు తగులబెట్టారని చెప్తున్నప్పటికీ, ఆ చావుకి ఈ గొడవకి ఏ సంబంధం లేదని తెలియవస్తుంది.

మే 23న అంభేట అనే గ్రామంలో ఠాకుర్లు ముగ్గురు దళితుల మీద దాడి చేసారు. అందుకు కారణమైన ఎనిమిది మంది ఠాకుర్లను అరెస్ట్ చేసి ఆధారాలు లేవని విడిచిపెట్టారు. దాడిచేసిన వారిని ఆధారాలు లేవని అరెస్ట్ చేయకపోగా, భీం ఆర్మీ వ్యవస్థాపకుడు చంద్రశేఖర్ ఆజాద్, ఇంకొంత మంది దళితులను అరెస్ట్ చేయడాన్ని నిరసిస్తూ మేజిస్ట్రేట్ ఆఫీస్ ముందు ధర్నా చేసిన రెండు వందల యాభై మంది దళిత మహిళల మీద కేసులు పెట్టింది ప్రభుత్వం. అగ్రకుల ఠాకుర్ల దాడులను నిరసిస్తూ మే 23న ఢిల్లీలోని జంతర్ మంతర్‌లో పెద్ద ఎత్తున ధర్నా నిర్వహించారు. ఈ హిందూ మతం తమకు సమానత్వం ఇవ్వదని, రాజ్యాంగ దినంగా పరిగణించే నవంబర్ ఇరవై ఆరున తమ గ్రామంలోని దాదాపు వెయ్యి మందికి పైగా మతం మార్చుకోవడానికి సిద్ధం అయ్యారు.

ఉత్తరప్రదేశ్‌లో యాదవుల ఆధిపత్యంలోని ఎస్‌పి లేదా జాదవ్‌ల ఆధిపత్యంలోని బిఎస్పి అధికారంలో ఉన్నా తమ అగ్రకుల ఆధిపత్యాన్ని చూపించడానికి ఠాకుర్ల(రాజపుత్) లకు అవకాశం లేకుండా పోయింది. మాయావతి అధికారంలో ఉన్నప్పుడు దళితులకు కాస్త ధైర్యం ఉండేది. రాజకీయ అధికారంలో దళితులు ఉండడంతో అగ్రకులాలు కూడా జాగ్రత్తగా ఉండేవి. వరుసగా మాయావతి అధికారం కోల్పోయి, ఇప్పుడు ఇన్ని సంవత్సరాల తర్వాత తమ అగ్రకుల ఠాకూర్, యోగి ఆదిత్యనాథ్, ముఖ్యమంత్రి కాగానే ఇన్ని నాళ్లు అనుచుకున్న కుల దురహంకారం కట్టలు తెంచుకుంది. బిఎస్పి రాజకీయంగా బలహీనపడడంతో అగ్రకులాలకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. అది చాల స్పష్టంగా అర్థం చేసుకున్న దళితులు ఇప్పుడు ఎన్నికలకు అతీతమైన, ప్రత్యామ్నాయ రాజకీయ 'భీం ఆర్మీ' అవసరమైంది. ఎన్నికల ఊబి కూరుకుపోయిన బిఎస్‌పి తమ సహాయార్థం రాదని దళితులకు తెలిసిపోయింది. రాష్ట్ర వ్యాప్తంగా అధికారం సాధించిన బిజెపికి ఇప్పుడు స్థానిక సంస్థల ఎన్నికలు ఒక సవాల్ కాగలవు. అందుకే ఇప్పుడు అగ్రకుల ఠాకుర్లను అధికారానికి ఉసిగోల్పడం అవసరం. ఉత్తరప్రదేశ్‌లోని ఉత్తర ప్రాంతం అంతా ఈ అగ్రకులాల అధినంలో ఉండి దళితులు బిసిలు రాజకీయ అధికారంలో వారిని ఏమి చేయలేక, వారి అహంకారాన్ని ఈ ప్రాంతంలో ఎకువగా ఉండే ముస్లింల మీద తీస్తూ వచ్చారు. మీరట్, హాంసిపూర్, ముజఫంనగర్ మత ఘర్షణలు వారి శృష్టే. హిందూ ఓటు బ్యాంకును సమకుర్చు కోవడానికి ఈ అల్లర్లు వారికి ఉపయోగపడ్డాయి. ఇప్పుడు స్థానిక సంస్థల ఎన్నికలు గెలవాలంటే సహరాన్పూర్‌లు కావలి. బిసిల పార్టీగా పేరున్న ఎస్‌పి కాని, దళితుల పార్టీగా పేరున్న బిఎస్‌పి గాని అధికారంలో ఉన్నన్నాళ్లు అగ్రకులాలను తమవైపు తిప్పుకోవడమో లేదా వారిని మైనారిటీ చేసి అధికారం చేలయిన్చాడమో జరిగింది. కాని వారిలోని అగ్రకులతత్వాన్ని పోగొట్టి ఇతర దళిత బహుజన కులాలను వారితో సమంగా చూసే పరిస్థితి కలిగించలేక పోయారు. ఇది ఉత్తరప్రదేశ్ దళిత బహుజన రాజకీయాల పెద్ద లోపం. ఈ ఎన్నికల రాజకీయాలు ఎన్ని సంవత్సరాలు చేసిన ఆ మౌలిక మార్పులు తీసుకు రాగలవా అనే సందేహం కలుగుతుంది. 2015లో ఎస్పి అధికారంలో ఉండగానే ఉత్తరప్రదేశ్ 150 మతఘర్షణలతో దేశంలోనే అత్యధిక అల్లర్లు జరిగిన రాష్ట్రంగా ఉంది.

భీం ఆర్మీకి బిఎస్‌పి నిధులు సమకూరుస్తుంది అని బిజెపి విమర్శిస్తే, లేదు అది బిజెపి సృష్టి అని మాయావతి అంటుంది. ఇక్కడ పరిస్థితి ఇంత దారుణంగా ఉంటే కేసు విచారణకు తొందర ఏమి లేదు వేసవి సెలవులు అయింతర్వతే వాదనలు వింటామని న్యాయమూర్తులు చెప్తున్నారు. ఇప్పుడు దళితుల జీవితాలు ఎవరికీ పట్టనివిగా చివరికి దళిత రాజకీయ నాయకులకు కూడా పట్టనివిగా అయినాయి. బిజెపి తమ సంప్రదాయ ఓటు బ్యాంకు అయిన ఠాకుర్ల మీద ఎటువంటి చర్య తీసుకోవడానికి సాహసం చేయబోదు. అలాగని దళితులను దూరం చేసుకుంటుందా చూడాలి.

తమ కులం వాడైన ఆదిత్యనాథ్ ముఖ్యమంత్రి కాగానే అగ్రకుల ఠాకుర్లు దళితుల మీద దాడులకు తెగించారు. ఘనమైన మెజారిటీతో గెలిచిన తర్వాత బిజెపి అనుకూల అగ్రకులాలు తమకు ఓటు వేయని వర్గాల మీద ప్రతీకారం తీర్చుకోవడానికి సిద్ధమైనట్టుగా తెలుస్తుంది. ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో బిజెపికి వ్యతిరేఖంగా ఓటు వేసినది ప్రధానంగా ముస్లింలు, యాదవులు, జాతవ్ లు(దళితులు). ముస్లింల ప్రధాన ఆదాయ వనరు అయిన మాంసం దుఖానాలను, కబేలాలను మూసివేసి వారిని ఆర్థికంగా దెబ్బతీసే చర్యలు ఇప్పటికే పూర్తయ్యాయి. ఆర్థికంగా, రాజకీయంగా బలంగా ఉన్న యాదవులను తాకే పరిస్థితి తక్కువ. ఇప్పుడు అగ్రకులాల టార్గెట్ దళితులే. కేవలం ఎన్నికల రాజకీయాలకే పరిమితమై తన మాస్ పునాదిని కోల్పోయిన బిఎస్‌పిని నమ్ముకొని లాభం లేదని గ్రహించిన దళితులకు ఇప్పుడు భీం ఆర్మీ ఒక ప్రత్యమ్నాయ రాజకీయ వేదిక కాగలదు. ఇది బిఎస్‌పికి పోటి అనుకోవడం కంటే, దానికి ఇది కొనసాగింపు కాగలదని అనుకోవడం సమంజసంగా ఉంటుంది.

*(రచయిత ఆర్థిక శాస్త్ర పరిశోధక విద్యార్థి)* వీ

# తెలంగాణ - పాత సీసాలో పాత సారా

***ప్రజా ఉద్యమం, అనేక త్యాగాల ఫలితంగా వచ్చిన తెలంగాణలో కనీస ప్రజాస్వామిక హక్కులు లేవనీ, పాలన విధానాల్లో మార్పులేదనీ, ప్రజాస్వామిక తెలంగాణ కోసం ప్రజలు మరో పోరాటం చేయాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* బైరెడ్డి సతీష్**

దశాబ్దాల పోరాటం, అనేక త్యాగాల ఫలితంగా అశేష జనవాహిని అకాంక్ష అయిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం రూపుదాల్చుకొని మూడు వసంతాల ముంగిట్లో నిలబడివున్నది. దిక్కులు పిక్కటిల్లేలా మారుమోగిన జై తెలంగాణ నినాదం ఆత్మగౌరవాన్ని అభివృద్ధి, తెలంగాణ స్వయం నిర్ణయాధికార ఎజెండానే కాక అణగారిన వర్గాల జీవనస్వరమై దేశంలోనే కాదు ప్రపంచవ్యాప్త ప్రజా ఉద్యమాలకు జవజీవాలు అందించి అచంచల విశ్వాసాన్ని పాదుగొల్పింది. తెలంగాణ నేలంతా ఉద్యమ చైతన్యంతో ప్రవాహమై పరిడవిల్లింది. సడలని బిగిపిడికిళ్లను పూయించిన పోరాట పూలదోటయ్యింది. గడపదాటని కాళ్లు కూడా కవాతులు చేసినయి. కొత్త కలాలు పురుడుపోసుకొని కాలాన్ని పరుగుపెట్టించినయి. కొత్త గళాలు వలసపాలన గుండెల్లో గుబులు పుట్టించి గురితప్పని బాణాలయినాయి. లక్షల గొంతుకలు యుద్ధక్షేత్రంలో రణ నినాదాలయినాయి. పసివాడి పలుకుల నుండి వయస్సు మళ్లినవాళ్ల మాటలు సైతం వేడిపుట్టించే తీవ్రతను సంతరించుకున్నాయి. ఈ తలవంచని జనజాతరకు పాలకులు సలాం చేయాల్సి వచ్చింది. కుట్రలు, కుయుక్తులను దాటుకుంటూ 2014 జూన్ 2న పది జిల్లాల తెలంగాణ భౌగోళికంగానైనా నిలబడింది.

దశాబ్దాల ప్రజా స్వప్నమైనప్పటికీ తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం దానికదే అంతిమ లక్ష్యం కాదు. సబ్బండ వర్గాలకు సామాజిక న్యాయం, దొరలు పెత్తందారుల చేతుల్లో బంధీలైపోయిన సకల వ్యవస్థలను ప్రజాస్వామి కీకరించుకోవడం, ప్రజా స్వభావాన్ని సిద్ధింప చేసుకోవడమనే బృహత్ లక్ష్యం పోరాట ప్రజల ముందు మిగిలేవున్నది. వలసవాద పెత్తందారి పోకడలు రూపంలో కనుమరుగైనట్టు కనిపించినా సారంలో ప్రభలంగానే ప్రజా జీవితాన్ని ప్రభావితం చేస్తున్నాయి. తెలంగాణ ప్రజా జీవితాన్ని ధ్వంసం చేసి దోపిడి, పీడనను వ్యవస్థీకృతం చేసింది వలస పాలనయే కాదు తరతరాలుగా తెలంగాణలో పాతుకొనిపోయిన అగ్రకుల భూస్వామ్య వ్యవస్థ కూడా అన్నది చారిత్రక సత్యం. ఈ అవశేష వలస పెత్తనం, కొత్తరూపంలో పాతుకొనిపోయిన భూస్వామ్య వటవృక్షపు కూకటి వేళ్లను పెకిలించడం, దళిత బహుజన, మహిళ, మైనార్టీ, పేద వర్గాలకు విముక్తి కల్పించి వారి ఆత్మగౌరవ పతాకాన్ని ఎత్తిపట్టేలా ప్రతి మనిషికి సమాన విలువకై, సహజ వనరుల్లోనూ, పోగుపడుతున్న సంపదలోనూ, అధికారంలోనూ సమాన వాటా దక్కేలా జరగాల్సిన అసలు సిసలైన పోరాటం మిగిలిపోయే ఉన్నది.

తెలంగాణ రాష్ట్రం సిద్ధించిన నేపథ్యంలో జరిగిన సాధారణ ఎన్నికల్లో 'ఉద్యమ పార్టీ'గా అనిపించుకున్న టిఆర్ఎస్ అధికారంలోకి రావాల్సిన అవసరాన్ని అనేక ఉద్యమ శ్రేణులు, సంస్థలు కోరుకున్న మాట వాస్తవం. అనేక అపసవ్య ధోరణులతో వ్యవహరించినప్పటికీ పార్లమెంటరీ రాజకీయాలతో తెలంగాణ రాష్ట్రం అనే నినాదంతో నిలబడడంతో ఆ పార్టీయే అధికారంలోకి రావాలని సహజంగానే మెజారిటీ ప్రజలు భావించారు. ఉద్యమ క్రమంలో పొందిన ప్రజా జీవితపు అవగాహన, అనుభవం పాలనలో పనికివస్తాయనే అభిప్రాయంతోనే అందరూ ఉన్నారు. దీనికి తోడు ఉద్యమ కాలంలో ఆ పార్టీ నాయకత్వం లేవనెత్తిన అంశాలు, మిగితా ఉద్యమ సంఘాలు చేపట్టిన అంశాలకు రూప ప్రాయంగానైనా పోలిక ఉండడం కూడా ఈ వైఖరి తీసుకునేలా దోహదపడింది. పోరాటాల ఫలితంగా రాష్ట్రం సిద్ధించడం, చైతన్య వంతమైన ప్రజా సమూహం, రాష్ట్ర ఉద్యమంలో కీలకంగా నిలబడ్డ పార్టీ అధికారంలోకి రావడంతో సహజంగానే ప్రజల ఆశలు అమాంతం పెరిగినయి.

రాష్ట్రం ఏర్పడిన తొలిరోజుల్లోనే ఇకనుండి టిఆర్ఎస్ పక్కా 'రాజకీయ పార్టీ'గా వ్యవహరిస్తుందని స్వయంగా చంద్రశేఖర్‌రావు ప్రకటించారు. చెప్పకనే ఒక విషయం స్పష్టం చేశారు. ఇప్పటివరకు ఉన్న పాలక వర్గ రాజకీయాలకంటే బిన్నమైన, ప్రత్యేక విలువలు, నైతికత, సైద్ధాంతికత తమ పార్టీకి ఏమీలేవని స్పష్టమయ్యేలా వారి వ్యవహారశైలి ఉన్నది. అధికారం చేపట్టిన కొద్దికాలానికే ఆ ప్రకటన తాలుకూ ఆచరణ బట్టబయలయింది. తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని వ్యతిరేకించినటువంటి, ఉద్యమ ప్రయోజనాలకు వ్యతిరేకంగా పనిచేసి, ఉద్యమకారులపై కేసులు పెట్టడంలో, ఉద్యమాన్ని అణిచివేయడంలో పాత్ర పోషించిన అనేక మంది నాయకులను పార్టీలోకి తీసుకోవడమే కాదు, కీలక పదవులు కట్టబెట్టి మరీ ప్రజల నెత్తిన కూర్చోబెట్టి పెత్తనం చేయిస్తున్నారు. అదే సమయంలో తెలంగాణ ఉద్యమ నాయకులపై దుష్ప్రచారం చేస్తూ అభివృద్ధి నిరోధకులుగా చూపెట్టే ప్రయత్నం చేస్తున్నారు. టిఆర్ఎస్ ఏ గొప్ప విలువలకు ప్రతీక, ప్రతినిధి కాదని కొత్త రాజకీయ సంస్కృతి ఏమీ లేదని తాను ఆ తానులోని ముక్కననే అధికారం చేపట్టిన ఆరంభంలోనే నిరూపించుకున్నది.

అనేక దశాబ్దాలుగా వ్యక్తీకరించబడుతున్న ప్రజా ఆకాంక్షలు, ఉద్యమ క్రమంలో పెంచబడిన ఆశలు, ఎన్నికల సందర్భంలో టిఆర్ఎస్ ఇచ్చిన హామీలు, ఆచరణలో ప్రజాజీవితాల్లో కలిగిన అనుభవాల ఆధారంగానే తెలంగాణ ప్రభుత్వ పనితీరును అంచనా వేయాలి. ప్రభుత్వ పెద్దలు ఏమి ప్రచారం చేస్తున్నారు, వారికి బాకాలు ఊదే మీడియా ఏం చెబుతున్నదనే దానికంటే ఈ మూడు సంవత్సరాలలో ప్రజా జీవితాల్లో చోటుచేసుకున్న గుణాత్మక మార్పులు ఏమివున్నాయనే అంశాల ప్రాతిపదికనే ప్రభుత్వ పనితీరును మదింపువేయాలి. టిఆర్ఎస్ ప్రభుత్వం చెబుతున్నట్లు 60 ఏళ్లలో లేని అభివృద్ధి మూడేళ్లల్లో కనిపిస్తుందా అనే అంశానికి ఇంక విలువ ఉండి సహేతుకంగా అనిపిస్తుందా? తన వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి అదేవాదనను పదేపదే చేయడం సమర్థనీయమేనా? ఈ మూడేళ్ల కాలంలోనే తన దిశ ఎటువైపో సూచించే

విధాన నిర్ణయాలు, పాలనా పద్ధతులంటూ ఏమీ లేవా? ఉద్యమ కాలంలో ప్రజలందరూ అంగీకరించేలా, భావ ప్రచార సందర్భంలో అభివృద్ధి లేమికి ఏ విధానాలు దోహదపడ్డాయో, వలస పాలకులు అనుసరించిన ఏ అభివృద్ధి నమూనా, రాజకీయ, ఆర్థిక విధానాలు జన జీవితంలో సంక్షోభాన్ని తీసుకొచ్చాయో అంతకంటే భిన్నంగా, వైవిధ్యంగా ఉద్యమ సందర్భంలో చెప్పినట్లుగా, ఆశలు కల్పించినట్లుగా పాలన కొనసాగుతున్నదా? ఆకర్షణీయమైన మాటలు, ప్రశంసార్హమైనవిగా అనేక విధానాలు కనిపిస్తాయి కాని ఆచరణలో ఆదే మూస ధోరణి, అదే వలస వాద పాలక వైఖరి స్పష్టంగా కనిపిస్తున్నది. తెలంగాణ జనజీవితం పరాయీకరణకు గురికావించబడ్డ ఏ మౌలిక విధానాలపై సమీక్షగాని, రద్దు కాని లేకుండానే పాత పద్ధతిలోనే పాలన కొనసాగుతున్నది. రాజకీయ, ఆర్థిక విధానాలు, వ్యవసాయంపై ఏ ముసాయిదా లేకుండానే పారిశ్రామిక వేత్తలకు, సంపన్న వర్గాలకు, దేశ విదేశీ పెట్టుబడిదారులకు పాత తరహా పిలుపులు, రాయితీలు, ప్రోత్సహకాలతో సహజ వనరులను సమర్పించు అభివృద్ధి నమూనాయే రాజ్యమేలుతుంది. మౌలిక సమస్యల నుండి ప్రజా ఉద్యమం ద్వారా పోగుపడిన చైతన్యాన్ని దారి మళ్లించి భావోద్వేగాలలో మైమరచిపోయేలా సాంస్కృతిక, అధ్యాత్మిక అంశాలకు అతిగా స్థానమివ్వడం జరుగుతుంది. పాలనలో సమిష్టితత్వం, రాజ్యాంగ స్ఫూర్తికంటే 'వ్యక్తి వాద' ముద్రకోసమే తపన పడుతున్నట్లు కనపడుతున్నది. అభివృద్ధి, సంక్షేమం జమిలిగా వెలుతున్నట్టు బయటకు చెపుతున్నా వాటి రూపంలో, సారంలో, ఆచరణలోనూ ఎటువంటి మౌలిక వ్యత్యాసం గతంతో పోలిస్తే కనిపించడంలేదు. అనేక పథకాలైతే గతకాలపు ప్రభుత్వాల కొనసాగింపుగానే ఉన్నాయి. ప్రజా పాలనకంటే ప్రజలకు ఇది సరిపోతుందిలే అనుకునే పాలకుల ఏకపక్షవైఖరే ఎక్కువగా ప్రతిబింబిస్తున్నది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన కొత్తలో చేపట్టిన సమగ్ర సర్వే ఎక్కడ ఉపయోగపడిందో, మన ఊరు మన ప్రణాళిక పేరుతో హడావిడిగా ప్రజల దగ్గర నుండి సేకరించిన ప్రజా ఆకాంక్షల పత్రాలు, అవసరాల వినతులు ఏ చీకటి గదుల్లో మగ్గుతున్నాయో తెలియరావడం లేదు.

తెలంగాణ రాష్ట్రానికి దళితుడే తొలి ముఖ్యమంత్రి అని నమ్మినవాళ్లకి తక్కువేమిలేదు. ముఖ్యమంత్రి మాటేమోగాని ఓట్లు కురిపించిన దళితులకు మూడెకరాల భూమి మూణ్ణాళ్ల ముచ్చటయే కాదు తొలినాళ్ల ముచ్చట కూడా కాలేక పోయింది. ఓట్ల కాలం వరకు ఈ అంశంపై చాలా ఆకర్షణీయంగా మాట్లాడిన నేతలు ఇపుడు దాని ఊసే ఎత్తడంలేదు. రాష్ట్రంలో ఉన్న మొత్తం దళిత జనాభాలో 75 శాతం గ్రామీణ ప్రాంతాల్లో ఉన్నారు. ఈ సంఖ్య కుటుంబ పరంగా చూస్తే ఎనిమిది లక్షల కుటుంబాలు ఉంటాయి. వీరిలో కనీసం ఆరు లక్షల కుటుంబాలైతే భూమిలేని నిరుపేద కుటుంబాలు. వీరికి అవసమైన భూమి 18 లక్షల ఎకరాలు. ప్రభుత్వ ధర ప్రకారం లెక్కకట్టినా ఈ పథకానికి 80 వేల కోట్ల రూపాయలు అవసరమవుతాయి. ఈ పథకం అమలు అవుతున్న తీరు, బడ్జెట్ కేటాయింపులు దాని కాల పరిమితి చూస్తే 80 సంవత్సరాలకు పైగానే పడుతుంది. ఇప్పటికీ పంచింది పట్టుమని పదివేల ఎకరాలు కూడా లేదు. వ్యవసాయ రంగం పాత ఆంధ్రప్రదేశ్ కంటే ఏమాత్రం భిన్నంగా లేదు. రైతుల ఆత్మహత్యల పరంపర కొనసాగుతూనే ఉన్నది. గిట్టుబాటు ధర కోసం ఉద్యమించిన రైతాంగాన్ని సంకెళ్లతో బంధించి క్రిమినల్ కేసుల్ని బనాయించింది. గిట్టుబాటు కాని పంటల్ని అగ్గిపాలు చేసుకోవాల్సిన దుస్థితికి నెట్టివేసింది. భారీ ప్రాజెక్టులతో నీటిపారుదల రంగానికి, విద్యుత్ రంగానికి విపరీతమైన ప్రాధాన్యత ఇస్తున్న అప్పటికే పూర్తయిన ప్రాజెక్టుల కింది రైతాంగం సైతం ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. తెలంగాణ రాష్ట్రంలో విద్యుత్ సమస్యే లేనట్టుగా ప్రచారం చేస్తున్నది ప్రభుత్వం. నిజానికి తెలంగాణ రైతాంగానికి తొమ్మిది గంటలు అందాల్సిన పూర్తిస్థాయి విద్యుత్ సప్లై జరగడం లేదన్నది క్షేత్రస్థాయిలోని వాస్తవం. ఛత్తీస్‌గఢ్‌తోని, ఇటు ఆంధ్రప్రదేశ్‌తోనూ చాలా ఖరీదైన ఒప్పందాల ద్వారా విద్యుత్‌ను పొందుతున్నాం. అధిక వ్యయం కలిగిన థర్మల్ విద్యుత్‌ను తెలంగాణకు కట్టబెట్టి తక్కువ ఉత్పత్తి వ్యయం కలిగిన విద్యుత్‌ను తెలంగాణకు దూరం చేస్తున్నది ఆంధ్రప్రదేశ్. ఛత్తీస్‌గఢ్‌తో కుదుర్చుకున్న ఒప్పందంలో పారదర్శకత లేదు అనే అంశాన్ని పదేపదే ప్రశ్నించినప్పటికి సమాధానాన్ని దాటవేస్తున్నది ప్రభుత్వం. ఈ ఖరీదైన విద్యుత్తు ఒప్పందాల మూలంగా ప్రజలపై మరింత భారంపడే అవకాశం ఉన్నది. ఈ ప్రభుత్వం అత్యంత ప్రతిష్టాత్మకంగా చేపట్టిన భారీ నీటిపారుదల ప్రాజెక్టుల విషయంలో సమగ్ర ప్రాజెక్టుల నివేదికలు లేకుండానే (డిపిఆర్) ముందుకెళుతున్నది. కాళేశ్వరం ఎత్తిపోతల ప్రాజెక్టు సమగ్ర నివేదికను విశ్లేషించినపుడు దానికింద సాగుకయ్యే ఖర్చు విస్మయపరుస్తుంది. రైతుపై పడే భారం ఎకరాకు పంటకు ఏటా 1,28,608 రూపాయలు. ఈ ప్రాజెక్టు మొత్తం అంచనా వ్యయం 2008లో 17 వేల కోట్లుండగా, ఇవాళ అది 80,500 కోట్లకు చేరుకున్నది. అంటే ఎనిమిదేండ్లలో ఐదు రెట్లు పెరిగింది. ఎలాంటి అనుమతులు, ప్రణాళికా లేకుండా చేపట్టిన ప్రస్తుత ప్రాజెక్టు ఖర్చు ఎంత పెరుగుతుందో చెప్పడం కష్టం. ఏటా విద్యుత్ వినియోగం, ఈ ప్రాజెక్టుపై అప్పు, వడ్డీ, తరుగుదల, నిర్వహణ ఖర్చులు చూసుకుంటే తడిసిమోపెడవ్వడం ఖాయం. ఇంతా చేస్తే 124 టిఎంసిలతో మొత్తం సాగయ్యే భూమి 9.92 లక్షల ఎకరాలు మాత్రమే. ఇంతా చేస్తే ఈ ప్రాజెక్టు వ్యయం నిర్వహణ, విద్యుత్ ఖర్చులు చూసినపుడు ఈ ప్రాజెక్టు కింద కోల్పోతున్న భూమిని కలిపితే భవిష్యత్తులో ఇంత కంటె గొప్ప ప్రయోజనాలు ఉంటాయంటే సందేహాస్పదమే. ప్రజలు నిర్వాసితులు కావడం, కాంట్రాక్టర్లు వేల కోట్లు వెనుకేసుకోవడం, రైతులపై భారం పడడం, రాష్ట్రం అప్పుల్లోకి కూరుకొనిపోవడం మాత్రం ఖాయంగా కనిపిస్తున్నది. కొత్తగా మొదలు పెట్టిన పాలమూరు – రంగారెడ్డి ఎత్తిపోతల ప్రాజెక్టు ఇప్పటికే ఎటువంటి కదలిక లేకుండా ఉన్నది. కాని దానికి సంబంధించిన ప్రజయోజనాల విషయంలో ప్రభుత్వం చేసే ప్రచారార్భాటాలకు కొదవలేదు. ప్రాజెక్టుల పేరుతో ఉన్న కొద్దిపాటి వ్యవసాయ భూమిని కూడా కోల్పోవాల్సి రావడంతో రైతాంగం మరింత విలవిలలాడుతుంది. తెలంగాణలో గతంలో కంటే భూనిర్వాసితత్వం మరింతగా పెరిగిపోయింది. పారిశ్రామిక రంగంలో దేశంలోనే వ్యాపారం చేయదగిన రాష్ట్రాల్లో (ఈస్ ఆఫ్ డూయింగ్ బిజినెస్) నెంబర్ వన్ స్థానమని రాష్ట్రానికి పేరుపడింది. ప్రపంచ స్థాయి సంస్థలు, దేశీయ విదేశీ వ్యాపారస్థులతో, వ్యాపార సంఘాల మీటింగులలో, విదేశీ పర్యటనలో వేలాది కోట్ల రూపాయల పెట్టుబడులు వస్తున్నాయని, వేలాది ఉద్యోగాలు కల్పిస్తామని ఆర్భాటంగా ప్రకటించినా ఇంత వరకు వచ్చిన కంపెనీలు ఎన్ని? ఇచ్చిన ఉద్యోగాలెన్నో లెక్కచెబితే బాగుంటుంది. పోనీ వచ్చిన ఆ ఉద్యోగాల్లో తెలంగాణ ప్రజలకు కల్పించబడిన వాటా ఎంతో నిగ్గుతేలాల్సి ఉంది. అసలు అంత పెద్ద కంపనీలు, వాటి నియామక విధానాలు స్థానికులకు ఉద్యోగ కల్పన చేసేవిధంగా ఉంటాయా? ఆంధ్ర వలస పాలనా విధానాల మూలంగా మూసేయబడిన రిపబ్లికన్ ఫోర్జ్, ప్రగాటూల్స్, అల్విన్, ఎపి స్కూటర్స్, స్పాంజ్ఐరన్, సిర్‌పూర్ కాగజ్‌నగర్ మిల్లు, బోధన్ చక్కర ఫ్యాక్టరి , అజంజాహి మిల్లు వంటివి తెలంగాణ

రాగానే తెరిపిస్తామనే ప్రగల్భాలు ఎక్కడపోయినవి? జిల్లాల్లో పరిశ్రమల ఏర్పాటు అనే ఊసు ఉందా ఎక్కడైనా?

మిషన్ కాకతీయ నిజంగా చాలా మంది చేత ప్రశంసించబడిన పథకం. చెరువులు బాగుపడితే ఊరు బాగుపడి బతుకులు బాగుపడతాయని వేలకోట్ల రూపాయలతో పూడికతీత, కట్టల పోత బాగానే జరిపారు. మరోవైపు వాగులు వంకలు పాడైయ్యేలా ఇసుక తవ్వకాలను జోరుగా జరుపుతున్నారు. అడవులను, కొండలను ధ్వంసం చేశాక చెరువుల్లోకి నీరెలావస్తుంది? మిషన్ కాకతీయ చెరువులను కొంతబాగు చేసిన మాట నిజమే కాని, కాంట్రాక్టర్లను, ట్రాక్టర్ల, బుల్డోజర్ల, జెసిబిల, పొక్లైన్ ఓనర్లకు మరింత కాసుల పంట పండించిందనేది మరింత నిజం. ఇక మిషన్ భగీరథ ప్రభుత్వం అత్యంత ప్రతిష్టాత్మకంగా ఓట్లు కురిపిస్తరని అన్ని గ్రామాలకు తాగు నీరందించేందుకై చేపట్టిన పథకం. నిజానికి గ్రామీణ ప్రాంతాల్లో 70శాతానికి పైగా ఏదో రూపంలో తాగు నీరందుతూనే ఉన్నది. రాజశేఖర రెడ్డి కాలంలో ఎక్కడ చూసిన కాల్వల తవ్వకం కన్పించినట్లు, చంద్రశేఖర్‌రావు గారి పాలనలో ఎక్కడ చూసిన మిషన్ భగీరథ పైపులే కన్పిస్తున్నాయి. ఆ పైపుల్లో నీరు పారుతుందో, ప్రజల గొంతు నిండుతుందో తెలియదు కాని పైపుల కంపెనీల యజమానులకు మాత్రం కాసుల వరద మాత్రం పుష్కలంగానే ఉంది. ఈ మిషన్ భగీరథ పూర్తయిన కొన్నాల్లకే ప్రైవేటు సంస్థలకు అప్పగించి వాడకం దార్ల రుసుము వసూలు చేయడం తథ్యం. నిపుణుల అభిప్రాయం ప్రకారం 16 వేల కోట్లతో పూర్తి చేయదగిన పనులను 46 వేల కోట్లతో చేపట్టడం అనేక అనుమానాలకు తావిస్తున్నది.

డబుల్ బెడ్‌రూం ఇళ్ల హామీ గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. అప్పటి వరకు పాత ప్రభుత్వాలు కట్టించిన ఇళ్లన్ని అగ్గిపెట్టెల్లా ఉన్నాయని, అద్భుతమైన డబుల్ బెడ్‌రూం ఇళ్లను తెలంగాణ రాష్ట్రంలో పేదలకు నిర్మిస్తామని ఎన్నికల హామీల్లో భాగంగా చెప్పిన టిఆర్ఎస్ ఇవాళ ముఖం చాటేస్తున్నది. రెండున్నర లక్షల ఇళ్లను కట్టిస్తామని చెప్పినా మూడేళ్లలో రెండువేల ఇళ్లుకూడా ఇంత వరకు నిర్మాణం జరగలేదు. ప్రచారమేమో డబుల్, నిర్మాణమేమో నిల్ అన్నట్టుగా ఉన్నది ప్రభుత్వ వ్యవహారశైలి. కెజి టు పిజి ఉచిత విద్య అన్న నినాదం కాలగర్భంలో కలిసిపోయినట్టే! నాలుగు వేల పాఠశాలల్ని మూసి వేయాలనే నిర్ణయం బడుగు బలహీన వర్గాలకు శరాఘాతంగా మారబోతున్నది. ఇబ్బడి ముబ్బడిగా గురుకుల విద్యాలయాలను ఒకవైపు ప్రకటిస్తూనే మరోవైపు ప్రైవేటు విశ్వ విద్యాలయాలకు రంగం చేస్తున్నది తెలంగాణ ప్రభుత్వం. విశ్వ విద్యాలయాలను పూర్తిగా తమ నియంత్రణలోకి తెచ్చుకోవాలని, ముఖ్యమంత్రే చాన్స్‌లర్‌గా ఉండేలా చట్ట సవరణ చేయాలని ప్రయత్నించి రేండేళ్ల విసిలు, పాలక మండళ్లను నియమించకుండా వాటి స్వతంత్రతను నిర్వీర్యపరిచేలా వ్యవహరించింది.

ఇప్పటి రాష్ట్రంలో ఉన్న విశ్వ విద్యాలయాల్లో 70 శాతానికి పైగా అధ్యాపక, అధ్యాపకేతర పోస్టులు ఖాళీగా ఉన్నాయి. గురుకులాలు పెద్ద సంఖ్యలో రావడం వల్ల ఉన్న విద్యాలయాల మనుగడ ప్రశ్నార్థకంగా మారుతుంది. ఉమ్మడి రాష్ట్రంలో ఉపాధి ఉద్యోగం లేకుండా ఉన్న యువత స్వరాష్ట్రంలోనైనా కొలువులు దొరుకుతాయనే ఆశతో ఉద్యమంలో మమేకమయ్యారు. అసలు ఉద్యమ బలం పెరిగిందే నీళ్లు, నిధులు, నియామకాలు ఉంటాయనే బరోసాతోనే కదా. లక్షలాది ఉద్యోగాలను సీమాంధ్రవాళ్లు తరలించుకపోయారని ఉద్యమం సందర్భంలో ప్రచారం చేసినా కోల్పోయిన ఉద్యోగాలు కాకపోయినా, కనీసం ఖాళీగా ఉన్న వాటిని భర్తీ చేసినా ఏవో అవకాశాలు వస్తాయనుకున్న యువతకు తీవ్ర నిరాశే ఎదురైంది. ఇంటికో ఉద్యోగం అన్నారు, ఊరుకో ఉద్యోగం కూడా రాలేదు. లక్షా ఏడు వేల ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయని అసెంబ్లీలోనే అధికారికంగా ప్రకటించినా మూడేళ్లు గడిచినా ఇరవై వేల ఉద్యోగాలు కూడా ఇవ్వలేదు. జరిగిన ఉద్యోగ పరీక్షలు కూడా అనేక వివాదాల్లో ఇరుక్కుపోయినాయి. ఇదిగో అదిగో అంటూ డి.ఎస్.సిపై పదిసార్లు ప్రకటనలనతో ఊరించారే కాని వాస్తవ రూపందాల్చలేదు, డి.ఎస్.సి హామీ రూపుదాల్చకపోగా విద్యావాలంటీర్ల నియామకం మాత్రం చేస్తున్నారు. కాంట్రాక్టు ఉద్యోగాల రెగ్యులరైజేషన్ కూడా అరకొరగా కొనసాగుతున్నది. న్యాయపరమైన చిక్కులు ఉన్నాయంటూ క్రమబద్ధీకరణ విషయంలో తాత్సారం చేస్తున్నది. ఆ చిక్కులను పరిష్కరించే బాధ్యత తనది కాదన్నట్టుగా తప్పించుకో చూస్తున్నది.

బతుకు భద్రతను ఇచ్చే బరోసాను ఇవ్వకపోగా రాజకీయ నిరుద్యోగులకు మాత్రం 'ఉపాధి' కల్పించే పనిని జోరుగా చేస్తున్నది. ఎంఎల్‌సిల సంఖ్యను యుద్ధ ప్రాతిపదిక పెంచడమే కాకుండా, ఎంఎల్ఏల సంఖ్యను కూడా పెంచాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. ప్రజలకు అవసరమొస్తాయో లేదో కాని అనేక కార్పొరేషన్‌లకు అధ్యక్షులుగా ప్రజల సొమ్మును సోకులు చేస్కొండని పదవుల పందారం చేస్తున్నది. క్యాబినెట్ హోదాలో సలహాలను ఏమిస్తారో తెలియదు కాని పదుల సంఖ్యలో సలహాదారులను నియమిస్తున్నది. కులాలను మచ్చిక చేసుకునే పనిలోపడి గొర్రెలను, బర్రెలను ప్రకటిస్తున్నది. కాని అవేవి వారి సమగ్రాభివృద్ధికి ఉపకరించవని గమనించట్లేదు. కులాల భవన్‌లు నిర్మించి, కొద్ది మందికి పదవుల పంపకం చేస్తే సామాజిక న్యాయం జరిగినట్టు కాదు, పాలనలో వాటా దొరికట్టు అంతకంటే కాదు. మైనారీటి ఓటు బ్యాంకు కోసం హామీ ఇచ్చిన 12 శాతం రిజర్వేషన్లపై న్యాయ పరమైన అడ్డంకులను అధిగమించే, కేంద్రాన్ని ఒప్పించే చర్యలేవీ నిర్దిష్టంగా చేపట్టడం లేదు.

టి.ఆర్.ఎస్. మానిఫెస్టోలో 'చట్టబద్ద పాలన–పౌర హక్కుల' (పేజీ 30,31) అనే అంశం కింద ఇలా రాసుకున్నారు. 'ప్రజాస్వామికమైన కార్యక్రమాలను ఎవరు చేపట్టినా వారికెలాంటి అవరోధం లేని విధంగా వారి హక్కులు కాపాడే విధంగా పరిపాలన ఉంటుంది'. 'ప్రజలు శాంతియుతంగా, అహింసామార్గంలో ఉద్యమించే హక్కు అమలయ్యే వాతావరణం నిర్మిస్తుంది'. ఈ హామీని ఇంత త్వరగా ఏ ప్రభుత్వమూ కూడా తుంగలో తొక్కి ఆ హామీకి భిన్నంగా, అప్రజాస్వామికంగా వ్యవహరించిన ప్రభుత్వం లేదు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ప్రజాస్వామికమైనది కాని ప్రత్యేక రాష్ట్రంలో మాత్రం ప్రజాస్వామ్యం, పౌరహక్కులు ఏమీ ఉండవు. రాష్ట్రం కోసం ఎన్ని రూపాల్లో కొట్లాడినా, ఏమీ మాట్లాడినా రాజ్యాంగ పరిధికి లోబడిందే అయినపుడు ప్రత్యేక రాష్ట్రంలో ప్రజా సమస్యల పరిష్కారం కోసం గొంతెత్తడం నేరమెట్లయింది, అభివృద్ధి నిరోధకమెలా అయింది? పరిష్కారమేమోగాని అసలు మాకు సమస్యలు ఉన్నాయంటూ చెప్పుకునే అవకాశం ఇవ్వకపోవడం ఏ తరహా ప్రజాస్వామ్యమో పాలకులే సెలవివ్వాలి.

వలసపాలన దోపిడీ మయమైనదని, హక్కులు హరించబడ్డాయని ఇప్పుడున్న ప్రభుత్వాధినేత పౌరహక్కుల సభల్లో ఎలిగెత్తినవారే కదా! మరి ఇప్పుడు స్వంత రాష్ట్రంలో ఆ ప్రాథమిక హక్కులను మరింత నగ్నంగా, అధ్వాన్నంగా ఉల్లంఘించడం ద్వారా, భూనిర్వాసితులు సభ పెట్టుకుందామన్నా, శాంతి యుతంగా జరప తలపెట్టిన నిరుద్యోగుల నిరసన ర్యాలికి అనుమతి నిరాకరించడం ద్వారా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్

పాలకులకంటే అధ్వాన్నమయిన, అప్రజాస్వామిక పాలన అనిపించుకుంటున్నారు. అక్రమ అరెస్టులు, నిర్బంధాలు షరామామూలు అయిపోయింది. ఉద్యమ నాయకుని ఇంటిమీద సైతం అర్ధరాత్రి పోలీసులు దాడిచేసి తలుపులు విరగ్గొట్టి మరీ అరెస్టులు చేయడం వంటి దుర్మార్గమైన చర్యలు వలస పాలనలో కూడా జరగలేదు.

ప్రశ్నిస్తే, మాట్లాడితే తెలంగాణ అభివృద్ధిని అడ్డుకుంటున్నారని, ఆంధ్రా తొత్తులని ముద్రవేసే యత్నాలు జరుగుతున్నాయి. బహుశా బంగారు తెలంగాణలో పౌరహక్కులు, ప్రశ్నించే స్వేచ్ఛలుండవేమో! వేలాది ధర్నాలకు, నిరసన కార్యక్రమాలకు వేధికైన హైద్రాబాద్‌లోని ఇందిరా పార్క్‌కు సమీపాన ఉన్న ధర్నా చౌక్‌ను ఎత్తివేసి ఎక్కడో మారుమూలన మీ ఏడుపేదో ఎవరి కంటా పడకుండా ఏడవండి అని నిరసన తెలిపే ప్రజాస్వామిక హక్కును సైతం కాలరాసింది. దీన్ని వ్యతిరేకిస్తూ జరిగిన శాంతియుత ర్యాలీపైన స్థానికులను రెచ్చగొట్టి మఫ్టీలో పోలీసులనే స్థానికులుగా నిలబెట్టి నిరసనకారులతో చిల్లర గొడవకు దిగే స్థాయికి దిగజారింది ప్రభుత్వం. ప్రజాస్వామిక వాతావరణాన్ని చిన్నాభిన్నం చేయడం, ఉద్యమ విలువల్ని విధ్వంసం చేయడం ద్వారా ప్రజల ఆశలన్నీ అడియాసలైనాయి. నయీం కేసులో డైరీలో పేర్కొన్న రాజకీయ నాయకుల పేర్లను బహిర్గతపర్చకుండానే ఏదో కొద్దిమంది పోలీసు అధికారులను సస్పెండ్ చేసి చేతులు దులుపుకున్నది.

అనేక సామాజిక పోరాటాలకు నిలయమైన తెలంగాణ నేలపైన ఇటీవల కొన్ని వికృత పోకడలను చూడవల్సివచ్చింది. ప్రేమించినందుకు మంథనిలో దళితుడైన మధుకర్ హత్య, కులాంతర వివాహం చేసుకున్నందుకు భువనగిరి నరేష్, స్వాతిల హత్య, ఆత్మహత్యలు వారి వ్యక్తిగత, కుటుంబ నేపథ్యంలో జరిగినవి కావు. సమాజంలో పాతుకొనిపోయిన సామాజిక కుల వివక్షలో భాగంగా జరిగినవి. భారతీయ సమాజ నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ ప్రభావంతోనే పరువు హత్యలుగా చెప్పబడే ఈ పచ్చినేరాలు జరుగుతున్నాయి. మరోవైపు యజ్ఞయాగాలతో ఆ కుల వ్యవస్థను సృష్టించిన బ్రాహ్మణీయ, మనువాద భావజాలం మరింత బలపడేలా రాష్ట్ర ప్రభుత్వ పెద్దలు వ్యవహరిస్తున్నారు. లాభాదాయకమైన కాంట్రాక్టులన్నీ ఆంధ్రవారికే కట్టబెడుతున్న వైనం ఏ లాలూచిని సూచిస్తోందోమరీ? అన్నింటా నెంబర్‌వన్ అని, మిగులు ఉన్న రాష్ట్రమని చెప్పుకుంటూ ఫీజు రీయింబర్స్‌మెంట్ మాత్రం విడుదల చేయరు? రైతుల ఋణమాఫీ ఎంతకూ జరగదు. ఉద్యోగుల పిఆర్‌సి బకాయిలు ఇవ్వరు. ఏడాడికి రెండు సార్లు రావాల్సిన కరువు భత్యం ఏడాదైనా ప్రకటించరు.

ప్రజల మొక్కులు చెల్లించడమేమోకాని వ్యక్తిగతంగా మొక్కిన మొక్కులు తీర్చడానికి మాత్రం 'లౌకిక' సంపదను కోట్ల రూపాయలు కేటాయిస్తారు. ప్రచార ఖర్చులు, దుబారా వ్యయానికి మాత్రం అంతే ఉండదు. కోట్లాది రూపాయలతో క్యాంపు ఆఫీసుల పేరుతో ఇంద్రభవనాలు నిర్మించడం, అవసరం లేకపోయినా వాస్తు పేరుతో వందల కోట్ల రూపాయల ప్రతిపాదనలతో కొత్త సెక్రటేరియట్ నిర్మించాలనే ఆలోచనలు ఏమాత్రం ప్రజా ప్రయోజనాలకు అనుగుణంగా లేవు. కొత్త జిల్లాల ఏర్పాటు శాస్త్రీయంగా, ప్రజా అవసరాలు తీర్చడం కంటే వారిపైన పెత్తనం చేయడానికే ఎక్కువగా పనికి వస్తున్నది. ప్రజా ప్రయోజనాలు, అభివృద్ధి ప్రాతిపదికనకంటే పాలకుల, నాయకుల ప్రయోజనాలకు అనుగుణంగా కొత్త జిల్లాలు ఎర్పరిచినట్టు అనిపిస్తున్నది.

ఎలాంటి చర్చ, అభిప్రాయ సేకరణ లేకుండానే జోనల్ వ్యవస్థ రద్దు నిర్ణయాన్ని ప్రభుత్వం ఏకపక్షంగా ప్రకటించింది. వెనకబడిన ప్రాంతాల ప్రజలకు వివిధ ఉద్యోగ నియామకాల్లో కొంత న్యాయం జరిగి, వారికి ప్రాతినిధ్యం పెరగడానికి ఉపకరించిన జోనల్ వ్యవస్థ రద్దు ప్రజాభిప్రాయంతో సంబంధం లేకుండానే జరిగింది. ఎస్‌సి, ఎస్‌టి ఉప ప్రణాళికకు చట్టబద్ధత సంక్రమింపచేసి అమలు అయ్యేలా చూడాలనుకోవడం అహ్వానించదగినదే అయిన కేటాయింపులన్నీ క్షేత్రస్థాయిలో లక్ష్యాలను నెరవేర్చేలా అధికార యంత్రాంగం వ్యవహరిస్తుందా అనేది అనేక అనుభవాల రీత్యా అనుమానస్పదం. బడ్జెట్‌లో బారెడు కేటాయింపులు చేసిన ఆచరణలో ఖర్చుపెట్టేది మూరెడు, ప్రజల జీవితాల్లోకి చేరేది చారెడు మాత్రమే అనేది గత అనుభవమే.

కళ్యాణలక్ష్మి, షాదీముబారక్ వంటివన్నీ వన్‌టైం ఈవెంట్‌లే తప్ప వాటి ప్రభావం ప్రజాజీవితంపైన పెద్దగా ఉండదు. సంక్షేమ పథకాలు ఊతకర్రల్లాంటివే తప్ప వాటికవే అభివృద్ధికరమైనవి కావు. సంక్షేమ రాజ్య ఆచరణల్లో ప్రజా సంక్షేమం అంటే శ్రమ జీవుల చేతుల్లో సృష్టించబడిన సంపదంతా కొద్ది మంది చేతుల్లో కేంద్రీకృతమై ప్రజలకు ఏవో కొన్ని తక్షణ ప్రయోజనాలు కల్పిస్తూ వాటిని దీర్ఘకాలిక అభివృద్ధిగా భ్రమింపజేస్తున్నారు. ప్రజలను ఓటు బ్యాంకుగా మలిచే సంక్షేమ పథకాలకే మానవీయ ముసుగు కప్పి అద్భుతమైన పథకాలుగా ప్రచార భజన చేసుకుంటున్నారు పాలకులు. ఈ ప్రభుత్వానికి యువజన పాలసీ ఏమిటో తెలియదు. ఏ సమాజానికైన వెన్నుముకలాంటి యువతకు ఎలాంటి బతుకు బరోసాను కలిగిస్తారనే దానిపై ఆధారపడి దాని శక్తియుక్తులను నిర్మాణాత్మకంగా ఉపయోగించుకోవచ్చు. యాభై లక్షలకు పైగా యువత కలిగిన తెలంగాణలో విద్యావంతులైన నిరుద్యోగులు, అంతగా విద్యలేని నిరుద్యోగులు, నిపుణత కలిగిన నిరుద్యోగులు, పాక్షిక నైపుణ్యం కలిగిన నిరుద్యోగులు ఉన్నారు. వీరందరికి ప్రభుత్వ ఉద్యోగాలు ఇపుడున్న అభివృద్ధి నమూనాలో ఎలాగూ సాధ్యం కాదు. కనీసం వీరికి ఏఏ రూపాల్లో ఉపాధిని, భవిష్యత్తుపై విశ్వాసం కలిగేలా ఏ ప్రణాళికలు చేపట్టారో, అవి ఆచరణలో ఎక్కడ ఉన్నాయో అనే అంశంలో ప్రభుత్వం ఇంకా చీకట్లోనే ఉన్నది. ఉద్యోగాల సంగతి అలా ఉంటే క్రీడాకారులుగా రాణించాలనుకునే ఔత్సాహిక యువతకు తీవ్రనిరాశే ఎదురౌతున్నది. ఎదో గెలిచిన వాళ్లకు కోట్ల రూపాయలు గుమ్మరించే ప్రచారార్భాటాలు తప్ప అసలు గెలుపు గుర్రాలుగా తయారు చేయాలన్న సోయి ఏమాత్రం లేదు.

ఉత్తర తెలంగాణలో చాలా ప్రాంతాలను బొందల గడ్డలుగా మార్చే ఓపెన్‌కాస్టు గనుల విధానాన్ని ఉద్యమ సందర్భంలో తీవ్రంగా వ్యతిరేకించిన టిఆర్ఎస్ అధికారంలోకి వచ్చాక యూ టర్న్ తీసుకున్నది. ఓపెన్‌కాస్టు విధానానికి వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజా ఉద్యమాలపై స్పందించకుండా తన ద్వంద్వ వైఖరిని బయటపెట్టుకున్నది. ప్రాజెక్టుల పేరుతో ప్రజలను ఒప్పించి భూసేకరణ జరిపే బదులు భయపెట్టి పోలీసువారి చేత రెవిన్యూ పనులు చేయిస్తున్నది. దానికి మల్లన్నసాగర్ ప్రాజెక్టు ప్రత్యక్ష ఉదాహరణ. 2013 భూసేకరణ చట్టాన్ని సైతం తనకు అధికారం లేనప్పటికి సవరించి మరీ తను వెలువరించిన జి.ఓ. ప్రకారమే నష్టపరిహారం చెల్లిస్తున్నది. ప్రాజెక్టు నిర్మాణం, పారిశ్రామిక అవసరాలు భూ బ్యాంకుల పేరుతో తన ఇచ్ఛానుసారం జి.ఓ. 123ను తీసుకొస్తే ప్రజలు ఉద్యమించడమే కాకుండా కోర్టును ఆశ్రయించి కొట్టేయించారు. భూసేకరణ పేరుతో ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు భూ మాఫియా కంటే మించిపోయింది. 2013 భూసేకరణ చట్టంను సవరించిన 2016 బిల్లును ఆగమేఘాలమీద అసెంబ్లీలో ఆమోదింపజేసుకున్నది.

కోట్లాది రూపాయల విలువైన మియాపూర్ భూముల కుంభకోణానికి సంబంధించి రాజకీయ నాయకత్వాన్ని కాపాడుతు ఉద్యోగులను మాత్రమే

# పశువధ నిషేధ చట్టం పూర్వాపరాలు

***పశువధ నిషేధ చట్టం వెనుక బిజెపి స్వార్థ రాజకీయార్థిక కారణాలు ఉన్నాయనీ, ఈ చట్టం ముఖ్య ఉద్దేశం దళిత, మైనారిటీలను ఆర్థికంగా దెబ్బతీసి కార్పొరేట్ సంస్థలకు లాభాలు చేకూర్చడమేననీ అంటున్నారు ఎం. కె. కుమార్***

పశువధపై నిషేధం చేసిన మోడీ సర్కార్ ఒక రహస్య ప్రణాళికను అమలు చేయడానికి శ్రీకారం చుట్టినట్టు తెలుస్తోంది. అలాగే ఆవు రాజకీయం ద్వారా రాబోయే ఎన్నికల్లో లబ్ది పొందాలని బిజెపి చూస్తోంది. ఆవు మాత్రమే హిందువుల పవిత్ర జంతువుగా ఇప్పటివరకు ప్రచారం చేస్తూ వస్తున్న ఆర్ఎస్ఎస్ శక్తులు ఆవుతో పాటు గేదె, ఎద్దు, ఒంటెలకు కూడా పవిత్రత ఆపాదించడం వెనుక బిజెపి ఎత్తుగడను సులభంగానే అర్థం చేసుకోవచ్చు. పశువధ నిషేధ చట్టం ముఖ్య ఉద్దేశం కోళ్లు, మేకలు, గొర్రెల మాంసాన్ని ఆనందంగా భుజించవచ్చని దేశ ప్రజలకు చెప్పడమే. జంతు బలుల నిషేధాన్ని పటిష్టంగా అమలు చేయని అధికారిక వర్గం జంతువుల పట్ల ప్రేమ తనకు లేదని తెలుస్తోంది. అందుకే మాంసంపై నిషేధాన్ని మాత్రం అమలు చేయడం లేదు. వివాదాస్పదమైన నిర్ణయం వెనుక జిఎస్‌టి బిల్లుపై అర్థవంతమైన చర్చను అపివేయడానికి ఉపయోగపడుతుంది.

ప్రతి పౌరుడి నెత్తిపై పన్ను భారం మోపడానికి, చిన్న వ్యాపారస్థున్ని సైతం పన్నుతో వేధించడానికి జిఎస్‌టి చట్టం-2016 ఉపయోగ పడుతుంది. ఈ ఆర్థికదోపిడీ వల్ల దేశీయ పారిశ్రామిక రంగం ఒక్క కుదుపుకు లోనవుతుంది. సేవారంగ ప్రాముఖ్యతను మరింత పెంచుతుంది. బహుళజాతి సంస్థల కబంధ హస్తాలలో దేశీయ ఆర్థిక వ్యవస్థను ఉంచడానికి జిఎస్‌టి ఉపయోగపడుతుంది. పశువధ నిషేధం వల్ల దేశీయ పాడి పరిశ్రమ ఘోరంగా దెబ్బతిననుంది. అందుకే జంతువులను పవిత్రం చేసే కుట్ర పెరిగిపోయి, మనుషుల ప్రాణాలకు విలువ తగ్గే విధంగా మోడీ ప్రభుత్వ విధానాలుంటున్నాయి.

ఆవు పవిత్రమైన జంతువుగా మారడం వెనుక ఒక వ్యవస్థ రద్దు ఉంది. ఇనుము కనిపెట్టిన తర్వాత వ్యవసాయంలో ఉత్పత్తి అధికమైంది. నాగలి దున్నడానికి పశువుల అవసరం ఏర్పడింది. బౌద్ధం, జైనం అహింసా ధర్మాన్ని పాటించమని, యజ్ఞ, యాగాదుల పేరుతో పశువులను పెద్దఎత్తున వధించడం ఆపాలని పిలుపు నిచ్చింది. ఇది యజ్ఞాలకు వ్యతిరేకమైన పోరాటంగా రూపుదిద్దబడింది. భయపడ్డ వైదికమతం జంతువధను అనివార్యంగా నిషేధించాల్సి వచ్చింది. వ్యవసాయ పురోగమనానికి తోడ్పాటును అందించడానికి, వ్యవసాయ ఆర్థిక సమాజంపై పట్టు సాధించడానికి బ్రాహ్మణ మతం చేసిన అయిష్టమైన చర్య ఇది. అందుకే నందికి అపారమైన పవిత్రత ఇవ్వబడింది. వ్యవసాయంలో ఎద్దు కన్నా ఆవు పాత్ర ముఖ్యమవడం, పశుపోషణ విస్తరించడం జరిగింది. తర్వాతి క్రమంలో నంది స్థానంలో ఆవు చేరింది. ప్రస్తుతం ఆవు స్థానంలో ఒంటె వచ్చి చేరింది. ఎందుకంటే ఒంటె మాంసాన్ని ఇస్లాం ప్రజలు ఎక్కువగా భుజిస్తారని వీరి భావన. చివరికి దున్నపోతును పశువధ నిషేధంలో చేర్చారు. యమధర్మరాజు వాహనమైన దున్నపోతు సైతం పశుపోషణ, వ్యవసాయ సమాజాలలో ప్రముఖమైన పాత్ర పోషించింది. పాడిపరిశ్రమలో దున్నపోతుకు విశిష్టమైన స్థానం ఉంది. విదేశీ పాడీ పరిశ్రమల అభివృద్ధికి ఇది ప్రధాన అడ్డంకిగా

---

బాధ్యులుగా చేయజూస్తున్నది. ప్రపంచంలోనే అత్యంత ప్రమాదకరమైన పారిశ్రామిక వ్యర్థాలను వెదజల్లే ఫార్మా కంపెనీల కోసం ఫార్మాసిటి పేరుతో హైదరాబాద్ సమీపంలో పదివేల ఎకరాల భూమిని సేకరించే పనిలో ఇన్వెస్ట్‌మెంట్ మాన్‌ఫ్యాక్చరింగ్ జోన్(ఎన్ఐఎంజె) పేరుతో భారీ పారిశ్రామిక ఉత్పత్తి మండలాలుగా అంతర్జాతీయ మౌలిక సదుపాయాల పేరుతో అనేక రాయితీలు, పన్ను మినహాయింపుతో ఏర్పడి వేల కోట్ల రూపాయల పెట్టుబడితో లక్షల ఉద్యోగాలు వస్తాయని ఊదరగొడుతున్నారు. దేశంలో పదహారు (ఎన్ఐఎంజె) లకు ఆమోదం లభిస్తే రెండు తెలంగాణలో ఏర్పాటు కాబోతున్నాయి. మెదక్ జిల్లాలో 12,500 ఎకరాల భూసేకరణ పనులు జరగుతున్నవి. ఇవి కూడా గతంలో దేశ వ్యాప్తంగా ఏర్పాటయిన ప్రత్యేక మండలాల ఏర్పాటును ప్రభుత్వాలు ఎట్లా ఊదరగొట్టి భూములను సేకరించినవో ఇవాళ అదే జరగబోతున్నది.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 107 సెజ్‌ల్లో 70 తెలంగాణాలోనే ప్రతిపాదించారు. 50 లక్షల ఉద్యోగాలు వస్తాయని ఆనాటి ప్రభుత్వాలు ప్రచారం చేస్తే యాభైవేల ఉద్యోగాలు కూడా రాలేదన్నది వాస్తవం. ఇవాళ (ఎన్ఐఎంజె) కూడా అంతకన్నా భిన్నంగా ఉండబోవు. పాలనలో ఉద్యమ శక్తుల భాగస్వామ్యం ఏమో గాని అసలు ఉద్యమ శక్తుల ఆనవాళ్లు ఏవీ ఉండకూడదనే వైఖరిని ప్రదర్శిస్తున్నది ప్రభుత్వం. ప్రతిపక్షాలు, ప్రజా సంఘాలు అవసరం లేనంత అద్భుత ప్రగతి ఏదో జరగుతున్నట్లు వ్యవహరిస్తున్నారు పాలకులు. మొత్తంగా ఉద్యమ చైతన్యాన్ని నీరుగార్చి, ప్రశ్నించే గొంతుల్ని అణిచివేసి పౌర సమాజాన్ని మొత్తాన్ని గుప్పిట్లో పెట్టుకునే పోలీసు నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నది. తాము కలవాలను కున్నవాళ్లతోనో, తమకు ప్రయోజనాలను కలిగించే వాళ్లను మాత్రమే ప్రభుత్వ పెద్దలు కలవడం జరుగుతున్నది తప్ప మొత్తంగా ప్రజలు తమ గోడును వినిపించుకుందామంటే కలిసేనాదుడే కరువైండు. ఉద్యమానుభవంతో పరిపాలకులు వస్తే ప్రజలకు చేరువవుతారనే అనుకుంటాం తప్ప అంతా మాకు తెలుసు, ఏం చేయాలో కూడా మాకే తెలుసు అనే ధోరణి ఇవాల రాజ్యమేలుతుంది. ఈ నేపథ్యంలోనే పాలనను ప్రజలకు మరింత చేరువ చేసేలా, ఉద్యమ క్రమంలో ప్రకటించబడ్డ అనేక ప్రజా ఆకాంక్షలు సాఫల్యం చెందేలా అసలుసిసలైన ప్రజాస్వామిక తెలంగాణాకై ఉద్యమించాల్సిన చారిత్రక బాధ్యత పోరాడే ప్రజల్ని ముందుకు నెడుతూనే ఉంటుంది.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

మారింది. అందుకే పంది మాంసాన్ని నిషేధించకుండా పాడిపరిశ్రమకు వెన్నెముకైన పాలిచ్చే జంతువుల వధనే నిషేధించడం జరిగింది. ప్రపంచంలోని ఇస్లాం మతస్తులకు ఒంటె మాంసం ఇష్టమైనది. కాబట్టి ఒంటె మాంసాన్ని నిషేధించడం ద్వారా ముస్లింలు ఇష్టంగా భుజించే సాంస్కృతిక ఆహారపు అలవాటుపై దెబ్బకొట్టాలని చూస్తున్నారు.

పాల ఉత్పత్తిలో విశేషంగా ఉపయోగడపడే ఆవు, బర్రె ఒకానొక దశలో వట్టిపోయి పాలను ఇవ్వలేకపోతాయి. వీటిని రైతులు పశువధ శాలలకు అమ్మి మరో పాలిచ్చే ఆవు, బర్రెలను కొనుక్కుని తమ పెట్టుబడిని తగ్గించుకుంటారు. పునరుత్పత్తిని కోల్పోయిన జంతువులను వధశాలలకు అమ్మడం సంప్రదాయంగా వస్తున్నది. ఈ వట్టిపోయిన జంతువులను రైతులే వాటి మరణాంతరం వరకు భరించాలంటే, సగటు రైతు పాల ఉత్పత్తి నుండి తప్పుకోవడమే అవుతుంది. జంతువుల మీద ముఖ్యంగా పాలిచ్చే జంతువుల మీదే మోడీ సర్కారుకు అమితమైన ప్రేమ ఉంటుంది. కోళ్లు, మేకలు, గొర్రెలు, కుందేలు వారికి జంతువులుగా కనబడకపోవడం విడ్డూరం. కుక్కలను ప్రేమించే చాలామంది ఎగువ, మధ్యతరగతి ప్రజలు మేకలను, కోళ్లను మాత్రం ఇష్టంగా భుజిస్తుంటారు. ఇదే జంతుప్రేమని వారు ఉపన్యాసాలు దంచేస్తుంటారు. వ్యవసాయంలో జంతువుల బదులు నూతనసాంకేతిక పనిముట్లను ఎవరైనా కోరుకుంటారు. ట్రాక్టర్, వరికోత యంత్రాలను కూలీల ఉపాధి పొట్టకొట్టనంత కాలం ఆహ్వానించవలసిందే. ఎందుకంటే వ్యవసాయంలో జంతువులను రైతులు ఎంతో కొంతమేరకు హింసకు గురిచేయాల్సి వస్తుంది. అదే సమయంలో ఆ దుక్కి దున్నే ఎద్దులకు ఎమైనా రైతు విలవిల లాడిపోయేవాడు. అంటే పెట్టుబడితో కొన్న ఆ జంతువుల పట్ల లాభాపేక్ష కన్నా, మానవీయమైన సంబంధాలను రైతు నెరిపేవాడు.

మనుస్మృతి కాలం నుండి చర్మకారులైన దళితులను జంతు హంతకులుగా పేర్కొనడం జరుగుతూ వస్తోంది. నిజానికి వారు సామాజిక శాస్త్రవేత్తలు. జంతు కళేబరాలను స్మశానవాటికలకు తరలించే మానవీయులు. దీనికి ప్రతిఫలంగా వారు స్వీకరించేది కేవలం జంతువుల చర్మం మాత్రమే. కొయ్యనాగలి వ్యవసాయంలో ఉత్పత్తిని ప్రారంభించి నప్పుడు దున్నే ఎద్దులు వ్యవసాయ ఉత్పత్తిలో పాలుపంచుకున్నాయి. ఆ చారిత్రక దశ దాటి ఈరోజు ట్రాక్టరు వచ్చి వ్యవసాయాన్ని సులభతరం చేసింది. ఈ క్రమంలోను మరణించే జంతువుల పట్ల కనీస ప్రేమను కనబరిచి, వాటికి దహన సంస్కారాలు తీర్చే బాధ్యతను దళితులే భుజాన వేసుకున్నారు. స్వచ్ఛభారత్‌ను దళితులే వేల సంవత్సరాలుగా నిర్వహిస్తున్నారు. పశువధ నిషేధం అమలైతే సంతానోత్పత్తి కోల్పోయిన పాలిచ్చే జంతువుల ఆలనాపాలనా చూడటం సగటు రైతుకు ఏ మాత్రం సాధ్యమయ్యే పనికాదు. మరోవైపు విదేశీ పాడి పరిశ్రమను దీటుగా ఎదుర్కోలేక స్వదేశీ పాడి పరిశ్రమ కుదేలవుతుంది. గ్రామాలలో, పట్టణాలలో పాలిచ్చే జంతువులు గుంపులు, గుంపులుగా తిరుగు తుంటాయి. గోవు మీద ప్రేమ కన్నా, విదేశీ పాడి పరిశ్రమకు ఎర్రతివాచీ పరచడమే మోడీ ప్రధాన లక్ష్యం. అలాగే దళితుల, మైనారిటీలకు పెద్ద ఎత్తున ఉపాధి కోల్పోయేల చేసి, వారిని అగ్రకుల పెత్తనందారీలకు బానిసలుగా చేయడం ప్రధాన అంశం.

### ప్రత్యామ్నాయం ఏదీ?

వేల సంవత్సరాలుగా పశువు వ్యవసాయంలో కీలకపాత్ర పోషిస్తోంది. యాంత్రీకరణ పెరిగిన తర్వాత ఆహార వినియోగంలో మారిన అలవాట్లు, ప్రొటీన్ల ఆవశ్యకత పశుమాంసానికి విపరీతమైన గిరాకీని పెంచింది. వ్యవసాయానికి, పాడిపరిశ్రమకు ఉపయోగపడే పశువు ఇప్పుడు మాంసం ఉత్పత్తికి, ఎగుమతులకు ఉపయోగపడుతోంది. పశుసంపద వృద్ధికి ప్రభుత్వం సైతం అనేక పథకాలను ప్రవేశపెట్టాల్సి వచ్చింది. ఈ పథకాలు సైతం గ్రామీణ భారతంలో పాడిపరిశ్రమ వృద్ధికి ఉపయోగపడ్డాయి. దేశవ్యాప్తంగా 19.09 కోట్ల పశువులు ఉన్నాయని గణాంకాలు తెలుపుతున్నాయి. వీటిలో 1.61 కోట్ల దున్నపోతులు, ఎద్దులున్నాయి. ఇవి దేనికి ఉపయోగపడటం లేదు. అంతిమంగా ఇవి మాంసం ఉత్పత్తికి ఉపయోగ పడుతున్నాయి. 9.26 కోట్ల ఆవులు, గేదెలు వుండగా ఇవి మాత్రమే పాలిస్తున్నాయి. ఇవి కూడా ఒక దశవరకే పాలిస్తాయి. పునరుత్పత్తి తగ్గిపోయిన తర్వాత ఇవి సైతం పశువధశాలలకు తరలాల్సిందే. దేశవ్యాప్తంగా పశువులు తమ పాలు, మాంసం ద్వారా ఏటా 6 లక్షల కోట్ల విలువైన ఆర్థిక సంపదను సృష్టిస్తున్నాయి. దేశ జాతీయోత్పత్తిలో వీటి వాటా 5 శాతంగా ఉంటుంది. 1980లో వ్యవసాయరంగం స్థూల ఉత్పత్తిలో పశుసంపద నుండి 12 శాతం వచ్చేది. 2016లో స్థూల వ్యవసాయ ఉత్పత్తిలో పశువుల ద్వారా చేరిన సంపద 25.6 శాతానికి పెరిగినట్లు నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రీసెర్చ్ సెంటర్ ప్రకటించింది.

పశుమాంసం ఒక పెద్ద పరిశ్రమగా అవతరించిన తర్వాత పశు మాంసం కోసమే పశువుల్ని కొనడం, మేపడం జరుగుతోంది. పశు మాంసాన్ని ఎక్కువగా ఉత్పత్తి చేస్తున్న భారతదేశం అందులో 80 శాతం ఎగుమతులనే చేస్తుంది. దేశీయంగా పశుమాంసం చాలా స్వల్ప స్థాయిలో విక్రయించబడుతోంది. 2016లో అంతర్జాతీయంగా పశుమాంసాన్ని ఉత్పత్తి చేసిన దేశాలలో భారత్ 5వ స్థానంలో నిలిచింది. పశుమాంస వినియోగంలో మాత్రం 52 స్థానంలో నిలిచింది. మొత్తం పశుమాంస ఉత్పత్తిలో అమెరికా 18.83 శాతాన్ని ఆక్రమిస్తే, భారత్ 7.03 శాతాన్ని ఆక్రమించింది. ప్రపంచవ్యాప్తంగా ఏటా 6 కోట్ల మెట్రిక్ టన్నుల పశుమాంసం ఉత్పత్తి అవుతోంది. ఇందులో యునైటెడ్ స్టేట్స్ 113.89 మెట్రిక్ టన్నుల ఉత్పత్తిని, యురోపియన్ యూనియన్ 78 లక్షల మెట్రిక్ టన్నులు, చైనా 69 లక్షల మెట్రిక్ టన్నులను, భారత్ 42.50 లక్షల మెట్రిక్ టన్నుల పశుమాంసాన్ని ఉత్పత్తి చేశాయి. పశుమాంస ఎగుమతుల్లో ఇప్పటికీ భారతదేశం ప్రథమ స్థానంలో ఉంది. ప్రపంచ మొత్తం ఎగుమతులు 94.39 లక్షల మెట్రిక్ టన్నులు కాగా, భారత్, బ్రెజిల్ చెరో 19.50 లక్షల మెట్రిక్ టన్నుల పశు మాంసాన్ని ఎగుమతి చేస్తున్నాయి. తర్వాత స్థానంలో ఆస్ట్రేలియా, యుఎస్, న్యూజిలాండ్, కెనడా ఉన్నాయి. పశుసంపద వినియోగానికి ప్రపంచ దేశాలు సగటున ఏటా 17.4 పౌండ్లు వెచ్చిస్తున్నారు. ఇందులో ఉరుగ్వే, అర్జెంటీనా, హాంకాంగ్, అమెరికా, పాకిస్తాన్, సౌదీ అరేబియా, సింగపూర్ వరుస ప్రథమ స్థానాలలో ఉన్నాయి. భారత్‌లో పశుమాంస వినియోగానికి సగటు పౌరుడు ఏటా 4 పౌండ్లు మాత్రమే చెల్లిస్తున్నాడు. 53 దేశాల్లో పశుమాంస భక్షణ జరుగుతుంటే, అందులో భారత్ 52వ స్థానంలో నిలిచింది.

నిజానికి వధించే పశువులను 80 శాతం మార్కెట్ నుండే కొనుగోలు చేస్తున్నారు. ఈ నేపథ్యంలో రైతులు తమ పశువులను మార్కెట్లో అమ్మలేక ఇబ్బందులు పడతారు. తాజా నోటిఫికేషన్ వల్ల 22 మిలియన్ల ప్రజలు ప్రత్యక్షంగా నష్టపోతారు. పశుమాంసం విక్రయాల వల్ల భారత్ 26 వేల కోట్ల రూపాయలను ఆదాయంగా పొందుతోంది. 2016-17 వ సంవత్సరంలో ఆ ఆదాయం 2.4 శాతానికి తగ్గిపోయింది. పాడి రైతులకు 47 శాతం లాభం పశువులను అమ్ముకోవడం ద్వారానే

సంపాయిస్తున్నారు. 1951–2012 మధ్య పాలిచ్చే పశువుల సంఖ్య 150 శాతం పెరిగింది. ఆవులు, ఎద్దుల సంఖ్య కేవలం 22 శాతం మాత్రమే ఉంది. అంటే రైతులు ఆ మేరకు గోవుల నుండి పాలిచ్చే ఇతర పశువులను కొంటున్నారు. దేశంలో 45 శాతం ఆవు మాంసం దక్షిణాది రాష్ట్రాల నుండే ఉత్పత్తి అవుతుందని గణాంకాలు చెపుతున్నాయి. మొత్తం పశుమాంసంలో ఆవు మాంసం వాటా కేవలం 5 శాతం మాత్రమే. 2015–16లో 190 మిలియన్ల పశువుల్లో కేవలం 1.7 శాతం పశువులను మాత్రమే పశువధ శాలలకు తరలించారు. 5 మిలియన్ల పశువులకు ఆహారాన్ని అందించడానికి 11,607 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. రాష్ట్రీయ గోకుల్ మిషన్ –2014 ద్వారా ప్రభుత్వాలు ఇప్పటికి కేవలం రు.580 కోట్లు మాత్రమే ఖర్చు పెట్టి గోశాలలను నడుపుతున్నాయి. ఇందులో కేవలం గోవులు మాత్రమే ఉంటాయి. మిగిలిన పశువులు ఉండవు. దేశంలో 6,000 గోశాలలు ఉన్నట్లు కేంద్రం ప్రకటించింది. నిజానికి మున్సిపాలిటీ, కార్పొరేషన్లు ఒక గోవుకు సగటున ఒక రోజుకు రు. 40 ఖర్చు పెడుతున్నాయి.

భారత్‌లో పశువుల పెంపకం భారీ పరిశ్రమగా వర్ధిల్లుతోంది. పశువుల తోలుపైనా ఎక్కువ ఆదాయాన్ని భారత్ పొందుతోంది. విదేశీ మారక నిల్వలు ఏటా 4 బిలియన్ డాలర్లు భారత్‌లోకి పశుమాంస విక్రయం వల్ల వస్తోంది. అదే తోలు వస్తువుల ఎగుమతుల ద్వారా భారత్ ఏటా 13 బిలియన్ డాలర్లను పొందుతోంది. మాంసం ఎగుమతుల కన్నా తోలు ఎగుమతుల వల్లే భారత్ ఎక్కువగా ఆర్జిస్తోంది. పశువధ నిషేధం వల్ల మాంస, తోలు పరిశ్రమలు నష్టపోనున్నాయి. లక్షల సంఖ్యలో కార్మికులు వీధిన పడనున్నారు.

**పశువధ చట్టం అమలు సాధ్యమవుతుందా?**

గోమాంసాన్ని తింటున్నారనే నెపంతో మనుషులను చంపడం భారత్‌లోనే ఉంది. గో పరిరక్షణ దళాలు దేశవ్యాప్తంగా పశువుల కన్నా హీనంగా మనిషిని చూస్తున్నాయి. వీరి ఒత్తిడి మేరకు మోడీ గోవుతో పాటు మొత్తం పశువుల వధ విక్రయాన్ని నిషేధించారని ప్రచారం జరుగుతోంది. వ్యవసాయ పనులు, పాడిపరిశ్రమ కోసమే పశువులను వినియోగించాలని పాలకుల ఉద్దేశంగా ఉన్నట్లు బయటకి కనిపిస్తోంది. గోవు రాజకీయాల ద్వారా ముస్లింలపై దాడులు చేస్తున్న హిందూ మతోన్మాదులకు ఈ చట్టం మరింత ప్రోత్సాహన్నిస్తుంది. పశువులను కొనాలంటే సగటు యజమాని ఖచ్చితంగా రైతు మాత్రమే అయిండాలి. అలాగే పశువులను అమ్మడం జరగదంటూ హామీ పత్రాన్ని ఇవ్వాలి. 8 పేజీల కేంద్ర పర్యావరణ శాఖ నిబంధనల్ని తప్పకుండా పాటిస్తామని అఫడవిట్ ఇవ్వాలి.

**ముసలి పశువులను ఏం చేయాలి?**

పశువు జీవితకాలం సగటున 20 ఏళ్లు ఉంటుంది. 5 ఏళ్ల లోపే పునరుత్పత్తిని ప్రారంభించే పశువులు, గరిష్టంగా 10, 11 ఏళ్ల వరకు పాలను ఇస్తాయి. పోషక విలువలు గల ఆహారాన్ని పశువుకు అందించకలిగితేనే ఇది సాధ్యపడుతుంది. వట్టిపోయిన, ముసలి పశువులను రైతు సాకలేడు. ఎందుకంటే దానికయ్యే పెట్టుబడితో మరో పాలిచ్చే పశువును అతను సాకవచ్చు. ఈ విషయంపై కేంద్ర చట్టం ఎటువంటి స్పష్టతను కనపరచలేదు. పాలివ్వని పశువులను ఏం చేయాలనేది ఇప్పుడు రైతుల ముందున్న ప్రశ్న. సేద్యానికి ఎద్దు వాడకం తగ్గింది. ఎద్దుల బండ్లు గ్రామాల్లో కనబడటం లేదు. పశువుకు మగ లేదా ఆడ ఏ పశువైనా పుట్టచ్చు. అది రైతు చేతుల్లో ఉండదు. పాల ఉత్పత్తి కోసం ఆడ పశువులను రైతు ఇష్టంగా సాకుతాడు. వాటిని అమ్ముకున్నా ఎవరైనా పాలకోసం కొంటారు. మగదూడలను రైతులు ఏంచేయాలనేది పెద్ద ప్రశ్నై కుర్చొంది.

పశువుల పుట్టుకను నియంత్రించే శాస్త్ర పరిజ్ఞానం ప్రస్తుతం అందుబాటులో ఉంది. ఆడ పశువును, మగ పశువు దగ్గరకు సంభోగం ద్వారా తీసుకెళ్లి పునరుత్పత్తిని సాధించేవారు. ఇంజక్షన్‌తో గర్భాన్ని సాధించడం సులభతరంగా మారింది. ఈ విధానంలోనే కేవలం ఆడ పశువులను కనే విధంగా సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించే అవకాశాలున్నాయి. అంటే పాలిచ్చే జంతువులనే కనేవిధంగా సాంకేతికత ఉపయోగపడనుంది. ఇది దుర్మార్గంగా మగ పశువుల సంతతిని నిర్మూలిస్తాయి. ఇదే అంశాన్ని మనుషులకు వర్తింపజేస్తే, ఎంత క్రూరంగా ఉంటుందో ఆలోచిస్తేనే భయం పుడుతుంది.

పశువుల్ని స్థానికులే చంపితింటున్నారని వాదించే హిందూత్వ వాదులు ఇకనైనా కళ్లుతెరవాలి. భారత వాణిజ్యశాఖ నివేదికలు, అంతర్జాతీయ అధ్యయనాలు భారత్‌లో వినియోగం చాలా తక్కువని తేల్చేశాయి. కోట్లాది మంది పశు మాంస, తోలు పరిశ్రమల వల్ల ఉపాధి పొందుతున్నారు. వీరందరి నైపుణ్యాన్ని వినియోగించుకుని ఉపాధినిచ్చే శక్తిసామర్థ్యాలు కేంద్రప్రభుత్వానికి లేవు. పశువుకు, మనిషికి ఉన్న ప్రకృతిపరమైన సంబంధాన్ని కేంద్రం పరిగణలోనికి తీసుకోకుండా బహుళజాతి పాడి సంస్థల, హిందూ మతోన్మాదుల ప్రయోజనాల కోసం ఈ చట్టాన్ని తీసుకొచ్చింది.

**చట్టంలో ఏముంది?**

జంతు హింసా నిరోధక చట్టం–1960కి అనుబంధంగా 2017 మే 23న కేంద్ర ప్రభుత్వం కొన్ని నిబంధనలను జి.ఓ రూపంలో జారీచేసింది. వీటిని లైవ్‌స్టాక్ మార్కెట్స్ రెగ్యులేషన్ రూల్స్ –2017 గా పిలుస్తున్నారు. జంతు హింసా నిరోధక చట్టం సెక్షన్ 38(1) ప్రకారం కేంద్రం నిబంధనలను జత చేసినట్టు చెపుతోంది. రాజ్యాంగంలోని 7వ షెడ్యూల్‌లో రాష్ట్ర ప్రభుత్వాలు పశువుల ఆరోగ్య సంరక్షణ, నిర్వహణ వంటివి చూసుకోవాలని చెప్పబడింది. పురపాలక సంఘాలకు, పంచాయితీలకు కూడా పశుసంరక్షణ, డెయిరీ, పశువుల చర్మాన్ని శుద్ధి లాంటి అధికారాలు ఆర్టికల్ 243 ప్రకారం ఉంది. తమాషా ఏందంటే పీపీఏ యాక్ట్ (ప్రివెన్షన్ ఆఫ్ క్రూయాలిటీ టు యానిమల్స్)ను అమలు చేయాల్సిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలదే. తాజా నిబంధనలో క్యాటిల్ నిర్వచనంలో ఆవుతో పాటు, మిగిలిన పశువులను చేర్చారు. రాష్ట్రాల అభిప్రాయాలను పరిగణనలోనికి తీసుకోకుండా కేంద్రం ఈ చట్టం చేయడం సమాఖ్యరాష్ట్రాల స్ఫూర్తికి వ్యతిరేకం. పశుమార్కెట్లను ఇతర రాష్ట్రాల సరిహద్దుకు 25 కిలోమీటర్ల ఆవల ఉండాలి. ఇతర దేశాల సరిహద్దులకు 50 కిలోమీటర్ల ఆవల ఉండాలి. పశువులను హింసించే విధంగా అలంకరించకూడదు. పాలిచ్చే పశువులకు ఆక్సిటోసిన్ ఇంజక్షన్లు ఇవ్వకూడదు. 6 నెలలలోపు పశువులను సంతలో ఉంచకూడదు. 6 నెలల దాటిన పశువులను అమ్మేటప్పుడు మార్కెటింగ్ ఆఫీసర్‌కు, పశువును చంపమనే హామీ పత్రం ఇవ్వాలి. గోవధ నిషేధం కూడా రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల్లో చేర్చారు.

**నిరసనలు**

ప్రజల ఆహారఅలవాట్లపై నిరంకుశ వైఖరిని అవలంబిస్తున్న బిజెపి

ప్రభుత్వంపై సొంత పార్టీ కార్యకర్తలే తిరుగుబావుటా ఎగరేస్తున్నారు. కార్పొరేట్ ఏజెంట్‌గా పనిచేస్తూ, ఆర్ఎస్ఎస్ లాంటి మతతత్వ శక్తుల అడుగుజాడల్లో మోడీ ప్రభుత్వం నడుస్తుందని చెప్పడానికి పశువధ నిషేధ చట్టం ఒక తార్కాణం. మేఘాలయ రాష్ట్రానికి చెందిన ఇద్దరు బిజెపి రాష్ట్రస్థాయి నేతలు పశువధ నిషేధ నోటిఫికేషన్‌ను రద్దు చేయాలని బిజెపికి రాజీనామా చేశారు. బిజెపి ఉత్తర గారోహిల్స్ జిల్లా అధ్యక్షులు బచ్చూ మారక్, పశ్చిమ గారోహిల్స్ జిల్లా అధ్యక్షులు బెర్నార్డ్ మారక్ మీడియాకు తమ రాజీనామాలు చూపిస్తూ, బీఫ్ తినడం మా సంస్కృతిని, మా మనోభావాలపై పెత్తనం చెలాయించాలని చూస్తే మేం ఊరుకోమని తెగేసి చెప్పారు. ఆ రాష్ట్రంలో ఇప్పటికే బిజెపి నేతలు 200 మంది రాజీనామా చేశారు. మేఘాలయాలో బీఫ్‌ను నిషేధించమని, అది మా ఎజెండాలో లేదని మేఘాలయ రాష్ట్ర బిజెపి ఇన్‌ఛార్జి నలిల్ కోహ్లి చివరకు పత్రికా ప్రకటన ఇవ్వాల్సివచ్చింది. మేఘాలయలో 40 శాతం మందికి పైగా బీఫ్ తింటారు. అందులో హిందువులు సైతం అధికశాతంలో ఉన్నారు. రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకంగా నడుచుకుంటూ భారతీయ భిన్న సంప్రదాయాలను గౌరవించకుండా బిజెపి నిరంకుశ ఫాసిస్టు ధోరణులను అవలంబిస్తోంది.

బీఫ్ సమస్యను అతి పెద్ద ప్రధాన సమస్యగా చేస్తూ, లక్షల కోట్ల విలువైన బీఫ్ మార్కెట్‌ను కార్పొరేట్ శక్తులకు ధారాదత్తం చేయడంతో పాటు, హిందూ ఓటుబ్యాంకును సమీకరించుకోవడం బిజెపి శ్రేణులు చేస్తున్నాయి. పశువుల అక్రమ రవాణాకు, కళేబాలకు అమ్మేవారిని జాతీయ భద్రతా చట్టం, గూండా చట్టం కింద శిక్షించాల్సి వస్తుంది. దీనివల్ల మాంసం ఎగుమతి చేసే వ్యాపారుల కన్నా, పశువులను అమ్ముకునే రైతులే ఎక్కువగా నష్టపోవాల్సి వస్తుంది. పశువధను నిషేధించిన ప్రభుత్వం, పశుమాంస ఎగుమతులను నిషేధించలేదు. అలాగే పశుమాంసం తినడాన్ని నిషేధించలేదు కాబట్టి, పశుమాంసం మార్కెట్లో యథేచ్ఛగా దొరుకుతుందని విశ్లేషకులు అభిప్రాయ పడుతున్నారు. దీనివల్ల పశువులను కొని మాంసాన్ని అమ్ముకునే వ్యాపారులు ఆనందంగా ఉంటే, అమ్ముకునే పరిస్థితి లేక రైతులు, వ్యవసాయదారులు ఇబ్బందుల పాలవుతారు. సమాజాన్ని రెండు వర్గాలుగా చీల్చడానికి బిజెపి ప్రయత్నిస్తోంది. పశుభక్షకులు, పశురక్షకులుగా ప్రజల్ని చీల్చి కాషాయ కార్పొరేట్ ఎజెండాను బిజెపి అమలుచేస్తోంది. తద్వారా సాంస్కృతిక ఆధిపత్యాన్ని తమ చేతుల్లో ఉంచుకుని, ద్రవ్య పెట్టుబడి అజెండాను అమలుచేయవచ్చని బిజెపి ఆలోచన.

3 సంవత్సరాల పరిపాలన పూర్తి కావస్తున్న సందర్భంగా జంతువులపై క్రూరత్వ నిరోధక నియమాలు -2017 చట్టాన్ని మోడీ ప్రభుత్వం తీసుకొచ్చి మతపరమైన నిషేధాన్ని అమలు చేయాలని చూస్తోంది. చట్టంలోని సెక్షన్ 22 ప్రకారం కొన్న పశువులను వ్యవసాయానికి ఉపయోగించుకుంటామని రైతు హామీ పత్రం ఇవ్వాలి. 6 నెలలపాటు ఇతరులకు, ఇతర రాష్ట్రాలకు అమ్మకూడదని షరతులు చట్టంలో ఉన్నాయి. ఇప్పటివరకు పశువధ నిషేధాన్ని అమలు చేస్తున్న రాష్ట్రాలలో రైతులు తమ పశువులను చాలా తక్కువ ధరకు విక్రయించాల్సి వస్తుంది. వట్టిపోయిన పశువుల ధరలు అమాంతం తగ్గుముఖం పట్టడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. పాలిచ్చే ఆవు ధర రు. 60,000 ఉంటే, వట్టిపోయిన ఆవుల ధర కేవలం రు. 15000 ఉంటుంది. నిజానికి కబేళాలకు వట్టిపోయిన పశువులను తరలించి, వచ్చిన పెట్టుబడితో పాలిచ్చే పశువులను కొని పాడి పరిశ్రమ వృద్ధికి తోడ్పడుతుంది. నిజానికి విదేశాలతో పోల్చుకుంటే పాలకోసమే పశువులను కొనే సంప్రదాయం ఇక్కడ ఎక్కువగా ఉంది. మాంసం కోసమే పశువులను కొనే పరిస్థితి చాలా తక్కువగా ఉంది. పాడి పరిశ్రమకు పుశువుల మాంస పరిశ్రమకు మధ్య ఉన్న సంబంధం రెండు పరిశ్రమలను వృద్ధి చేస్తోంది. రెండు ఒకదానిపై ఒకటి ఆధారపడి వృద్ధి చెందుతున్నాయి. పశు మాంస నిషేధం ఉన్న రాష్ట్రాలలో పాలిచ్చే పశువుల విలువ రు. 80 వేల నుండి రు. 45 వేలకు పడిపోయింది. అలాగే మగ పశువుల ధర కూడా రు. 50 వేల నుండి రు. 30 వేలకు పడిపోయింది. పశువులను కొనడానికి ఎవ్వరూ ముందుకు రాని పరిస్థితి ఆ రాష్ట్రాలలో నెలకొంది. కేంద్ర ప్రభుత్వం ముందస్తుగానే జాతీయ పశుగణాభివృద్ధి కార్యక్రమం 2015-16లో పశుగణాలను వృద్ధి చేయడానికి బడ్జెట్ కేటాయింపులు పెంచింది. నాబార్డు రుణంపై ఈ పథకం నడుస్తుంది. ఈ పథకం ఆశ్చర్యంగా దళితులకు, ఆదివాసులకు, మహిళలకు ప్రోత్సాహం ఇవ్వాలని ఉద్దేశించబడింది. పశువులను విక్రయ శాలలకు తక్కువ ధరకు అమ్ముకుని, తద్వారా కార్పొరేట్ శక్తులు మాంసం ఎగుమతులు ఎక్కువ చేసేందుకు ఈ పథకం ఉపయోగపడనుంది.

## నిషేధం దేనికి

వ్యవసాయ సమాజంలో పశువులు అమ్మకం, కొనుగోళ్లలో పరిమితి విధిస్తే, అది వ్యవసాయ ఉత్పత్తులకు నష్టం చేకూరుస్తుంది. యజ్ఞాలలో బలిచ్చిన పశువును తింటే పాపం ఉండదని ఉపనిషత్తులు, మను ధర్మశాస్త్రం చెప్తున్నాయి. వైదిక మతం గతంలో క్షత్రియులు, బ్రాహ్మణులు పశుమాంసం తినడం తప్పు కాదని చెప్పింది. ప్రొటీన్లు సైతం బీఫ్‌లో ఎక్కువగా ఉంటాయి. చికెన్‌లో 9.8, మటన్‌లో 12.13 ఉంటే బీఫ్‌లో ఏకంగా 21 శాతం ప్రొటీన్లు ఉంటాయి. ఇది మిగిలిన మాంసం కన్నా తక్కువ ధరకు లభిస్తుంది. భారతదేశంలో బీఫ్ ఎగుమతుల్లో ప్రముఖమైన సంస్థ అల్ దువా ఫుడ్ ప్రాసెసింగ్ కంపెనీ. దీనికి మీరట్ దగ్గర ఉన్న సార్ధనా నియోజకవర్గ బిజెపి ఎంఎల్ఎ సంగీత సోమ్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నాడు. పశువధను నిషేధించిన రాష్ట్రాల్లో పశువులను బాగా సంరక్షిస్తున్నారు అనుకుంటే పొరపాటే. అయోధ్య రామజన్మభూమి పాతది అవడం వల్ల, కొత్త నినాదంతో హిందువులను ఏకం చేయాలని బిజెపి ఆలోచిస్తుంది. యుపి ఎన్నికల్లో అయోధ్య అంశం వల్ల పెద్దగా బిజెపికి ఒరిగిందేమి లేదు. గోవు రాజకీయాలు కొంత మేరకు యుపిలో పనిచేశాయి. 2019 ఎన్నికలకు గోవు రాజకీయాలు బాగా పనిచేస్తాయని బిజెపి బలంగా విశ్వసిస్తోంది. ఫెడరల్ స్ఫూర్తిని దెబ్బతీస్తేనే బిజెపి రాజకీయాలు మనగలుగుతాయి. దీని ద్వారా భిన్నత్వం లో ఏకత్వాన్ని సాధించవచ్చు. పశువధ నిషేధాన్ని పశ్చిమ బెంగాల్, కేరళ, తమిళనాడు, మేఘాలయ, త్రిపుర ప్రభుత్వాలు వ్యతిరేకించాయి.

## ప్రజల ఆహారపు అలవాట్లలో జోక్యం

2014లో పీపుల్ ఫర్ ఎనిమల్స్ నేత గౌరి మాలేఖి సుప్రీంకోర్టులో పశువుల అక్రమ రవాణాపై పిటిషన్ దాఖలు చేసింది. దీనిపై జూలై 13, 2015లో సుప్రీంకోర్టులో స్పందిస్తూ పశువుల అక్రమ రవాణాను భారత్ అరికట్టడానికి కేంద్ర ప్రభుత్వం చర్యలు చేపట్టాలని ఆదేశించింది. దీన్ని సాకుగా చూపి కేంద్ర ప్రభుత్వం చట్టం చేసింది.

గోరక్షణ దళాలు గోవులను ఏ మాత్రం సంరక్షిస్తున్నాయో మనకు తెలుసు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పశువుల సంరక్షణ గురించి పట్టించు కోవడం లేదు. రైతులు మాత్రమే పశువులను సొంత బిడ్డల్లా

చూసుకుంటున్నారు. ప్రజల ఆహారపు అలవాట్లపై ప్రభుత్వాలకు హక్కు లేదు. పశు మాంసంలో ఉన్న పోషకాహారాల వల్ల ఎక్కువ మంది ప్రజలు దానిపై మొగ్గు చూపుతున్నారు.

గోవధ నిషేధ చట్టం 1960లో వచ్చింది. పర్యావరణ పరిరక్షణ కోసం పశువధను నిషేధిస్తున్నట్లు కేంద్రం అసత్యాలు చెపుతుంది. రాజకీయపార్టీలు మోడీ ప్రభుత్వంపై వత్తిడి పెంచి, చట్టాన్ని వెనక్కి తీసుకోవాలని కోరుతున్నాయి. వామపక్షాలు, కాంగ్రెస్, డిఎంకె, తృణమూల్ కాంగ్రెస్, జెడియు, ఆర్‌జెడి, బిఎస్‌పి, ఎస్‌పి, బిజెపి భాగస్వామి శివసేన పశువుల అమ్మకాలపై నిషేధాన్ని వ్యతిరేకిస్తున్నాయి. ఈ నిషేధం ద్వారా వెనుకబడిన కులాల సామాజిక, ఆర్థిక మూలాలపై కేంద్రం దెబ్బకొట్టింది. కొన్ని స్వచ్ఛందసంస్థలు కోర్టులను ఆశ్రయించాయి. కొన్ని హైకోర్టులు ఇప్పటికే కేంద్ర చట్టంపై స్టే విధించాయి. చివరికి మోడీ తినే ఆహారాన్నే భారత ప్రజలు తినాల్సి వస్తోంది. తమిళనాడులో అయితే మరో జల్లికట్టు తరహా ఉద్యమాన్ని (మెరీనా విప్లవం) చేస్తామని అక్కడి రాజకీయ పార్టీలు హెచ్చరించాయి. అయితే ఆందోళనలు చేస్తున్న ప్రజాసంఘాలు కార్యకర్తలపై కాషాయ శ్రేణులు దాడులు చేస్తున్నాయి. మద్రాసు ఐఐటి క్యాంపస్‌లో జరిగిన బీఫ్ ఫెస్టివల్‌లో పిఎచ్‌డి స్కాలర్ సూరజ్‌పై హిందుత్వ వాదులు దాడులు చేశారు. సూరజ్ కంటికి తీవ్ర గాయమైంది. ఇప్పటివరకు నిందితులను పోలీసులు పట్టుకోలేదు.

**జాతీయ జంతువుగా ఆవు**

సనాతన హిందూ సంప్రదాయాలను జాతీయత పేరుతో ప్రజలపై రుద్దడం బిజెపికి అలవాటుగా మారింది. మైనారిటీలు, వెనుకబడిన సెక్షన్ల ప్రజలపై హిందూ సంప్రదాయాల పేరుమీద దాడులు ఆరంభించి, వారిలో భయాందోళనలను నింపుతున్నారు. ప్రజల్లో అసహనాన్ని పెంచడం, గోరక్షక దళాల పేరుతో దాడులు, ట్రిపుల్ తలాక్‌లు, ఉమ్మడి పౌరస్మృతి, బీఫ్ వివాదం లాంటి అంశాలతో ప్రజలను చీల్చడానికి బిజెపి ప్రయత్నిస్తోంది. తాజాగా పశువిక్రయాలపై పరిమితులు విధించి కోట్లమంది హిందూ కార్మికులను రోడ్లపాలు చేస్తోంది. చివరికి జాతీయ జంతువుగా ఉన్న రాయల్ బెంగార్ టైగర్‌ను తీసివేసి, ఆవును జాతీయ జంతువుగా చేసే కుట్ర జరుగుతోంది.

చట్టంలో పశువులను చంపడాన్ని నేరంగా చెప్పలేదు. పశుమాంసాన్ని నిషేధించలేదు. పశువుల క్రయ విక్రయాలపై మాత్రమే ఆంక్షలు విధించడం వల్ల బిజెపి ఎత్తుగడలను సులభంగానే అర్థం చేసుకోవచ్చు. కేరళ హైకోర్టు సైతం కేంద్రం నిరంకుశ వైఖరిని, అనాలోచిత నిర్ణయాన్ని తప్పుబట్టింది. నిజంగా గోవును ఆరాధించే హిందువులు సైతం గోవును రాజకీయ వస్తువుగా చేయడాన్ని నిరసించారు. న్యాయస్థానాలు సైతం మెజారిటీ మతాన్ని ప్రోత్సహించే విధంగా తీర్పులు చెపుతున్నాయి. రాజస్థాన్ హైకోర్టు గోవును జాతీయ జంతువుగా చేసి, గోహింసను అరికట్టడానికి ప్రభుత్వాలు కృషి చేయాలని హితవు చెప్పారు. అంతేగాక గోహత్య చేసినవారికి జీవితఖైదీ వేసే విధంగా చట్టంలో మార్పులు తీసుకురావాలని సలహా ఇచ్చింది. ఈ తీర్పు బిజెపి మత పరిపాలనను మరింత ప్రోత్సహించే విధంగా ఉంది. గోవుపైనే నిషేధం విధిస్తే, పెద్ద ఎత్తున విమర్శలు వెల్లువెత్తుతాయని బిజెపి మిగిలిన పశు విక్రయాలపైనే నిషేధం విధించినట్టు బిజెపి శ్రేణులు చెప్తున్నాయి. నిజానికి జాతీయ జంతువుగా నిర్వచించాలంటే చాలా విషయాలను పరిగణనలోనికి తీసుకోవాలి. దేశ సంస్కృతి, వారసత్వం, చరిత్ర, భిన్న సంస్కృతులు, భిన్న జాతుల సంప్రదాయాలు, జాతీయ స్వభావాలు, ప్రాంతీయ ప్రత్యేకతలు లాంటి అంశాలను పరిగణనలోనికి తీసుకోవాలి. 1972లో వన్య ప్రాణుల సంరక్షణ చట్టం అమలులోకి వచ్చింది. భారత్‌లో 8 రకాల పులులు కనిపిస్తాయి. ఇందులో బెంగాల్ టైగర్‌ను ప్రత్యేకమైన స్థితిగతుల ప్రాతిపదికగా నిర్ణయించారు. దేశంలో 48 బెంగాల్ టైగర్‌లు మాత్రమే ఉన్నాయని ప్రభుత్వ గణాంకాలు చెపుతున్నాయి.

**కుల వివక్ష**

పశువుల విక్రయాలపై ఆంక్షలు విధించడం వల్ల కింది కులాలు, మైనారిటీ మతస్థులపై బిజెపికి ఉన్న ద్వేషభావం అర్థమవుతోంది. జంతు హింస నిరోధక చట్టం 1960 కింద, కేంద్రం విధించిన ఈ నూతన నిబంధనను చేర్చారు. దీనిలోకి ఆవు, ఆవు దూడ, కోడె దూడ, ఎద్దు, గేదెలు, పోతులు, ఒంటెలు చేర్చారు. హిందువుల్లోని కొన్ని కులాలు, ఇతర మతాలకు చెందిన ప్రజలు మాంసం కోసం ఈ జంతువులను ఎక్కువగా వాడుతుంటారు. అగ్రకులస్తులు తింటున్న కోడి, మేకలను నిషేధించలేదు. బిజెపికి ఉన్న వర్ణ, కుల వివక్ష దృష్టిని ఇది తెలియ జేస్తోంది. దళితులకు, ముస్లింలకు వ్యతిరేకమైన జి.ఓ.గా దీన్ని కుల సంఘాల నేతలు భావిస్తున్నారు. పార్లమెంట్‌లో 111 మంది ఎస్‌సి, ఎస్‌టి ఎంపిలు ఉన్నప్పటికీ, వారెవరూ ఈ నూతన జి.ఓ.కు వ్యతిరేకంగా మాట్లాడకపోవడం విచారకరం.

**శిక్షలు**

పశు వధ, వాటి అక్రమ రవాణాకు పాల్పడినపుడు ఏ చట్టం కింద శిక్షించాలో కొంత తికమక ఉంది. తాజా జి.ఓ. వల్ల జాతీయ భద్రతా చట్టం (ఎన్‌ఎఎ) గ్యాంగ్‌స్టర్ చట్టం కింద కేసులు నమోదు చేస్తామని పోలీసులు చెపుతున్నారు. ఎన్‌ఎఎ కింది అనుమానితుడ్ని పోలీసులు తమ ఇష్టమొచ్చినంత కాలం నిర్బంధంలోకి తీసుకోవచ్చని పోలీసులు చెపుతున్నారు. డిటెన్షన్‌కు సంబంధించి కనీసం వివరణ ఇవ్వాల్సిన అవసరం లేదని వారు పేర్కొంటున్నారు. ఒకసారి పౌరుడు గ్యాంగ్‌స్టర్‌గా నమోదైతే, ఆ వ్యక్తులపై పోలీసుల నిఘా ఉంటుంది. పోలీసులు కోరినప్పుడల్లా, పోలీసుస్టేషన్‌కు హాజరై, విచారణను ఎదుర్కోవలసి ఉంటుంది. సాధారణంగా 14 రోజులు రిమాండ్ ఉంటే, ఈ చట్టం కింద గరిష్టంగా 60 రోజుల వరకు రిమాండ్ విధించవచ్చు. ఇప్పటికే గోరక్షణ పేరుతో స్వీయ నియమిత సంఘాలు ఎక్కువగా ఉన్నాయి.

**గో రక్షక సంఘాలు**

1989లో అఖిల భారత కృషి గోసేవా సంఘ్, అహింసా ఆర్మీ ట్రస్ట్ అనే రెండు సంస్థలు సుప్రీంకోర్టులో కేసు వేశాయి. గోవధని నిషేధించాలని వీరి డిమాండ్. గుజరాత్ ప్రభుత్వం ఈకేసులో ఇంప్లీడ్ అయింది. ఇందులో ప్రతివాదిగా ఖురేషి సమాజ్, పశువధ కేంద్రాల యజమాని ఉన్నాడు. గోవులు వట్టిపోయినపుడు మాత్రమే కబేళాలకు రైతులు అమ్ముతున్నారని, వాటినే తాము చంపి మాంసాన్ని ఎగుమతి చేస్తున్నామని అతను పేర్కొన్నాడు. ఒక ఆవు 20 సంవత్సరాలు బతికితే, వట్టిపోయిన తర్వాత దానిద్వారా 70 కిలోల మాంసం వస్తుంది. దీని విలువ ప్రస్తుత గణాంకంలో రు.15000 ఉంటుంది. ఆ ఆవు ద్వారా వచ్చే 25 లీటర్ల రక్తం విలువ రు.5,000 ఉంటుంది. దాని ఎముకల ధర రు.3000 ఉంటుంది. ఒక ఆవు తోలు ధర రు.7,000 వరకు ఉంటుంది. అంటే మొత్తంగా వధశాల యజమానికి ఒక వట్టిపోయిన ఆవు వల్ల సుమారు రు.25,000 ఆదాయం ఉంటుంది.

# పరువు కోసం హత్యలు

*బ్రాహ్మణ అగ్రకుల ఆధిపత్యం కొనసాగింపులో భాగంగానే పరువు హత్యలు జరుగుతున్నాయనీ, కుల అంతరాలను నిర్మూలించే కులాంతర వివాహాలను ప్రోత్సహించినప్పుడే కుల నిర్మూలన జరుగుతుందనీ అంటున్నారు* **అరణ్య**

గత కొద్ది కాలంగా చాలా ఎక్కువగా ఉన్ననూ చాలా కాలంగానే ఈ దేశంలో ప్రేమించడం అనేది ఒక సామాజిక నేరంగా పరిగణింప బడుతూ వస్తున్నది. ప్రేమించడం, అందులోనూ కులం పరిధి దాటి ప్రేమించడాన్ని కుటుంబాలు, సమాజాలు ఏమాత్రం సహించని పరిస్థితిలోకి చేరుకున్నట్లు కనబడుతున్నది. ప్రేమించిన వాళ్లను విడదీయడం, ప్రేమికులను చంపడం అనే వాటికి ఇతర కారణాలు ఎన్ని ఉన్ననూ ఇప్పుడు మాత్రం కులం, ఆ కులంతో ఏర్పడిన పరువు అనేవే ప్రధాన కారణాలు అవుతున్నాయి. కులానికి బాహ్యంగా ఏర్పడే పరువుకు పెద్దగా ప్రాధాన్యం లేకపోవడం వల్ల ఈ రోజు కుల పరంగా వచ్చిన పరువును వదులుకోవడానికి సిద్ధంగా లేని స్థితిలోకి కుటుంబాలు నెట్టబడడం ఈ హత్యలకు ఒక ప్రధాన కారణంగా నిలిచింది.

భారతదేశం కులం అనే ఒక అసహజమైన నిర్మాణాన్ని కలిగి ఉన్న దేశం. కుల పరమైన సామాజిక విభజన వేలాది సంవత్సరాలుగా సమాజంలో పాతుకుపోయి ఈ నాటికీ మౌలికమైన కూడు, గుడ్డ దొరకని స్థితిలోకి కోట్లాది మంది జనాన్ని నెట్టి వేసిన ఒక నిర్మాణంగా కులం ఈ దేశంలో ఉన్నది. కులం పుట్టుకకు సంబంధించి అనేక వివాదాలు, భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, ప్రాథమికంగా కులం అనేది కొందరి అవసరాల కోసం, కొందరి స్వప్రయోజనాల కోసం మాత్రమే ఏర్పాటు చేయబడింది. ఆ ప్రయోజనాలను పొందేవారు తప్ప అందరూ అంగీకరిస్తున్న విషయం. పరాన్నభుక్కుల లాగా జీవించడం కోసం ఒక పకడ్బందీ సామాజిక విభజనను ఏర్పాటు చేసి, దాని ద్వారా వేల సంవత్సరాలుగా ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తూ వస్తున్న ఒకానొక సెక్షన్ నేటికీ ఆ సామాజిక ఆధిపత్యాన్ని వదులుకోలేక పోతున్నదనేది బహిర్గత సత్యం.

మారుతున్న ప్రపంచ పరిస్థితులు, పెరుగుతున్న సాంకేతిక జ్ఞానం నేపథ్యంలో కూడా కులం ఒక సంకుచితమైన నిర్మాణమేననే కోణాన్ని అర్థం చేసుకోకపోయిననూ, కులం పుట్టుక – మనుగడ వంటి సంక్లిష్ట సైద్ధాంతిక అంశాల జ్ఞానం లేకపోయిననూ, కులం గురించి ఇంకా ఎన్నెన్నో సత్యాలు తెలియకపోయిననూ, దేశంలో ప్రతి ఏటా వేలాది మంది యువతీ యువకులు కులంతో సంబంధం లేకుండా ప్రేమించు కుంటున్నారు. కులాంతర వివాహాలు చేసుకుంటున్నారు. ఈ మధ్యలో నైతే ఇలాంటి వివాహాలు మరింత ఎక్కువ సంఖ్యలో జరుగుతూ వస్తున్నాయి. అయితే ఈ కులాంతర ప్రేమలను, వివాహాలను సహించలేని అగ్రకుల పెద్దలు తమ ఆధిపత్యాన్ని నిలుపుకునే క్రమంలో భాగంగా ప్రేమికులను, కులాంతర వివాహాలు చేసుకునే వాళ్లను నిర్దాక్షిణ్యంగా చంపుతున్నారు. ఇలాంటి క్రూరమైన హత్యలు పరువు హత్యల పేరుతో జరుగుతున్నాయి. ఇప్పటి వరకూ ఉత్తర భారతదేశంలోని హర్యానా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో వందల సంఖ్యలో జరిగినా, ఈ మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్, తెలంగాణలలో కూడా ఈ హత్యలు ఎక్కువగా జరుగుతున్నాయి.

జీవిత భాగస్వామిని ఎంచుకునే విషయంలో జరుగుతున్న ఈ పరువు హత్యలు రెండు రకాలుగా ఉన్నాయి. (నిజానికి ఇవి పరువు హత్యలు కావు. పరువు కోసం జరుగుతున్న హత్యలు).

---

రైతుకు వధశాల వారు రు.15,000 వరకు ఇస్తారు. ప్రకృతి ప్రేమికులు అదే ఆవును వ్యవసాయంలో వినియోగిస్తే అద్భుతాలు చేయవచ్చని చెపుతారు. అదే వట్టిపోయిన ఆవు రోజుకు 6 కిలోల పేడను వేస్తుంది. గో మూత్రం ద్వారా ఆస్టియో ఫోరోసిస్, ఆస్టియా మైలీటాన్, బ్రాంకైటీస్ వంటి రోగాలకు మందులు తయారు చేయవచ్చని చెపుతారు. ఆవు పేడ నుండి మిథేన్ గ్యాసును ఉత్పత్తి చేయవచ్చు. ఒక ఆవు తన జీవితకాలంలో సుమారు రు.25 లక్షల రూపాయలను ఇస్తుంది కాబట్టి, దాన్ని చంపకూడదని హిందూత్వ వాదులు కోర్టులో కేసులు వేస్తున్నారు. వారి గణాంకాల ప్రకారం ఒక ముసలి ఆవు ఏటా 4,500 లీట్ల బయోగ్యాస్‌ను, 180 టన్నుల సేంద్రీయ ఎరువును, 200 లీటర్ల కీటక నివారణ ఔషధాన్ని ఇస్తుందని వారు చెప్తున్నారు. ఏ రైతు ఉపయోగపడే ఆవును చంపుకోదని, వధశాలకు విక్రయించడనే వాస్తవాన్ని గో ఆరాధకులు, గో ప్రేమికులు గమనించాల్సి ఉంది. ఈ రోజు ప్రకృతి వ్యవసాయాన్ని గోవును ప్రేమించేవారికన్నా రైతులే ఎక్కువ చేస్తున్నారు. ఇదే గో ఆరాధకులు మిగిలిన పశువుల మాంస విక్రయాలను కేంద్రం నిషేధించడాన్ని ఎందుకు వ్యతిరేకించలేదో సెలవియ్యాలి.

ముస్లింలు సైతం గోవుపై తమ ప్రేమను కనబరచారు. బాబర్ గోవధ నిషేధాన్ని అమలుపరిచాడు. అతని కొడుకు హుమాయున్ దాన్ని పాటించాడు. అక్బర్ హిజిరి 935లో గోవధ నిషేధం చేశాడు. జహంగీర్ ఫర్మానా 1586లో, ఆదివారం, గురువారం ఏ జంతువులను చంపొద్దని శాసనం చేశాడు. ఔరంగజేబు బక్రీదు పండుగనాడు గోవధను నిషేధించాడు.

ముస్లింలు ఎక్కువగా గోవులను చంపుతారని చేసే ప్రచారాలు అర్థరహితమైనవని గుర్తించాలి. జంతువుల పట్ల ప్రేమను వ్యక్తపరిచే వారందరూ జంతువు అవసాన దశలో ఉన్నప్పుడు మాత్రమే దాని మాంసాన్ని తినడానికి పూనుకుంటారు. పాలిచ్చే జంతువులను ఏ రైతు చంపుకోడు.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)*

వీ

మొదటి రకమైనవి కులాంతర వివాహాలకు సంబంధించినవి. నిజానికి వివాహం అంటే కలిసి జీవించే ఒప్పందంతో, ఒక అవగాహనతో నిర్దిష్ట ప్రణాళికతో తమకంటూ ఒక ప్రత్యేకమైన కుటుంబ నిర్మాణం చేసుకుని తద్వారా సమాజంలో భాగస్వాములవడం. అయితే ఒక కుటుంబంగా ఏర్పడిన తర్వాత, ఆ కుటుంబం సమాజ నిర్మాణానికి, మనుగడకు తోడ్పడుతుంది. ఇది సహజమైన పని. కానీ ఒక సమాజం తనంత తానుగా బాధ్యత తీసుకుని కుటుంబం విషయంలో కలగజేసుకోకూడదు. అంటే ఒక కుటుంబ నిర్మాణంలోను, ఆ కుటుంబ వ్యవహారాలలోను, కుటుంబ మనుగడకు సంబంధించిన విషయాలలోను సమాజం జోక్యం చేసుకోకూడదు. అదే జరిగితే కుటుంబ మౌలిక, ప్రాథమిక హక్కులను ఆ సమాజం హరించినట్లే అవుతుంది. సమాజం కోసం కుటుంబం తన హక్కులను దారాదత్తం చేయాలని భావించడం ప్రజాస్వామిక, సామాజిక నియమాలకు పూర్తిగా విరుద్ధం. తాను సూచించిన విధంగానే, ఏర్పరిచిన నియమాల ఆధారంగానే కుటుంబ నిర్మాణం జరగాలనే హక్కు సమాజానికి ఏ కోశానా ఉండదు. ఉమ్మడి సాంస్కృతిక జీవనం అనేది సమాజ లక్షణాలలో ఒక అంశంగానే ఉండాలి గాని, అదే ప్రధానమైన నియమం కాకూడదు. అందుకే సమాజం అనేక రకాల మనుషులను, కుటుంబాలను తనలో కలుపుకు పోయేలాగా ఉండాలి. కానీ నేటి భారతదేశ సమాజాలు అందుకు పూర్తి భిన్నంగా ఉన్నాయి.

ఎప్పుడైతే సమాజం కుటుంబాలను తన గుప్పిట్లో ఉంచుకోవడానికి చూస్తున్నదో ఆ కుటుంబంలోని మనుషులు కూడా తెలిసో తెలియకో సమాజం ఆధిపత్య నియమాలను పాటించడానికి ప్రయత్నిస్తూ పోతున్నారు. అట్లా పాటించి తమ కుటుంబాన్ని సమాజ నియమాలకు లోబడి ఉంచే ప్రయత్నం చేస్తున్నారు. దీని వల్ల సమాజం సంకుచిత, అశాస్త్రీయ నియమాలను కుటుంబాలు పాటిస్తూ పోతున్నాయి. కుటుంబ సభ్యులంతా ఈ నియమాలను తప్పనిసరిగా ఇష్టమున్నా, లేకున్నా పాటించాలనే నిబంధనలు విధించబడుతూ వస్తున్నాయి. అనేక కుటుంబాలలో దాదాపు అందరు కుటుంబ సభ్యులూ వీటిని పాటిస్తున్ననూ, ఎక్కడో ఒక చోట ఈ నిబంధనలను ఉల్లంఘించి స్వేచ్ఛగా ప్రవర్తించే వాళ్లను కుటుంబంలోని మిగిలిన సభ్యులు అంగీకరించడం లేదు. వాళ్లు తీసుకున్న ఆ స్వేచ్ఛ వల్ల తమ కుటుంబం సమాజంలో పరువును కోల్పోతున్నదని భావించి, అందుకు కారణమైన వాళ్లు తమ కుటుంబ సభ్యులే అయిననూ ప్రేమ, ఆప్యాయతలను మరిచిపోయి హత్య చేస్తున్నారు. తోడబుట్టిన వాళ్లను, కన్నబిడ్డలను చంపుకుంటున్నారు. అందుకే ఇవి పరువు కోసం జరుగుతున్న హత్యలవుతున్నాయి.

ఆర్యులు తరతరాల సామాజిక ఆధిపత్యాన్ని నిర్వహించే కుటిల ప్రయోగంతో సామాజిక అంతరాలను ఏర్పరిచారు. కులం ఆ ప్రయోగ క్రమంలో ఏర్పడిందే. అట్లా ఏర్పడిన కులం పునాదులు ఈనాటికీ కనీసమైనా కదల లేదు. కనుచూపు మేరలో ఆ అవకాశం కనిపించడం లేదు. ఒక పకడ్బందీ వ్యూహంతో దుర్మార్గంగా ఏర్పరచబడిన కుల వ్యవస్థ మూలాలను, అందుకు సంబంధించిన కారణాలను, దాని వల్ల లబ్ది పొందుతున్న వర్గాలను గురించి అర్థం చేసుకుని ఉమ్మడి సామాజిక విప్లవం దిశగా అడుగులు వేస్తే తప్ప కుల నిర్మూలన జరగదు. కానీ ఆధిపత్య భావజాల సెక్షన్‌ల, కులాల విద్యలు, ప్రభుత్వాలు ప్రజలను చైతన్య పరచకుండా, వాళ్లు సంఘటితం కాకుండా నిరంత ప్రణాళికలు తయారు చేస్తూనే ఉన్నాయి. పురాణాలు, ఇతిహాసాల నిండా వర్ణాశ్రమ ధర్మాల కంపును నింపి, ప్రజల జీవితాలపై వేల ఏళ్ల నుంచి రుద్దిన దోపిడీ వర్గం ఈనాటికీ రాజ్యాంగ యంత్రాంగాన్ని, రాజ్యాధికారాన్ని తమ చేతుల నుంచి బదలాయించకుండా ఏర్పాటు చేసిన కుట్ర పూరిత నిర్మాణంగా కులాన్ని కొనసాగిస్తూ వస్తున్నది. చిత్రమైన విషయమేమిటంటే కుల వ్యవస్థను ఏర్పరచిన వర్గాల వారే కులాధిపత్యమే కాకుండా పురుషాధికత్యను స్థాపించే పాశవికమైన పితృస్వామిక వ్యవస్థను కూడా రూపొందించారు. కుల విభజన ద్వారా శ్రామిక వర్గం మధ్య ఐక్యత లేకుండా చేశారు.

ఒక కులం తరతరాలుగా శ్రమకు దూరంగా సుఖంగా జీవిస్తూ మిగిలిన కులాలు వేల సంవత్సరాలుగా శ్రమిస్తూనే ఎందుకుండాలి? తమ సుఖ జీవనాన్ని కొద్ది రోజులు చెప్పులు కుట్టే వాళ్లకిచ్చి తామెందుకు ఆ పని చేయకూడదు? ప్రజలు ఇదే పని చేయాలనే పని విభజన చేసిన సెక్షన్ వాళ్లకున్న అర్హతలేమిటి? వాళ్లు ఏ వర్గ ప్రయోజనం కోసం ఆ విభజన చేశారు? ఒక కులం నుంచి మరొక కులంలోకి మారకూడదనే నియమం వల్ల లబ్ధి పొందిందెవరు? ఎందుకు కొందరికి దేవాలయ ప్రవేశం నిషేధించబడింది? దేవాలయాల ఆజమాయిషి వేలాది సంవత్సరాలుగా కొందరి చేతుల్లోనే ఎందుకున్నది? కొన్ని రకాల సాహిత్యాలు చదడానికి, నేర్చుకోవడానికి కొందరు మాత్రమే ఎందుకు అర్హులు? సమాజంలో కొందరి ఇళ్లు, గుళ్లు ఎందుకు ఊరవతల ఉంటాయి? ఎందుకు కొందరు నేటికీ అంటరాని వాళ్లుగా ఛీత్కరించ బడుతున్నారు?

ఇవన్నీ నేటి సమాజంలో కులం వల్ల బోధపడుతున్న వారి మెదళ్లలో మెదులుతున్న ప్రశ్నలు. ఇవన్నీ కళ్ల ముందు కనబడుతున్న సజీవ సాక్ష్యాలు. ప్రపంచంలోనే అతిగొప్ప సంస్కృతి అని గొప్పలు చెప్పుకునే సంస్కృతిలోని డొల్లతనం ఇది. ఈ దుర్మార్గ సంస్కృతిలో భాగంగా ఏర్పాటు చేసిన ఒకే కులంలో వివాహం చేసుకోవాలనే నియమం కుల అంతరాలను మరింతగా నిలిపి ఉంచుతుందే తప్ప కుల నిర్మూలన ఆదర్శానికి చేరుకోదు. కనుక కులం దాటి పెళ్లిళ్లు చేసుకోకూడదనే నిబంధన చాలా క్రూరమైనది. ఈ నిబంధనను ఉల్లంఘించి కులాల అంతరాలు పట్టించుకోకుండా నిర్మలమైన, స్వచ్ఛమైన మనసుతో ప్రేమించుకుని పెళ్లి చేసుకున్న అమాయక యువతీ యువకులపై పెద్దలు దాడి చేయడం చాలా దుర్మార్గమైన చర్య.

ఇక రెండవ రకం హత్యలు – కూలాంతర ప్రేమికుల హత్యలు. వేర్వేరు కులాల యువతీ యువకులు ప్రేమించుకుంటే వాళ్లను పెద్దవాళ్లు చంపేస్తున్నారు. ఈ చంపడాలు కూడా వేర్వేరు తేడాలతో జరుగుతుంటాయి. ఉదాహరణకు ఒక 'అగ్రకులం' (సమాజం భాషలో) అబ్బాయి, నిమ్నకులం అమ్మాయి ప్రేమలో ఉంటే అబ్బాయి తరపువాళ్లు ఆ అమ్మాయితో సరదాగా తిరిగితే తిరగమని చెప్పి పెళ్లి మాత్రం తమ కులపు మరో అమ్మాయిని చేసుకొమ్మని బహిరంగంగానే చెప్తారు. అతను వాళ్ల మాట వినకుండా ఈ అమ్మాయినే పెళ్లి కూడా చేసుకుంటే ఆమెను ఏదో ఒక వంకతో బాధపెడుతూ, ఏదో ఒక రోజు ఆమెను వదిలిపెట్టేలా

చేసి తమ అబ్బాయికి తమ కులంలోనే మరో అమ్మాయితో వివాహం చేయించాలని చూస్తుంటారు. ఇది ఒక్కోసారి ఈ అమ్మాయిని చంపేసేదాకా కూడా వెళ్తుంది. అగ్రకులంలోని వ్యవహారం కనుక డబ్బులతో కేసుల్లోంచి కూడా సులభంగా బయట పడుతుంటారు. ఇక్కడ మరో విషయం ఏమిటంటే అబ్బాయి కులంలో దీన్ని పెద్ద బాధపడాల్సిన సమస్యగా పట్టించుకోరు. మగవాళ్లు ఏది చేసినా ఏం తప్పుకాదనే పురుషాధిక్య భావజాల ప్రభావంతో దీన్ని పెద్ద తప్పుగా భావించరు. మొత్తంగా అతన్ని పెళ్లి చేసుకుని లేదా ప్రేమించి బలయ్యేది అమ్మాయే. పరువు విషయంలో అమ్మాయి వైపు నుంచి చూస్తే అమ్మాయి తల్లి దండ్రులు ఒకింత బాధపడ్డా కూడా తమ అమ్మాయి ప్రేమించింది లేదా పెళ్లి చేసుకున్నది తమ కులం కంటే పెద్ద కులం అబ్బాయినే కనుక వాళ్లు కొద్దికాలం తర్వాతనైనా ఆ బాధను, కోపాన్ని మరిచిపోయి ప్రవర్తిస్తుంటారు.

ఇక మరో ఉదాహరణ చూస్తే ఒక నిమ్న కులం అబ్బాయి, అగ్రకులం అమ్మాయిలు ప్రేమలో ఉంటే అబ్బాయి తరపు వాళ్లు అమ్మాయిది పెద్ద కులం కనుక పెద్దగా అభ్యంతర పెట్టరు. ఎటొచ్చీ దీన్ని సమస్యగా బాధపడేది అమ్మాయి తరపు వాళ్లు తమ కులానికి మచ్చ తెచ్చిందని, తమ కుటుంబాన్ని తలెత్తుకోకుండా చేసిందని భావించి దాడులకు పాల్పడుతుంటారు. పై మొదటి ఉదాహరణలో కంటే ఎక్కువగా ఇక్కడ దాడులు జరుగుతాయి. అదీ అమ్మాయి తరపు వాళ్ల దాడులు. మంథని మధుకర్ కేసులో గానీ, నరేష్ – స్వాతిల కేసులో గానీ అమ్మాయిది పెద్ద కులం, అబ్బాయిది చిన్న కులం అవడమే దాడులకు కారణమయింది. మధుకర్ కేసులో లాగా అమ్మాయి ముందే అమ్మాయి ప్రేమించిన వాన్ని చంపి, ఆమెను భయపెట్టి, రేపు ఆమెను వేరే అబ్బాయికిచ్చి పెళ్లి చేసినా జీవితమంతా ఈ భయాన్ని మర్చిపోకుండా ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బిక్కు బిక్కుమని సంసారం చేయాలనుకుంటారు. లేదా స్వాతి కేసులో లాగా అబ్బాయిని చంపినట్లే అమ్మాయినీ చంపుతుంటారు. పరువు కంటే, కులం కంటే ప్రేమ, ఆప్యాయత, కడుపుతీపి అనే మానవీయ లక్షణాలేవీ ఎక్కువ కాదనేంత దుర్మార్గంగా పెద్దలు వ్యవహరిస్తున్నారు. అంటే 'తమ అమ్మాయి తప్పుచేస్తే మేము కన్న కూతురని చూడకుండా, తోడబుట్టినదని కూడా చూడకుండా చంపేశాం, మాకు పరువంటే, కులమంటే ఎంత విలువో చూడండ'ని సమాజానికి ప్రకటించుకోవడం కోసం, ఆ సేఫ్‌జోన్‌లోకి వెళ్లడం కోసం ఎంత దారుణానికైనా తెగిస్తున్నారు. ఈ రెండు ఉదాహరణల్లోనూ గమనించాల్సిన అంశం ఏమిటంటే అమ్మాయి పడే మానసిక సంఘర్షణ. ఈ దేశ పితృస్వామిక వ్యవస్థ స్త్రీలను శరీరాలుగా, ఆస్తిగా, వస్తువుగా చూస్తూ స్త్రీ అంటే ఒక మనిషి అని, ఆ మనిషికి ఆలోచనలుంటాయని, వాటిని గౌరవించాలనేది ఏదీ లేకుండా దారుణమైన జెండర్ వివక్షను సాంప్రదాయాల పేరుతో, సంస్కృతి పేరుతో అమలు చేస్తున్నది. చిన్నతనం నుంచీ ఆమె కదలికల మీద, కుట్టుబాట్ల మీద, వస్త్రధారణ మీద, తయారవడం మీద, చివరకు నవ్వు మీద, జుట్టు మీద, ఫోన్ మీద అన్నింటి మీదా పురుషుని అదుపాజ్ఞలు ఉంటాయి. అవన్నీ ఎలా ఉండాలో సమాజం నిర్వచించి మగవాళ్లను కాపలాదార్లుగా పెడుతుంది. సమాజం చెప్పినదానికి సంస్కృతి అని పేరు పెట్టి తరాలు, తరాలకు ఆ కట్టుబాట్లను, అదుపాజ్ఞలను బదలాయిస్తూ పురుష స్వామ్యం ఆధిపత్యం చేలాయిస్తున్నది.

దక్షిణాది రాష్ట్రాలలో సమాజం వెనుక నుంచి ఇదంతా చేస్తూ, పరువు హత్యలలో కూడా కుటుంబంలో వ్యక్తులు హత్యలు చేస్తుంటే సమాజం తెర వెనుక ఉంటున్నది కానీ, ఉత్తరాది రాష్ట్రాలలో ఖాప్ పంచాయితీల పేరుతో సమాజమే ప్రత్యక్షంగా స్త్రీలు ఏం మాట్లాడాలి? ఏం వేసుకోవాలి? ఎవరితో మాట్లాడాలి? ఇప్పుడైతే ఏం తినాలని కూడా నిర్దేశిస్తూ పరువు పేరుతో జరిగే హత్యలు కూడా సమాజమే నేరుగా చొరవ తీసుకుని పంచాయితీలలో హత్యలు కూడా చేస్తూ వస్తున్నది. అంటే వ్యక్తులకు, సమాజాలకు కనీస జ్ఞానం, కనీస మానవీయతలు లేని ఒక తప్పుల తడకల వ్యవస్థలో మనం బతుకుతున్నాం. ఈ వ్యవస్థలో తప్పుడు నడవడికి బలవుతున్న వాళ్లు మాత్రం ప్రేమికులే. ముఖ్యంగా ఇటువంటి చర్యల వల్ల అమ్మాయిలైతే జీవిత కాలమంతా మానసిక సంఘర్షణతో బతుకుతున్నారు.

ఒక మనిషిని చంపే అధికారం ఎవరికీ లేదు. చట్టానికి కూడా ఆ హక్కు ఉండకూడదని భావించినందువల్లనే ఈ రోజు ఉరిశిక్ష రద్దు ప్రధానమైన చర్చనీయాంశమైంది. ఇక ప్రత్యక్ష హత్యలైతే ఏ రకంగానూ ఆమోదయోగ్యం కావు. అసలు చంపే హక్కు ఎవరికైనా ఎట్లా వస్తుంది? ఎవరి వ్యక్తిగత జీవితాలు వారికుంటాయి కదా! ఆ వ్యక్తిగత జీవితాలలోకి చొరబడే అధికారం కుటుంబంలోని వ్యక్తులకు గానీ, సమాజానికి గానీ ఎందుకుంటుంది? తన జీవితాన్ని ఏ దిశగా నిర్వచించుకోవాలో నిర్ణయించుకునే అధికారం తనకుండదా? అలా స్వేచ్ఛగా ప్రవర్తిస్తే చంపడమేనా? తల్లిదండ్రులకైతే మాత్రం చంపే హక్కు ఉంటుందా? భ్రూణ హత్యలనే ఖండిస్తున్నప్పుడు ఎదిగిన పిల్లలను చంపడం ఎంత వరకు సరైన పని అవుతుంది?

ఇవన్నీ గమనించిన తర్వాత మనం ప్రాథమికంగా అర్థం చేసుకోవలసిన విషయమేమిటంటే కులం అనేది బ్రాహ్మణీయ భావజాలపు ఉగ్రవాదం (ఐడియాలాజికల్ టెర్రరిజం) ఫలితం. కొన్ని ప్రధాన దోపిడీ సెక్షన్‌ల మనుగడ కోసం అది అవతరించబడింది. కులాన్ని త్యజించడం, కుల నిర్మూలన జరగడమే ఈ కుల వివక్షలకు, అసమానతలకు పరిష్కారం. అయితే ఈ విషయ జ్ఞానంతో సంబంధం లేకుండా కులాంతర ప్రేమలు, వివాహాలు చేసుకున్న వాళ్లు చేసిన ఆ పని తప్పుడు పని కాదు. పైగా అది ఆదర్శప్రాయమైన చర్య. కనుక వారిని అభినందించి, వారి జీవితం ఒడిదొడుకుల మయం కాకుండా మద్దతివ్వడం పెద్దరికం అవుతుంది. తాము చేసే చట్ట వ్యతిరేక భౌతిక నిర్మూలనలకు పరువు హత్యలనే పేరు పెట్టుకుని, తమ పిల్లల పాలిట తామే నిర్దయగా ప్రవర్తించడం వల్ల ఎవరికి కడుపుకోత కలుగుతుందో ఆలోచించాలి. ఒకప్పుడు సతీ సహగమనం, బాల్య వివాహాలు వంటి ఆచారాలుండగా, వాటిని ఈ రోజు మనం ఎట్లా అసహ్యించు కుంటున్నామో, అలాగే ప్రేమ వివాహాలను గానీ, కులాంతర వివాహాలను గానీ అడ్డుకునే చర్యలను, ఆ చర్యలకు ప్రేరేపించే పెద్దలను ముందు తరాలు దోషులుగా నిలబెట్టే స్థితి వస్తుంది. పిల్లల అభ్యుదయ వివాహాలను ఆమోదించని ప్రగతి నిరోధకులుగా పెద్దలు నిలిచిపోయే పరిస్థితి ఏర్పడుతుంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# పార్లమెంటరీ ప్రజాస్వామ్యం : నక్సల్బరీ పోరాటం

***భారత ప్రజాస్వామ్యం సారంలో ప్రజాస్వామ్యం కాదని నిర్వచించి వ్యవస్థ పునాదులను ప్రశ్నించడమే నక్సల్బరీ విశిష్టత అంటున్నారు ప్రొ. జి. హరగోపాల్***

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, (అంటే ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం) పారిశ్రామిక విప్లవంలో నుండి ఉద్భవించిన ఒక ప్రయోగం. మధ్య యుగాలలో ఏర్పడ్డ రాచరిక వ్యవస్థ ప్రపంచ దేశాలన్నింటిలో దైవానుగ్రహం (డివైన్ రైట్ థియరీ) నుండి తనకు అధికారం వచ్చిందని, రాజు భగవంతుడి ప్రతినిధి అనే విస్తృత ప్రచారం ద్వారా ప్రజల సమ్మతిని ఏదో మేరకు సాధించింది. మనిషి ప్రకృతి శక్తుల అధీనంలో ఉన్నప్పుడు పుట్టడం, జీవించడం, మరణించడం ఒక సర్వాతీత శక్తి మీద ఆధారపడి ఉందన్న భావన రాచరిక వ్యవస్థకు ఆధారభూతంగా పనిచేసింది. ప్రకృతి శక్తుల మీద ఆధిపత్యం సాధించే క్రమంలో మనుషులు ప్రపంచాన్ని చూసే పద్ధతిలో, ప్రకృతి సూత్రాలని అవగాహన చేసుకునే క్రమంలో పెరుగుతున్న ఆత్మవిశ్వాసం నుండి కొత్త ప్రశ్నలు లేదా మౌలిక ప్రశ్నలు అడగడం ప్రారంభం కావడంతో, దైవాంశ అధికారం ప్రశ్నార్థకమై రాచరిక మూలాలు కదలడమే కాక రాజ్యాధికారానికి ఒక కొత్త సాధికారికత అవసరమైంది. ఆ విధంగా పారిశ్రామిక విప్లవం మనిషికిచ్చిన విశ్వాసం లో నుండి ప్రాతినిధ్య ప్రజాస్వామ్య భావన ఎదిగి ప్రత్యామ్నాయ పాలనా నిర్మాణాలకు దారితీసింది. అది మనం అనుకున్నంత సులభంగా, సహజంగా రాలేదు. ప్రజలు పొందిన కొత్త చైతన్యం నుండి ముందుకు వచ్చిన పోరాటాలు, త్యాగాల నుండి ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ ఆవిష్కరణ జరిగింది. పారిశ్రామిక విప్లవం వచ్చిన ప్రతి దేశంలో అనివార్యంగా ఈ మార్పులు వచ్చాయి. అయితే 18వ శతాబ్దంలో ఉవ్వెత్తున ముందుకు వచ్చిన ఫ్రెంచి విప్లవం మానవ సమాజానికి కొన్ని సుసంపన్నమైన ప్రజాస్వామ్య విలువలను అందించి మానవాళి పాలనా సంస్కృతిని, సామాజిక సంబంధాలను ఉన్నతీకరించింది.

ప్రాతినిధ్య ప్రజాస్వామ్యానికి ఎన్నికలు ఒక ప్రధానమైన మార్గంగా పరిగణించడం పరిపాటి అయ్యింది. పారిశ్రామిక విప్లవం ఒక వైపు ఉత్పత్తి శక్తులను పెంచుతూ కొత్త వర్గ సమాజానికి దారితీయడంతో పెట్టుబడికి లేదా సంపదకు మానవ శ్రమకు మధ్య అంతరం పెరిగింది. దీంతో ఆర్థిక ప్రయోజనాల మధ్య వైరుధ్యం ఏర్పడడంతో రాజకీయ పార్టీలు ఏర్పడి ఒక్కొక్క పార్టీ కొన్ని ప్రయోజనాలకు ప్రాధాన్యత ఇవ్వడం వలన, ప్రయోజనాల మధ్య పోటీ రాజకీయ పార్టీల మధ్య పోటీగా మారడంతో ఎన్నికలలో ఈ పార్టీలు పోటీపడడం, పౌరులు ఏదో ఒక పార్టీకి ఓటు వేయడం, ఎవ్వరికి మెజారిటీ ఓట్లు వస్తే వాళ్లకు ఒక నిర్ణీతకాలం అధికారంలో ఉండేలా అంగీకరించడంతో ఎన్నికల ప్రక్రియకు ప్రాధాన్యత లభించింది. గెలిచిన పార్టీ అందరి ప్రయోజనాలను చూసుకుంటుంది అనే ఒక ప్రచారం ఆచరణలోకి వచ్చింది. అది అందరి ప్రయోజనాలను కాపాడకపోతే ఎన్నికలలో ఆ పార్టీని అధికారం నుండి ప్రజలు తొలగించి మరో పార్టీని ఎన్నుకోవచ్చున్న వెసలుబాటు ఓటర్లకు ఎక్కడలేని బలం వచ్చినట్లు భావించడం కూడా ఒక సామాజిక వాస్తవమే.

కార్ల్ మార్క్స్ ఎన్నికల రాజకీయాలను విశ్లేషిస్తూ సంపన్నులు (ఆయన భాషలో బూర్జువా వర్గం) ఎన్నికలను ఒక కవచంగా ఉపయోగించుకొని తమ ప్రయోజనాలే అందరి ప్రయోజనాలుగా భావించేలా ఈ ప్రక్రియను ఉపయోగించుకున్నారని, వర్గ సమాజాలలో ఇది సహజమేనని, వర్గ సమాజాలు రద్దు అయ్యే క్రమంలో ప్రజలు సమిష్టిగా జీవించే దశకు చేరుకున్నప్పుడు ప్రజలు స్వయం పరిపాలనను సాధించి పరోక్ష ప్రజాస్వామ్యం నుండి ప్రత్యక్ష ప్రజాస్వామ్య దశలో ప్రవేశిస్తారని సూత్రీకరించాడు. దానికి ఆయన ప్యారిస్ కమ్యూన్ ప్రయోగాన్ని బీజప్రాయంలో ఉన్న నిజమైన ప్రజాస్వామ్య వ్యవస్థ అని కూడా భావించాడు. బూర్జువా ప్రజాస్వామ్యం రెండు మూడు శతాబ్దాలుగా భిన్న రూపాలను సంతరించుకుంది. మార్క్స్ ఊహించిన వర్గరహిత ప్రత్యక్ష ప్రజాస్వామ్య పరిణామం రావడానికి చాలా కాలమే పట్టవచ్చు. ఆ మధ్యకాలంలో నియంతృత్వ, రాజరిక వ్యవస్థలకంటే పరోక్షమే ఐనా ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం ఒక మెరుగైన పాలనా ప్రక్రియ అనే అంశం మీద తర్జన భర్జన జరుగుతూనే ఉంది.

పారిశ్రామికీకరణ ముందుగానే సాధించిన యూరోపియన్ దేశాలు వెనకబడిన దేశాలను ఆక్రమించడం, అక్కడి వనరులను కొల్లగొట్టడం, వలస దేశాలను తమ మార్కెట్ అవసరాలకు ఉపయోగించుకోవడం వలన ప్రపంచంలోని చాలా దేశాలలో సహజంగా రావలసిన పారిశ్రామిక అభివృద్ధి కుంటుపడడంతో ప్రపంచ చరిత్ర చాలా ఆటుపోట్లకు గురైంది. పెట్టుబడిదారీ దేశాల్లో కూడా ప్రజాస్వామ్యం వెల్లివిరిసిందని కాదు, వేరే దేశాలను కొల్లగొట్టేవాడు తమ దేశంలో నిజమైన ప్రజాస్వామ్యాన్ని నిర్మించలేడు. ఆయా దేశ ప్రజలు ప్రత్యక్షంగానో పరోక్షంగానో తమ దేశ దోపిడీ విధానానికి కొంత బలౌతుంటారు. ఈ దేశాల మధ్య పోటీ పెరిగి ప్రజలను యుద్ధాలలోకి లాగడం, దేశభక్తి పేరుమీద, జాతీయత పేరుమీద ప్రజలు అంగీకరించినా, అంగీకరించకున్నా తమ దేశం ఇతర దేశాల మీద చేసే యుద్ధంలో భాగమైపోతారు, ఆవేశాలకు గురౌతుంటారు, తమ పాలకుల జయ అపజయాలకు మూల్యాన్ని చెల్లిస్తుంటారు. ప్రజాస్వామ్య దేశాలుగా పరిగణింపబడే యూరోపియన్ దేశాలు రెండు ప్రపంచ యుద్ధాల విధ్వంసాన్ని, ప్రాణ నష్టాన్ని చూశారు, అనుభవించారు. రెండు యుద్ధాలలో జర్మనీ పాత్ర ప్రపంచ ప్రజలకు తెలుసు. హిట్లర్ జర్మనీలో ఎన్నికల ద్వారా అధికారంలోకి వచ్చాడు. యూదుల మీద ఆయన చేసిన మానవహననం మానవ చరిత్రకు, మానవీయతకు మాయని మచ్చగా మిగిలిపోయింది. హిట్లర్ దృష్టాంతం ప్రపంచ ప్రజల

అనుభవంలోకి రావడంతో ఎన్నికల ద్వారా ప్రజాస్వామ్యం విలసిల్లడం కాదు, ఫాసిజం కూడా అధికారంలోకి రావచ్చని, లక్షలాదిమంది ప్రాణాలను అత్యంత క్రూరంగా తీసుకోవచ్చనే చేదు నిజం మన సమిష్టి జ్ఞానంలోకి ఏదోమేరకు వచ్చింది. దానిని మరచిపోవడం చాలా ప్రమాదం.

భారతదేశం లాంటి ఎన్నో అభివృద్ధి చెందుతున్న దేశాలు వలసవాదానికి వ్యతిరేకంగా ఏదో మేరకు పోరాడాయి. పోరాడే క్రమంలో ప్రత్యర్థిని పూర్తిగా వ్యతిరేకించే బదులు ప్రత్యర్థి దేశాల సంస్థలను, విలువలను, ప్రయోగాలను తమ దేశాలకు కూడా ప్రయోజనమే అని భావించడంతో, తమ దేశ ప్రజల చైతన్యం నుండి కాని, తమ దేశ ఆర్థిక సాంస్కృతిక మూలాల నుండి కాని లేదా స్వాతంత్ర పోరాట స్ఫూర్తితో ప్రత్యామ్నాయాల గురించి ఆలోచించడం కాని చేయకపోవడంతో వలసవాద పాలన ప్రభావం స్వాతంత్రానంతరం కొనసాగడం మన అందరం గమనిస్తూనే ఉన్నాం. ఎన్నికల రాజకీయాలు అందులో ఒక భాగం. పాలకులు ఎన్నికలే ప్రజాస్వామ్యానికి ప్రమాణం అని ప్రచారం చేస్తూ ప్రజాస్వామ్యాన్ని ఎన్నికల ప్రక్రియకి కుదించడంతో, ఈ దేశాల్లో లాంఛనప్రాయమైన ప్రజాస్వామ్యమేర్పడి (ఫార్మల్ డెమోక్రసీ) సారంలో అది ఒక డొల్ల వ్యవస్థగా మారింది. ఎన్నికల తర్వాత ఎన్నికలు జరుగుతుంటాయి, కొందరు గెలుస్తారు, కొందరు ఓడుతారు. ఎవ్వరు ఎందుకు గెలుస్తారో ఎవ్వరు ఎందుకు ఓడుతారో టి.వి ఛానెల్‌లలో పనికిరాని, ప్రయోజనం లేని చర్చలు గంటల తరబడి జరుగుతుంటాయి. ఒక ఎన్నికల తర్వాత ఆ దేశంలో ప్రజాస్వామ్య పునాదులు బలపడ్డాయా, ప్రజల భాగస్వామ్యం పెరిగిందా, కొత్త విలువలు ఏమైనా ఆచరణలోకి వచ్చాయా, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా ఏదైనా ప్రయోగంలోకి వచ్చిందా అన్న ప్రశ్నలు చర్చకే రాకపోవడంతో భారతదేశం లాంటి దేశాలలో మన కళ్ల ముందే ప్రజాస్వామ్యం మీద గౌరవం లేని వారు, రాజ్యాంగ విలువల పట్ల ఏమాత్రం కమిట్‌మెంట్ లేని వారు రాజ్యాంగం మీద ప్రమాణం చేసిన మరుక్షణమే రాజ్యాంగ విరుద్ధ పనులు చేస్తుండడం అందరం గమనిస్తున్నాం. ఇప్పుడైనా నిజమైన ప్రజాస్వామ్యం అంటే దాని అర్థమేమిటో అనే ప్రశ్న అడగడం అత్యవసరం, అనివార్యం.

ప్రజాస్వామ్యం అంటే అది ఒక పాలనా స్వరూపం (ఫామ్ ఆఫ్ గవర్నెన్స్) కాదు, అది ఒక జీవన విధానం. నిత్య జీవితంలో మానవ సంబంధాలు ఏ విలువల మీద ఆధారపడి ఉన్నాయి, మనుషులలో సమానత్వ సమిష్టి భావన పెరుగుతున్నదా? సమాజంలోని అన్ని ఆధిపత్య రూపాలు – పురుషాధిపత్యం, స్త్రీ పురుషుల మధ్య సంబంధాలు, కుల సంబంధాలు, మతపర పరస్పర గౌరవం, మతం నుండి స్వేచ్ఛ క్రమేణ బలపడడం, ఆర్థిక వ్యవస్థలో అంతరాలు తగ్గడం లేదా మారుతున్నాయా అన్నవి మౌలిక ప్రశ్నలు. ఈ సామాజిక సంబంధాలు మారడానికి సమాజంలో ఏ కృషి జరుగుతున్నది, అన్యాయానికి గురైన వాళ్లు దానికి వ్యతిరేకంగా పోరాడడానికి కావలసిన వెసలుబాటు, చోటు (స్పేస్) ఉన్నదా, ఒకే కాలంలో ఎన్ని ప్రజాస్వామ్యయుత సామాజిక రాజకీయ ఉద్యమాలు జరుగుతున్నాయి అనే అంశాన్ని విశ్లేషించకుండా అన్ని సమస్యలు ఎన్నికలప్పుడే తేలిపోతాయి, లేదా తేల్చుకోవచ్చు అన్న అవగాహన ప్రజాస్వామ్య పరిణామానికి చాలా పెద్ద ప్రతిబంధకం. వలసవాద దోపిడీని అనుభవించిన దాదాపు అన్ని దేశాలలో, ఎన్నికలు క్రమంగా జరుగుతున్న సమాజాలలో కూడా సామాజిక ఉద్యమాలు, విప్లవోద్యమాలు సమాంతరంగా సాగుతున్నాయి. ప్రత్యామ్నాయ సమాజ స్వప్నమున్న ప్రతి దేశంలో ప్రతి ఘటనోద్యమాలు జరుగుతూనే ఉన్నాయి. అలాంటి ఉద్యమాలలో భారతదేశంలో ముందుకు వచ్చిన విప్లవోద్యమం నక్సల్బరీ ఉద్యమం. ఇది గత అర్థ శతాబ్దం చాలా ఆటుపోట్లకు గురౌతూ సజీవంగా ఉంది. నక్సల్బరీ దేశంలోని రాజకీయ చర్చ స్వభావాన్ని చాలా మౌలికంగా మార్చింది.

గత అర్థ శతాబ్ద కాలంలో భారత ప్రధాన స్రవంతి రాజకీయాలు చాలా వేగంగా మారుతూ వచ్చాయి. నిజానికి 1967–71 మధ్య కాలంలో ప్రజలు ఒక విస్తృత నిరసనను భిన్న రూపాల్లో వ్యక్తీకరిస్తూ వచ్చారు. ఈ నిరసనకు స్పందనగా ఇందిరాగాంధీ పేదరిక నిర్మూలన, భూ సంస్కరణలు లాంటి అంశాలను రాజకీయ ఎజెండాలోకి తెచ్చింది. అప్పటికే సంపన్నులు, పారిశ్రామికవేత్తలు, భూస్వాములు తమ ప్రయోజనాలకు కావలసిన నిర్మాణాలను నిర్మించుకునే ఉన్నారు. ఇందిరాగాంధీకి అది తెలియదని కాదు, తాను ప్రతిపాదించిన విధానాలను అమలు చేయగలనని లేదా చేయాలని ఆమెకు చిత్తశుద్ధి ఉందని కూడా భావించవలసిన అవసరం లేదు. అది అప్పటి రాజకీయ అవసరం. అయితే ఇందిరాగాంధీ ఎజెండా ప్రజల చైతన్యంలో కొత్త ఆశలను కల్పించింది, చైతన్య స్థాయి పెంచింది. ఈ చైతన్యం విప్లవోద్యమ స్థాయికి వెళ్లే దశలో లేదు. ఈ పరిణామక్రమంలో కులాలు, సమూహాలు, ప్రాంతాలు, ఆదివాసులు తమ తమ సమస్యలకు ఎవరికి వారు స్పందించడంతో దేశవ్యాప్తంగా ఒక సంఘటిత ఉద్యమం సాగలేదు లేదా సాధ్యం కాలేదు. ఈ క్రమం అస్తిత్వ ఉద్యమాలకు కావలసిన మార్గాలు వేసింది. దాదాపు 1970వ దశకం నుండి అస్తిత్వ ఉద్యమాలు పుంజుకున్నాయి. రాజ్యం కూడా తన విధానాల ద్వారా ఈ రాజకీయాలను ప్రోత్సహించాయే తప్ప, ఉద్యమాలలో అంతర్లీనంగా ఉండే ఆకాంక్షల మేరకు మౌలిక మార్పు చేయడానికి సంసిద్ధత చూపించలేదు.

గత మూడు నాలుగు దశాబ్దాలుగా సామాజిక ఉద్యమాలు పెరుగుతూ వచ్చాయి. ప్రతి సామాజిక ఉద్యమం ఒక లక్ష్యం కొరకు లేదా ఒక సమస్య పరిష్కారం కొరకు, లేదా అభివృద్ధి పేర జరుగుతున్న విధ్వంసానికి నిరసనగా ముందుకు వచ్చాయి. ఇవన్నీ సంఘటిత ఉద్యమాలుగా ఎదగక పోవడం వలన సమాజంలో విభజన పెరుగుతూ భిన్న రాజకీయ పార్టీల ఆవిర్భావానికి దారి తీసింది. కొన్ని పార్టీలు ఆయా రాష్ట్రాల్లో అధికారానికి కూడా వచ్చాయి. ఏ రాజకీయ పార్టీ కూడా సమాజంలో ఉండే సమస్యల మూలాలకు వెళ్లడానికి సిద్ధపడడం లేదు. రాజకీయాలు నిజానికి సృజనాత్మకంగా సమస్యలను సమగ్ర పరిష్కారాల దిశగా కృషి చేయాలి. అది వదిలేసి తాత్కాలిక పరిష్కారాలు సూచిస్తూ ఒక ఎన్నికలో అధికారంలోకి రావడం మరుసటి ఎన్నికలలో ఓడిపోవడం ఒక ఆనవాయితీగా మారింది.

నిజానికి ఎన్నికల రాజకీయాలు రూపంలో మాత్రమే ప్రజాస్వామికంగా అగుపించి సారంలో తమ పటిష్ఠతను కోల్పోయాయి. దాదాపు అన్ని రాజకీయ పార్టీలు తాత్కాలిక సమస్యలతో కొట్టుమిట్టాడుతుంటే, సంపన్నవర్గాలు తమ ప్రయోజనాలకు అనుగుణంగా విధానాలను మలుపుతూ 1980వ దశాబ్ద ప్రారంభం వరకే దేశానికి పెట్టుబడిదారీ వ్యవస్థ తప్ప వేరే మార్గం లేదు అనే స్థాయికి నెట్టారు.

# ప్రజాతంత్ర - మతోన్మాద జాతీయత

***భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో ఆర్ఎస్ఎస్, బిజెపి శక్తులు ఒక రకంగా వ్యతిరేక పాత్రను పోషించారనీ, ఇప్పుడు అధికారంలోకి వచ్చిన తరువాత దేశభక్తి, జాతీయత పేరిట హిట్లర్ తరహా అరాచకవాదాన్ని సృష్టిస్తున్నారనీ అంటున్నారు* కొండూరు వీరయ్య**

దేశంలో గత రెండునెల్లుగా జాతీయత పేరుమీద కుహనా జాతీయ వాదం వెర్రితలలు వేస్తోంది. ప్రభుత్వ అధికారిక భావజాలాన్ని వ్యతిరేకించే వారు, ప్రశ్నించేవారు దేశద్రోహులుగా ముద్రించ బడుతున్నారు. ఉరిశిక్ష హేతుబద్ధతను ప్రశ్నించిన వారంతా ఉగ్రవాద సమర్థకులుగా దూషించ బడుతున్నారు. దేశ సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థలను ప్రభావితం చేస్తున్న అంశాల పట్ల ప్రభుత్వ ప్రోత్సాహిత నిపుణులు, ఆశ్రిత మేధావుల అభిప్రాయాలకు భిన్నంగా స్వతంత్ర అభిప్రాయాలు కలిగి ఉండడం రాజద్రోహంగా మారిపోయింది. ఈ పరిణామాలన్నింటి వెనక దండలో దారంలాగా కొనసాగుతున్న అంశం జాతీయత గురించిన చర్చ. పాలకవర్గాల అభిప్రాయాలే సర్వ సాధారణంగా ప్రజాభిప్రాయా లుగా చెలామణి అవుతాయన్న మార్క్స్ సూత్రీకరణ తాజా పరిణామాల నేపథ్యంలో మరింత కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

1980 దశకంలో ఎల్కె అద్వానీ నేతృత్వంలోని బిజెపి భారతీయ లౌకిక పునాదులపై దాడి చేయడానికి కుహనా లౌకికవాదం అన్న పదబంధాన్ని ముందుకు తెచ్చింది. 2014 ఎన్నికల ఫలితాల తర్వాత వెలువడిన విశ్లేషణల్లో విశ్లేషకులు, వ్యాఖ్యాతలు చివరకు లౌకికతత్వం అన్న స్వతంత్ర భావన అవసరమా అన్న ప్రశ్న ముందుకు తెచ్చేందుకు సాహసించే దుస్థితి తలెత్తింది. ఈ చర్చ ఫలితంగానే ముస్లిం మైనారిటీల నరమేధానికి పాల్పడిన వ్యక్తి, ఆయనకు ఊతమిచ్చిన శక్తులు జాతి భవిష్యత్తుకు జామీనుదారులుగా ప్రజల ముందు ఫోజు కొట్టడానికి, ఈ ప్రచారమే పెట్టుబడిగా పునాదిగా హస్తినలో రాజ్యాధికారాన్ని స్వంతం చేసుకోవడానికి సోపానంగా మారింది. తదనంతర కాలంలో ఉన్మత్త హిందూత్వ శక్తులు రాజ్యాంగ పునాదులుపై సాగిస్తున్న విధ్వంసక దాడికి మరింత పదును పెట్టిన సందర్భంగా తాజాగా భారత జాతీయత అన్న భావనపై సాగుతున్న దాడిని చెప్పుకోవచ్చు. ఈ నేపథ్యంలో భారతీయత గురించి ప్రజాతంత్ర రాజ్యాంగం అందించిన అవగాహనకు నియంతృత్వ ధోరణులకు నిలువెత్తు నిదర్శనం అయిన ఆర్ఎస్ఎస్ ముందుకు తెస్తున్న అవగాహనకు మధ్య ఉన్న విభజన రేఖను అర్థం చేసుకోలేకపోతే మరో

---

పెట్టుబడిదారీ వ్యవస్థ, పాశ్చాత్య అనుభవ నేపథ్యంలో చెప్పాలంటే ఒకవైపు సమాజంలో శాస్త్రీయ దృక్పథాన్ని పెంచుతూ ఒక ప్రజాస్వామిక సంస్కృతిని కూడా పెంచాలి. అయితే పెట్టుబడి పెరిగినా దానికి అనుగుణంగా కావలసిన సంస్థలకు, సంస్కృతిని పెంపొందించకపోయే ప్రక్రియను ఆర్.ఎస్. రావు పెట్టుబడిదారీ సంస్కృతి లోపించిన పెట్టుబడి (కాపిటల్ వితౌట్ కాపిటలిజం) అని సూత్రీకరించారు. అందుకే ఎన్నికల రాజకీయాలలో క్రమక్రమేణ ప్రజాస్వామ్య విలువలు, ముఖ్యంగా రాజ్యాంగం నిర్దేశించిన లక్ష్యాలవైపు వెళ్లడం అటుంచి రాజ్యాంగ విలువలను, రాజ్యాంగ స్ఫూర్తిని ధ్వంసం చేస్తూ రావడంతో దేశంలోని పెట్టుబడి అభివృద్ధికి కావలసిన వాతావరణమే లోపించడంతో దేశంలోని పెట్టుబడిదారీ వ్యవస్థ విదేశీ పెట్టుబడికి ఎర్రతివాచీ పరచడంతో ఆ కాస్తోకూస్తో మిగిలిన స్వాతంత్రోద్యమ స్ఫూర్తి కూడా కనుమరుగవుతూ వచ్చింది.

దేశంలోని దాదాపు అన్ని రాజకీయ పార్టీలు పార్లమెంటరీ వామపక్ష పార్టీలతో సహా సామ్రాజ్యవాద ప్రేరేపిత అభివృద్ధి నమూనాను బలపరచడంతో ఎన్నికల రాజకీయాలు పూర్తిగా పట్టాలు తప్పి, ప్రజల చావుబ్రతుకుల సమస్యతో సంబంధం లేని, మౌలిక మార్పుల ప్రస్తావన కూడా లేని కొన్ని పనికిరాని సాంస్కృతిక అంశాలను ముందుకు తీసుకురావడంతో, సాంస్కృతిక జాతీయత గురించి మాట్లాడుతూ వచ్చిన బిజెపి అధికారంలోకి వచ్చింది. ఒకవైపు జాతీయత గురించి మరొకవైపు సామ్రాజ్యవాదులతో మిలాఖత్ కావడంతో దేశం ఒక ఫాసిస్టు భావజాల సుడిగుండంలోకి నెట్టబడుతున్నది. ఈ భావజాలాన్ని ఎలా ఎదుర్కోవాలో తెలియక చాలా రాజకీయ పార్టీలు తికమక పడుతున్నాయి. అందుకే ఎన్నికల రాజకీయాలే ప్రజాస్వామ్యం అని భావిస్తే, ఎన్నికల ద్వారా ఫాసిస్టు శక్తులు కూడా అధికారంలోకి రావచ్చు.

నిత్యజీవితంలో సమస్యలతో సతమతమౌతున్న ప్రజలు భిన్న ప్రతిఘటనా రూపాలను ఎన్నుకుంటున్నారు. సామ్రాజ్యవాద అభివృద్ధి విధ్వంసాన్ని కళ్లారా చూస్తూ, అనుభవిస్తున్న ఆదివాసులు రాజీలేని పోరాటాలను చేపట్టారు. దేశంలోని దాదాపు అన్ని ఆదివాసి ప్రాంతాలలో ప్రతిఘటనా పోరాటాలు జరుగుతున్నాయి. ఈ మధ్యకాలంలో దళితులు భీంసేన పేరుతో మిలిటెంట్ ఉద్యమాలకు శ్రీకారం చుట్టారు. అభివృద్ధి నమూనాతో ఊపిరి ఆడని రైతాంగం తిరుగుబాటు మార్గాలు వెతుకుతున్నారు. ఇక నిరుద్యోగ యువత ఒక అస్పష్టమైన, అయోమయమైన స్థితిలోకి నెట్టబడ్డారు. అంటే ఒక వైపు ఎన్నికలు జరుగుతూనే ఉన్నాయి, మరోవైపు భిన్నమైన ఉద్యమాలు ప్రధాన స్రవంతి రాజకీయాలు బయట జరుగుతున్నాయి. ఒక యాభై ఏళ్ల క్రితం భారత ప్రజాస్వామ్యం సారంలో ప్రజాస్వామ్యం కాదని, దేశ ఆర్థిక రాజకీయ పునాదులనే ప్రశ్నించి, ఒక ప్రత్యామ్నాయ వ్యవస్థ కొరకు పోరాటాల్ని చేపట్టిన నక్సల్బరీని ఈ నేపథ్యంలోనే అర్థం చేసుకోవాలి.

(రచయిత సామాజిక శాస్త్రవేత్త) వీ

తరం మతోన్మాదం ప్రేరిత భావోద్వేగాలకు బలికాక తప్పని పరిస్థితి కనిపిస్తుంది. ఈ పరిస్థితిలో జాతీయత భావజాలం ఆవిర్భావం, దాని పుట్టుపూర్వోత్తరాలు, భారత జాతీయత ఆవిర్భావం, ఆర్‌ఎస్‌ఎస్ ప్రతిపాదిత జాతీయతకు రాజ్యాంగం ప్రతిపాదిత జాతీయతకు మధ్య ఉన్న వైవిధ్యం వైరుధ్యం గురించిన విషయాలు క్లుప్తంగా చర్చించుకుందాం.

ఏ విషయాన్నైనా దాని చారిత్రక పరిణామం నేపథ్యంలో పరిశీలిస్తే వాస్తవాలు వెల్లడవుతాయి. ఇదే ప్రమాణాన్ని జాతీయత, జాతీయవాదానికి కూడా వర్తింపచేయవచ్చు. చారిత్రక పరిశీలన కోణం నుండి చూసినపుడు ఆధునిక ప్రపంచ చరిత్ర, ఆధునిక జాతీయ రాజ్యాల చరిత్ర, పెట్టుబడిదారీ వ్యవస్థ దాని పరిణామ చరిత్ర విడదీయరానంతగా ఒకదానితో ఒకటి పెనవేసుకుపోయాయి. వివిధ భౌగోళిక ప్రాంతాల మధ్య నిర్దిష్టంగా, స్పష్టంగా గుర్తించగలిగిన సంస్కృతి, ఆచార వ్యవహారాలు, భాషలు ఇతర ప్రమాణాలుగా ఉంటాయి. అందువల్లనే రాజ్యం గురించిన ప్రాథమిక పరిచయ పాఠ్యాంశాల్లో రాజ్యానికి ఉండాల్సిన ప్రాథమిక లక్షణాలు – ప్రభుత్వం, భాష, ప్రజలు, నిర్దిష్టమైన సరిహద్దులు – అని నిర్వచించారే తప్ప మరే ప్రమాణం గురించీ ప్రస్తావించలేదు. ఎక్కడా రాజ్య వ్యవస్థలను మతాల ప్రాతిపదికన, సంకుచిత లక్ష్యాల కోసం రూపొందించిన నిర్వచనాల ప్రాతిపదికన వర్గీకరించలేదు. 19వ శతాబ్దం ముగింపు నాటికి లౌకిక నిర్వచనం ప్రకారమే జాతీయతను నిర్ధారించడం ప్రమాణంగా ఉంది. పాశ్చాత్య దేశాలన్నీ పైన చెప్పిన నాలుగు లక్షణాల ప్రాతిపదికనే సరిహద్దులు విభజించుకున్నట్లు యూరోపియన్ దేశాలచరిత్ర మనకు విధితం చేస్తుంది.

యూరోపియన్ జాతీయవాదం పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి, విస్తరణతో పాటు సంఘటితం అవుతూ వచ్చింది. దేశాల్లో పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెందిన వేగానికి అనుగుణంగా ఆయా దేశాల్లో జాతీయవాదం బలంగా వేళ్లూనుకుంటూ వచ్చింది. జాతీయవాదం దేశంలో ఉన్న అంతర్గత శత్రువును గుర్తించి వారిపై పోరాడే క్రమంలో యూరోపియన్ జాతీయత క్రోడీకరించబడింది. యూరోపియన్ జాతీయత ప్రధానంగా ఒకే మతం, ఒకే భాష, ఒకే ఆర్థిక వ్యవస్థ చుట్టూ అల్లుకుపోయిన జాతీయత. పెట్టుబడిదారీ దేశాలు తమ మార్కెట్ అవసరాలు తీర్చుకునే నేపథ్యంలో వలసవాదాన్ని ఆశ్రయించడంతో జాతీయతకు సరికొత్త వ్యాఖ్యానం తెరమీదకు వచ్చింది. వర్ధమాన దేశాల జాతీయ భావాలు బాహ్య శత్రువుకు వ్యతిరేకంగా వైవిధ్యభరితమైన ప్రజా సమూహాలను ఏకం చేసే క్రమంలో ముందుకొచ్చిన జాతీయత. ఈ విధంగా చూసినపుడు యూరోపియన్ జాతీయత నిర్దిష్ట వర్గాలను, సామాజిక తరగతులను, మత విశ్వాసాలను వెలివేసిన (ఎక్స్‌క్లూజివ్) జాతీయత కాగా, వర్ధమాన దేశాల జాతీయత సకల సామాజిక తరగతులు, మత విశ్వాసాలు, వర్గాలను సంలీనం చేసుకునే (ఇన్‌క్లూజివ్) జాతీయత అన్న ప్రాథమిక వైరుధ్యాన్ని అర్థం చేసుకోవాల్సి ఉంది. అందువల్లనే భారత రాజ్యాంగం సమ్మిశ్రిత స్వభావం ఉన్న రాజ్యాంగం. భారతదేశంలో వివిధ మతాలు, సంస్కృతులు, ఆర్థిక వ్యవస్థలు సరికొత్త సమ్మిళిత అస్థిత్వాన్ని ముందుకు తెచ్చాయి. ప్రజాతంత్ర జాతీయతకు పునాదులు వేసింది.

భారత రాజ్యాంగం, భారత జాతీయత రెండూ స్వాతంత్ర్యోద్యమ పోరాట నేపథ్యంలో రాటుదేలిన వైవిధ్య భరితమైన రాజకీయ సామాజిక మేధోమథన ఫలితం. యూరోపియన్ జాతీయత సంఘటితం అయ్యే క్రమంలో పాలకవర్గాలు, మార్కెట్ కీలక పాత్ర పోషిస్తే భారత జాతీయత సంఘటితం కావడంలో ప్రజలు, ప్రజా పోరాటాలు, ప్రత్యేకించి పెట్టుబడిదారీ వ్యవస్థ అంశగా మారిన వలసవాదానికి వ్యతిరేకంగా వెల్లువెత్తిన ప్రజాపోరాటాలు కీలక పాత్ర పోషించాయి.

భారత రాజ్యాంగం జాతీయత అంటే ఏమిటి? ఇండియా దట్ ఈజ్ భారత్ అన్న పదబంధాన్ని ఎందుకు వాడారు అన్న విషయాలు అటువంటి మౌలిక విషయాలను వివరించబూనుకోలేదు. అంతమాత్రాన రాజ్యాంగ పరిషత్ ఈ అంశాలను తడమలేదు అనుకుంటే పొరపాటు. అప్పటికే సర్వాంగీకృత అభిప్రాయాల పర్యవసానంగా ఈ పదబంధాలు ఉన్నందున వాటి గురించి ప్రత్యేకంగా చర్చించలేదు. కానీ వాటిని విపులీకరిస్తూ వివిధ అధికరణల్లో ప్రస్తావనలు వదిలారు. భారత భూభాగంపై జన్మించి నివసిస్తున్న పౌరులందరు భారతీయులే అని పౌరసత్వాన్ని ధృవీకరించింది. తద్వారా భారత జాతీయత భారత దేశంలో నివసించే వారందరి ఉమ్మడి జాతీయత అని చెప్పకనే చెప్పింది. అంతేకాదు, దేశంలో నివశిస్తున్న వైవిధ్యభరితమైన సామాజిక ఆర్థిక తరగతులు, మత విశ్వాసాలకు చెందిన వారిని గుర్తించడమే కాక వారి అస్థిత్వాన్ని రాజ్యాంగం అంగీకరించింది. అందువల్లనే అటువంటి వెనకబడిన తరగతులందరికీ అవసరమైన రక్షణలు కూడా కల్పించాలని ప్రతిపాదించింది.

స్వాతంత్ర్యోద్యమ పర్యవసానంగా సంఘటితం అయిన భారత జాతీయతను కాపాడుకోవాలంటే స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న అన్ని తరగతుల ప్రజల మనోభావాలు, ఆశలు, ఆశయాలు నెరవేర్చుకునేందుకు రాజ్యాంగం ద్వారా కనీస హామీ ఇవ్వాలని రాజ్యాంగ పరిషత్ నిర్ణయించింది. అందువల్లనే స్వతంత్ర భారతదేశం ఎన్నో వేర్పాటువాద ఉద్యమాలను తట్టుకుని అధిగమించి జాతీయ సమైక్యతా సమగ్రతలను కాపాడుకుంటూ తన ఉనికిని కొనసాగించుకుంటూ వచ్చింది. దీనికి పూర్తిగా భిన్నమైనది మతోన్మాద జాతీయత. జాతీయవాదం. ప్రజాతంత్ర జాతీయవాదానికి భారతదేశాన్ని ఉదాహరణగా చెప్పుకుంటూ దానికిపూర్తిగా భిన్నమైన మతోన్మాద జాతీయవాదానికి సమకాలీన ఉదాహరణగా పొరుగున ఉన్న పాకిస్తాన్‌ను చెప్పుకోవచ్చు.

రాజ్యాంగం ఆర్‌ఎస్‌ఎస్ కోరుకుంటున్న మనువాద వ్యవస్థ, కుల వ్యవస్థలను తిరుగులేని విధంగా దెబ్బతీసింది. కుల వ్యత్యాసాలు, మత విశ్వాసాలతో నిమిత్తం లేకుండా రాజ్యాంగం భారతదేశంలో జన్మించిన వారందరికీ సమాన హక్కులు, అవకాశాలు, ఓటింగ్ హక్కులు ప్రసాదించింది. ఈ విధంగా సార్వత్రిక వయోజన ఓటు హక్కు అన్నది స్వాతంత్ర్యోద్యమ నినాదాల్లో ఒకటి. నాడు బ్రిటిష్ ప్రభుత్వం కులీనులకు, పన్ను చెల్లించే వారికి, స్థిరాస్తి కలిగిన పురుషులకు మాత్రమే తొలుత ఓటు హక్కును ఇచ్చింది. ఈ సాంప్రదాయం నాడు యూరప్, అమెరికాల్లో ఈ తరహాలోనే ఓటు హక్కును సంపన్నవర్గాలకు పరిమితం చేశారు. భూస్వామ్య వ్యవస్థ నాటి ప్రాతినిధ్య వ్యవస్థలను వలసవాదం, పెట్టుబడిదారీ విధానం కూడా బతికించుకుంటూ వచ్చాయి అని చెప్పడానికి ఇది తిరుగులేని ఉదాహరణ.

ఇటువంటి పరిమిత ప్రజాప్రాతినిధ్య వ్యవస్థ స్థానంలో సార్వత్రిక

ఓటు హక్కును మొదటిగా అందరికీ అందించింది ఫ్రెంచి విప్లవం. ఈ విప్లవం స్ఫూర్తిగా నాటి వలస దేశాలన్నింటిలోనూ ఈ నినాదం పోరాట నినాదంగా మారింది. ఫ్రాన్స్, అమెరికా వంటి దేశాల్లో సార్వత్రిక ఓటు హక్కు 1960 దశకం నాటికి గానీ చట్టబద్ధం కాని పరిస్థితుల్లో భారత రాజ్యాంగం 1947 నాటికే సార్వత్రిక ఓటు హక్కును రాజ్యాంగ బద్ధం చేసింది. ఈ విధంగా సార్వత్రిక ఓటు హక్కు ఇవ్వటాన్ని నాడే ఆర్‌ఎస్‌ఎస్ వ్యతిరేకించింది. అటువంటి ఆర్‌ఎస్‌ఎస్, దాని కుపుత్రికలు, కుపుత్రులు అయిన సంఘపరివారం నేడు ప్రజాతంత్ర హక్కుల గురించి మాట్లాడడం చూస్తే దెయ్యాలు కూడా వేదాలు వల్లిస్తాయన్న సామెత ఎందుకు వచ్చిందో అర్థమవుతుంది.

మరో ముఖ్యమైన అంశాన్ని ఇక్కడ ప్రస్తావించాలి. స్వాతంత్ర్యోద్యమం నిజమైన ప్రజాతంత్ర ఉద్యమంగా పరిణామం చెందిన తీరు గురించిన విషయం అది. స్వాతంత్ర్యోద్యమ చరిత్రను ఈ కోణంలో విభజించి చూడడం ఇదే తొలి ప్రయత్నం కావచ్చు. ప్రజాతంత్రీకరణ స్వభావం రీత్యా చూసినపుడు భారత స్వాతంత్ర్యోద్యమ పోరాట చరిత్రను మూడు భాగాలుగా విభజించవచ్చు. ఇక్కడ ప్రజాతంత్ర స్వభావాన్ని పోరాటంలో ప్రజల భాగస్వామ్యం ప్రాతిపదికగా విశ్లేషిస్తున్నాము. ఈ రకంగా చూసినపుడు విస్తృత ప్రజా బాహుళ్యం భాగస్వామ్యం ఉన్న అసంఘటిత పోరాటాల దశను మొదటి దశగా పరిగణించవచ్చు. ఈస్టిండియా కంపెనీ ప్రారంభించిన భూసంస్కరణలకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా వేర్వేరు ప్రాంతాల్లో వేర్వేరు సమయాల్లో చెలరేగిన సమరశీల పోరాటాలు ఈ దశలో మనకు కనిపిస్తాయి. ఫకీర్ల తిరుగుబాటు నుండి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం వరకు ఉన్న కాలాన్ని ఈ తొలిదశగా నిర్ధారించుకోవచ్చు. దీనికి సంబంధించిన వ్యాఖ్యానాలు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని పురస్కరించుకుని 2007లో మార్క్సిస్టు ప్రచురించిన ప్రత్యేక వ్యాసాల్లో వివరంగా ఉన్నాయి.

ఇక రెండో దశగా నిర్వచించదగ్గ దశ ప్రజల భాగస్వామ్యం తక్కువగా ఉండి సంఘటిత ప్రయత్నాలు, పోరాటాలు సాగిన కాలాన్ని చెప్పుకోవచ్చు. ఈ దశ ప్రధానంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం తర్వాతి కాలంలో ముఖ్యంగా ఎఒ హ్యూమ్ సమన్వయ సహకారాలతో కాంగ్రెస్ పార్టీ ప్రారంభించింది మొదలు మహాత్మా గాంధీ భారతదేశానికి తిరిగి వచ్చేంత వరకు ఉన్న కాలాన్ని ఈ రెండో దశ కింద వర్గీకరించవచ్చు. ఈ కాలంలో ప్రధానంగా జరిగిన పోరాటాల చరిత్ర అందరికీ సుపరిచితమే. ఈ రెండవ దశనే జాతీయవాదానికి సైద్ధాంతిక జవసత్వాలు చేకూర్చే ప్రయత్నం జరిగిన దశగా చెప్పుకోవాలి. భారత జాతీయత భావానికి జవసత్వాలు చేకూర్చేందుకు ప్రయత్నం జరిగిన కోణం కాల పరిధి రీత్యా క్లుప్తమైనదే అయినప్పటికీ దేశ చరిత్రపై, ప్రత్యేకించి ప్రజ్వరిల్లుతున్న సమరశీల స్వాతంత్ర్యోద్యమం మీద తిరుగులేని, చెరగని ముద్ర వేసిన కాలం అది. ఈ ప్రయత్నం కూడా రెండు మార్గాల్లో జరిగింది.

ఇంగ్లాండ్ పార్లమెంట్‌లో సభ్యులుగా ఉన్న గ్రాండ్ ఓల్డ్ మాన్ ఆఫ్ ఇండియా, దాదాబాయి నౌరోజీ, దేశీయంగా గోపాలకృష్ణ గోఖలే వంటివారు ఆర్థిక కోణంలో భారతదేశం గురించిన చర్చను ముందుకు తేవటంతో భారత జాతీయ గురించి ఆర్థిక కోణంలో చర్చ మొదలైంది.

ఈ రెండో మార్గంలో జరిగిన ప్రధాన ప్రయత్నాలు కమ్యూనిస్టు కుట్రలుగా బ్రిటిష్ నిఘా నివేదికల్లో చోటుచేసుకున్న లాహోర్, మీరట్, కాన్పూర్ కుట్ర కేసులుగా నమోదైన పోరాటాలు. వీటిని పోరాటాలు అని వర్గీకరించడం పట్ల కొందరికి అభ్యంతరం ఉంటే ఉండవచ్చు. కానీ నేను వాటిని పోరాటాలు గానే వర్గీకరిస్తున్నాను. ఎందుకంటే భారత స్వాంత్ర్య పోరాటంలో ఈ కుట్ర కేసుల సందర్భంగా సాగిన సైద్ధాంతిక మేథోమథనం మరెన్నడూ జరగలేదు.

లాహోర్, మీరట్, కాన్పూర్ కుట్ర కేసుల విచారణ సందర్భంగా తమ వాదనలు వినిపించిన వారు నేడు జెఎన్‌యులో చరిత్ర విభాగంలో పరిశోధకులుగా దరఖాస్తు చేసుకుంటే ప్రవేశం తిరస్కరించగలిగే ధైర్యం నేడు ఎవ్వరికీ లేదని ప్రముఖ చరిత్రకారిణి మృదులా ముఖర్జీ తాజాగా వ్యాఖ్యానించిందంటే వారి వాదనల పటిమ, శాస్త్రీయత, చారిత్రత స్థాయి ఏమిటో అర్థమవుతుంది. ఈ కుట్రకేసులు తెరమీదకు తెచ్చిన అంశాలను కాదనలేక నాటికి స్వాతంత్ర్యోద్యమానికి తిరుగులేని నాయకుడుగా ఉన్న కాంగ్రెస్ సైతం ఈ అంశాలను క్రమం క్రమంగా తన ఎజెండాలోకి తీసుకొచ్చింది. ఈ రెండో మార్గంలో జరిగిన చర్చలు, మేధోమథనం ద్వారా భారతీయతకు సంబంధించిన శాస్త్రీయమైన, సైద్ధాంతిక కోణం, సామాజిక సమ్మిళిత కోణం ముందుకు వచ్చింది. ఈ ఘనత శైశవ దశలోని కమ్యూనిస్టు ఉద్యమానిదే అని సగర్వంగా చెప్పవచ్చు.

చివరి దశ సంఘటిత ప్రయత్నాలతోపాటు విశాల జనబాహుళ్యం స్వాంత్రోద్యమంలో భాగస్వాములు అయిన దశగా చెప్పుకోవచ్చు. ఇది స్వాతంత్ర్య పోరాటంలో నిర్ణయాత్మక దశ, వలసవాదానికి వ్యతిరేకంగా సమగ్ర పోరాటమే కాదు, సమీకృత పోరాటం కూడా జరిగిన దశ ఈ చివరి దశ. చివరి దశలో నిర్దిష్ట రూపం పొందిన ప్రజల భాగస్వామ్యమే తర్వాతి కాలంలోనే రాజ్యాంగ రచన సందర్భంగా అనుసరించాల్సిన విధి విధానాల విషయంలో సమీకృత, సమ్మిళిత జాతీయతను భారత జాతీయతగా స్వీకరించాల్సిన పరిస్థితిని కల్పించింది.

ఈ మూడు దశల్లోనూ తనదైన పాత్ర పోషించింది నాటి కాంగ్రెస్ పార్టీ. చివరి రెండు దశల్లో ప్రభావవంతమైన పాత్ర పోషించింది కమ్యూనిస్టు ఉద్యమం. అందువల్లనే భావసారూప్యతే కాకా సైద్ధాంతిక సారూపత్య రీత్యా స్వాతంత్రోద్యమం తొలిదశలో జరిగిన పోరాటాల స్ఫూర్తిని కొనసాగిస్తామని భారతకమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) తమ కార్యక్రమంలో చెప్పుకొన్నది. కాంగ్రెస్ పార్టీ తన వ్యవస్థాపక లక్ష్యాలకు కట్టుబడి ఉన్నట్లు నేటికీ చెప్పుకొంటోంది. కానీ భారత స్వాతంత్ర్య పోరాటంతో కానీ, పోరాట వారసత్వంతో కానీ ఏ మాత్రం సంబందం లేని పార్టీ భారతీయ జనతా పార్టీ.

స్వాతంత్ర్యోద్యమ పోరాటంలో బలిదానం గావించిన అమరలను అటు నాటి కాంగ్రెస్ గానీ, నేటి కమ్యూనిస్టు ఉద్యమం గానీ వేల సంఖ్యలో పేర్లతో సహా ప్రస్తావించే సత్తాను కలిగి ఉన్నాయి. స్వాతంత్ర్యోద్యమంలో త్యాగాలు చేసి బ్రిటిష్ జైళ్లల్లో మగ్గటం ద్వారానో, పోరాటపథంలో అశువులు బాశారనో చెప్పుకోవడానికి వీలైన నేతల పేర్లు ఆర్‌ఎస్‌ఎస్‌కు లేవు. ఆర్‌ఎస్‌ఎస్ వ్యవస్థాపకులుగా ఉన్న హెగ్డేవార్, గోల్వాల్కర్, బిజెపికి పూర్వాశ్రమ గురువు శ్యాంప్రసాద్ ముఖర్జీలు చివరకు హిందువులకు బహుభార్యత్వాన్ని సైతం సమర్థించే స్థాయికి దిగజారిన నేతల వారసత్వం మతోన్మాద సంస్థలది. ఆర్‌ఎస్‌ఎస్‌కు స్వాతంత్ర్యోద్యమానికి ఉన్న ఏకైక లింకు వినాయక దామోదర్ సావర్కార్. ఆయన్ను పూనేలో అరెస్టు చేసి అండమాన్ జైలుకు పంపితే ఈ జైలు నుండి

విడుదల చేయమని బ్రిటిష్ వాళ్ల కాళ్లా వేళ్లా పడ్డాడని ఆర్ఎస్ఎస్ పట్ల సానుభూతి కలిగిన చరిత్రకారులే ధృవీకరించారు. బాలగంగాధర్ తిలక్ స్వాతంత్ర్యం నా జన్మహక్కు అని ప్రకటించినందుకుగాను రాజద్రోహం నేరం మీద అండమాన్ జైలుకు పంపితే బొంబాయి నగరం నిరసనలతో స్థంభించి పోయింది. పూనేలో ప్లేగు వ్యాపించిన సందర్భంలో బ్రిటిష్ అధికారులను హత్య చేయడానికి ప్రయత్నం చేసినందుకు గాను సావర్కర్‌ను అండమాన్ జైలుకు పంపితే ఆయన గురించి చెప్పుకునే నాథుడే కరువయ్యాడు. నాటి ఆర్ఎస్ఎస్ ఆద్యుల్లో ఒకడని చెప్పుకుంటున్న సావర్కర్‌కు ఉన్న ప్రజాదరణ అది. అందువల్ల భారత జాతీయత గురించి ముందుకు తెస్తున్న ఆర్ఎస్ఎస్ ప్రేరేపిత, బిజెపి ప్రభుత్వ ప్రాయోజిత చర్చ స్వాతంత్ర్యోద్యమ పోరట కాలంలో నిర్దిష్టీకరించ బడిన భారత జాతీయతకు పూర్తిగా భిన్నమైనది అని అర్థం చేసుకోవాలి.

భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ఊపిరి పోసుకోవడానికి ముందే దేశ రాజకీయ రంగస్థలంలో ఆరంగేట్రం చేసిన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌కు స్వాంత్ర్యోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొనడం మాట అటుంచి స్వాంత్ర్యోద్యమానికి, దాని లక్ష్యాలకు, ప్రజల ఆశలు, ఆశయాలకు పూర్తి వ్యతిరేకంగా పని చేసింది. ప్రత్యక్షంగా బ్రిటిష్ ప్రభుత్వానికి తొత్తుగా పనిచేసింది. స్వాతంత్ర్యోద్యమ లక్ష్యాలకు వ్యతిరేకంగా ఆర్ఎస్ఎస్ దాని అనుబంధ సంఘాలు పనిచేయడం ఈ నాటిది కాదు. జాతీయ పతాకంగా త్రివర్ణ పతాకాన్ని నాటి స్వాతంత్ర్యోద్యమం ముక్తకంఠంతో అంగీకరించింది. అదే పతాకాన్ని స్వాతంత్ర్యానంతరం అధికారికంగా జాతీయ పతాకంగా దేశం అంగీకరించింది. కానీ ఈ పతాకంలో వ్యవసాయాభివృద్ధికి ప్రాతినిధ్యం వహించే హరిత వర్ణం పరోక్షంగా ఇస్లాం సంస్కృతికి ప్రాతినిధ్యం వహించేదిగా ఉన్నందున త్రివర్ణపతాకాన్ని జాతీయ పతాకంగా తొలగించాలని 1947లోనే ఆర్ఎస్ఎస్ అధికారిక పత్రిక ఆర్గనైజర్ డిమాండ్ చేసింది.

రాజ్యాంగం ప్రతిపాదించిన పలు అంశాలు, అందించిన విలువలకు వ్యతిరేకంగా కుహనా వాదనలు ముందుకు తేవడం ఆర్ఎస్ఎస్ పుట్టుకతో నేర్చిన కుటిల విద్య. అంతేకాదు. స్వాతంత్ర్యానంతరం భారత జాతీయతకు ఈశాన్య భారతంలోనూ, పంజాబ్‌లోనూ తెరమీదకు వచ్చిన సమరశీల వేర్పాటువాద ఉద్యమాలు విసిరిన సవాలును స్వీకరించింది, జాతీయ సమైక్యత సమగ్రతల కోసం వేలాదిమంది కార్యకర్తలను ఫణంగా పెట్టి పోరాడింది భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) మాత్రమే.

ఈ ఉద్యమాలు పతాక స్థాయిలో కొనసాగుతున్నపుడు, దేశాన్ని అస్థిరత్వం వైపు నెట్టిన సమయంలో భారత జాతీయత ప్రమాదపు అంచున ఉన్నది అని ఈనాడు ఘోషిస్తున్న పార్టీ నేతలెవ్వరూ నోరెత్తలేదు. వారికి చెప్పుకోదగ్గ నాయకులెవ్వరూ ఈ వేర్పాటు ఉద్యమకారుల చేతుల్లో ప్రాణాలు కోల్పోలేదు. వేర్పాటువాద ఉద్యమాలను చట్టసభల్లోనూ, బయటా విధానపరంగానైనా వ్యతిరేకించ లేదు. ఎందుకంటే ఆర్ఎస్ఎస్ కోరుకుంటున్న భారత దేశం నేటి భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విభజితమైన భారతదేశం కాదు.

1947కు పూర్వం ఉన్న 560పైగా సంస్థానాలు, జమీందార్ల పాలనలో ఉన్నట్లుగా ఆధునిక భారతదేశం సాధ్యమైనంతగా చిన్నచిన్న రాష్ట్రాలుగా చీల్చాలన్నది ఆర్ఎస్ఎస్ ప్రతిపాదన. అంతేకాదు. క్విట్ ఇండియా ఉద్యమం నాటికి బెంగాల్‌లో ముస్లిం లీగ్‌తో కలిసి అధికారం పంచుకున్న ఆర్ఎస్ఎస్ నేత, అద్వానీ, వాజ్‌పేయిల రాజకీయ గురువు శ్యాంప్రసాద్ ముఖర్జీ దేశం కష్టకాలంలో ఉన్నపుడు ఇటువంటి ఆందోళనలకు తావివ్వరాదని, వాటిని అణచివేసేందుకు బ్రిటిష్ ప్రభుత్వం తీసుకున్న అన్ని నిర్ణయాలను తాను సమర్థిస్తున్నానని లేఖ సైతం రాశాడు. ఇదీ ఆర్ఎస్ఎస్ జాతీయత. దేశ భక్తి.

స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ప్రజాతంత్ర జాతీయవాదానికి పునాదులు వేసిన మరో మైలురాయిగా భాషా ప్రయుక్త రాష్ట్రాల ఉద్యమాలను చెప్పుకోవచ్చు. పైన చెప్పుకున్న దశల్లో చివరి దశలో తెరమీదకు వచ్చిన ఈ ఉద్యమాలు అవిభక్త బెంగాల్ నుండి ఒరిస్సాను వేరుచేయడంతో ప్రారంభమై రాష్ట్రాల పునర్వ్యవస్తీకరణ సంఘం సిఫార్సులకు అనుగుణంగా స్వతంత్ర భారతదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుతో ముగుస్తుంది. ఈ ఉద్యమంలో కూడా నాటి నుండీ నేటి వరకు కొనసాగుతున్న రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌కు గానీ, స్వాతంత్ర్యానంతరం ఆర్ఎస్ఎస్ రాజకీయ విభాగాలుగా తెరమీదకు వచ్చిన జనసంఘ్‌కు గానీ, నేటి 56 అంగుళాల ఛాతీ కలిగిన ప్రధాని నాయకత్వం వహిస్తున్న భారతీయ జనతా పార్టీకి గానీ ఈ ఉద్యమాలతో ఏ మాత్రం సంబంధం లేదు. ఔరంగజేబు కూడా 56 అంగుళాల ఛాతీ కలిగిన చక్రవర్తి అన్న విషయాన్ని గుర్తుచేసుకోవడం సందర్భోచితం.

స్వాతంత్ర్యోద్యమ పోరాటంలో మరో కీలకమైన కోణం కూడా ఉంది. నాడు జరిగిన పోరాటం విదేశీ పాలకులకు వ్యతిరేకంగా సాగింది. దేశీయ ఆర్థిక వనరుల మీద వారి పెత్తనానికి వ్యతిరేకంగా సాగిన పోరాటం. జాతీయ వనరులు మీద ఈ దేశ ప్రజలందరికీ సమాన హక్కు కోసం జరిగిన పోరాటం. ఈ పోరాటంలోనే జాతీయత అన్న భావనలో ప్రజలు, ప్రజల ఆర్థిక అవసరాలు, వనరులపై ప్రజల ఆధిపత్యం ఇమిడి ఉన్నాయి. స్వాతంత్రోద్యమంలోని ఈ కోణంతో కూడా నేటి పాలక పార్టీకి ఏ మాత్రం సంబంధం లేదు. అందుకే భారతీయ మౌలిక రంగాలన్నింటిలోనూ విదేశీ పెట్టుబడులకు పెద్దపీట వేయడానికి నిస్సంకోచంగా ముందుకెళ్తోంది బిజెపి.

రాజ్యాంగం స్ఫూర్తిని సరిగా అర్థం చేసుకోవాలంటే జాతీయ వనరులు, ప్రకృతి వనరులపై ప్రజలకు పూర్తిస్థాయి ఆధిపత్యాన్ని అంగీకరించాలి. ప్రకృతి వనరుల మీద పూర్తి ఆధిపత్యం ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రభుత్వాలదే ఉండాలని కెజి బేసిన్ గ్యాస్ కేసు విషయంలో సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు సారాంశాన్ని కూడా ప్రస్తావించు కోవచ్చు. రాజ్యాంగంలోని ఈ స్ఫూర్తిని ముందుగా అర్థం చేసుకుంటే సుప్రీం కోర్టు తీర్పులో ఆర్థిక జాతీయత కోణం స్పష్టమవుతుంది.

ఈ విషయాలను పక్కన పెట్టి నేడు జాతీయత, జాతీయ వాదం అంటే కేవలం సాంస్కృతికతకు, మత విశ్వాసాలకు మాత్రమే పరిమితం అయినదిగా చూపించే ప్రయత్నం జరుగుతోంది. ఈ ప్రయత్నానికి పరాకాష్ట భారతమాతను భారత జాతీయతకు ఏకైక చిహ్నంగా చూపించడం. భారత్ మాతకు జై అనలేని వాళ్లకు పౌరసత్వం రద్దు చేయాలని డిమాండ్ చేసే స్థాయికి రాజకీయ పరిస్థితులు దిగజారి పోయాయి.

1970 దశకంలో పాఠశాలలో ఆలపించే జాతీయగీతంతో గొంతు కలపడం ప్రతి పౌరుడి విధుల్లో భాగమా కాదా అన్న ప్రశ్నపై స్పందించిన సుప్రీం కోర్టు జాతీయ గీతాలాపనలో గొంతు కలిపడం, కలపకపోవడం సదరు విద్యార్థినీ విద్యార్థుల వ్యక్తిగత స్వేచ్ఛ అని నిర్ధారిస్తూ ప్రాథమిక విధుల కంటే ప్రాథమిక హక్కులకు పెద్ద పీట వేసింది. అటువంటి

ప్రాథమిక హక్కుల్లో అంతర్భాగమే సంఘం పెట్టుకోవడం, సంఘ లక్ష్యాల కోసం పని చేయడం, ఈ లక్ష్యాల సాధనలో ప్రభుత్వాలు అనుసరించే ప్రజావ్యతిరేక నిర్ణయాలను తిరస్కరిస్తూ ఉద్యమించటం. ప్రభుత్వాలు అనుసరించే ప్రజా వ్యతిరేక విధానాలు, నిర్ణయాలను ప్రశ్నించడం, వ్యతిరేకించడం, ఉద్యమించడమే నేడు ప్రభుత్వ వ్యతిరేకతగానూ, తద్వారా దేశ ద్రోహంగానూ చిత్రించే కుతంత్రం కాకతాళీయంగా జరుగుతున్నది కాదు. ఉద్దేశ్యపూర్వకంగా జరుగుతున్నదే.

ఈ క్రమంలోనే ఏకంగా మోడీ దైవాంశ సంభూతుడన్న కేంద్ర మంత్రి వర్యులు వెంకయ్యనాయుడు వ్యాఖ్యలను గమనించవచ్చు. ఇంతకుముందు చెప్పినట్లు ప్రభుత్వమే దేశం, ప్రభుత్వ వ్యతిరేకతే దేశ వ్యతిరేకత అన్న ఆర్ఎస్ఎస్ మందీ మార్బలం సాగిస్తున్న ప్రచారం చివరకు ప్రభుత్వానికి నాయకత్వం వహిసుస్తున్న పార్టీయే ప్రభుత్వం అన్న స్థాయికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని దిగజారుస్తోంది. ఈ క్రమంలో సదరు ప్రభుత్వానికి నాయకత్వం వహించే పార్టీ సిద్ధాంతాలను, వివిధ సామాజిక ఆర్థిక సాంస్కృతిక వ్యవహారాలపై వారి అభిప్రాయాలను ప్రశ్నించడం, తిరస్కరించడం అంతిమంగా దేశద్రోహంగా మారే విపరీత పరిస్థితిని సృష్టించింది.

భారత రాజ్యాంగం ప్రపంచ దేశాల్లోకల్లా అత్యంత ప్రజాతంత్ర రాజ్యాంగం. ఎందుకంటే రాజ్యాంగ పీఠిక భారతీయులమైన మేము భారత దేశాన్ని సర్వ సత్తాక ప్రజాతంత్ర లౌకిక సామ్యవాద గణతంత్ర రాజ్యంగా ప్రకటిస్తున్నాం అని చెప్పడం ద్వారా ఇక్కడ ప్రతి ఒక్క భారతీయుడు రాజ్యాంగ నిర్మాతగా మారాడు. ఈ పీఠికలో జాతీయత, జాతీయవాదం గురించి మాటమాత్రం కూడా ప్రస్తావించకపోవడం గమనార్హం. గత ఆరు దశాబ్దాల కాలంలో వివిధ సందర్భాల్లో రాజ్యాంగ పీఠిక రాజ్యాంగ మౌలిక లక్షణాల్లో ఒకటి అని సుప్రీం కోర్టు రాజ్యాంగ ధర్మాసనం పదే పదే గుర్తు చేస్తూనే వచ్చింది. వీరి రాజ్యాంగ వ్యతిరేకతకు మరో మచ్చుతునకను గుర్తు చేసుకోవచ్చు. బాబ్రీ మసీదు విధ్వంసానికి ప్రత్యక్షంగా నాయకత్వం వహించిన కళ్యాణ్‌సింగ్ మొదలు అద్వానీ, ఉమాభారతి వరకు పలువురు నేతలు నేడు రాజ్యాంగం ప్రసాదించిన వివిధ పదువుల్లో ఉన్నారు. వీరు అదే రాజ్యాంగంపై ప్రమాణం చేసి రాజ్యాంగ ఆదేశాలను తు.చ. తప్పకుండా పాటిస్తామని దేశానికి హామీ ఇచ్చారు. ఈ రాజ్యాంగం, రాజ్యాంగం ద్వారా సంక్రమించిన అధికారాల ను వినియోగించే న్యాయవ్యవస్థనే గుర్తించ నిరాకరిస్తున్న సంఘ పరివారం ప్రభుత్వంపై సంపూర్ణ ఆధిపత్యం చెలాయించే అవకాశం కల్పించడం భారత రాజ్యాంగంలోని ప్రజాతంత్ర స్వభావానికి తాజా ఉదాహరణ.

నేటి మోడీ కేబినెట్‌లో పలువురు ఆర్ఎస్ఎస్ యూనిఫారం వేయడం మానేశారు తప్ప ఆర్ఎస్ఎస్ మౌలిక లక్ష్యాలను మక్కికి మక్కి అమలు చేస్తున్నారు. అటువంటి వారి చేతుల్లో బందీ అయిన రాజ్యాంగ యంత్రం దేశ వాసులందరికీ సమాన హక్కులు అవకాశాలు కల్పించాల్సిన బాధ్యత నుండి నిర్దిష్ట సామాజికి సమూహాలకు దేశ వనరులు, అవకాశాలు, హక్కులును దఖలు పరుస్తూ మిగిలిన వారిని ద్వితీయ శ్రేణి పౌరులుగా మార్చేందుకు కుటిలప్రయత్నాలు చేస్తోంది. గత రెండు సంవత్సరాల కాలంగా రాజ్యాంగ పునాదులను ధ్వంసం చేయడమే లక్ష్యంగా పని చేస్తున్నారు. ఈ వాస్తవాన్ని కప్పిపెట్టి జాతీయవాదం పేరుమీద భారతీయ జనతా పార్టీ చేస్తున్న విధ్వంసం కేవలం రాజ్యాంగ నిర్మిత జాతీయ వాదానికి తూట్లుపొడవటానికి జరుగుతున్న ప్రయత్నమే. ఈ విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవడంలో విఫలం అయితే స్వాతంత్ర్యోద్యమం నాటి ప్రజాతంత్ర లక్ష్యాలు ఆశయాలకు ప్రాతనిధ్యం వహించేలా నిర్మితమైన పలు రాజ్యాంగ వ్యవస్థలకు ఆర్ఎస్ఎస్ భావజాల ప్రేరేపిత ప్రభుత్వం తెచ్చిపెడుతున్న ముప్పు పట్ల ఏమరుపాటు వహించిన వాళ్లమే అవుతాం.

ప్రపంచ దేశాల రాజ్యాంగాల్లో వ్యక్తి స్వేచ్ఛకు సంబంధించి, సామాజిక అభివృద్ధికి సంబంధించిన అత్యంత పురోగామి భావాలను రాజ్యాంగ బద్ధమైన హక్కులు, అవకాశాలు, బాధ్యతలు, విధులకింద మార్చడంలో రాజ్యాంగ రచనా సంఘం అధ్యక్షులు బి.ఆర్. అంబేద్కర్ పాత్ర అద్వితీయం. రాజ్యాంగం ప్రతిపాదించిన ఇటువంటి అనేక అవకాశాలు ప్రజాతంత్ర జాతీయతను మరింత పటిష్టం చేశాయి. పరిపుష్టం చేశాయి. నేడు జాతీయత పేరుతో ఆర్ఎస్ఎస్ ముందుకు తెస్తున్న వాదనలన్నీ ఈ రాజ్యాంగ మౌలిక సూత్రాలకు వ్యతిరేకంగా ముందుకు వస్తున్నాయి.

రాజ్యాంగ బద్ధంగా పరిపాలన సాగిస్తామని స్వయానా రాష్ట్రపతి ముందు ప్రమాణం చేసిన ప్రభుత్వం ఈ రాజ్యాంగ వ్యతిరేక దాడిని, రాజ్యాంగ విరుద్ధమైన దాడికి నాయకత్వం వహించడం దేశాధ్యక్షుడుగా ఉన్న హిట్లరే స్వయంగా జర్మనీ పార్లమెంట్‌కు నిప్పంటించే కుట్రకు వ్యూహం పన్నిన సందర్భాన్ని గుర్తుకు తెస్తుంది. రష్యాలో గోర్బచేవ్ నాయకత్వంలో విప్లవ రష్యా రాజ్యాంగాన్ని, విప్లవ పతాకాన్ని, పార్టీని, పార్టీ కార్యక్రమాన్ని రద్దుచేసి జార్‌కాలం నాటి చిహ్నాలను చట్టబద్ధం చేసిన తాజా సందర్భం తోనూ మోడీ పాలనకు పోలికలున్నాయి. అది కూడా బి.ఆర్. అంబేద్కర్ 125 వ జయంతి ఉత్సవాల సందర్భంగా పార్లమెంట్ ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేసి ఆయనకు మొక్కుబడిగా నీరాజనాలు పలుకుతూ మరోవైపున ఆయన అందించిన రాజ్యాంగంలోని అత్యంత ప్రజాతంత్ర యుతమైన హక్కులను 'హిందూ'మహా సముద్రంలో నిమజ్జనం చేయడానికి పాచికలు వేస్తోంది ఆర్ఎస్ఎస్. ఆర్ఎస్ఎస్ శకుని తరహాలో ఆడిస్తున్న పాచికలాటను దుర్యోధనుడు ఆడినట్లుగా నేడు మోడీ, ఆయన మంత్రివర్గంలోని హేమా హేమీలు ఆర్ఎస్ఎస్ విసిరిన పాచికల ప్రకారం ఆడుతున్నారు. నాటి మహాభారతంలో ద్రౌపది వస్త్రాపహరణానికి గురైతే నేటి భారతంలో రాజ్యాంగంలోని ప్రజాతంత్ర హక్కులు హరణకు గురవుతున్నాయి.

ఈ పరిస్థితుల్లో డా. అంబేద్కర్ ఆశయాల పరిరక్షణకు పాటుపడడం అంటే అంబేద్కర్ విరచిత రాజ్యాంగాన్ని, దాని ప్రజాతంత్ర స్వభావాన్ని, స్వాంత్ర్యోద్యమ వారసత్వంగా అందివచ్చిన ప్రజాతంత్ర జాతీయతను కాపాడుకోవటానికి పోరాడటమే నిజమైన దేశభక్తుల కర్తవ్యం. జాతీయవాదం ముసుగులో రాజ్యాంగం విరచిత ప్రజాతంత్ర జాతీయత స్థానంలో ఆర్ఎస్ఎస్ విరచిత మతోన్మాద జాతీయతను ముందుకు తేవటానికి, అదే అసలైన జాతీయతగా చిత్రించేందుకు జరుగుతున్న కుయత్నాలను ఆమూలాగ్రం వ్యతిరేకించి పోరాడటమే నిజమైన భారతీయతకు నీరాజనం పట్టే మార్గం.

ఈ సందర్భంగా స్వాతంత్ర్యోద్య మంతోనూ, స్వాతంత్ర్యోద్యమం అందించిన ప్రజాతంత్ర జాతీయవాద భావనలతోనూ ఏ మాత్రం సంబంధం లేని ఆర్ఎస్ఎస్‌లు ఏ విధంగా మిథ్యా జాతయవాదాన్ని తెరమీదకు తెస్తున్నాయో వివరించే ప్రయత్నం చేయాలి. ఆర్ఎస్ఎస్ కుట్రలకు అడ్డు కట్ట వేయాలి. ఇదే అంబేద్కర్‌కు నిజమైన నివాళి.

*(వ్యవసాయ కార్మిక సంఘం అఖిల భారత వర్కింగ్ కమిటీ సభ్యులు)* వీ

# ప్రాథమిక విద్య - ప్రభుత్వాల నిర్లక్ష్య వైఖరి

***ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతులు కల్పించి విద్యార్థులకు ఉచిత విద్యనందించాల్సిన ప్రభుత్వం విద్యార్థుల హాజరు తక్కువ నెపంతో ప్రభుత్వ పాఠశాలలను మూసివేయడం విద్యను వ్యాపారం చేయడానికే అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**జూ**న్ 12 నుండి రెండు తెలుగు రాష్ట్రాలలో పాఠశాలలు తెరుచుకొని, కొత్త విద్యా సంవత్సరం 2017-18 లోనికి ప్రవేశించాయి. కానీ రెండు తెలుగు రాష్ట్రాలలో ఇంగ్లీష్ మీడియం పేరు మీద, విద్యార్థుల హాజరు శాతం నెపంతో గ్రామాలలో ప్రాథమిక పాఠశాలలు మూసివేసి, రెండు - మూడు గ్రామాలకు కలిపి ఒక పాఠశాలను ఏర్పాటు చేసే పరిస్థితికి రాష్ట్ర ప్రభుత్వాలు వచ్చాయి. 'విలీనం' పేరు మీద కొన్ని వేల పాఠశాలలు గ్రామాలలో మూతపడే పరిస్థితి నెలకొన్నది. ఈ పరిస్థితి దృష్ట్యా ఆర్థికంగా వెనుకబడిన వారు, దళితులు, వెనుకబడిన కులాల వారి పిల్లలు ప్రాథమిక విద్యకు దూరమయ్యే పరిస్థితి నెలకొన్నది.

అంతే కాకుండా రాష్ట్ర ప్రభుత్వాలు రెసిడెన్షియల్ పాఠశాలలు ఏర్పాటు చేస్తామని ప్రకటిస్తున్నాయి. అది కూడా ఆచరణలో సాధ్యపడడం లేదు. అసలు మూలాల గురించి ఆలోచించకుండా, పై పై మాటలతో కాలం వెల్లబుచ్చుతూ, సామాన్య ప్రజానీకానికి రోజు, రోజుకూ విద్యావకాశాలను దూరం చేస్తున్నాయి. విద్యా హక్కు చట్టంలో 2009 (ది రైట్ ఆఫ్ చిల్డ్రన్ టు ఫ్రీ అండ్ కంపల్సరీ ఎడ్యుకేషన్ యాక్ట్ 2009) లోని అంశాలు ఎక్కడా అమలు కావడం లేదు. ప్రైవేట్ విద్యా సంస్థలలో కూడా 25 శాతం (పేద పిల్లలకు, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారికి, దళితులకు అందరికీ కలిపి) ఉచిత విద్యనందించాలనే లక్ష్యం నెరవేరడం లేదు. ఒక గ్రామంలో ఒక పాఠశాల ఉండడం వలన పిల్లలు ఇల్లు కంటే ఎక్కువగా పాఠశాలనే ప్రేమించే పరిస్థితి ఉంటుంది. అందులోనే ఎక్కువగా కాలం గడపడానికి ఇష్టపడతారు. ఉపాధ్యాయులు సైతం ప్రాథమిక పాఠశాలలో పిల్లలను సరిగ్గా పట్టించుకోవడం లేదు. ఇద్దరు ఉపాధ్యాయులుంటే ఒకరు హాజరు అవుతున్నారు. మరొకరు ఇంటివద్ద స్వంత పనులు చూసుకుంటున్నారు. వారానికి రెండు రోజులుగా విభజించుకొని పాఠశాలలను సందర్శిస్తున్నారు. పేద ప్రజల పిల్లలు హాజరయ్యే ప్రాథమిక పాఠశాలల్లో విద్యా బోధన, వారి భవిష్యత్తును తీర్చిదిద్దే ఉపాధ్యాయులు కానరావడం లేదు. ఇది విచారకరం, శోచనీయం. ప్రజలు, ప్రజాస్వామిక వాదులంతా ఖండించాల్సిన విషయం. 'భారత దేశ భవిష్యత్తు తరగతి గదిలో నిర్ణయించబడుతుంది' అన్న కొఠారి కమిషన్ సిఫారసులు అమలుకు నోచుకోవడం లేదు.

ఉపాధ్యాయులు తరగతి గదిలో సరిగ్గా పాఠ్యాంశాలు బోధించకపోతే ఒక తరం భవిష్యత్తు అంధకారం అయ్యే పరిస్థితి గోచరిస్తుంది. ముఖ్యంగా ప్రాథమిక విద్య అనేది ఒక వ్యక్తి తీర్చిదిద్దబడడానికి మూలాధారం. ప్రాథమిక విద్యలో పిల్లవాడు అనేక రకాలైన భవిష్యత్తును ఊహించుకుంటాడు, తనను తాను మలుచుకునే ప్రయత్నం చేస్తాడు.

భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 21ఎ ప్రకారం 6 నుంచి 14 సంవత్సరాల వయస్సు లోపు పిల్లలకు భారత ప్రభుత్వం ఉచిత, నిర్బంధ విద్యనందించాలి. కాని గ్రామాలలోనే పాఠశాలలు మూసి వేయడం వలన పేద ప్రజలకు విద్యను దూరం చేయాలనే దుష్ట సంకల్పం రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్నది. తద్వారా రాజ్యాంగాన్ని అతిక్రమిస్తున్నది, ఉల్లంఘిస్తున్నది. ప్రభుత్వమే కార్పొరేట్ సంస్థలకు దాసోహమయ్యే పరిస్థితి నెలకొన్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మున్సిపల్ శాఖా మంత్రి పి. నారాయణ స్వయానా నారాయణ విద్యా సంస్థల అధినేత కావడం, నెల్లూరు నుంచి ఢిల్లీ వరకు అతని విద్యా సంస్థల ప్రాపకం, వెలుగొందడం మనం చూస్తున్నాం. అంతే కాకుండా ఆంధ్రప్రదేశ్ విద్యా శాఖా మంత్రి గంటా శ్రీనివాసరావు స్వయానా ఈయన వియ్యంకుడు. నారాయణ విద్యా సంస్థలలో ప్రతి సంవత్సరం కొంత మంది విద్యార్థులు అనుమానాస్పదంగా మృతి చెందడం, ఆ విద్యా సంస్థలలో జరుగుతున్న బోధనా శిక్షలను తెలియజేస్తుంది. తల్లిదండ్రుల కడుపుకోతకు అద్దం పట్టే దృశ్యాలెన్నో ప్రతి సంవత్సరం మనం చూస్తూనే ఉన్నాం. ఉన్నత విద్యా పరిస్థితి ఆ విధంగా ఉంటే, ప్రాథమిక విద్యా పరిస్థితి 'మూసివేతల' పర్వం కొనసాగుతున్నది. పిల్లలపై తల్లిదండ్రుల ఆకాంక్షలను, భవిష్యత్తును కార్పొరేట్ విద్యా సంస్థలు 'వ్యాపారం' చేశాయి. తల్లిదండ్రులు కూడా భవిష్యత్తును భ్రమిస్తున్నారు తప్ప, వాస్తవాలను గమనించడం లేదు. అనుభవాల నుంచి గుణపాఠాలను నేర్చుకోవడం లేదు. వేయి మందికో - పది వేల మందికో ఒక విద్యార్థి ప్రతిభ ఆధారంగా, కృషి చేత వచ్చిన సీట్లను ఈ కార్పొరేట్ సంస్థల మాయలో పడి, అదే విధంగా తమ పిల్లవాడు తీర్చిదిద్దబడతాడనే ఊహల్లో పడి భవిష్యత్తు ఉన్న మంచి పిల్లలను ఆత్మహత్యల వైపుకు నెట్టబడే విధంగా ఈ ప్రభుత్వం - కార్పొరేట్ విద్యా సంస్థల యాజమాన్యాలు తయారు చేస్తున్నాయి. ఈ పరిస్థితి నెలకొనడానికి ఈ కార్పొరేట్ విద్యా సంస్థల వెనుక ఉన్న ప్రభుత్వ పెద్దలు - పోలీసు వ్యవస్థ - కార్పొరేట్ సంస్కృతిని కోరుకునే ప్రతి వ్యక్తి కారకులే. మెడిసిన్ చదివిన వాడే ప్రతిభావంతుడు, ఐఎఎస్ వచ్చిన వాడే సమాజంలో గొప్పవాడు, వారిని తీర్చిదిద్దింది మా సంస్థే అనే గొప్ప గొప్ప ప్రకటనల వెనుక ఒక మాయ - భ్రమ - కల్పితం అన్నీ ఉన్నాయి. అదంతా ఒక వ్యాపార సంస్కృతిలో ఈ సమాజాన్ని నెట్టడానికి చేసే ప్రయత్నంలో భాగమే.

పేద విద్యార్థులకు అంతర్జాతీయ ప్రమాణాలతో అత్యుత్తమ విద్యను అందిస్తామంటూ తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఒకేసారి 169 గురుకులాలను ప్రారంభించింది. అయినప్పటికీ గ్రామాలలో మూసి వేస్తున్న పాఠశాలల పట్ల మాత్రం ఆ రాష్ట్ర ప్రభుత్వ వైఖరి సరిగ్గా లేదు. సర్వశిక్షా అభియాన్, విద్యా సంస్థల మౌలిక సదుపాయాల నిర్మాణ సంస్థ అన్నీ అవినీతి, అక్రమాలలో కూరుకుపోయి ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నవ నిర్మాణ దీక్షల పేరుమీద పెట్టిన ఖర్చును ప్రాథమిక

# వ్యాపార రహదారిలో చైనా వ్యూహం

***ప్రపంచ మార్కెట్‌ను తనకు అనుకూలంగా మలుచుకోవాలనే ఉద్దేశ్యంలో భాగంగానే చైనా వన్‌బెల్ట్‌-వన్‌రోడ్‌ పథకాన్ని ముందుకు తెచ్చిందనీ, తన అధీనంలో ఉన్న బడుగుదేశాలను స్థావరాలుగా ఏర్పాటు చేసుకొనే ప్రమాదం ఉందనీ అంటున్నారు సంతోష్‌***

సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ప్రబోధించిన అమెరికా, బ్రిటన్‌ తదితర అగ్రరాజ్యాలు, తాము నిర్దేశించిన ఆర్థిక సిద్ధాంతం తమ దేశాల్లోనే కట్టడికి గురవుతుండగా, చైనా దాన్ని గట్టిగా సమర్థించటమే కాదు, అందుకు దోహదం చేసే పథకంతో ముందుకు సాగుతున్నది. కొన్ని దశాబ్దాల పాటు సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ఇతర దేశాలపై రుద్దిన అమెరికా శిబిరం 2008 ఆర్థిక సంక్షోభం తర్వాత ఆత్మరక్షణలో పడి రక్షణాత్మక విధానాలను అమలు చేస్తోంది. అటువంటి పరిణామాల మధ్య, 'వన్‌బెల్ట్‌-వన్‌రోడ్డు' ప్రాజెక్టు ప్రతిపాదనతో చైనా దూసుకు వెళ్తుంది. ఇది అత్యంత మౌలిక వసతి ప్రాజెక్టుల సముదాయం. ఈ బృహత్తర ప్రాజెక్ట్‌ ప్రపంచంలోనే అతిపెద్ద ఉమ్మడి మార్కెట్‌కు ద్వారాలు తెరుస్తుందని, దీనికి అనుసంధానంగా ఉండే దేశాలన్నింటినీ సుసంపన్నం చేస్తుందని, ఇది తూర్పు పడమరలను అనుసంధానించిన పురాతన సిల్క్‌రోడ్‌ను తలపించే బహు విధాలుగా విస్తృతమైందని, ప్రపంచ జనాభాలో 64 శాతం అంటే... సుమారు 450 కోట్ల మంది నివసించే వివిధ ఖండాల్లోని 65 దేశాలను నేరుగా కలిపే ఈ ప్రాజెక్టు భూతలంతో పాటు సముద్ర జలాల్లోనూ సాగుతుందని, ఇది అందరికి లాభదాయకం అంటూ చైనా చెబుతుంది.

1976లో మావో మరణానంతరం చైనా నాయకత్వం సోషలిస్టు విధానాలకు తిలోదకాలు ఇచ్చింది. 1978 నుంచి చైనా మార్కెట్‌ సోషలిజం పేరుతో పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరిస్తూ విదేశీ బహుళజాతి సంస్థల పెట్టుబడులను అనుమతించింది. దేశీయంగా కూడా పెట్టుబడిదారీ వర్గాలను ప్రోత్సహించింది. ఎగుమతి ఆధారిత ఉత్పత్తి విధానాలను చేపట్టడంతో గత కొన్నేళ్లుగా ప్రపంచ తయారీ రంగంలోనూ, ఎగుమతుల్లోనూ అగ్రగామిగా ఉన్న చైనా 2008 ఆర్థిక మాంద్యం

---

పాఠశాలలో మౌలిక సదుపాయాలకు పెట్టుంటే గ్రామాలలో పేద ప్రజల పిల్లలు మరింత చైతన్యవంతులై విద్యనభ్యసించేవారు.

ఐక్యరాజ్య సమితి అనుబంధ సంస్థ యునెస్కో ఇచ్చిన నివేదికలో సార్వత్రిక విద్యా ప్రమాణాలతో, భారత ప్రభుత్వం 50 సంవత్సరాలు వెనుకబడి ఉన్నదనీ, కనీసం లక్ష్య సాధనకు విద్యా రంగంలో మౌలిక మార్పులు చేపట్టకుండా 2030 సంవత్సరం నాటికి సుస్థిరాభివృద్ధి లక్ష్యాలను భారత్‌ చేరుకోలేదనీ స్పష్టపరిచింది. ఇదిలా ఉండగా ఆంధ్రప్రదేశ్‌ ముఖ్యమంత్రి మాత్రం 2029 కంతా ఆంధ్రప్రదేశ్‌ అన్ని రంగాలలో భారతదేశంలోని ఇతర రాష్ట్రాల కంటే ముందంజలో ఉంటుందని ప్రజలను నమ్మించే ప్రయత్నం చేస్తున్నాడు. అసలు ప్రజల కనీస అవసరాలను గమనించకుండా, పైపై మెరుగులు దిద్దే ప్రయత్నం జరుగుతున్నది.

ఒకటవ తరగతి నుంచి బండెడు పుస్తకాలతో విద్యార్థులు పాఠశాలలకు వెళుతుండగా వారిలో సృజనాత్మకతను బయటికి తీసే ఉపాధ్యాయ బృందం లేదు. 5వ తరగతి పిల్లవాడు రెండవ తరగతి పుస్తకాన్ని చదివే అక్షరజ్ఞానం కూడా లేదు. పిజి స్థాయి విద్యనభ్యసించిన వారికి సామాజిక పరిజ్ఞానం లేదు. ఈ వ్యవస్థను అర్థం చేసుకునే పరిస్థితి కనిపించడం లేదు. నిరుద్యోగం అత్యధికంగా పోగుపడ్డ వ్యవస్థ మనది. ఇందుకు మౌలిక (పునాది) చదువుల డొల్లతనం కూడా ఒక కారణంగా చెప్పుకోవచ్చు. పాతిక కోట్లమంది యువత భవిష్యత్తు అంధకారమవుతున్నది.

ప్రాథమిక స్థాయి బోధనా సిబ్బంది 66.41 లక్షల మందిలో దాదాపు 11 లక్షల మంది ప్రామాణిక అర్హతలు, శిక్షణలు లేనివారే (దేశ వ్యాప్తంగా). విద్యార్థులను విజ్ఞాన గనులుగా తీర్చిదిద్దే ప్రక్రియ మొదలవ్వాలి. ప్రాథమిక స్థాయిలో పిల్లల మనసెరిగిన సృజన సీలురైన ఉపాధ్యాయులు కావాలి. విద్యార్థినీ విద్యార్థులలోని భిన్నమైన ఆసక్తులను గమనించి, వివిధ రంగాలలో వారి నైపుణ్యాన్ని గమనించి, వారి భవిష్యత్తును వారే తీర్చిదిద్దుకునే విధంగా వారిని ప్రోత్సహించే వ్యవస్థ కావాలి, రావాలి. విద్యార్థుల శారీరక, మనో విజ్ఞాన వికాసాలే లక్ష్యంగా కొత్త విద్యావిధానం రూపొందించబడినప్పుడే పిల్లల భవిష్యత్తు తీర్చిదిద్దబడుతుంది.

పాఠశాలలు జ్ఞానాన్ని, తర్కాన్ని అందించే విజ్ఞాన ప్రదేశాలు, కాని ప్రభుత్వాలు ఆ విధంగా ఆలోచించడం లేదు. వ్యాపార దృక్పథంతో 'నష్టదాయక పాఠశాలలు' అనే పేరు పెట్టి (5,6 మంది విద్యార్థినీ విద్యార్థులు ఉంటే పాఠశాలలకు) వాటిని మూసివేయనున్నారు. రాజ్యానికి అవసరమయ్యే మంచి పౌరులు విద్య ద్వారా మాత్రమే తయారవ్వగలరని ప్రముఖ తత్వవేత్త 'అరిస్టాటిల్‌' ఆ కాలంలో బోధించారు. విద్య మనిషిని సమగ్రంగా తీర్చిదిద్దుతుంది. విద్యను సామాజిక పెట్టుబడి (సోషల్‌ క్యాపిటల్‌) గా చూడాలి తప్ప వ్యాపార సరుకుగా చూడరాదు. విద్య సరుకుగా (వస్తువుగా) మారినప్పుడు విద్యార్థులలోని సహజత్వాన్ని, సృజనాత్మకతను నాశనం చేస్తుంది. విద్యార్థులు పెట్టుకున్న లక్ష్యాలను అధిగమించడానికి అడ్డంకిగా మారుతుంది. పాఠ్య పుస్తకాల కొరత, ఉపాధ్యాయుల బదిలీలు ప్రాథమిక స్థాయి పాఠశాల విద్యలో ప్రతి సంవత్సరం ఒక ప్రతిబంధకం. ఈ నేపథ్యంలో ప్రభుత్వం రేషనలైజేషన్‌ను నిలిపివేసి, తక్షణం మౌలిక వసతులపై దృష్టి కేంద్రీకరించాలి. ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు కూడా పిల్లలను 'బెత్తంతో' దండించడం మానివేయాలి. బెత్తం లేకుండా చదువు నేర్పలేని విద్య నిరర్థకం. ఈ మేరకు మనమంతా విద్యా వ్యవస్థను మార్చాలి.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్‌ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

తరువాత అంతర్జాతీయంగా సమస్యలను ఎదుర్కొంటున్నది. అగ్ర రాజ్యాలు స్వీయ రక్షణ విధానాల అమలును ప్రారంభించాయి. చైనా నుంచి వచ్చే సరుకులపై భారీ ఎత్తున సుంకాలు విధించడం సహా అనేక ఆంక్షలను అమలు చేయడం మొదలెట్టాయి. 2008లోనే అమెరికాకు 12.5 శాతం మేరా, యూరప్‌కు 19.4 శాతం మేరా చైనా ఎగుమతులు కోత పడ్డాయి. ఇది సహజంగానే చైనా కరెంట్ అకౌంట్ లోటుకు దారితీసింది. మరోపక్క ద్రవ్యోల్బణం పెరిగింది. అన్నిటి ధరలూ పెరిగాయి. శ్రామికుల్లో అభద్రతకు, అశాంతికి దారి తీసింది.

వన్ బెల్ట్-వన్ రోడ్ ప్రాజెక్టు ఆలోచన, చైనా ఆర్థిక శక్తి పాశ్చాత్య దేశాలకు ఆకర్షణీయంగా కనిపిస్తున్నాయి. ఆసియా, యూరప్, ఆఫ్రికా దేశాల మార్కెట్లు అనుసంధానం లక్ష్యంగా చైనా తలపెట్టిన వన్‌బెల్ట్-వన్‌రోడ్ (ఒబిఒఆర్) 21వ శతాబ్దంలో అత్యంత ప్రాముఖ్యత సంతరించుకున్న అతి భారీ ఆర్థిక ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు పూర్తయ్యేనాటికి మొత్తం ఒక లక్షా 70 వేల కోట్ల డాలర్ల వ్యయం అవుతుందని అంచనా వేస్తున్నారు. రెండో ప్రపంచ యుద్ధం ముగిశాక పశ్చిమ యూరప్ దేశాల పునర్నిర్మాణం కోసం 'మార్షల్ ప్లాన్' కింద అమెరికా వెచ్చించిన మొత్తాన్ని ఇప్పటి మారక విలువతో పోల్చినా ఇది ఎన్నో రెట్లు అధికం. ఇంత భారీ ప్రాజెక్టుకు మన పొరుగునున్న చైనా రూపకల్పన చెయ్యడంతోపాటు నాయకత్వం వహిస్తోంది. ఈ ప్రాజెక్టుపై చర్చించేందుకు చైనా రాజధాని బీజింగ్‌లో బెల్ట్ అండ్ రోడ్ ఫోరం (బిఆర్‌ఎఫ్) రెండు రోజుల సమావేశాన్ని మే 14, 15 తేదీలలో ఏర్పాటు చేయగా సదస్సుకు 24 ట్రిలియన్ డాలర్లకు పైగా జిడిపి ఉన్న 29 దేశాల అధినేతలు, వందకు పైగా దేశాల ప్రతినిధులు పాల్గొన్నారంటేనే దీని ప్రాధాన్యత అర్థమవుతుంది.

ఆసియా నుండి ఆఫ్రికా మీదుగా యూరప్ వరకు ఉద్దేశించిన పథకం సాకారమైతే సరుకు రవాణాను సులభతరం చేయడంతో పాటు మార్గం వెంట అనేక పారిశ్రామిక కేంద్రాలు, ఓడరేవులు, రైలుమార్గాలు, రహదారుల నిర్మాణం జరగనుంది. ఈ ప్రాజెక్టులకు వివిధ దేశాల తోడ్పాటు సమీకరించేందుకు కొద్ది సంవత్సరాలుగా చైనా గట్టిగా ప్రయత్నిస్తున్నది. 1950వ దశకంలో చైనా, భారత్, బర్మా (మయన్మార్) శాంతియుత సహజీవనం నిమిత్తం ప్రపంచానికి ప్రతిపాదించిన పంచశీల సూత్రాలు ప్రాతిపదికగా ఈ ఒబి-ఒఆర్ పరిధిలోకి వచ్చే అన్ని దేశాలతో మైత్రిని, సహకారాన్ని పెంపొందించుకోవాలని చైనా కోరుకుంటోందని అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ తన ప్రారంభోపన్యాసంలో చెప్పారు. "తమ సొంత సామాజిక వ్యవస్థను లేదా అభివృద్ధి నమూనాను ఎగుమతి చేయటం, ఇతర దేశాల అంతర్గత వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం, తమ అభీష్టాన్ని ఇతరులపై విధించడం తమ ఉద్దేశం కాదన్నారు. ప్రతిదేశం సార్వభౌమత్వం, భౌగోళిక సమగ్రతలను పరస్పరం గౌరవించుకోవాలని" అన్నారు.

చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ అక్టోబర్ 2013లో ఈ ప్రాజెక్టు గురించి మొదటిసారి ప్రకటించారు. ఒబిఒఆర్ ప్రాజెక్టులో భాగంగా ప్రతిపాదించిన రహదారుల కలయిక, భూమార్గాన నిర్మించ తలపెట్టిన 'సిల్క్‌రోడ్ ఎకనమిక్ బెల్ట్', సముద్రాల నౌకాయానం ప్రధానంగా సాగే 'మారీటైమ్ సిల్క్‌రోడ్' సాకారమైతే వాణిజ్యం పెరుగుతుందని భావిస్తున్నారు. ఈ ప్రాజెక్టుకు సంబంధించి చైనా వివిధ దేశాలతో సుదీర్ఘంగా చర్చలు సాగించిన అనంతరం ప్రాజెక్టుకు తుదిరూపం తెచ్చింది. యూరప్, ఆసియా (యురేషియా) దేశాల్లోని పురాతన సిల్క్ రూట్ తరహాలో నూతన వాణిజ్య మార్గాన్ని నిర్మించడం ఈ ప్రాజెక్టు లక్ష్యం. దీనిలో భాగంగా భారీ రోడ్లు, వంతెనలు, పోర్టుల వంటి మౌలిక వసతుల నిర్మాణాన్ని చైనా చేపట్టనుంది. రోడ్డు, నౌకాయానాలు ప్రధానంగా ఉండే ఈ ప్రాజెక్టు మధ్య ఆసియా కేంద్రంగా, హిందూ మహాసముద్రం మీదుగా ఆఫ్రికా ఖండం వరకు సాగుతుంది. ప్రాజెక్టులో భాగంగా చేపట్టే మరో రోడ్డు మధ్యధరా సముద్రం మీదుగా యూరప్‌లోకి ప్రవేశిస్తుంది.

ఈ ప్రాజెక్టు భౌగోళికంగా ఆరు రోడ్డు మార్గాలనూ, సముద్ర మార్గాలను కలుపుతుంది. ఈ ఆరు మార్గాలు పశ్చిమ చైనాను పశ్చిమ రష్యాతో ఉత్తర చైనాను మంగోలియా ద్వారా తూర్పు రష్యాతో, పశ్చిమ చైనాను మధ్య ఆసియాతో, పశ్చిమ ఆసియా ద్వారా టర్కీతో, నైరుతి చైనాను పాకిస్తాన్‌తోనూ, దక్షిణ చైనాను పాకిస్తాన్, బంగ్లాదేశ్, మయన్మార్ ద్వారా భారత్‌ను కలుపుతుంది. 'సముద్ర మార్గ సిల్క్ రోడ్ చైనా కోస్తా తీరాన్ని సింగపూర్-మలేసియా, హిందూ మహా సముద్రం, అరేబియా సముద్రాన్ని, హర్ముజ్ జల సంధి మొదలైన వాటిని కలుపుతుంది. ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తయితే ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో కీలక మార్పులు చోటు చేసుకుంటాయి. ముఖ్యంగా ఆసియా, యూరప్, ఆఫ్రికా దేశాలపై దీని ప్రభావం పడనుంది. ఫలితంగా ప్రపంచ ఆర్థికరంగంలో కొనసాగుతున్న అమెరికా ఆధిపత్యానికి గట్టి సవాల్ ఎదురవుతుంది. ఈ కారణంగానే చైనా ప్రతిపాదించిన ఒబిఒఆర్‌ను అమెరికా వ్యతిరేకిస్తోంది.

ఆసియా, యూరప్, ఆఫ్రికా దేశాలను రోడ్లు, రైల్వేలు, పోర్టుల ద్వారా అనుసంధానించేందుకు ఇప్పటివరకు దీని కోసం 5,500 కోట్ల డాలర్లు కేటాయించారు. సింహభాగం చైనాదే అయినప్పటికీ ఇతర దేశాలనూ ఇందులో భాగస్వాములను చేసి, దేశాల్లోనూ, దేశాల మధ్య వాణిజ్యానికి అవసరమైన ప్రాథమిక సదుపాయాలు నిర్మించడం ద్వారా ఆర్థిక మాంద్యంలో ఉన్న ప్రపంచాన్ని అభివృద్ధి పథంలో పెట్టేందుకు కృషి చేస్తున్నట్లు చైనా చెబుతుంది. అందుకే ఇతర దేశాలూ, అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు దీనిలో భాగస్వామ్యం కావాలని సదస్సును ప్రారంభిస్తూ చైనా అధ్యక్షుడు పిలుపునిచ్చారు. అగ్రరాజ్యం అమెరికా అధ్యక్షునిగా ఎన్నికైన డొనాల్డ్ ట్రంప్ 'మా దేశం, మా వ్యాపారం, మా ప్రయోజనాలు' అంటూ అంతర్జాతీయ వాణిజ్యంపై ఆంక్షలు పెడుతూ, వలసలకు వ్యతిరేకంగా అమెరికా, ఐరోపాల్లో ప్రభుత్వాలు చర్యలు తీసుకుంటూ యుద్ధ సన్నాహాలు చేస్తున్న సమయంలో చైనా ఈ ప్రాజెక్టును ప్రారంభించడం గమనార్హం.

ఆసియాలో చైనా, జపాన్‌ల తదుపరి పెద్ద ఆర్థిక శక్తి అయిన భారత్ బీజింగ్ సమావేశంలో పాల్గొనకపోవటం గమనార్హం. "సార్వభౌమత్వం, భౌగోళిక సమగ్రత విషయంలో తమ ప్రధాన ఆందోళనలను విస్మరించే ప్రాజెక్టును ఏ దేశం అంగీకరించదు" అని భారత విదేశీ వ్యవహారాల మంత్రిత్వశాఖ అధికార ప్రతినిధి గోపాల్ బగాలె వ్యాఖ్యానించారు. నిజానికి ప్రపంచ దేశాలు రాజకీయాల కతీతంగా ఆర్థిక సంబంధాల వృద్ధికి ప్రయత్నిస్తున్న కాలమిది. అయితే సార్వభౌమత్వం, భౌగోళిక సమగ్రతే భారత్‌కు సమస్య అయింది. జమ్మూ-కశ్మీర్ విషయంలో పాకిస్తాన్‌తో ఉన్న భౌగోళిక వివాదం బృహత్తరమైన అంతర్జాతీయ ప్రాజెక్టులో భాగస్వామి కాకుండా భారత్‌ను నిరోధించింది. అంతేకాకుండా ఒబి-ఒఆర్‌లో చైనా-పాకిస్తాన్ ఎకనామిక్ కారిడార్ (సిపిఇసి) వివాదాస్పదమైన పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్ గుండా నిర్మాణమవుతుంది. పాక్ ఆక్రమిత కశ్మీర్‌లో పాకిస్తాన్, చైనా కలిసి వివిధ పథకాలను ద్వైపాక్షికంగా చేపట్టడం ఎప్పటినుంచో ఉన్నది. ఒక రహదారి పాక్

ఆక్రమిత కశ్మీర్ మీదుగా పాకిస్తాన్‌ను దాటి ఆరేబియా సముద్ర రేవు అయిన గ్వాదర్‌కు చేరుతుంది. గిల్గిత్-బాల్టిస్థాన్ ప్రాంతంలో సింధునదిపై రెండు భారీ జలవిద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణానికై చైనా, పాకిస్తాన్‌తో అవగాహన ఒప్పందంపై సంతకం చేసింది. గిల్గిత్ బాల్టిస్థాన్ జమ్మూ-కశ్మీర్‌లో అంతర్భాగం.

చారిత్రకంగా భారత్ పాకిస్తాన్‌ల మధ్య విడదీయరానంత సామాజిక సాంస్కృతిక, సారూప్యత ఉన్నది. బ్రిటిష్ వారి విభజించి పాలించే కుటిల నీతి వల్ల రెండు దేశాలుగా విడిపోయాయి. చైనా 1951లో టిబెట్-జియాంగ్ రోడ్డు అక్సాయిచిన్ ప్రాంతం నుండి నిర్మించింది. అక్సాయిచిన్ ప్రాంతం లడక్‌లో భాగమని భారత్ వాదన. ఆ ప్రాంతంలో గడ్డి కూడ మొలవదు అని నెహ్రూ పేర్కొనడం గమనార్హం. భారత్‌కు పాక్ ఆక్రమిత కశ్మీర్ వివాదంలాగానే చైనాకు జపాన్, వియత్నాం తదితర దూర ప్రాచ్యదేశాలు కొన్నింటితో దక్షిణ చైనా సముద్ర దీవులపై తీవ్రమైన సార్వభౌమాధికార వివాదాలున్నాయి. వాటిని పురస్కరించుకొని తరచు సైనిక పరమైన ఉద్రిక్తతలు సైతం తలెత్తుతున్నాయి. అయినప్పటికీ వారందరిని చైనా ఆహ్వానించింది. వారు హాజరయ్యారు. అంటే, భౌగోళిక వివాదాలకు మించి ఆర్థిక ప్రయోజనాల కోణం నుంచి అందరూ పథకాన్ని చూస్తున్నారన్న మాట. వాస్తవానికి ఈ దృష్టి సుమారు రెండున్నర దశాబ్దాల కాలంగా సర్వసామాన్యమైపోయింది. ఇప్పుడు భారత ప్రభుత్వం బీజింగ్ సమావేశంలో పాల్గొనకపోయినా వేగంగా మారుతున్న ప్రపంచంలో ఈ ప్రాజెక్టును పూర్తిగా విస్మరించటం రానున్న కాలంలో భారత్‌కు సాధ్యం కాకపోవచ్చు.

చైనాతో తీవ్రమైన సముద్రయాన వివాదాలున్న జపాన్, వియత్నాంలు ఉన్నతాధికారులను బీజింగ్ సమావేశానికి పంపాయి. శ్రీలంక ప్రధానమంత్రి రనిల్ విక్రం సింఘె, నేపాల్ ఉప ప్రధాని, ఆర్థికమంత్రి కృష్ణ బహదూర్ మహరా పాల్గొన్న ఆసియా నాయకుల్లో ఉన్నారు. భూటాన్ మినహా సార్క్ దేశాలన్నీ ఈ ఒబి-ఒఆర్ ప్రాజెక్టులో చేరాయి. రష్యా అధ్యక్షుడు పుతిన్ స్వయంగా పాల్గొనగా, రానన్న అమెరికా అధ్యక్షుడు మనసు మార్చుకుని ప్రతినిధి వర్గాన్ని పంపించారు. యూరోపియన్ యూనియన్ నుంచి వైదొలిగాక వ్యాపారాభివృద్ధి కోరుకుంటున్న బ్రిటన్ ఈ ప్రాజెక్టును స్వాగతించింది. భూటాన్ మినహా భారత్ పొరుగు దేశాలన్నీ హాజరైనాయి. కొంతమంది భారత్ స్కాలర్స్ ప్రారంభోత్సవ సభకు హాజరుకావటం విశేషం. చైనా-పాకిస్తాన్ ఆర్థిక కారిడార్‌ను ఈ ప్రాంతంలోని అన్ని దేశాలకు తోడ్పడే ఆర్థిక ప్రాజెక్టుగా అభివర్ణించిన పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్, భారత్ పేరు ప్రస్తావించకుండా, "ఇది మనం విభేదాలను అధిగమించి, దౌత్యం ద్వారా వివాదాలు పరిష్కరించుకోవలసిన సమయం. భావితరాలకు శాంతిని వారసత్వంగా ఇద్దాం" అని సుభాషితాలు చెప్పడం కొసమెరుపు.

మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది మొదలు మన విదేశాంగ విధానం దేశ ప్రయోజనాల కన్నా అమెరికా అనుకూలత. చైనా, పాకిస్తాన్ వ్యతిరేకతల చుట్టూనే తిరుగుతోంది. మోడీ ప్రతి అంశాన్ని విదేశీ హస్తంతోనూ, చైనా, పాకిస్తాన్‌లతో ముడిపెడుతున్నాడు. 1962 సరిహద్దు యుద్ధం తరువాత భారత్-చైనా సంబంధాల్లో ఏర్పడ్డ దూరాన్ని రాజీవ్‌గాంధీ హాయాంలో చూపించిన చొరవ కొంతవరకు తగ్గించింది. సరిహద్దు సమస్యలను పక్కన బెట్టి రెండు దేశాలు పరస్పర వాణిజ్యాన్ని విస్తరించుకోవాలని నిర్ణయానికొచ్చిన తరువాత రెండు దేశాల మధ్య వాణిజ్యం విస్తరించింది. నేడు భారత్‌కు అతి పెద్ద వాణిజ్య భాగస్వామిగా చైనా ఉంది. భారత్ ప్రతి ఏటా చైనాతో 71 బిలియన్ డాలర్ల వ్యాపారం చేస్తోంది. మన ఎగుమతుల కంటే చైనా నుండి దిగుమతులు ఎక్కువగా ఉండడంవల్ల మనదేశం లోటులో ఉంది. దీన్ని పూడ్చుకోవాల్సిన అవసరం ఉంది. ఇరు దేశాలు పోటీతత్వంతో కాకుండా భాగస్వాములుగా మారినప్పుడే అంతర్జాతీయ వాణిజ్యం విస్తరిస్తుంది. దాని ఫలితాలు దేశాలకు తోడ్పడుతాయి.

చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ సిల్క్ రోడ్ లేదా సిల్క్ రూట్‌కు క్రీ.పూ. 150 నుంచి క్రీ.శ. 1400 దాకా ఉన్న ప్రాశస్త్యాన్ని గురించి ఘనంగా ప్రస్తావించారు. యూరప్, ఆఫ్రికా, ఆసియా దేశాలలోని ప్రాచీన నాగరికతలను అనుసంధానం చేసింది నిజమే. ఈ సిల్క్ రోడ్ ఆసియా ఖండాన్ని తూర్పు నుంచి పశ్చిమం దాకా, జపాన్ నుంచి కొరియా ద్వీపకల్పం దాకా మధ్యధరా సముద్రంతో కలిపింది. ఈ మార్గం ద్వారా పట్టు వాణిజ్యం జరిగేది కనక దానిని సిల్క్ రోడ్ అన్నారు. కాని అది అంతర్జాతీయ వాణిజ్యానికే కాక సాంస్కృతిక, సాంకేతిక సంబంధాలకు కూడా ఉపయోగపడింది. ఈ మార్గం 'పరస్పరం జ్ఞానం ఇచ్చి పుచ్చుకోవడానికి, పరస్పర ప్రయోజనానికి తోడ్పడింది అని చైనా అధ్యక్షుడు అన్నారు. ఇది 'దాపరికం లేని విధానానికి, సమ్మిళిత తత్వానికి' ప్రాతినిధ్యం వహిస్తుందని కూడా చెప్పారు. కొత్త సిల్క్ రోడ్ లేదా బి.ఆర్.ఐ. 'ఈ శతాబ్దపు గొప్ప పథకం' అని కొనియాడారు.

ఇవ్వాల్టి వరకు చైనా నుంచి ఐరోపా, ఆఫ్రికా, అమెరికాలకు జరిపే నౌకా రవాణాకు మలాక్కా జలసంధి(మలేసియా, సుమత్రా దీవుల మధ్య ఉంది) ప్రధాన మార్గంగా ఉంది. గ్వాదర్ ఓడరేవు పూర్తయితే మలాక్కా జల సంధికి ప్రత్యామ్నాయం లభించడంతో పాటు పశ్చిమ దేశాలకు చైనాకు మధ్య 2 వేల కిలోమీటర్ల దూరం తగ్గిపోనుంది. ఫలితంగా చైనా సరుకుల ఎగుమతుల రవాణా ఖర్చులు భారీగా తగ్గనున్నాయి. ఆఫ్రికా దేశాలకు కూడ ఇది దగ్గరిదారి అవుతుంది. గ్వాదర్ నిర్మాణంతో చైనా జలమార్గాల్లో కీలకంగా ఎదిగే అవకాశముంది. ఇరాన్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ మధ్య ఉన్న హర్మజ్ జలసంధి ప్రస్తుతం ఇరాన్ ఆధీనంలో ఉన్నప్పటికీ, అక్కడికి 600 కి.మీ. దూరంలో ఉన్న గ్వాదర్‌లో తిష్ట వేస్తే ఆ ప్రాంతంలో చైనా ప్రాబల్యం పెరుగుతుంది. ప్రపంచ చమురు వాణిజ్యం 35 శాతం ఈ జలసంధి మీదుగానే జరుగుతుంది. గ్వాదర్ నిర్మాణంతో అంతర్జాతీయ వాణిజ్య ముఖ చిత్రాన్ని చైనా తనకు అనుకూలంగా మార్చుకునేందుకు సిద్ధమవుతోంది.

ప్రచ్ఛన్న యుద్ధం ముగిసిన తర్వాత ప్రపంచంలోని సముద్ర జలాల మీద, నౌకాశ్రయాల మీద, సహజ వనరుల మీద (ముఖ్యంగా చమురు గ్యాస్) మీద పెత్తనం కోసం అమెరికా ప్రయత్నిస్తోంది. ముఖ్యమైన భౌగోళిక ప్రాంతాల మీద తన ఆధిపత్యమే కొనసాగాలని అనుకుంటోంది. ఈ విషయంలో రష్యా, చైనా, జర్మనీ నాయకత్వంలోని కొన్ని యూరప్ దేశాలు తమ ఆర్థిక ఆధిపత్యం కోసం పోటీ పడుతున్నాయని అమెరికా ఆందోళన పడుతోంది. రక్షణ రంగానికి అమెరికా అపారంగా డబ్బు ఖర్చు పెడ్తుంది. ఈ విషయంలో ఏ దేశం కాని, లేదా వివిధ దేశాల కూటమి కాని సమీప భవిష్యత్తులో అంత డబ్బు ఖర్చు పెట్టడం అసాధ్యం. పెట్టలేవు కూడా. 2003 నాటి ఇరాక్ యుద్ధం, ఆ తర్వాత జరిగిన పరిణామాలను పరిశీలిస్తే యురేషియా (యూరప్, ఆసియా- ఈ ప్రాంతంలోని దేశాలు అవిచ్ఛిన్నమైనవి) రాజకీయ చిత్ర పటాన్ని మార్చాలని అమెరికా ప్రయత్నిస్తోంది. ముఖ్యంగా దక్షిణ-మధ్య యురేషియాను మర్చాలని అమెరికా తీవ్రంగా ప్రయత్నిస్తోంది. అంటే

ఇందులో పర్షియన్ సింధు శాఖ, కాస్పియన్ సముద్ర ప్రాంతం, దాని చుట్టూ ఉన్న మధ్య ఆసియా దేశాలు ఉన్నాయి. సోవియట్ యూనియన్ పతనమైన తర్వాత దక్షిణ-మధ్య యురేషియా ప్రాంతంలో అమెరికా ఏర్పాటు చేసిన కొత్త సైనిక స్థావరాలే దీనికి నిదర్శనం.

దక్షిణ-మధ్య యురేషియాపై అమెరికా సామ్రాజ్యవాదం తమ పట్టు బిగించడంతో పాటు అమెరికా పాలకులు చైనా ఆర్థికంగా పురోగమించడానికి అడ్డుకట్ట వేయాలని ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఆసియాలో చైనాను ప్రాంతీయ శక్తిగా ఎదగకుండా అడ్డుపడుతూనే ఉన్నారు. 2011లో ఇందులో భాగంగానే 'పివోట్ టు ఏషియా' (ఆసియా ఇరుగు) వ్యూహం పన్ని ఆస్ట్రేలియా, జపాన్, భారత్ మద్దతు కూడగట్టి ఆసియా-పసిఫిక్ ప్రాంతంలో తన ఆధిపత్యం కొనసాగించడానికి ప్రయత్నించింది. అమెరికా పెడుతున్న రక్షణ వ్యయంతో చైనా అయిదోవంతు కూడా ఖర్చు పెట్టలేదు. అదీగాక దక్షిణ కొరియా, తైవాన్‌తో పాటు ఆస్ట్రేలియా, జపాన్, భారత్ అమెరికాకే మద్దతు పలుకుతున్నాయి. అమెరికాకు అనేక సైనిక స్థావరాలున్నాయి. ఏ దేశంలో చైనాకు సైనిక స్థావరాలేవి లేవు. అందుకని చైనా బి.ఆర్.ఐ. పథకంతో ముందుకొచ్చింది. తద్వారా యురేషియా మొత్తంలో ఆర్థిక సహకారం సంపాదించాలని ప్రయత్నిస్తోంది.

బెల్ట్ అండ్ రోడ్ (బెల్ట్ అండ్ రోడ్ ఇన్‌షియేట్) పథకం గురించి గొప్పగా ప్రచారం చేయడాన్ని పక్కన పెడితే దీని భౌగోళిక రాజకీయార్థిక ప్రభావాన్ని కూడా అర్థం చేసుకోవాలి. ఈ పథకం ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అమెరికా ఆధిపత్యానికి పెద్ద సవాలుగా మారుతుందని అమెరికా భావిస్తోంది. తమ ఆర్థిక నాయకత్వాన్ని కబళించాలని చైనా ప్రయత్నిస్తోందని కూడ భావిస్తోంది. మరోవైపు అమెరికాకు జూనియర్ భాగస్వాములైన జపాన్, ఇండియాలు ఈ ప్రాంతంలో ప్రబలమైన శక్తిగా ఎదగడాన్ని చైనా జీర్ణించుకోలేకపోతుంది. అన్నింటికన్నా మించి బి.ఆర్.ఐ.లోని ఆరు మార్గాలలో చైనా-పాకిస్తాన్ ఆర్థిక మార్గం పాక్ ఆక్రమిత కశ్మీర్ ద్వారా వెళ్లడాన్ని భారత్ అంగీకరించలేకపోతోంది. ఎందుకంటే పాక్ ఆక్రమిత కశ్మీర్ తమకే చెందుతుందన్నది భారత్ వాదన.

2008 ఆర్థిక సంక్షోభం తరువాత అమెరికా, ఐరోపా దేశాల ప్రాబల్యం క్షీణించింది. మరోవైపు చైనా, రష్యా, జర్మనీ, జపాన్‌ల వద్ద బారీ నగదు నిల్వలు పోగుపడ్డాయి. అనంతరం ఐరోపా ఆర్థిక సంక్షోభం జర్మనీని, చమురు ధరల పతనం రష్యానూ ఇబ్బంది పెట్టాయి. సిరియాలో జోక్యం, పాశ్చాత్య దేశాల ఆర్థిక ఆంక్షలతో రష్యా బలహీన పడింది. ఇలా ప్రధాన దేశాలన్నీ చిక్కుల్లో పడడం చూసి చైనా తన ప్రాబల్యం పెంచుకోవడానికి అనువైన విదేశాంగ, ఆర్థిక, వాణిజ్య విధానాలను ఆరంభించింది. ఆగ్నేయాసియా ఆఫ్రికా దేశాల్లో భారీ మొత్తంలో పెట్టుబడులు పెట్టడం ప్రారంభించింది. మయన్మార్, వియత్నాం, థాయ్‌లాండ్, కంబోడియా, లావోస్, వియత్నాంలాంటి చోట్ల జలవిద్యుత్, థర్మల్ విద్యుత్, ఓడరేవులు రహదారులు తదితర ప్రాజెక్టుల్ని చేపట్టింది.

ప్రపంచ దేశాలతో చైనా సంబంధ బాంధవ్యాలు పెంచుకోవడంతో పాటు దాని ఆర్థిక వ్యవస్థకు అమెరికా, యూరప్ దేశాల నుంచి ఎదురైన సవాళ్లను అధిగమించడానికి కూడా తోడ్పడ్డాయి. ఇలా వాణిజ్యం ముసుగులో ఇప్పుడు చైనా కూడా ఆర్థిక సహాయం, వ్యాపారం, మౌలిక వసతుల ప్రాజెక్టుల పేరుతో ఇతర దేశాలపై పెత్తనం చేయాలను కొంటోంది. ఈ విధానాల్లో భాగంగా 2009లో ఆఫ్రికాతో ప్రారంభించి, నేడు లాటిన్ అమెరికా ఖండ దేశాల్లో ప్రవేశించింది. వ్యాపారం అంటేనే లాభం, అందువలన ఏ దేశం సొంతలాభం లేకుండా ఏపనీ చేయదు. పెట్టుబడులు, ఆర్థిక సహాయం పేరుతో ఆయా దేశాల్లో పాగావేసి, చైనా కంపెనీలకు విపరీతంగా లబ్ధిచేకూర్చడం చైనా ప్రభుత్వ లక్ష్యంగా ఉంది.

2008 ఆర్థిక సంక్షోభం తరువాత చైనా ఎగుమతులు బాగా తగ్గిపోవడంతో, ఆ దేశ ఉత్పత్తి సామర్థ్యంలో చాలా భాగం నిరుపయోగం గా పడి ఉంది. ఎగుమతులు జోరుగా సాగినప్పుడు ఉత్పత్తి వృద్ధికి ఎడాపెడా అప్పులు చేసిన చైనా కంపెనీలు ఇప్పుడు గిరాకీ తగ్గిపోవడంతో చిక్కుల్లో పడ్డాయి. చేసిన అప్పులకు వడ్డీ కట్టడమూ కష్టమైపోతోంది. వాటిని గట్టెక్కించడానికి చైనా ప్రభుత్వం సిల్క్ రోడ్ ప్రాజెక్టు వేగాన్ని పెంచింది. ఈ ప్రాజెక్ట్ ద్వారా తన కార్యక్షేత్రాన్ని విస్తరించి ప్రపంచంలో తిరుగులేని శక్తిగా ఎదగాలని చైనా ప్రయత్నాలు ప్రారంభించింది. దేశంలో సిమెంట్, ఉక్కు రంగాల్లో పేరుకుపోయిన నిల్వలను వదుల్చుకోవడానికి ఈ ప్రాజెక్ట్ దోహదపడుతుంది. ఈ ప్రాజెక్టు కింద ఇతర దేశాల్లో చేపట్టే మౌలిక వసతుల పనుల కాంట్రాక్టులను తమ కంపెనీలకే కట్టబెడుతూ, వాటికి నిధులనూ సమకూరుస్తోంది. కొత్త సిల్క్ రోడ్ ప్రాజెక్టు కింద 2015లో 8,000 కోట్ల డాలర్ల విలువైన 4,000 కాంట్రాక్టులను చైనా కంపెనీలకే కట్టబెట్టింది. 2017లో 12,500 కోట్ల డాలర్ల విలువైన 9,000 భారీ ప్రాజెక్టులను ప్రధానం చేయనుంది.

కొత్త సిల్క్‌రోడ్ వెంబడి ఉన్న దేశాల్లో చైనా గత మూడేళ్లుగా 5,000 కోట్ల డాలర్ల పెట్టుబడులు పెట్టింది. ఈ విధంగా దేశ దేశాల్లోని కాంట్రాక్టులు చైనా కంపెనీల పరం కావడం చూసి అమెరికా, ఐరోపా కంపెనీలు తీవ్ర అసంతృప్తికి లోనవుతున్నాయి. చైనా పెట్టే ప్రతి డాలర్ పెట్టుబడి వెనక ఆర్థిక కోణంతో పాటు సైనిక వ్యూహపరమైన దృక్పథమూ ఉంది. విదేశాల్లో తాను నిధులు సమకూర్చి నిర్మిస్తున్న ప్రాజెక్టులన్నింటికీ కఠినమైన షరతులు విధిస్తుంది. నలభై ఏళ్లకు ఒప్పందం కుదుర్చు కుంటుంది. ప్రాజెక్టుకు అవసరం లేకపోయినా ఇతర దేశాల్లో వందల కొద్దీ ఎకరాల భూమి తన ఆధీనంలో ఉంచుకొంటుంది. వ్యూహపరంగా కీలకమైన దేశాల్లో ప్రాజెక్టులు చేపట్టినప్పుడు వాటి రక్షణ పేరుతో అక్కడ తమ సేనలను, ఆయుధాలను మోహరిస్తుంది. చైనా నుంచి సహాయం పొందుతున్న దేశాలన్నీ పేదదేశాలు కావడంతో అవి కిమ్మనలేక పోతున్నాయి. ఆర్థిక వలసవాదం కొత్త రూపమిది.

యురేషియా దేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, ఆర్థిక వ్యవస్థలను సామ్రాజ్యవాదులు ఇప్పటికే నాశనం చేశారు. ఇతర దేశాల మీద ఆధార పడేట్టు చేశారు. ఈ దేశాలతో బిఆర్ఐ పథకం ద్వారా తమ దేశంలో ఉత్పత్తి అపారంగా ఉన్నందున చైనా వాణిజ్యాన్ని పెంచుకోవాలని చూస్తోంది. ముఖ్యంగా ఉక్కుకు గిరాకీ పెంచాలని చూస్తోంది. చైనా నాయకత్వం మార్కెట్ ఆధారంగా సంపద పెంచాలని అనుకుంటోంది. ఒకవైపు చైనా ఎదుగుదలను కట్టడి చేయాలని అమెరికా పాలకులు భావిస్తూ ఉంటే మరోవైపు చైనా నాయకులు అమెరికా ఆధిపత్యాన్ని సవాలు చేస్తూ ఆసియాలో నిలదొక్కుకోవడానికి తీవ్రంగా ప్రయత్నిస్తుంది. అమెరికాను పక్కన పెట్టి ఆసియాలో తానే ప్రధాన శక్తిగా నిలువాలని చైనా ఆశిస్తోంది. చైనా జరుపుతున్న భౌగోళిక రాజకీయాలు చాలా తెలివైన తిరుగులేని వ్యూహంగా కనిపిస్తున్నాయి. రాజకీయార్థిక విధానాల దృష్టితో చూస్తే అడంస్మిత్ ఆర్థిక సిద్ధాంతాలకు చైనాలో అదరణకు కొరతేమి లేదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఆదివాసి మహిళలపై లైంగిక దాడులు

***మావోయిస్టుల ఏరివేత పేరిట ఛత్తీస్‌గడ్‌లో పోలీసులు, భద్రతా బలగాలు భయోత్పాలను సృష్టిస్తూ ఆదివాసీ మహిళలపై లైంగిక దాడులకు పాల్పడుతున్నాయని అంటున్నారు సాకేత్***

ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో అభివృద్ధి పేరుతో దేశంలో ప్రజలు విస్తాపనకు గురవుతున్నారు. ఈ బాధిత వర్గంలో తరాల తరబడి దోపిడీకి, అణిచివేతకు గురైన, అభివృద్ధికి దూరమైన సామాజిక సమూహాలే ఎక్కువగా ఉన్నాయి. సహజ వనరులు, ఖనిజ సంపద నిక్షిప్తమైన అడవి, ఆదివాసీ ప్రాంతాల్లో ఆ వనరుల తరలింపు ఫలితంగా జరుగుతున్న విస్తాపన, విధ్వంసం ఆదివాసీ అస్థిత్వాన్నే ప్రమాదంలోకి నెట్టివేస్తున్నాయి. సహజంగానే స్వేచ్ఛా జీవులుగా, స్వతంత్ర ప్రాంతాలుగా ఉండాలని వాంచించే ఆదివాసీలపైన ప్రధాన జనజీవన స్రవంతి నూతన అభివృద్ధి నమూనా వారికి నిలువనీడ లేకుండా చేస్తున్నది. వారి కళ్ల ముందటి సంపద, కాళ్లకింది నేలంతా పరాయీకరణకు గురవుతుంటే ఆదివాసీ పల్లెలన్నీ రక్తమోడుతున్నాయి. ఛిద్రమైన బతుకులు చెట్టుకొకటి పుట్టకొకటి అవుతున్నాయి. ఆదివాసీలకు అండగా నిలబడి వనరుల దోపిడీని అడ్డుకునే ఉద్యమాలను అణిచివేయడానికి 'హంట్'లను కొనసాగిస్తున్నాయి ప్రభుత్వాలు. రాజ్యాంగం ప్రకారం పాలన చేస్తామని ప్రతిజ్ఞచేసిన ప్రభుత్వామే అదే రాజ్యాంగం ఆదివాసీలకు కల్పించిన రక్షణలను అపహాస్యం చేస్తూ విచ్చలవిడిగా హింసకు, వికృత చేష్టలకు పాల్పడుతున్నది. అభివృద్ధి ముసుగులో సమిష్టి సంపదైన సహజ వనరుల తరలింపు, వాటిని ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు, దేశ విదేశీ కార్పొరేట్‌లకు కట్టబెట్టి ప్రైవేట్ ఆస్తులను పోగేసే ప్రక్రియలో ఆదివాసీల హక్కులను కాలరాస్తున్నది. మొత్తంగా వారి జీవించే హక్కులనే హరిస్తున్నది.

దండకారణ్యం అనగానే అక్కడ జరిగే సాయుధ చర్యలకిచ్చినంత ప్రచార ప్రాధాన్యం అక్కడి ఆదివాసీలపై ముఖ్యంగా ఆదివాసీ మహిళలపై రాజ్య యంత్రాంగం కొనసాగిస్తున్న విచ్చలవిడి లైంగిక హింస హేయమైన, అమానవీయమైన చర్యలను బట్టబయలు చేసి వారి చెంత నిలిచే, వారిని ఆత్మగౌరవంతో జీవించేలా చేసే ప్రయత్నాలు బయటి సమాజంలో జరుగుతున్నంతగా జరగడం లేదు. మావోయిస్టు ఉద్యమానికి అండగా నిలుస్తున్నారనే అక్కసుతోనో, అటవీ సంపద వివిధ రకాల ఖనిజ నిక్షేపాల అక్రమ తరలింపును అడ్డుకుంటుందనే కోపంతోనో మావోయిస్టు ఉద్యమాన్ని అణిచివేసే పేరుతో ఆ ప్రాంతాన్నంతా సైనిక మండలంగా చేసి బేస్ క్యాంపులతో యుద్ధ క్షేత్రంగా మార్చివేసాయి. మొత్తంగానే ఆదివాసీ పల్లెల్ని, గూడెంలను జల్లడపట్టి బీభత్సాన్ని సృష్టిస్తూ ఆదివాసీలను భయభ్రాంతులను చేస్తున్నాయి. ఈ వికృత క్రీడలో ఆదివాసీ మహిళలు మరింతగా బలైపోతున్నారు. తుపాకుల పహారా మధ్యన బిక్కుబిక్కుమంటు బతుకులెల్లదీస్తున్నారు.

దండకారణ్యం వెలుపల మహిళలపై జరిగే అత్యాచారాలు, అఘాయిత్యాలపై ఎంతో కొంత స్పందన, ప్రచారం పరిష్కారమూ లభించే అవకాశాలున్నాయి. అదే దండకారణ్యంలో జరిగే అనేక ఘోరాలు నేరాలు, స్త్రీలపై జరిగే లైంగిక హింస కనీస ప్రచారానికి, స్పందనకు నోచుకోవడం లేదు. సామాజిక ఉద్యమకారులు, అధ్యయనపరులు, ప్రజాపక్షం వహించే పాత్రికేయులో చొరవ తీసుకుంటే గానీ రాజ్యయంత్రాంగ నేరాలు వెలుగులోకి రావడం లేదు.

అయితే ఆదివాసీ మహిళలపై జరిగే లైంగిక హింస, వికృత చర్యలన్నీ సైనిక బలగాలు, ప్రభుత్వాలు పెంచిపోషించిన సాల్వాజుడుం లాంటి ప్రైవేటు ఆర్మీ చేతుల్లో మాత్రమే జరిగినవి, జరుగుతున్నాయి. ఇంకా జుగుప్సాకరమైన విషయమేమిటంటే ఈ లైంగిక హింసను ప్రభుత్వం, సైనిక బలగాలు ఒక సాధనంగా ప్రయోగిస్తున్నవి. మావోయిస్టు ఉద్యమంతో మమేకమయ్యారన్న మిషతో ఒక శిక్షారూపంగా ప్రభుత్వాలు మిలిటరీ బలగాల ద్వారా ఇది విచ్చలవిడిగా కొనసాగిస్తున్నవి.

మిలటరీ బలగాల పెంపు, మోహరింపు అంతా కూడా కార్పొరేట్స్‌కి భూమి కట్టబెట్టడానికి జరిగిన ఒప్పందాలతోనే పెరుగుతూ వచ్చింది. ఛత్తీస్‌గడ్ ఏర్పడిన తొలి రెండేళ్లలోనే సిఆర్‌పిఎఫ్ బలగాల మోహరింపు మొదలైనప్పటికీ ఆ రాష్ట్ర ప్రభుత్వం టాటా స్టీల్, ఎస్ఆర్ గ్రూప్‌తో కుదుర్చుకున్న ఒప్పందాల దరిమిలా ఇనుప ఖనిజ తరలింపులో తలెత్తే 'సమస్యల' పరిష్కారం కోసం బడా కంపెనీల మద్దతుతోనే ఏర్పడిన సాల్వాజుడుం రెండున్నర లక్షల ఆదివాసీలు చెల్లాచెదురు కావడానికి హత్యలు, గృహ దహనాలు, లూటీలు, లైంగిక హత్యాచారాలను విచ్చలవిడిగా ప్రయోగించింది. 2009లో కాంకేర్, నారాయణపూర్ జిల్లాల్లో రావ్‌ఘాట్ గనులను స్టీల్ ఆథారిటీ ఆఫ్ ఇండియాకు కేటాయించడం, జిందాల్, శారదా ఎనర్జీ, డిబీర్స్, రియోటింటో, బ్రోకెన్ హిల్ ప్రాపర్టీస్ వంటి దేశ విదేశ బడా కార్పొరేట్ సంస్థలకి బస్తర్, కాంకేర్, సుక్మా, దంతెవాడ వంటి జిల్లాల్లో వేలాది ఎకరాల భూమిని ఇనుము, బాక్సైట్, సున్నపురాయి వంటి విలువైన ఖనిజాలను వెలికితీసే నిమిత్తం ధారాదత్తం చేయడంతోనే సిఆర్‌పిఎఫ్, కోబ్రా, నాగా, మిజో, బిఎస్ఎఫ్ వంటి బెటాలియన్ల సంఖ్య విపరీతంగా పెరుగుతూ వచ్చింది.

ఈ మొత్తం ఒప్పందాలు కుదుర్చుకునే ప్రక్రియలో ఎక్కడా కూడా రాజ్యాంగబద్ధ సంస్థలైన గ్రామసభల అనుమతిని కనీసంగానైనా పరిగణించలేదు. ఆదివాసీ చేతుల్లోనే ఉండే గ్రామ సభలు నిర్ద్వందంగా ఈ అనుమతులను, ఒప్పందాలను వ్యతిరేకించాయి.

భారీ బలగాల మోహరింపుతో ఆదివాసీ పల్లెలన్నీ భయం గుప్పిట్లోకి వెళ్లడమే కాకుండా వాటి పాశవికతను అనుభవిస్తూనే ఉన్నాయి. నక్సలైట్స్ దాడిలో పాల్గొన్నారన్న ఆరోపణలతో 2010 సెప్టెంబర్ 5, 6న బిఎస్ఎఫ్, ఛత్తీస్‌గడ్ పోలీసులు కలిసి నలభై మంది ఆదివాసీలను తీవ్రంగా గాయపరిచి, ఇద్దరు అమ్మాయిలను లైంగికంగా వేధించి, 17 మందిని

అక్రమంగా నిర్బంధించి చిత్రహింసల పాలుచేశారు. సామూహిక లైంగిక అత్యాచారాలు, గ్యాంగు రేప్‌ల్లాంటివి అనేకం కొద్దిమేరకైనా మీడియా ద్వారా వెలుగు చూసినయి.

లైంగిక హింస, వేదింపులు, బెదిరింపులు భయకంపితులను చేయడం నిత్యకృత్యమైంది. రేప్, లైంగిక హింస ఒక శిక్షారూపంగా, యుద్ధ సాధనంగా వాడడం ప్రపంచవ్యాప్తంగా కొత్తేమీ కాకపోయినా, రాజకీయ కార్యకలాపాలు అందునా ప్రత్యామ్నాయ రాజకీయాలు చురుగ్గా ఉండే ప్రాంతాల్లో ఇది మరింతగా అమలవుతున్నది. ఇది సామూహిక హనన వ్యూహంలో భాగంగా, నిర్వాసితం చేసే కుట్రలో భాగంగానే జరుగుతున్నది. ఆదివాసీలు ప్రత్యేకించి మహిళలు వ్యవసాయ పనులకు వెళ్లడానికి, అడవీ ఉత్పత్తుల్ని సేకరించే పనులకు సాహసించడం లేదు. వారిపై అత్యాచారాలు, సామూహిక లైంగిక హింస జరుగుతుందనే భయమే కాకుండా వారిని చంపివేసి 'ఎన్‌కౌంటర్'గా చిత్రించే ప్రమాదం కూడా ఉన్నదని.

ఎన్‌కౌంటర్లకు డబ్బు రూపేణ ప్రోత్సాహకాలు అందడంతో ఈ హత్యలకు గురవుతున్న ఆదివాసీల సంఖ్య కూడా పెరుగుతున్నది. అసలు ఈ భారీ సైనికీకరణ అంటేనే ఏదో ఉత్పాతం, ఉన్మాదం జరుగుతుందనే భయమే కాదు హక్కుల హననం జరగడానికి ఆస్కారముంటుందని అర్థమవుతున్నది. ఈ బలగాలకు తోడు సాల్వాజుడుం లాంటి ప్రైవేటు ఆర్మీ సభ్యులను ప్రత్యేక పోలీసు అధికారులు (ఎస్‌పిఓలు)గా చేర్చుకొని గాలింపు, సాయుధ చర్యల్లో భాగస్వామ్యమయ్యేలా చేయడంతో వీరు కూడా ఆదివాసీ మహిళలపై విచ్చలవిడిగా లైంగిక అత్యాచారాలకు పాల్పడ్డారు.

2012లో సర్కెగూడ ఆదివాసీ గ్రామంలో ప్రజలంతా విత్తనాల పండుగ కోలాహలంలో ఉన్న సమయంలో ఆ సమూహంపై సిఆర్‌పిఎఫ్ బలగాలు దాడిచేసి ఏడుగురు చిన్న పిల్లలతో సహా 17మందిని చంపేశాయి. ఖనిజ సంపదను కార్పొరేట్‌లకు ఎంతటి దుర్మార్గానికైనా ఒడిగట్టి కట్టబెట్టే ప్రభుత్వాలకి ఆదివాసీల కనీస అవసరాలను తీర్చడంలో మాత్రం శ్రద్ధలేదు. తాగునీరు లేక ఆదివాసీ మహిళలు సుదూర ప్రాంతాలకు కాలినడకన వెళ్లి నీరు తెచ్చుకోవాల్సిన పరిస్థితి. శిశు మరణాల సంఖ్య గణనీయంగా ఉండడమే కాకుండా పోషకాహారలోపం, రక్తహీనత వంటి వాటితో బాధపడే పిల్లలు 42 శాతానికి పైగానే ఉన్నారు. మలేరియా గురించి అయితే చెప్పాల్సిందేమీలేదు.

ఆదివాసీలపై ప్రధానంగా మహిళలపై జరిగే లైంగిక హింస, అత్యాచారాల్లో అన్ని ప్రాంతాల్లో ఒకే పద్ధతి కనిపిస్తుంది. అదంతా రాజ్యం తన ప్రజల్ని తానే భయకంపితుల్ని చేసి గుప్పిట్లో పెట్టుకొనే పద్ధతిలోనే ఉంటున్నది. 2011లో సుప్రీంకోర్టు సాల్వాజుడుం లాంటి ప్రైవేట్ ఆర్మీకి ప్రభుత్వం మద్దతివ్వడం రాజ్యాంగ విరుద్ధమని, దాన్ని వెంటనే రద్దు పరచాలని ఆదేశించే వరకు భద్రతా బలగాలు ప్రత్యేక పోలీస్ అధికారుల రూపంలో ఉన్న జుడుం సభ్యులు జమిలిగా జులుం కొనసాగించారు.

సాల్వాజుడుం ప్రవేశంతో ఆదివాసీ సమాజాన్ని చీల్చే ప్రయత్నాన్ని బలంగా చేసింది ఛత్తీస్‌ఘర్ ప్రభుత్వం. ఆదివాసీ ఆవాసాలను ఖాళీ చేయించి బలవంతంగా బేస్ క్యాంపుల్లో నిర్బంధించే పనిని జుడుంకు అప్పగించింది. ఆదివాసీల్లో ఆస్తిపర వర్గాలవారు సాల్వాజుడుంతో జతకలిసి సాధారణ ఆదివాసీలపై విచ్చలవిడిగా హింసాకాండకు పాల్పడ్డారు. భౌగోళిక పరిజ్ఞానం బాగా కలిగిన జుడుం సభ్యులను భద్రతా బలగాలు తమ గాలింపుకు, వ్యూహాత్మక స్థావరాల గుర్తింపుకు బాగా వాడుకున్నాయి. భద్రతా బలగాల వెన్నుదన్నుతో మరింత రెచ్చిపోయిన సాల్వాజుడుం అమాయక ఆదివాసీలను వారి ఇళ్ల నుండి నిర్బంధంగా ఖాళీ చేయించడం, గృహ దహనాలు, లూటీలు చేయడాలు, బహిరంగంగా కొట్టడం, బట్టలు విప్పించడం లాంటి వికృత చర్యలెన్నింటికో పాల్పడింది. భద్రతా బలగాలు జరిపే ఏ కూంబింగ్ ఆపరేషనైనా సాల్వాజుడుం సహకారంతో జరగడం, అలాంటి ప్రతి సందర్భంలో మహిళల లక్ష్యంగానే జుడుం వ్యవహరించింది. లైంగిన దాడులతో భీతావాహులను చేయడమే కాకుండా సాయుధ బలగాలకు 'లైంగిక సుఖాన్ని' అందించాలని తీవ్రమైన ఒత్తిడిచేసేవాళ్లు.

కిడ్నాపులు, రేపులు, హత్యలు, పంటపొలాలు ధ్వంసం చేయడం, ఇంట్లోని నిత్యావసర వస్తులను అపహరించడం, కోళ్లు, పశుసంపద వంటి వాటిని దోచుకొని వెళ్లడం నిత్యకృత్యమైంది. నక్సలైట్ల కోసం గాలింపు చేసే క్రమంలోనే కాదు, సానుభూతిపరులనుకున్న వాళ్లను సహితం నిర్బంధించి లైంగిక హింసను ప్రయోగిస్తున్నారు. అరెస్టు జరిగిన సమయంలోనే కాకుండా కస్టడిలోకి తీసుకున్న మహిళలపై మరింతగా ఈ హింసా ప్రయోగం జరుగుతున్నది. వారితో అసభ్యంగా మాట్లాడడం, తాకకూడని చోట వికృతంగా తాకడం, తుపాకీ మడమలతో స్త్రీల శరీరాలపై, సున్నిత భాగాల్లో పొడవడంలాంటివి ఎన్నో ఉన్నాయి. కనీసం వారికి తమ మీద జరిగిన, జరుగుతున్న లైంగిక అత్యాచారాల గురించి బయటికి చెప్పుకునే పరిస్థితి కూడా లేదు.

మావోయిస్టు పార్టీకి అనుబంధంగా ఉన్న క్రాంతికారి ఆదివాసీ మహిళా సంఘం (కెఎఎమ్ఎస్)లో సభ్యులుగానో, సానుభూతిపరులుగానో ఉన్నవాళ్లనయితే మరింతా లక్ష్యంగా చేయడమే కాకుండా వారి రాజకీయ విధేయత పోలీసుల దృష్టిలో వారిని లైంగిక హింసకు గురిచేయడం సమర్థనగా అనిపిస్తున్నది.

2011 అక్టోబర్‌లో ఆదివాసీ పాఠశాల వార్డెన్ అయిన సోనీసూరిని మావోయిస్టు సానుభూతిపరురాలనే నెపంతో అరెస్టు చేసి కస్టడిలో వివస్త్రను చేయడమే కాకుండా కరెంట్‌షాకులకు గురిచేసారు. అంకిత్ గార్గ్ అనే పోలీస్ సూపరింటెండెంట్ అయితే ఆమెను పచ్చిభూతులు తిడుతూ కించ పరచడమేకాకుండా వివస్త్రను చేయడాన్ని, కరెంటు షాకులను గురిచేయడాన్ని ప్రత్యక్షంగా పర్యవేక్షించడమే కాకుండా తన మనుషులతో తీవ్రంగా హింసించడం, ఆమె మర్మాంగాల్లో రాళ్లను జొప్పించేలా చేసిన కిరాతక చర్యకి ప్రత్యక్ష బాధ్యుడు. సుప్రీంకోర్టు ఆదేశించిన వైద్య పరీక్షలో ఇది రుజువైనప్పటికీ అతనిపై చర్యలు తీసుకోకపోగా అంకిత్ గార్గ్ 'ఘన'కార్యాలకు రాష్ట్రపతి సాహసవీరుని అవార్డు లభించింది.

లైంగిక హింసను పరాక్రమ చర్యగా చూపే సంస్కృతి అధికారంలో ఉన్నవారు ఎంతటి వికృత నేరానికైనా శిక్షలుండవనే భావనను కల్పిస్తున్నది. తద్వారా లైంగిక హింసను హింసా, అణిచివేత రూపంగా చట్టబద్ధం చేసే ప్రమాదమున్నది. సోనీసూరి ఉదంతం ప్రధాన స్రవంతి మీడియా ద్వారా బయటి ప్రపంచానికి బాగానే తెలిసినప్పటికీ సూరి జైల్లో ఉండగా ఆమెకు పరిచయంలోకి వచ్చిన ఇటువంటి లైంగిక హింసను ఎదుర్కొన్నవాళ్లలో కవాసి ఇద్మె ఒకరు. తన సోదరీలతో స్థానిక సంతలో ఉన్న ఇద్మేను అరెస్టు చేసి అనేక పోలీస్‌స్టేషన్లు తిప్పుతూ పలు సార్లు రేప్‌చేసారు. చావు అంచుకు వెళ్లిన ఆమెను కస్టడిలో చనిపోతే అనేక సమస్యలుంటాయని ఎర్రబోరులో 24 మంది పోలీసులను చంపివేసిన ఘటనలో పాల్గొన్నదంటూ కోర్టులో ప్రవేశపెట్టారు.

మావోయిస్టు సాయుధ చర్యల్లో పాల్గొనడమేదో ఇంతటి విచ్చలవిడి లైంగిక హింస, అత్యాచారాలకు గురిచేయడం అర్థమైనదన్నట్టుగా, సమంజసమైనదన్నట్టుగా వ్యవహరిస్తున్నాయి భద్రతాబలగాలు.

సోనీసూరి, ఇద్మే కేసుల్లో శిక్షార్హమైన రుజువులున్నప్పటికీనీ వాటికి బాధ్యులైన పోలీసు అధికారులపై ఎటువంటి చర్యలులేకపోగా పదోన్నతులు, 'సాహస' అవార్డులతో సత్కరిస్తున్నారు. చర్యలు తీసుకుంటే భద్రతా బలగాల 'స్థైర్యం' దెబ్బతిని 'అంతర్గత' భద్రతకు ముప్పువాటిల్లి దేశం విచ్ఛిన్నమైనపోతుంది మరీ!

2011 మార్చిలో కోయ కమాండోలు, కోబ్రా, ప్రత్యేక పోలీసు అధికారుల పేరుతో ఉన్న సాల్వాజుడుం సభ్యులు మోర్పల్లి, బోడ్మెట్ల, తిమ్మాపురం గ్రామాల మీద పడి బీభత్సాన్ని సృష్టించారు. ముగ్గురిని చంపివేసి, ముగ్గురు మహిళలను రేప్ చేయడమే కాకుండా మూడు వందల ఇళ్లను తగులబెట్టారు. ఇదంతా ఆనాటి దంతెవాడ ఎస్పి ఎస్ఆర్పి కల్లూరి ఆధ్వర్యంలోనే జరిగింది. లేథాబాయి అనే మహిళ, ఎస్పి తనను రేప్ చేయడమే కాకుండా గ్యాంగ్ రేప్ చెయ్యమని తనవాళ్లను ఆదేశించాడని స్వయంగా మేజిస్ట్రేట్ ముందు వాగ్మూలం ఇచ్చింది. 2006లో ఆమె కేసు వేసినప్పటికీ కేసు ఉపసంహరించుకునేలా ఆమెను బెదిరించడమే కాకుండా ఆ తర్వాత ఆమె జాడే తెలియకుండా పోయింది. ఇంతటి దుర్మార్గ చరిత్ర కలిగిని కల్లూరికి 2013, 2014లలో రాష్ట్రపతి పోలీస్ మెడల్ ఇవ్వడమే కాకుండా ఐజిగా బస్తర్ రేంజీకి పదోన్నతిపై పంపించారు.

ఎంతటి క్రూరమైన చర్యలకు పాల్పడినా, ఘోరమైన నేరాలు కళ్ల ముందు కనిపిస్తున్నా ప్రభుత్వాలు కార్పొరేట్స్‌కి కట్టబెట్టాలనుకున్న భూమిని పదిలంగా అప్పగించేలా ఏ పోలీసు అధికారి వ్యవహరించినా వారి ఏ లైంగిక హింస శిక్షార్హమైన నేరము కాదన్నట్టు వ్యవహరిస్తున్నది ప్రభుత్వం. అసమ్మతిని అణిచివేయండలో లైంగిక హింసను సమ్మతి కలిగిన సాధనంగా ఉపయోగించడమే కాకుండా శాంతిభద్రతలకు, దేశభద్రతకు అది అనివార్యమనేలా వ్యవహరిస్తూ అటువంటి చర్యలకు ఎంటువంటి శిక్షలుండవన్న సంకేతాన్ని బహిరంగానే ఇస్తున్నది రాజ్యం. సుప్రీంకోర్టు తీర్పుతో సాల్వాజుడుం లాంటి ప్రైవేటు సాయుధ సంస్థ అధికారికంగా లేకపోవచ్చుగానీ ఆ సభ్యుల్లో అధికులను డిస్ట్రిక్టు రిజర్వు గార్డు ఫోర్స్ పేరుతో ఛత్తీస్‌ఘర్ ప్రభుత్వం 'రిక్రూట్' చేసుకున్నది. జుడుం లేకపోయినా గానీ ఆ శక్తులన్నీ అధికారిక పోలీస్ ఫోర్స్‌గా మారిపోయింది. నిజానికి సుప్రీంకోర్టు చాలా విస్పష్టంగా తన తీర్పులో ఆదివాసీ యువతను మావోయిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా వాడటమంటే 'సమాజాన్ని విభజించే, విచ్ఛిన్నంచేసే విష గుళికల్ని విత్తుకోవడమే' అని పేర్కొన్నది. ఏ ప్రభుత్వమైనా రాజ్యాంగ నిర్దేశానుసారం ప్రజల సంక్షేమం కోసం పనిచేయాలే తప్ప ప్రజల్లో విభజన తెచ్చే, ఒకరిపైన ఒకరిని ఉసిగొల్పే చర్యలు చేపట్టరాదని ప్రకటించింది.

సాల్వాజుడుం లేకపోవచ్చు గానీ దాని స్థానంలో అదే శక్తులతో నిండిపోయిన డిస్ట్రిక్ట్ రిజర్వ్ గార్డు (డిఆర్జి)తో పాత తరహా ఆపరేషన్లు కొనసాగుతూనే వున్నాయి. బూటకపు ఎన్‌కౌంటర్లు, అక్రమ అరెస్టులు, నిర్బంధాలు, బూటకపు లొంగుబాట్లు వంటివి మీడియా ద్వారా ఎంతోకొంత బయటికి వస్తూనే వున్నాయి. పాత్రికేయుల, హక్కుల ఉద్యమకారుల అరెస్టులు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. ఇటీవలి కాలంలో తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్‌కు చెందిన నిజనిర్ధారణ సభ్యుల బృందాన్ని అక్రమంగా అరెస్టుచేసి గత ఆరు నెలలుగా జైల్లోనే బందించివేసారు.

2015-16 మధ్యకాలంలో సామూహిక లైంగిక అత్యాచారాలు జరిగిన ఘటనలు అనేకం వెలుగులోనికి వచ్చినయి. మైనర్లు, గర్భిణీ స్త్రీలు సైతం ఈ లైంగిక హింసకు గురవుతున్నారు. నిజానికి క్షేత్రస్థాయిలో ఏం జరుగుతున్నదో తెలుసుకునే అవకాశం కూడా భద్రతా బలగాలు ఇవ్వడం లేదు. వనవాసీ చేతన ఆశ్రమం కూల్చివేసి దాని సభ్యులను అనేక రకాలుగా వేదించి హింసించారు. 2013లో రెడ్‌క్రాస్ అంతర్జాతీయ కమిటి కార్యకలాపాలను రద్దు చేయాలని చత్తీస్‌గడ్ పోలీసులు ఆదేశించారు. ఆదివాసీలకి వైద్యసేవలందించే వాళ్లను, న్యాయ సహాయం చేసేవాళ్లను బెదిరించి, భయాన్ని సృష్టించి మరీ ఆదివాసీల మధ్యకు వెళ్లనీయడం లేదు. జగదల్ లీగల్ ఏయిడ్ గ్రూప్ (జగ్‌లాగ్) వారిని వెంటపడి మరీ జగదల్‌పూర్ విడిచి వెళ్లేలా వేదించారు.

పోలీసుల అక్రమ చర్యలని ఎవరు ప్రశ్నించినా వారిని వెంటాడుతూ భయానక వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. లీగల్ ఏయిడ్ గ్రూప్‌కు చెందిన శాలిని గెరాను, సామాజిక ఉద్యమ కార్యకర్త అయిన బేలా బాటియా ఇంటిపైన దాడి చేసి ఆ ప్రాంతాన్ని వదలి వెళ్లాలని బెదిరించారు.

లైంగిక హింస, రాజ్య నిర్బంధ వ్యతిరేక మహిళ అనే సంస్థతో పాటు అనేక ఇతర స్వతంత్ర సంస్థలు కూడా నిజనిర్ధారణ బృందాలుగా ఏర్పడి ఆదివాసీ మహిళలపై జరిగిన అనేక లైంగిక దాడి ఘటనలను వెలుగులోకి తెచ్చాయి. 2015 అక్టోబర్ 19 నుండి 24 వరకు నాలుగు బృందాలుగా భద్రతా బలగాలు చిన్న గెల్లూరు, పెద్ద గెల్లూరు, గుండామ్, బర్గిచెర్ల, పెగడపల్లిలో జరిగిన కూంబింగ్ ఆపరేషన్‌లో పెద్ద గెల్లూరుకు చెందిన పశువుల్ని మేపుతున్న 13 ఏండ్ల అమ్మాయిని వెంటాడి మరీ పట్టుకొని కళ్లకు గంతలుకట్టి ముగ్గురు వ్యక్తులు రేప్‌చేశారు. బహిరంగంగా కొట్టడం, వివస్త్రలను చెయ్యడం, దుస్తులను చింపి వేయడం, మర్మాంగాల్లో కారం పోయడం, కందిపోయేలా వాతలు పెట్టడం, మర్మాంగాలను కత్తులతో చీరివేయడం లాంటి వికృత చర్యలవల్ల, అటువంటి హింసను తాళలేక కనీసం నడవలేని, ఏ పని చేయలేని స్థితిలోకి నెట్టివేయబడిన మహిళలెందరోవున్నారు. ఇళ్లల్లోకి చొరబడి లైంగిక వాంఛ తీర్చమని వేదించడమే గాకుండా ఈ విషయాన్ని ఎవరికైనా చెపితే చంపివేస్తామని బెదిరించడం సర్వసాధారణమై పోయింది.

సామూహికంగా జరిగిన రేప్ కేసుల్లో ఒకరో ఇద్దరో సాయుధులు మహిళలను పశుబలంతో అదిమిపట్టడం మిగతావారు రేప్ చేయడమనే వికృత క్రీడ కొనసాగుతున్నది. ఇట్లాంటి అనేక సంఘటనల్లో బాధితులైన స్త్రీలు తమ బాధను బయటకు చెప్పుకుంటే సామాజికంగా ఉండే ఏవగింపుకు బయపడడం ఓవైపు, పోలీసు చర్యలను ఎదిరించలేని దీనస్థితి మరోవైపు ఉన్నది. కూంబింగ్ ఆపరేషన్ జరిగే ప్రతి సందర్భంలో మగవాళ్లంతా ఇళ్లను విడిచి అడవిలోకి పారిపోవడం, ఇళ్లల్లో ఉన్న ఆడవారిని పట్టుకొని అత్యాచారాలు చేయడమే కాకుండా మీ మగ వాళ్లందరు చెట్టు ఊపితే రాలిపోయే ఆకుల్లా రాలిపోతారని బెదిరించడం కూడా వారి భయాన్ని పెంచుతున్నది. "మేము జంతువుల్ని వేటాడుతూ అడవిలోకి వెళ్తాం, వాళ్లు మా లాంటి మనుషుల్ని వేటాడుతూ వస్తారు" అని కొర్చోలి ఆదివాసీ పోలీసు, భద్రతా బలగాలను దృష్టిలో పెట్టుకొని అన్న మాటల్లోనే అక్కడ వారు సృష్టిస్తున్న బీభత్సం ఏమిటో అర్థమవుతుంది.

నూతన అభివృద్ధి నమూనా తీసుకవచ్చిన ఈ హింస, విధ్వంసం, వనరుల దోపిడంతా కార్పొరేట్ పెత్తనం పోకుండా మారే అవకాశం ఏమాత్రం లేదు. పల్లెలు స్వయం పోషకాలుగా, స్వావలంబన సాధించకుండా, స్థానిక న్యాయం జరగకుండా సమాన హక్కుల

# బహుజనులకు రాజ్యాంగ హోదా

*రాజ్యాంగ పరంగా వెనుకబడిన తరగతుల వారికి జనాభా ప్రాతిపదికన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో రిజర్వేషన్లు కల్పించాలని అంటున్నారు* **సి.ఎచ్. బిక్షమయ్య**

**చారిత్రక నేపథ్యం**

'బహుజనులు' అనే పదమును మొదట బౌద్ధ భిక్షువులను ఉద్దేశించి గౌతమ బుద్ధుడు ఉపయోగించాడు. సామాజిక తత్వవేత్తల ప్రకారం 'ద్విజులు' కాకుండా మిగిలిన వారిని వెనుకబడిన తరగతులవారు అని అనేవారు. 'బ్యాక్‌వార్డ్ క్లాస్' అనే పదం 1921లో మైసూర్ సంస్థానంలో ప్రస్తావనకు వచ్చింది. భారత రాజ్యాంగంలో వెనుకబడిన తరగతుల వారిని ఎక్కడ నిర్వచించలేదు. వెనుకబడిన తరగతులు అనే పదాన్ని సమాజంలో సాంఘీకంగా, ఆర్థికంగా, విద్య పరంగా వెనుకబడిన కులాల సమూహంగా పరిగణిస్తారు.

భారత రాజ్యాంగ ప్రవేశికలో, ప్రాథమిక హక్కులలోని 14వ నిబంధనలో సమానత్వం అనే పదాన్ని పొందుపరిచిన సమాన అవకాశాలు అంతంత మాత్రమే. రాజ్యాంగంలోని 16వ భాగంలో 340 నిబంధన ప్రకారం రాష్ట్రపతి సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారి అధ్యయనం కోసం కమిషన్ ఏర్పాటు చేయాలని సూచిస్తుంది. భారతదేశ మొదటి రాష్ట్రపతి డా. బాబు రాజేంద్రప్రసాద్ మొట్ట మొదటి వెనకబడిన తరగతుల కమిషన్‌ను 1953 జనవరి 29న 'దత్తాత్రేయ బాలకృష్ణ కాలేల్కర్' అధ్యక్షతన కమిషన్‌ను ఏర్పాటు చేశాడు. కాలేల్కర్ కమిషన్ 1955 మార్చి 30న నివేదికను సమర్పిస్తూ 2,399 వెనుకబడిన కులాలు అని, అందులో భాగా వెనుకబడిన కులాలు 837 అని తెలుపుతూ అధ్యక్షుడు ఇచ్చిన నివేదికలో భిన్న అంశాలపై ఏకాభిప్రాయం లేనందున వాటిని అమలు పరుచలేదు.

మురార్జీ దేశాయ్ ప్రధాన మంత్రిగా ఉన్న జనతా ప్రభుత్వం 1978లో వెనుకబడిన తరగతుల రెండవ అధ్యయన కమిషన్‌ను భిందేశ్వర ప్రసాద్ మండల్ అధ్యక్షతన ఏర్పాటు చేయగా, 1979 జనవరి 1 నుండి 1980 డిసెంబర్ 31 వరకు సామాజిక, విద్యా, ఆర్థిక అంశాల ప్రాతిపదికన (11 అంశాలు పరిశీలించి) దేశ జనాభాలో సుమారు 52 శాతం ఒబిసి కులాల వారు అని, 3,743 వెనుకబడిన కులాలు అని 40 సిఫారసులతో 1980లో ప్రభుత్వానికి నివేదిక సమర్పిస్తూ కేంద్ర ప్రభుత్వ విద్యలో, ఉద్యోగాలలో 27 శాతం రిజర్వేషన్లు కల్పించాలని సిఫారసు చేసింది.

బిపి మండల్ కమిషన్ సిఫారసు ప్రకారం 1990 సెప్టెంబర్ 7న కేంద్రంలో విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ ప్రభుత్వం 27 శాతం రిజర్వేషన్లు అమలు పరిచింది.

మండల్ కమిషన్ సిఫారసులను సవాలు చేస్తూ ఇందిరా సహని సుప్రీం కోర్టును ఆశ్రయించగా కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలలో వెనుకబడిన తరగతుల వారికి 27 శాతం రిజర్వేషన్లు ఇవ్వడం సబబే అని తీర్పు చెబుతూ ఈ కింది రిజర్వేషన్లు మొదటి సారి ఉద్యోగానికి మాత్రమే పదోన్నతికి వర్తించవు. అగ్ర వర్ణాలలో 10 శాతం ఇబిసి రిజర్వేషన్లు ఇవ్వరాదు అని మొత్తం రిజర్వేషన్లు 50 శాతానికి మించరాదు అని తీర్పు ప్రకటించింది.

1963లో ఎంఆర్ బాలజీ మైసూర్ కేసులో కూడా రిజర్వేషన్లు 50 శాతానికి మించరాదు అని సుప్రీంకోర్టు తీర్పు ప్రకటించింది. ఇందిరా సహని కేసులో ఆర్థికంగా అభివృద్ధి చెందిన వారికి క్రిమిలేయర్ (సంపన్న వర్గం) విధానం అమలు పరచాలని ప్రకటించింది. 1993లో పాట్నా హైకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ రామనందన్ ప్రసాద్ కమిటీ 11 ప్రమాణాలతో 1993 మార్చి 10న క్రిమిలేయర్ విధానంపై నివేదిక సమర్పించింది. (ప్రస్తుతం క్రిమిలేయర్ పరిమితి 6 లక్షల రూపాయల వరకు).

జస్టిస్ జీవన్‌రెడ్డి అధ్యక్షతన 9 మంది న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనం జాతీయ, రాష్ట్ర స్థాయిలలో వెనుకబడిన తరగతుల కమిషన్ ఏర్పాటు చేయాలని సూచించింది.

**జాతీయ వెనుకబడిన తరగతుల కమిషన్**

1993 ఏప్రిల్ 2న పి.వి. నరసింహారావు ప్రభుత్వం ఒబిసి కమిషన్‌ను జస్టిస్ రామనందన్ ప్రసాద్ అధ్యక్షతన ఏర్పాటు చేసింది. ఇందులో ఒక ఛైర్మెన్, వైస్ ఛైర్మెన్, నలుగురు సభ్యులతో ఏర్పాటు చేశారు. వీరి పదవీకాలం మూడు సంవత్సరాలు. ఈ కమిషన్ రాజ్యాంగబద్ధమైనది కాదు. ఇది కేవలం చట్టబద్ధమైన సంస్థ. కేంద్ర ఒబిసి కమిషన్ ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రాతినిధ్యం లేని వారిని గుర్తించి వారికి రిజర్వేషన్లు

---

ప్రాతిపదికన అభివృద్ధి నమూనా రూపొందించబడకుండా ఈ హింసా వలయం ఆగిపోదు. అనేక దేశవిదేశీ కార్పొరేట్‌లతో చేసుకున్న ఒప్పందాలను తక్షణమే రద్దుచేయాలి. దండకారణ్యంలో వేలాదిగా మోహరించిన సాయుధ బలగాలను, గ్రీన్‌హంట్‌లను వెంటనే నిలిపివేయాలి. ఇప్పటి వరకు జరిగిన నరమేధానికి కారకులైన వారిపై చట్టపరమైన చర్యలుండాలి. అధికారం, ఆర్థిక, ఆయుధ బలంతో చేస్తున్న ఆగడాలకు వెంటనే స్వస్తి పలికి చట్టబద్ధ పాలన అమలయ్యేలా చూడాలి. అడవిపై, అటవీ సంపదపై ఆదివాసీలకే సంపూర్ణ హక్కు కల్పించాలి. జంతువుల్ని వేటాడుతూ అడవికి వెళ్లే పద్ధతిలో మనుషుల్ని వేటాడుతూ దండకారణ్యంలోకి ప్రవేశించే ఆనాగరిక విధానాలు నశించాలి. పైనుండి రుద్దబడే అభివృద్ధి నమూనా స్థానంలో క్రిందినుండి పైకి ఎగబాకే అభివృద్ధి విధానం అమలవ్వాలి. సమిష్టి సంపదైన సహజ వనరులు సమిష్టి సంక్షేమం, అభివృద్ధి కోసమే వినియోగించబడాలి. ప్రజలందరి అభివృద్ధి కోసం కాకుండా కొద్ది మంది వ్యక్తుల, సంస్థలకు ఆస్తులు పోగేసే దళారి పనికి పాలక వర్గం చరమగీతం పాడాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

కల్పించాలి. ఈ కమిషన్ సిఫారసు ప్రకారం ఏ కులాన్ని అయినా కేంద్ర ప్రభుత్వం ఒబిసి జాబితాలో చేర్చవచ్చును అని చట్టంలోని 9వ సెక్షన్ తెలియజేస్తుంది. 11వ సెక్షన్ ప్రకారం ప్రతి పది సంవత్సరాల కొకసారి కమిషన్ సిఫారసు ఆధారంగా ఒబిసి కులాల జాభితాను కేంద్ర ప్రభుత్వం సవరించవచ్చును. కాని ఎలాంటి సవరణలు ఇప్పటివరకు చేయలేదు.

ఒబిసి సంస్థ రాజ్యాంగ బద్ధమైనది కానందు వలన భారతదేశం లోని వివిధ రాష్ట్రాలలో ఒబిసి జాబితాలో చోటు కల్పించాలని కుల సంఘాలు ఆందోళన చేస్తున్నాయి. రాజ్యాంగంలో వెనుకబాటు తనాన్ని నిర్వచించకపోవడం వలన ఆర్థికంగా, సామాజికంగా ముందంజలో ఉన్న కులాలు రాజకీయ ఒత్తిళ్లు చేస్తూ ఒబిసి జాబితాలో చేరాయి. కొన్ని చేరాలని చూస్తున్నాయి. ఉదాహరణకు 2014 సాధారణ ఎన్నికలకు ముందు జాట్‌లను చేర్చారు. ప్రస్తుతం గుజరాత్ రాష్ట్రంలో పటేల్ వర్గం, ఆంధ్ర ప్రాంతంలో కాపు వర్గం మమ్ములను కూడా వెనుకబడిన తరగతులుగా గుర్తించాలని కోరుతున్నాయి. భారతదేశంలో వర్ణాశ్రమ ధర్మంతో పాటు వృత్తుల ఆధారంగా కుల ఆవిర్భావ పునాదులు ఏర్పడినాయి. ఎంఎన్ శ్రీనివాస్ అనే సమాజ శాస్త్రవేత్త అభిప్రాయం ప్రకారం భారతదేశంలో కుల వ్యవస్థ బలహీనపడడం లేదు. బలపడడం జరుగుతుంది. మాకు రిజర్వేషన్లు వద్దు అని ఎవరు కూడా ముందుకు రావడం లేదు.

రామ్‌సింగ్ యూనియన్ ఆఫ్ ఇండియా కేసులో సుప్రీంకోర్టు 2015 మార్చ్ 17న తీర్పు ప్రకటిస్తూ 15,15 (4) 16 (4) అధికరణములను వివరించింది. రాజ్యాంగంలోని 3వ భాగంలో పొందుపరిచిన ప్రాథమిక హక్కులలో సమానత్వపు హక్కులో 15 నిబంధన ప్రకారం జాతి, కుల, మత, లింగ విచక్షణలను రాజ్యాంగం నిషేధిస్తుంది. 15(4) అధికరణమును 1951లో 1వ రాజ్యాంగ సవరణ ద్వారా చేర్చడం జరిగింది. దీని ప్రకారం సామాజికంగా, విద్యా పరంగా వెనుకబడిన వర్గాలు గాని, లేదా ఎస్‌సి, ఎస్‌టిల అభ్యున్నతికి దోహదపడే ఏర్పాట్లు చేయవచ్చునని సుప్రీంకోర్టు తెలిపింది. 16(4) నిబంధన ప్రకారం ఒబిసిలకు అనుకూలంగా ఉద్యోగాలలో రిజర్వేషన్లు కల్పించవచ్చును. వివిధ స్వతంత్ర పరిస్థితుల, సాంఘీక, సాంస్కృతిక, ఆర్థిక, విద్య, రాజకీయ అంశాల కారణంగా వెనుకబాటుతనం వ్యక్తం అవుతుంది. వెనుకబాటు తనాన్ని నిర్ణయించడంలో 'కులం' అనేది ప్రధాన అంశం అయినప్పటికీ, కులం ప్రధానం కాకుండా వెనుకబాటు తనాన్ని వాస్తవిక దృక్పథంతో నూతన ప్రమాణాలు అనుసరించాల్సిన అవసరం ఉందని పేర్కొన్నారు.

**నూతన కమిషన్**

1993లో ఏర్పాటు చేసిన వెనుకబడిన తరగతుల జాతీయ కమిషన్ స్థానంలో బి.కె. హాండిఖ్ కమిటీ సిఫారసు ప్రకారం నరేంద్రమోడీ ప్రభుత్వం రాజ్యాంగ ప్రతిపత్తి కలిగిన సామాజికంగా, విద్యా పరంగా వెనుకబడిన తరగతుల వారి కోసం జాతీయ కమిషన్ ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. కేంద్ర కేబినెట్ 2017 మార్చ్ 23న ఎన్‌సిబిసి చట్టం స్థానంలో నూతన కమిషన్ ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. నూతన కమిషన్‌కు రాజ్యాంగ హోదా కల్పించే రాజ్యాంగ సవరణ బిల్లును కేంద్ర సామాజిక మంత్రి థావర్‌చంద్ గెహ్లాట్ బిల్లు ప్రవేశపెట్టగా లోక్‌సభ 2017 ఏప్రిల్ 10న ఆమోదించింది. బిల్లుకు అవసరమైన మూడింట రెండు వంతుల సభ్యుల మద్దతు (2/3వ వంతు) అవసరం ఉండగా, 360 మంది సభ్యులు అనుకూలంగా, ఇద్దరు మాత్రమే వ్యతిరేకించారు. లోక్‌సభ ఆమోదించిన బిల్లును రాజ్య సభలో 2017 ఏప్రిల్ 11న కేంద్ర మంత్రి ప్రవేశపెట్టాడు. ప్రతిపక్షాలు రాజ్య సభలో అభ్యంతరాలు లేవనెత్తడం వలన బిల్లును భూపేంద్ర యాదవ్ నేతృత్వంలోని సెలెక్ట్ కమిటీ పరిశీలనకు పంపడం జరిగింది.

**నూతన రాజ్యాంగ సవరణ బిల్లులోని ప్రధాన అంశాలు**

1. నూతనంగా 338బి అధికరణం పొందుపరుస్తూ రాజ్యాంగ సవరణ బిల్లులు ప్రవేశపెట్టారు.

2. 34 2ఎ అధికరణం చేర్చి ఒబిసి జాబితాలో ఏ కులాన్ని చేర్చాలన్నా లేదా తొలగించాలన్నా పార్లమెంట్ ఆమోదంతో మాత్రమే జరుగుతుంది.

3. సామాజికంగా, విద్యా పరంగా వెనుకబడిన తరగతులను నిర్వచించడానికి ప్రస్తుతం ఉన్న ఎన్‌సిబిసి చట్టాన్ని ఉపసంహరించుకొని 366 అధికరణం కింద కొత్త నియమం (26సి) పొందుపరిచే విధంగా క్యాబినెట్ ఆమోదించింది.

4. ముస్లిం వర్గాలను ఒబిసి జాబితాలో చేర్చాలో వద్దో ఆయా రాష్ట్రాలే నిర్ణయించుకుంటాయని కేంద్ర మంత్రి లోక్‌సభలో సమాధానం ఇచ్చాడు.

5. ఎన్‌సిఎస్‌బిసిలో అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, ముగ్గురు సభ్యులను ప్రధాన మంత్రి చేత నియామకం కాకుండా ఈ చట్టం ప్రకారం రాష్ట్రపతి నియమిస్తాడు.

6. రాజ్యాంగ హోదా పొందాలంటే పార్లమెంట్ ఉభయ సభలు వేరు వేరుగా 2/3వ వంతు మెజారిటీతో ఆమోదించాలి. తదుపరి భారతదేశంలోని సగానికంటే ఎక్కువ రాష్ట్ర శాసన సభల ఆమోదం పొందితే బిల్లు అమలులోకి వస్తుంది.

**పరిశీలించాల్సిన అంశాలు**

ఎలాంటి రాజకీయ ఒత్తిళ్లకు గురి కాకుండా వాస్తవమైన వెనుకబడిన తరగతులను గుర్తించవలసిన ఆవశ్యకత కలదు. స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు కావచ్చిన అభివృద్ధి ఫలాలు ఇప్పటికి దేశ ప్రజలందరికి అందుబాటులోకి రాలేదు. కె. సంతానం ప్రకారం రాజకీయ, ఆర్థిక, సాంఘీక సమానత్వం సాధించినప్పుడే ఈ దేశ ప్రజలందరికి నిజమైన స్వాతంత్ర్య ఫలాలు అనుభవించగలుగుతారు. ఈ చట్టం ప్రకారం అయిన నిజమైన ఒబిసిలను గుర్తించగలుగుతారని ఆశిద్దాం.

ఎస్‌సి, ఎస్‌టి వర్గాల వారి రక్షణ కోసం అట్రాసిటి చట్టం ఏ విధంగా అమలు చేస్తున్నారో ఒబిసి వర్గాల వారికి కూడా అలాంటి చట్టాన్ని రూపొందించవలసిన అవసరం ఎంతైనా కలదు. 243డి, 243టి నిబంధనల ప్రకారం ఎస్‌సి, ఎస్‌టి వర్గాల వారికి స్థానిక ప్రభుత్వాలలో రిజర్వేషన్లు జనాభా ప్రాతిపదికన కల్పిస్తున్నారో, ఒబిసిలకు కూడా జనాభా ప్రాతిపదికగా రిజర్వేషన్లు పొందుపరిచి అమలు చేయవలసిన ఆవశ్యకత కలదు. కేంద్ర ప్రభుత్వం తీసుకున్న ఈ సాహోసోపేతమైన నిర్ణయాన్ని రాజ్యసభ, రాష్ట్ర శాసనసభలు శీఘ్రంగా ఆమోదించవలసిన ఆవశ్యకత ఉంది. ప్రతి ఐదు సంవత్సరాలకు ఒకసారి ఒబిసి వర్గాల సామాజిక స్థితిగతులను సమీక్ష చేసి, వెనుకబాటు తనంపై పారదర్శకంగా, జవాబుదారీ తనం పెంపొందించే విధంగా సమగ్ర కార్యచరణ ప్రణాళికలు రూపొందించాలి. రాజకీయ ప్రయోజనాల దృష్టితో కాకుండా వాస్తవ, యదార్థ విలువల దృక్పథంతో పరిశీలించి జనాభాకు అనుగుణంగా కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలలో రిజర్వేషన్లు అమలు చేయవలసిన ఆవశ్యకత కలదు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్)*

# ఎక్స్‌ప్రెస్ హైవే ఎవరి ప్రయోజనాల కోసం?

***వ్యవసాయం నుండి తప్పుకున్న భూస్వాములు ఎక్స్‌ప్రెస్ హైవేలకు మద్దతు పలుకుతుంటే, ఆ ఎక్స్‌ప్రెస్ హైవేలలో కోల్పోతున్న తమ భూముల కోసం సాధారణ ప్రజలు ఐక్యంగా ఉద్యమించాల్సిన అవసరం ఉందంటున్నారు* డా. కొల్లా రాజమోహన్**

అమరావతి నుండి అనంతపురం ఎక్స్‌ప్రెస్ హైవే భారతదేశంలో అత్యంత పొడవైన వంపులు లేని ఎక్స్‌ప్రెస్ హైవేని నిర్మించడం ఆంధ్రులకు గర్వకారణమని, అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ప్రాజెక్ట్ అనీ ప్రభుత్వం, మేధావులు చెప్తున్నారు. తాజమహల్ మనకు ఎంతో గర్వంగా ఉన్నది. ఈ రోడ్డు కూడా అటువంటిదే అంటున్నారు. ఎక్స్‌ప్రెస్ హైవే వెంట రైల్వే మార్గాన్ని ఏర్పరిచి వెనకబడిన రాయలసీమ ప్రాంతాన్ని సుభిక్షం చేస్తామంటున్నారు. 101 కి.మీ దూరాన్ని తగ్గించి 120 నిమిషాల ప్రయాణ కాలాన్ని తగ్గిస్తామంటున్నారు. 26 వేల 890 ఎకరాల భూమిని రైతుల నుండి నయానో భయాన్నో సేకరిస్తామంటున్నారు.

అనంతపురం నుండి పల్నాడు వరకూ ప్రజలు కరువుతో, నీటి కొరతతో అల్లాడిపోతున్నారు. రైతులకు, జీవాలకు కనీసం తాగునీరు, పశువులకు మేత అందడంలేదు. వలసలు పోతున్నారు. బతకలేక పక్క రాష్ట్రాలలో కూలీలుగా, బిచ్చగాళ్లలాగా జీవిస్తూ, మురుగు కాల్వల పక్క నివసిస్తూ ఘోరమైన జీవితం గడుపుతున్నారు. వారికి ఉపశమనం కలిగించడం కోసం చేపట్టిన చర్యలు నామమాత్రంగా ఉన్నాయి. ఇదే కాలంలో దేశంలో ఎక్కడా లేనంత భారీ ఎత్తున భూసమీకరణకు పూనుకొన్నారు. తప్పనిసరి పరిస్థితులలో, మరొక ప్రత్యామ్నాయం లేనపుడే భూములు సేకరించాలని భూసేకరణ చట్టం సెక్షన్ 10 నిర్దేశిస్తున్నది. అయినా, ప్రత్యామ్నాయం గురించి ఆలోచించిన దాఖలాలు లేవు.

అమరావతి నుండి పల్నాడు వరకు ఉన్న శాసన సభ్యులతోగానీ, మండల, జిల్లా పరిషత్ సభ్యులతోగానీ చర్చించినట్లు లేదు. కనీసం అధికార పార్టీ కార్యకర్తలకు కూడా ఇంత పెద్ద ఎత్తున భూమి ఎందుకు తీసుకొంటున్నారో తెలియదు. రైతులడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేక దబాయిస్తున్నారు. ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. అసహనం చెందుతున్నారు. అభివృద్ధి పేరును అడ్డం పెట్టుకొంటున్నారు.

భూములు పోయేవారు ఏడుస్తూ ఉంటే, వారికి ధైర్యం చెప్పేవారు కరువయ్యారు. సమీకరించే భూమి వెనక ఉన్నవాడు సంతోషిస్తున్నాడు. ప్రభుత్వ నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరు అంటున్నారు. అవతల రైలు మార్గం, రోడ్డు మార్గం ఉందికదా, కొత్తగా మొత్తం రోడ్డును వేయడం వలన రైతులు, ప్రజలు నష్టపోతారంటే, అభివృద్ధి కోసం త్యాగం చేయాలంటు న్నారు. అధికార పార్టీలో ఉన్న స్థానిక నాయకులు ప్రజల పట్ల సానుభూతి చూపి మొసలి కన్నీరు కారుస్తున్నారు. అధినాయకత్వంతో మాట్లాడమంటే తమ వల్ల కాదంటున్నారు. నష్ట పరిహారం ఎక్కువ వచ్చేటట్లు ప్రయత్నం చేద్దామని భరోసా ఇస్తున్నారు. అడ్డం తిరిగితే పోలీసులు, కోర్టులు, జైళ్లు తప్పవని బెదిరిస్తున్నారు.

2013, భూసేకరణ చట్టం, సెక్షన్ 11 ప్రకారం భూసేకరణకు నోటిఫికేషను ఇవ్వకుండానే భూములలోకి వచ్చి సర్వే చేయటంలోని అంతరార్థం ప్రజలను భయ భ్రాంతులకు గురిచేయడమే తప్ప వేరుకాదు. ప్రభుత్వమే చట్టాలను పాటించకుండా ఇష్టానుసారం వ్యవహరిస్తే ఇక ప్రజలకు దిక్కెవ్వరు? ప్రజా ఉద్యమాలకు కాలం చెల్లిందంటున్నారు. ప్రజల మనోభావాలపై దెబ్బతీస్తున్నారు. మైండ్ గేమ్ ఆడుతున్నారు.

పొడవైన, వంపులులేని, సుందరమైన పచ్చని ఎక్స్‌ప్రెస్ హైవే నిర్మిస్తున్నారని మనం సంతోషించాలా లేక వ్యవసాయ భూమి అన్యాక్రాంత మౌతుందని విచారించాలా. ఆంధ్రప్రదేశ్ రాజధాని అమరావతికి చుట్టూ రహదారులు నిర్మించడంతోపాటు, రాష్ట్రంలోని ప్రధాన పట్టణాల నుండి రాజధానికి అతి తక్కువ సమయంలో చేరుకునేలా రహదారుల నిర్మాణానికి ప్రణాళికలు తయారుచేశారు. ఇందులో భాగంగా అనంతపురం నుండి అమరావతికి 371 కిలోమీటర్ల మేర గ్రీన్‌ఫీల్డ్ ఎక్స్‌ప్రెస్ హైవే నిర్మిస్తామంటున్నారు. ఈ రహదారిలో 33 మేజర్ బ్రిడ్జిలను నిర్మిస్తారు. నాలుగు రైల్వే బ్రిడ్జిలను నిర్మించాల్సి ఉంటుంది.. రహదారి మధ్యలో 10 కిలోమీటర్ల మేర కొండలు, సొరంగాలు తవ్వాల్సి ఉంటుంది. మొత్తం ఈ రహదారి నిర్మాణానికి రు. 27 వేల 600 కోట్లు ఖర్చవుతుందని అంచనా వేస్తున్నారు. భూసేకరణకు 2 వేల కోట్లను కేటాయించా మంటున్నారు. ప్రతిపాదిత రహదారి సమీపంలో భూసేకరణకు ప్రభుత్వం పూనుకొంది.

అనంతపూర్ నుండి పల్నాడు వరకూ ఉన్న ప్రాంతంలోని రైతులు భయభ్రాంతులౌతున్నారు. చిన్న రైతులు మా జీవితాలు ఏమి కావాలని వాపోతున్నారు. ఈ వార్త తెలిసినప్పటి నుండీ అన్నమే సయించడం లేదంటున్నారు. పెద్దలైతే మంచాలు దిగడం లేదు. కనపడినవారిని, మా భూములు రక్షించండి అని వేడుకుంటున్నారు. దుఃఖాన్ని దిగమింగుకోలేని వారు రోదిస్తున్నారు. నష్టపరిహారం ఎంత ఇస్తారని ప్రశ్నిస్తున్నారు. భూమి వదలక పోతే పోలీసులు కొడతారా, జైలులో పెడతారా అని అడుగుతున్నారు. ప్రభుత్వ ప్రకటనల వలన పెద్ద ఎత్తున భూమి సమస్య ముందు కొచ్చింది. వ్యవసాయ పంటలకు గిట్టుబాటు ధరలు లేవు. ఉన్న కష్టాలు చాలక కొత్త విపత్తు దాపురించింది. పచ్చని పంట పొలాలు రోడ్డుకు ఇవ్వమంటున్నారు.

ఈ ఎక్స్‌ప్రెస్ హైవే అవసరమా అని ప్రశ్నించే వారే కరువైనారు. ఒకప్పుడు భూమి కోసం ఉద్యమాలు జరిగిన ప్రాంతాలలో, ఇపుడు భూమిని రక్షించుకోవడానికి ఉద్యమించాల్సి వస్తుంది. అనవసరమైన భూసేకరణను వ్యతిరేకించిన వారిపై ప్రభుత్వం అణచివేత చర్యలను తీసుకొంటుంది. ప్రజలను భయోత్పాతంలో ముంచుతుంది.

బాహుబలిని కట్టప్ప ఎందుకు చంపాడు అన్న చర్చలో వెయ్యోవంతు కూడా, 20 వేల మంది రైతుల జీవితాల గురించి చర్చించక పోవడం ఒక తీవ్ర విషాదం. రైతులు పండించే పంటలపై ఆధారపడి బతికే

మేధావులమనుకొనే మధ్యతరగతి జీవుల ఆలోచనలు ప్రజాభిప్రాయంగా చెలామణి అవుతున్నవి. వ్యవసాయం నుండి తప్పుకొని, ఎక్కువ పొలం ఉండి కౌలు మీద వచ్చే ఆదాయాన్ని లెక్కచెయ్యనివారు, ఎక్కువ నష్ట పరిహారం కోసం ఎదురుచూస్తున్నారు. భూమిని ఇవ్వమని ప్రోత్సహిస్తున్నారు. తమ పిల్లలు చదువుకొని, అమెరికా వెళ్లి పడరాని పాట్లు పడి పంపిన డాలర్ల మత్తులో అమెరికా రోడ్లను భారతదేశంలో ఊహించుకొని, రోడ్లే అభివృద్ధి అంటున్నారు. జనాభా తక్కువ, భూమి ఎక్కువగా ఉన్న అమెరికా రోడ్లలతో పోల్చుకొంటున్నారు.

ఆఫ్రికా దేశాలలో వేటాడి, వెంటాడి, వలవేసి పట్టి, సంకెళ్లు వేసి అమెరికాకు తెచ్చిన ఆ బానిసలు తమ శ్రమతో సృష్టించిన సంపదే అమెరికాకు ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ అని మరచిపోతున్నారు. అమెరికా అభివృద్ధిలో తుపాకుల పాత్రను మరచిపోతున్నారు. తుపాకులను చూపి బానిసల చేత చేయించిన వ్యవసాయం, ఫలితంగా వచ్చిన సంపదను మరవరాదు. ప్రపంచంలోని మేధావులను ఆకర్షించి సాంకేతికంగా ఉన్నత స్థానాన్ని సంపాదించి, ఆయుధాలను, అణ్వాయుధాలను కూడపెట్టుకొని భారతదేశ రైతుల మార్కెట్ కోసం ప్రయత్నం చేస్తున్న విషయాన్ని మరవరాదు. తుపాకులను చూపి ప్రపంచ పోలీసుగా ప్రపంచ సంపదను పోగుచేసు కొంటున్న అమెరికా మన దేశానికి ఆదర్శ మౌతుందని కొంతమంది మేధావులు భావిస్తున్నారు. అది అత్యాశ అని గ్రహించి, మన దేశ పరిస్తితులకు అనుగుణంగా మన అవసరాలను మనమే నిర్ణయించు కోవాలి. ఆ నమూనానే కాపీ చేయాలనుకోవడం మూర్ఖత్వం.

ఎక్స్‌ప్రెస్ హైవే వెంట రైలు మార్గం నిర్మించడంలో తప్పేమీ లేదు. కానీ ఉన్న రైలు మార్గాన్ని డెవలప్ చేయడానికి ప్రణాళికలను ఆచరణకు పెట్టవచ్చు కదా. ఎక్స్‌ప్రెస్ హైవే వెంటనే రైలు మార్గం ఏర్పాటు చేయడం వలననే రాయలసీమను ఆధునిక యుగంలోకి తీసుకొని వెళ్తున్నామను కోవడం కొద్ది మంది భజనపరులకే చెల్లుతుంది. గుంటూరు నుండి అనంతపూర్ వరకు ఉన్న రైలు మార్గాన్ని అభివృద్ధి చేసి ప్రయాణ కాలాన్ని గణనీయంగా తగ్గించవచ్చు అనే విషయం గ్రహించాలి. రైల్వే లైన్‌ను డబల్ లైన్‌గా చేసినందువలన, విద్యుద్దీకరణ వలన ప్రయాణ కాలం తగ్గుతుందనే వాస్తవం పాలకులకు తెలియదా. ప్రతిపాదనేలేని రైలు మార్గం కోసం భూమిని ఇపుడు సేకరించి రైతులను ఏడ్పించాలా? 2 గంటల పయాణ కాలాన్ని తగ్గించడానికి ఇంత భూమిని నాశనం చేయాలా? అభివృద్ధి చెందిన దేశాలలో కూడా, ఫ్లై ఓవర్లు, ఎత్తైన ఎలివేటెడ్ రోడ్లను నిర్మించి భూమిని కాపాడుకొంటున్నారు. ఈ రీతిలో దేశంలో ప్రత్యేకంగా మన రాష్ట్రంలో భూమిపై దాడి జరపడం గర్హనీయం. ప్రజాస్వామ్యానికి పరాజయం. ప్రజాస్వామ్యవాదులకు సవాల్.

రోడ్డుకి ఎక్కడైనా సాధ్యమైనంత తక్కువ భూమిని తీసుకొంటూ ఉన్నారు. ప్రపంచ వ్యాప్తంగా 200 మీటర్ల వెడల్పున భూమిని సేకరించిన దేశాలేమైనా ఉన్నాయా. 200 మీటర్ల వెడల్పున భూమిని తీసుకోవాలని అనుకోవడంలోని మర్మం ఏమిటో ప్రజలకు తెలియాలి. అవసరమైన చోట్ల భూమిని సేకరించడం, చట్ట ప్రకారం, సరైన నష్టపరిహారం ఇవ్వడం, పునరావాసం కల్పించడం ప్రభుత్వ కర్తవ్యం. కానీ ఏ చట్టమూ పాటించకుండా రైతుల భూములలో ప్రవేశించడం, భయోత్పాతాన్ని సృష్టించడం చట్ట వ్యతిరేకం కాదా. భూసేకరణ చట్టం ప్రకారం నోటిఫికేషన్ ఇవ్వకుండానే రైతుల భూములలోకి ఎలా ప్రవేశించారు. పెగ్ మార్కులు ఎలా పాతారు? అనుమతి లేకుండా సచివాలయానికి రానిస్తున్నారా? రైతులను బెదిరించే అవకాశాన్ని ఆర్.డి.ఒ.లకు ఏ చట్టం ఇచ్చింది? రైతుల భూములను ఏ చట్టం ప్రకారం తీసుకోవాలని అనుకొంటున్నారు? భూసేకరణ, నష్టపరిహారం, పునరావాస, పునర్ ఉపాధి కల్పన చట్టం-2013 ప్రకారమా? మరయితే సామాజిక ప్రభావం గురించి సర్వేచేయరా? భూసమీకరణ అయితే ఎంత పాకేజీ ఇస్తారు?

కూడళ్లలో జంక్షన్ల వద్ద ఒకే గ్రామంలో 250-350 ఎకరాలు ఎందుకు తీసుకోవాలనుకుంటున్నారు. వాణిజ్య సముదాయాల పేరిట వాల్మార్టు, రిలయన్స్, కెఎఫ్‌సి లాంటి పెద్ద పెద్ద కంపెనీలకు రైతుల పొలాలను ధర్మం చేస్తారా. కంపెనీలు ఇచ్చే ఉద్యోగాలెన్ని. భూములు పోయి నిరాశ్రయులయే రైతులెంతమంది. వ్యవసాయం మీద ఆధారపడ్డ వ్యవసాయ కూలీలు, ఇతర వృత్తుల వారి జీవితాలకు దారేది. వేరే పని చేసుకోవడానికి, వారికి ఇంకా ఏమైనా పని వచ్చా. ఉన్న రోడ్డుని ధనవంతుల ఆక్రమణలకు వదిలేసి నిరుపేద రైతుల భూములను డెవలప్‌మెంట్ పేరున తీసుకోవడం ఏమి న్యాయం. జంక్షన్ల వద్ద రైతుల దగ్గర ఎకరాలుగా తీసుకొన్న పొలంలో కొన్ని గజాలు స్థలం ఇస్తా మనడం అన్యాయం కాదా. పొలాల రేట్లు ఎక్కువగా ఉన్న చోట భూసమీకరణ, పొలాల రేట్లు తక్కువగా ఉన్నచోట, భూ సేకరణ చట్టం ప్రకారం అంటున్నారు. ఇదేమి న్యాయం. రైతులను త్యాగం చేయమంటారా? అమరావతి?

అనంతపురం ఎక్స్‌ప్రెస్ హైవే రాయలసీమను రతనాల సీమగా చేస్తుందనడం ఆత్మవంచనే. నిజంగా రాయలసీమను రతనాల సీమగా చేయాలంటే రాయలసీమకు నీరివ్వండి. చదువు కోసం ఖర్చు పెట్టండి. ఎయిమ్స్ లాంటి సంస్థలను గుంటూరులోనే పెట్టాలా? రాయలసీమలో పెట్టవచ్చు కదా. వ్యవసాయ విద్యాలయాన్ని రాజధానిలోనే పెట్టాలా. పోలీసు శిక్షణా కేంద్రాన్ని కూడా రాజధానిలోనే పెట్టాలా. వ్యవసాయ భూమి, పాస్‌బుక్‌లు, ట్రాన్స్‌ఫర్లు, టెండర్లు, వీడియో కాన్ఫరెన్సులు? అన్నీ ఆన్‌లైన్‌లోనే అయినపుడు రాజధానికి రావలసిన అవసరం ఎవరికి ఉంటుంది. చాలా తక్కువ మందికే ఉంటుంది. ప్రయాణ కాలాన్ని 120 నిమిషాలు, అంటే 2 గంటలు తగ్గించటానికి, తిండి పెట్టే రైతును, వ్యవసాయ భూమిని, పర్యావరణాన్ని రక్షించి ప్రాణవాయువుని అందించే అడవులను నాశనం చేయాలా. ప్రత్యామ్నాయం ఉన్నపుడు కూడా అభివృద్ధి చాటున భూమిని లాక్కోవాలా. వ్యవసాయ భూమి తగ్గిపోయి జనాభా పెరిగి ఆహార భద్రత ప్రశ్నార్థకమైనపుడు, మరోదారి ఉన్నపుడు కూడా, పేద రైతుల వినాశనాన్ని కోరుకోవాలా.

టాక్సీ కన్నా విమాన ప్రయాణాన్ని చౌక చేసి, హవాయి చెప్పులు వేసుకొన్న సామాన్యుడికి కూడా విమానయోగాన్ని హవాయీ జహాజ్ కలిగిస్తానన్న ప్రధాని ప్రకటన వాస్తవమైతే, ఇంత భూసేకరణ అవసరమేమిటి. ఇది అధికార పార్టీ, అసమ్మతి పార్టీల, ప్రతిపక్ష పార్టీల అంతర్గత వ్యవహారం కాదు. రైతుల జీవన్మరణ సమస్య. రైతులపై ఏమాత్రం సానుభూతి ఉన్నా, వ్యవసాయాన్ని రక్షించాలన్నా రైతుల భూమిని అనవసరంగా తీసుకోవడాన్ని సహించరాదు. ఉన్న రోడ్డును రైల్వేలైన్లను అభివృద్ధి చేసి, భూసేకరణను ఆపండి. రైతులు కన్నీరు పెట్టినచోట, రైతులు అసంతృప్తి చెందిన చోట, వారు సమైక్యమై ఆగ్రహించిన చోట అన్యాయంగా ఎవరూ భూమిని తీసుకోలేరు. సమైక్య రైతు ఉద్యమానికి అపజయంలేదు.

*(రచయిత నల్లమడ రైతు సంఘం నాయకులు)* వీ

# ఆర్ ఎస్ రావు దృష్టిలో హక్కుల చర్చ - ఒక పునశ్చరణ

అరుదైన ప్రజామేధావి, మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రవేత్త, ప్రజా ఉద్యమాల మిత్రుడు అమరుడు ఆర్ఎస్ రావు (1937 – 2011) సంస్మరణలో ఆయన ఆశయాలను, కృషిని బలోపేతం చేసే కర్తవ్యంలో భాగంగా ప్రతి సంవత్సరం ఆర్ఎస్ రావు సంస్మరణోపన్యాసం, సదస్సు జరుగుతున్నాయి. ఆర్ఎస్ రావు మిత్రులు, బి1 కలెక్టివ్, రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక వీక్షణం సంయుక్త నిర్వహణలో 2012 నుంచి క్రమం తప్పకుండా జరుగుతున్న ఈ కార్యక్రమాల్లో భాగంగా ఆర్ఎస్ రావు సంస్మరణోపన్యాసం 2017 హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రం షోయబ్ హాల్‌లో జూన్ 17న జరిగింది. ఈసారి సంస్మరణో పన్యాసాన్ని 'ఆర్ఎస్ రావు దృష్టిలో హక్కుల చర్చ – ఒక పునశ్చరణ' అనే అంశంపై రాజకీయార్థిక శాస్త్రవేత్త, హక్కుల కార్యకర్త పంకజ్ దత్ చేశారు. ప్రొ. జి హరగోపాల్ అధ్యక్షత వహించారు.

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం లోపలా, బైట తెలుగు సమాజంలో కూడ 1990లలో హక్కుల గురించి లోతైన చర్చ జరిగిందని, ఆ సందర్భం లో ఆర్ఎస్‌రావు విలువైన ప్రతిపాదనలు, సూచనలతో చర్చను ముందుకు తీసుకుపోయారని, అటువంటి చర్చ మళ్లీ ఒకసారి మరింత లోతుగా జరగవలసిన సందర్భంలో సమాజం ఉందని హరగోపాల్ అన్నారు.

పంకజ్ దత్ తన ఉపన్యాసంలో, మొదట 'హక్కులు: రెండు దృక్పథాలు' అని ఆర్ ఎస్ రావు 1997లో రాసిన పత్రంలో చర్చించిన అంశాలు వివరించి, తాను ఈ ప్రతిపాదనలను ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా విశ్లేషించదలచుకున్నానని అన్నారు. హక్కుల భావన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలలో పుట్టిందని, అలాగే ప్రజాస్వామ్యం, ప్రజాస్వామిక హక్కులు అనేవాటిని ఆస్తి సంబంధాలతో, కొనసాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థతో వేరు చేసి చూడలేమని అన్నారు. హక్కు అంటే ఏ వ్యక్తికైనా ఏ పని అయినా చేయడానికి, చేయకుండా ఉండడానికి ఉండే ఎంపిక స్వేచ్ఛ అని ఆర్ఎస్ రావు నిర్వచించారని, ఆ స్వేచ్ఛ లేకపోతే ఆ పని నిర్బంధపూరితమై, బాధ్యతగా మారుతుందని అన్నారని పంకజ్ దత్ గుర్తు చేశారు. ఆ నేపథ్యంలో హక్కుల పట్ల భావవాద దృక్పథానికి, భౌతికవాద దృక్పథానికి ఉండే తేడాలను వివరించారు. పౌర హక్కులకూ, ప్రజాస్వామిక హక్కులకూ, మానవహక్కులకూ మధ్య తేడాలను చర్చించారు. పెట్టుబడిదారీ దృక్పథంలో హక్కులను బట్టి మనిషిని నిర్వచించడం జరుగుతుందని, మార్క్సిస్టు దృక్పథంలో మనిషి ప్రాతిపదికన హక్కులను నిర్వచించడం జరుగుతుందని మౌలిక భేదం గురించి ఆర్ రావు ప్రతిపాదనను వివరించారు. హక్కులను సాధారణంగా రాజ్యం–పౌరసమాజం అనే నేపథ్యంలో పరిశీలిస్తారని, కాని రాజ్యం–పౌరసమాజం–రాజకీయార్థిక వ్యవస్థ అనే నేపథ్యంలో పరిశీలించవలసి ఉంటుందని ఆర్ఎస్ రావు నొక్కి చెప్పేవారని గుర్తు చేశారు.

బూర్జువా ప్రజాస్వామిక సమాజాలలోని ఈ హక్కుల చర్చను భారత సమాజంలోకి తీసుకువచ్చినప్పుడు, సామాజిక అభివృద్ధి క్రమమే అడ్డగించబడిన సందర్భంలో హక్కుల చర్చకు ఉండే ప్రత్యేకతను, నిర్దిష్టతను గుర్తించాలని అన్నారు. బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరగకుండా, భూస్వామిక విలువలే పౌరసమాజంలో బలంగా ఉన్నప్పుడు, వలసవాదం ప్రవేశపెట్టిన న్యాయవ్యవస్థ, కార్యనిర్వాహక వ్యవస్థ నెలకొనడంతో భారత సమాజంలో ఒక అంతర్గత వైరుధ్యం చోటు చేసుకున్నదని ఆయన అన్నారు. ఈ అర్ధభూస్వామ్య, అర్ధవలస వ్యవస్థలో పైనుంచి చట్టాన్ని ప్రవేశపెట్టినప్పటికీ, కింద సమాజంలో ఆమోదయోగ్యం గా ఉండే భూస్వామిక విలువలే రాజ్యం చేస్తాయని, హక్కుల సమస్యను ఈ అంతర్గత వైరుధ్య నేపథ్యంలోనే చూడాలని అన్నారు. ఈ సామాజిక వైరుధ్యం పనిచేస్తున్న నేపథ్యంలో పౌర, మానవ హక్కుల స్థితి ఎలా ఉంటుందో బాలకార్మికుల సమస్య, అడవిపై ఆదివాసు ల హక్కు, అస్పృశ్యత, ప్రభుత్వ సాయుధ బలగాలకు హక్కులు ఉండవా అని ఇటీవల లేకెత్తుతున్న ప్రశ్నలు, లౌకికవాదం, పశువధ వంటి ఎన్నో అంశాలను ఉదహరించారు. అలాగే ఈ వైరుధ్య నేపథ్యంలో ప్రజాస్వామిక హక్కుల స్థితిని వివరించడానికి వెట్టిచాకిరీ, భూమి సమస్య, ప్రభుత్వ పథకాల కోసం విస్థాపన, నిరుద్యోగం వంటి ఉదాహరణలు విశ్లేషించారు.

మార్పుకూ, అభివృద్ధికీ ఆస్తి సంబంధాలు ఆటంకంగా ఉంటాయని, అందువల్ల ఆ ఆస్తి సంబంధాలను మార్చడమే ప్రజాస్వామిక హక్కుల పునాదిగా ఉంటుందని అన్నారు. వీ

# కె.ఎన్. రావు సంస్మరణ



నిజామాబాదు జిల్లా ప్రజా ఉద్యమాలలో కె. ఎన్. రావుగా సుపరిచితులైన కన్నెగంటి నరసింహారావు (1942–2017) 2017 జూన్ 21న మరణించారు. గుంటూరు జిల్లా తెనాలి తాలుకా దుగ్గిరాల గ్రామంలో రైతు కుటుంబంలో జన్మించిన కె.ఎన్. రావు కుటుంబం కూడా అనేక కుటుంబాలతో పాటు, 1947 లో నిజామాబాద్ జిల్లాకు వలస వచ్చి, బోధన్ తాలుకా రాయకూర్ గ్రామంలో స్థిరపడింది. సరైన విద్యాసౌకర్యాలు లేని కారణంగా ఆయన చదువు ప్రాథమిక పాఠశాలతోనే ముగిసింది.

యవ్వన దశలోనే కమ్యూనిస్టు సాహిత్యంతో, భావాలతో పరిచయమై 1962లో కమ్యూనిస్టు పార్టీ సభ్యులై, జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో పాలు పంచుకున్నారు. మొదటి చీలికలో సిపిఐ (మార్క్సిస్టు) లోకి వచ్చినా, త్వరలోనే నక్సల్బరీ రాజకీయాల వైపు వచ్చారు. బహుముఖ ప్రజ్ఞాశాలిగా, బహురంగాల కార్యకర్తగా ఆయన పార్టీ, రైతుకూలీ సంఘం, బీడీ కార్మిక సంఘం, విప్లవ రచయితల సంఘం, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, బాలల హక్కుల రక్షణ వేదిక వంటి ఎన్నో సంస్థలతో పనిచేశారు. ప్రధానంగా సాహిత్య కారుడిగా, సాహిత్యోద్యమ నిర్మాతగా తన కృషిని విస్తరించుకున్నారు. జిల్లాలో ఏర్పడిన 'చేతన సాహితి' అధ్యక్షులుగా వ్యవహరించి 'వెలుగు' చేతిరాత, సైక్లోస్టైల్ బులెటిన్‌ను నడిపారు. అంటరానితనం, దళితులపై వివక్ష సమస్యపై, విప్లవ రాజకీయ అవగాహనతో 'పరిష్కారం' నాటకం రాశారు.

గోర్కీ 'అమ్మ' నవల స్ఫూర్తితో 'తెగిన సంకెళ్లు' నాటకాన్ని, బీడీ కార్మికుల సమస్యలపై 'సంఘశక్తి' నాటకాన్ని రాశారు. విప్లవ రచయితసంఘం కార్యవర్గ సభ్యుడిగా ఉన్నారు. ప్రజా రచయితల సమాఖ్య జిల్లా కన్వీనర్‌గా పని చేశారు. ప్రగతి ప్రచురణల పేరుతో పిల్లల సాహిత్యాన్ని వెలువరించారు. 1992లో నిజామాబాద్‌లో జంపాల చంద్రశేఖర్ ప్రసాద్ ట్రస్ట్ బాధ్యుడుగా లైబ్రరీ నిర్మాణం, లైబ్రరీకి పుస్తక సేకరణ, లైబ్రరీ నిర్వహణ చేశారు.

1962 నుంచి 2012 వరకు ఐదు దశాబ్దాలు రాజకీయ, సామాజిక జీవితం గడిపిన కెఎన్ రావు నాలుగు సంవత్సరాలుగా అనారోగ్యంతో ఉన్నారు. ఆయన కోరిక, కుటుంబ సభ్యుల సంసిద్ధత మేరకు ఆయన కళ్లను లయన్స్ క్లబ్‌కు, భౌతికదేహాన్ని నిజామాబాద్ ప్రభుత్వ మెడికల్ కళాశాలకు దానం చేశారు. వీ

## తెలంగాణలో ప్రజాస్వామిక హక్కుల ఉల్లంఘన

ఎంప్లాయీస్ కో-ఆర్డినేషన్ కమిటీ, తెలంగాణ ఎపి, ఉద్యోగ క్రాంతి సంయుక్తంగా సూర్యారావు 25వ సంస్మరణ సభ, ఉద్యోగ క్రాంతి 37వ వార్షికోత్సవం సందర్భంగా సదస్సు నిర్వహించారు. ఈ సదస్సులో ప్రజల ఆకాంక్షలు-ప్రస్తుత పరిస్థితులు అనే అంశం పై వక్తలు గతంలో ఎన్నడూ లేని విధంగా ప్రజాస్వామిక హక్కుల ఉల్లంఘన జరుగుతోందన్నారు. కేంద్రంలో మోడీ, రాష్ట్రంలో కెసిఆర్ ఫాసిజాన్ని అమలు చేస్తున్నారన్నారు. నాటి వెంగళరావు నుంచి నేటి కెసిఆర్ వరకు తీవ్ర నిర్బంధాన్ని అమలు చేస్తున్నారన్నారు. రైతులు గిట్టుబాటు ధరల కోసం ఆందోళన చేస్తే అణచివేసి బేడీలు వేస్తున్నారన్నారు.

## సింగరేణిలో సమ్మె

సింగరేణి కార్మికులు వారసత్వ ఉద్యోగాల పునరుద్ధరణతో పాటు.. 9 డిమాండ్లతో జూన్ 15న సింగరేణికి చెందిన 5 జాతీయ కార్మిక సంఘాలు ఏఐటియుసి, సిఐటియు, ఐఎన్‌టియుసి, బిఎంఎస్, హెచ్‌ఎంఎస్ ఈ సమ్మెకు పిలుపునిచ్చాయి. ఈ సమ్మెకు విప్లవ కార్మిక సంఘాలు, కుల సంఘాలు, మావోయిస్టు పార్టీ మద్దతు ప్రకటించాయి. సమ్మెను విజయవంతం చేసి తమ పోరాట స్ఫూర్తిని చాటాలని సింగరేణి కార్మిక సమాఖ్య (సికాస) పిలుపునిచ్చింది. టిఆర్ఎస్ అనుబంధ తెలంగాణ బొగ్గుగని కార్మిక సంఘం సమ్మెకు దూరంగా ఉంది. ఒక్క మణుగూరు మినహా అన్ని ప్రాంతాల్లో కార్మికులు మొదటి రోజు సమ్మెలో పాల్గొన్నారు. కార్మికులు యాజమాన్యంతో జరుపుతున్న చర్చలు విఫలం కావడంతో సమ్మెను తాత్కాలికంగా విరమిస్తున్నట్లు జూన్ 24న కార్మిక నాయకులు ప్రకటించారు.

## కె.ఎన్.పి.ఎస్. రాష్ట్ర ప్రథమ మహాసభలు

మహబూబ్‌నగర్ జిల్లా కేంద్రంలోని క్రౌన్ ఫంక్షన్ హాల్‌లో జూన్ 10, 11 తేదీల్లో కుల నిర్మూలన పోరాట సమితి తెలంగాణ రాష్ట్ర ప్రథమ మహాసభలు జరిగాయి. ముఖ్య అతిథిగా ప్రొ. కె. లక్ష్మీనారాయణ కుల వ్యవస్థ నిర్మూలన కోసం దళిత పీడిత కులాలే కాకుండా అగ్రవర్ణాల్లోని పేదలు కూడా ఉద్యమించాలని అన్నారు. కుల నిర్మూలన మా అవగాహన అనే అంశం పై జయరాజ్ మాట్లాడారు. దళితులు ఐక్యమవుతున్న సందర్భంలో హిందూత్వ శక్తులు కొత్తకొత్త రూపాల్లో ముందుకువస్తున్నాయని విమర్శించారు.దళితులపై జరుగుతున్న దాడులను ఆపడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విఫలమయ్యాయన్నారు. రెండవ రోజు క్రౌన్ ఫంక్షన్ హాల్ నుండి జెడ్‌పి గ్రౌండ్ వరకు ర్యాలీగా వచ్చి బహిరంగ సభ నిర్వహించారు. ఈ సభలో జి. కళ్యాణ్‌రావు, ప్రొ. రత్నం, కిష్టప్ప మాట్లాడారు. ఈ సభకు అధ్యక్షుడు లక్ష్మయ్య అధ్యక్షత వహించి నిర్వహించారు.

## సినారె కన్నుమూత

కవి, విమర్శకుడు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డి (85) మృతిచెందారు. ఆయన గతకొంత కాలంగా అనారోగ్యంతో బాధపడుతున్నారు. జూన్ 12న గుండెపోటు రావడంతో కేర్ హాస్పిటల్‌లో మృతి చెందారు. సినారె 1931 జూలై 29న పూర్వ కరీంగనర్ జిల్లాలోని హన్మాజిపేటలో జన్మించారు. స్వగ్రామంలోనే ఆయన ప్రాథమిక విద్య కరీంనగర్‌లో ఉన్నత పాఠశాల విద్యను అభ్యసించారు. ఇంటర్ నుండి డిగ్రీ వరకు ఉర్దూ మాధ్యమంలోనే చదివారు. ఉస్మానియా యూనివర్సిటీలో తెలుగులో పిజి, పిహెచ్‌డి చేశారు. విద్యార్థి దశలోనే ఆయన కవిత్వం రాయడం మొదలు పెట్టారు. 'నవ్వని పువ్వు' ఆయన మొదటి రచన. నిజాం కళాశాలలో అధ్యాపకుడిగా జీవితం ప్రారంభించి ఉస్మానియాలో రీడర్‌గా, ప్రొఫెసర్‌గా బాధ్యతలు నిర్వహించారు. ఆయన అధికార భాషా సంఘం అధ్యక్షుడిగా ఉన్నారు. పద్య, గద్య ప్రక్రియల్లో ఆయన అనేక ప్రయోగాలు చేశారు. ఆయన ఎన్నో సినిమా పాటలు రాశారు. పద్మభూషన్, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం అందుకున్నారు. సినారెవిశ్వంభర పద్యకావ్యానికి 1988లో జ్ఞానపీఠ పురస్కారం లభించింది.

## ఐఎపిఎల్ నాలుగో జాతీయ మహాసభలు

హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో భారత ప్రజా న్యాయవాదుల సంఘం (ఐఎపిఎల్) జాతీయ నాలుగో మహాసభలు జూన్ 24, 25 తేదీల్లో జరిగాయి. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విశ్రాంత న్యాయమూర్తి జస్టిస్ అభయ్ తిప్సే హాజరయ్యారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ న్యాయ వ్యవస్థ స్వతంత్రంగా పనిచేయడం లేదనీ, న్యాయ వ్యవస్థలో న్యాయమూర్తుల ఎంపిక చేసే విషయంలో మార్పులు తేవాల్సిన అవసరంముందనీ అన్నారు. ఈ సదస్సుకు దేశ నలుమూలల నుంచి ప్రజా న్యాయవాదులు హాజరైనారు. ఈ సదస్సులో సమ్మె చేస్తున్న న్యాయవాదులపై క్రిమినల్ చర్యలు చేపట్టడంపై నిరసన వ్యక్తం చేశారు. మహాసభల్లో ఐఎపిఎల్ నూతన కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు.

## జి.ఓ 29ను రద్దుచేయాలని విద్యార్థుల ఆందోళన

జి.ఓ 29ను వెంటనే ఉపసంహరించుకోవాలని, క్రమబద్ధీకరణ పేరుతో పాఠశాలలు మూసివేసే నిర్ణయాన్ని ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తూ ఎస్ఎఫ్ఐ, ఎఐఎస్ఎఫ్, పిడిఎస్‌యు, వైఎస్ఆర్ఎస్ఎఫ్ జూన్ 1న పిలుపునిచ్చాయి. అందులో భాగంగా విజయవాడలోని ముఖ్యమంత్రి కార్యాలయాన్ని ముట్టడికి యత్నించారు. ముట్టడికి యత్నించిన విద్యార్థులపై లాఠీచార్జి చేశారు. గ్రామీణ, పేద విద్యార్థులు చదువుకునే పాఠశాలలను మూసివేస్తే సహించేది లేదని విద్యార్థి సంఘాల నాయకులు ఈ సందర్భంగా ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

## కశ్మీర్‌లో మానవ హక్కుల ఉల్లంఘన

'కశ్మీర్‌లో ఏం జరుగుతుంది' అనే అంశంపై సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో జూన్ 25న సదస్సు జరిగింది. ఈ సదస్సులో 'కోమిలేషన్ ఆఫ్ సివిల్ సొసైటీ' నేత, కశ్మీర్ న్యాయవాది ఫర్వేజ్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కశ్మీర్‌లో మానవ హక్కుల ఉల్లంఘన జరుగుతోందన్నారు. కశ్మీర్ ప్రజలు ఏం కోరుకుంటున్నారు, వారి పోరాటం ఎలా న్యాయమైందో ప్రపంచానికి తెలియజేయడంలో మీడియా 70 శాతం తప్పుగా చిత్రీకరిస్తుందన్నారు. కశ్మీర్‌లో ఒక కోటి జనాభా ఉండగా, ఏడు లక్షల మంది సైనికులు ఉన్నారన్నారు. సైనికులు చేస్తున్న దాడులు, హత్యలు, అత్యాచారాలు వంటివి జరుగుతూనే ఉన్నాయని, వారిపై ఎలాంటి కేసులు నమోదు చేయడం లేదని అన్నారు.

## మధ్యాహ్న భోజనం ప్రైవేటీకరించొద్దు

మధ్యాహ్న భోజనం పథకాన్ని ప్రైవేటీకరించొద్దంటూ ఆంధ్రప్రదేశ్ మధ్యాహ్న భోజన పథకం కార్మికుల యూనియన్ (సిఐటియు) ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా జూన్ 19న కలెక్టర్ కార్యాలయాలను ముట్టడించారు. ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ ధర్నాలు, ఆందోళనలు చేపట్టారు. శ్రీకాకుళం, విజయనగరం జిల్లా వ్యాప్తంగా వందలాది మంది కార్యకర్తలను పోలీసులు అరెస్టు చేశారు. వీ

## ఉత్తరప్రదేశ్‌లో రోడ్డు ప్రమాదం 22 మంది మృతి

ఉత్తరప్రదేశ్‌లో బరేలీ జిల్లాలో జాతీయ రహదారి 24పై బాదా బైపాస్ వద్ద బస్సు లారీని ఢీకొట్టింది. ఈ ఘటనలో బస్సు డ్రైవర్‌తో పాటు ఘటనా స్థలంలోనే 22 మంది మృతిచెందగా గాయపడిన 16 మందిని ఆస్పత్రికి తరలించగా చికిత్స పొందుతూ ఇద్దరు మృతిచెందారు. ఢిల్లీ నుంచి ఉత్తరప్రదేశ్‌లోని గోండాకు బయలుదేరిన బస్సు లారీని ఢీకొనడంతో డీజిల్ ట్యాంకర్ పేలి మంటలు రావడంతో బస్సు, లారీ కాలిపోయాయి.

## ప్రత్యేక గూర్ఖాలాండ్ కోరుతూ ఆందోళన

ప్రత్యేక గూర్ఖాలాండ్ డిమాండ్ చేస్తూ గూర్ఖా జనముక్తి మోర్చా (జెజెఎం) ఇచ్చిన బంద్ పిలుపు మేరకు జూన్ 12న డార్జిలింగ్ పర్వత ప్రాంతంలో నిరవధిక బంద్ ప్రారంభించారు. పశ్చిమబెంగాల్‌లోని ఉత్తర ప్రాంతంలోని డార్జిలింగ్ ప్రాంతాలను కలిపి గూర్ఖాలాండ్ పేరిట ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలన్నది గూర్ఖాల సుదీర్ఘ డిమాండ్. మే 16న రాష్ట్రంలో బెంగాలీని తప్పనిసరి సబ్జెక్టుగా నిర్ణయిస్తూ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ నిర్ణయం తీసుకోవడంతో డార్జిలింగ్‌లో ఆందోళనలు మొదలయ్యాయి. విద్యార్థులు బెంగాలీ, హిందీ, ఇంగ్లీష్, ఉర్దూ, నేపాలీ తదితర భాషలను ప్రథమ భాషగా తీసుకోవచ్చని అయితే త్రిభాషా సూత్రంలో భాగంగా బెంగాలీ మాత్రం ఉండాలని నిర్ణయించడాన్ని గూర్ఖాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ప్రత్యేక గూర్ఖాలాండ్ కల నెరవేర్చుకునేందుకు అంతిమ పోరాటానికి సిద్ధం కావాలని జెజెఎం నేత బిమల్ గురుంగ్ జూన్ 16న ప్రజలకు పిలుపునిచ్చారు.

## కర్నాటకలో బంద్

రైతులు పంట రుణాల మాఫీ, కొత్త రుణాల ఇవ్వాలని, తాగునీటి పథకాల నిర్మాణాల సాధన కోసం వివిధ కన్నడ రైతు సంఘాలు రాష్ట్ర వ్యాప్తంగా జూన్ 12న బంద్ నిర్వహించాయి. కోలారు, చిక్కబళ్లాపుర, రామనగర, హుబ్బళ్లి జిల్లాల్లో బంద్ ప్రభావం ఎక్కువగా ఉంది.

## దళితులపై రాజద్రోహం కేసు!

అక్రమంగా అరెస్టు చేసిన తమ వారిని విడుదల చేయాలని అడిగినందుకు ఇద్దరు విద్యార్థులతో సహా 15 మంది దళితులపై జూన్ 18న రాజద్రోహం కేసు మోపింది హర్యానా ప్రభుత్వం. తమకు న్యాయం చేయాలని ముఖ్యమంత్రిని కలిసిన రెండు రోజులకే ఆ దళితులపై రాజద్రోహం కేసు మోపింది. అంబాల జిల్లాలోని పటేర్‌హెడీలో ఈ యేడాది మార్చిలో మత ఘర్షణలు జరిగాయి. ఈ ఘటనలో రాజ్‌పుత్ తెగకు చెందిన వ్యక్తి చనిపోయాడు. ఈ కేసులో నలుగురు దళితులను పోలీసులు అరెస్టు చేశారు. కాగా మత ఘర్షణల ఘటనపై పారదర్శకంగా దర్యాప్తు జరిపించాలని, తమ వారిని విడిచిపెట్టాలని కోరుతూ దళితులు కర్నాల్‌లో ఆందోళన చేపట్టారు.

## దేశ వ్యాప్తంగా రైతుల నిరసనలు

రుణమాఫీ, పండించిన పంటకు గిట్టుబాటు ధర కల్పించాలని కోరుతూ, హర్యానా, మధ్యప్రదేశ్, రాజస్తాన్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, ఒడిశా రైతులు జాతీయ రహదారుల్ని దిగ్బంధించారు. ట్రాక్టర్లను రోడ్లకు అడ్డంగా నిలిపి తమ నిరసనను తెలియజేశారు. మధ్యప్రదేశ్‌లో పోలీసుల కాల్పుల్లో మరణించిన ఐదుగురు రైతుల మృతికి నిరసనగా 62 రైతు సంఘాలు దేశ వ్యాప్తంగా జూన్ 16న 3 గంటల పాటు జాతీయ రహదారుల బంద్‌ను విజయవంతం చేశాయి.

## ఢిల్లీ మహారాష్ట్ర భవన్ ముందు ఎఐకెఎస్ ధర్నా

ఆల్ ఇండియా కిసాన్ సభ ఢిల్లీలోని మహారాష్ట్ర భవన్ ఎదుట జూన్ 8న మధ్యప్రదేశ్ ఘటనను నిరసిస్తూ ఆందోళన నిర్వహించింది. బిజెపి పాలిత రాష్ట్ర ప్రభుత్వాలు రైతుల ఆందోళనలను అణిచే ప్రయత్నం చేస్తుందని, ఆల్ ఇండియా కిసాన్ జాతీయ ప్రధాన కార్యదర్శి హన్నన్ మొల్లా విమర్శించారు. రైతులపై కాల్పులకు బాధ్యులైన పోలీసు అధికారులను తక్షణమే సస్పెండ్ చేయడంతో పాటు మృతుల కుటుంబాలకు రు. కోటి నష్ట పరిహారం ఇవ్వాలని డిమాండ్ చేసింది. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లో జరుగుతున్న రైతుల ఆందోళనలను హైజాక్ చేసేందుకు బిజెపి, ఆర్ఎస్ఎస్ అనుకూల రైతు సంఘాలను రంగంలోకి దింపిందన్నారు. తక్షణం రుణాలన్ని మాఫీచేసి, అన్ని పంటలకు కనీస మద్దతు ధర లభించేలా చర్యలు చేపట్టేలా, మందసోర్ ఘటనపై నిష్పాక్షిక విచారణ జరిపించాలని డిమాండ్ చేసింది.

## కశ్మీర్‌లో మిలిటెంట్ల దాడి

కశ్మీర్‌లోని అనంతనాగ్ జిల్లాలో జూన్ 15న జరిగిన కాల్పుల్లో లష్కరే తోయిబా కమాండర్ జునైద్ మట్టాతో పాటు అతని సహచరుడు మజూమిల్ మృతిచెందారు. బిజిబిహారా సమీపంలోని అర్వాని గ్రామంలోని ఓ ఇంట్లో ముగ్గురు మిలిటెంట్లు ఉన్నారన్న సమాచారంతో పోలీసులు, ఆర్మీ, సిఆర్‌పిఎఫ్ చేపట్టిన ఆపరేషన్లో మరో మిలిటెంటును సజీవంగా పట్టుకున్నారు. సంఘటనా స్థలం వద్ద తమపై రాళ్లు రువ్విన ప్రజలపై భద్రతా దళాలు కాల్పులు జరపడంతో ఇద్దరు చనిపోయారు. 10 మంది గాయపడ్డారు. కశ్మీర్‌లోని అనంతనాగ్ జిల్లాలో జూన్ 16న పోలీసుల వాహనంపై మిలిటెంట్లు దాడికి పాల్పడడంతో ఆరుగురు పోలీసులు చనిపోయారు. పోలీసులు అనంతనాగ్‌లో విధులు ముగించుకొని అచాబల్ తిరిగి వెళుతుండగా కుల్గాడ్ గ్రామంలో మిలిటెంట్లు కాల్పులు జరిపారు.

## చత్తీస్‌గడ్‌లో ఎన్‌కౌంటర్

చత్తీస్‌గడ్‌లోని సుకుమా జిల్లాలో చింతగుఫాలో 'ఆపరేషన్ పహారా' పేరుతో భద్రతా బలగాలు కూంబింగ్ నిర్వహిస్తున్నాయి. ఈ కూంబింగ్‌లో భద్రతా బలగాలకు మావోయిస్టులు ఎదురుపడడంతో జరిగిన కాల్పుల్లో నలుగురు జవాన్లు మృతి చెందగా, ఐదుగురు గాయపడ్డారు. ఈ ఘటనలో 12 మంది మావోయిస్టులు మృతి చెందినట్లుగా పోలీసులు చెపుతున్నా, ఘటనా స్థలంలో ఒక మావోయిస్టు మృతదేహం మాత్రమే లభ్యమైంది. బీజాపూర్ జిల్లా బసగూడ పరిధిలో జూన్ 24, 25న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు మావోయిస్టులు మృతి చెందగా, నలుగురు భద్రతా సిబ్బంది గాయపడ్డారు.

## ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రికి విద్యార్థుల నిరసన

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి యోగి ఆదిత్యనాథ్ బాధ్యతలు స్వీకరించిన తరువాత దళిత, ముస్లింలపై దాడులు పెరిగిపోతున్నాయని జూన్ 8న యూనివర్సిటీకి వచ్చిన సిఎం వాహనానికి అడ్డుగా రోడ్డుపై విద్యార్థులు బైటాయించారు. ఇందులో ఆల్ ఇండియా స్టూడెంట్స్ అసోసియేషన్, సమాజ్‌వాది ఛాత్ర సభ సంఘాలకు చెందిన విద్యార్థులు పాల్గొన్నారు. సహరాన్‌పూర్‌లో దళితులపై ఇటీవల జరిగిన దాడుల నేపథ్యంలోనే విద్యార్థులు ముఖ్యమంత్రిని అడ్డుకున్నారు.

## ఎన్‌డిటివిపై సిబిఐ దాడులు

ఎన్‌డిటివి ఛానెల్ వ్యవస్థాపకుడు ప్రణయ్ రాయ్ ఇంట్లో సిబిఐ జూన్ 5న సోదాలు నిర్వహించింది. 2009లో రుణ పరిష్కారం కింద ఐసిఐసిఐ బ్యాంక్‌కు 48 కోట్ల రూపాయల నష్టం కలిగించారని, షేర్ల తనఖా విషయాన్ని సెబికి చెప్పకుండా మోసం చేశారని ఆయనపై అభియోగాలు పెట్టింది. అయితే ప్రణయ్ రాయ్ ఈ అభియోగాలను ఖండించారు. సిబిఐ పేర్కొన్న రుణం ఎప్పుడో చెల్లించామని, ఇది తమపై కక్ష చర్యలుగా పేర్కొన్నారు. ఎన్‌డిటివిపై సిబిఐ దాడులకు నిరసనగా జూన్ 9న సీనియర్ పాత్రికేయులు ఢిల్లీలోని ప్రెస్‌క్లబ్‌లో సమావేశం అయ్యారు. ఇది కేంద్ర ప్రభుత్వం భయపెట్టే చర్యలుగా పేర్కొంటూ వీటిని వెంటనే ఆపేయాల్సిందిగా డిమాండ్ చేశారు. వీ

## అఫ్ఘనిస్తాన్‌లో బాంబు దాడులు

అఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్‌లో మే 31న ట్రక్కు బాంబు దాడి జరిగింది. వివిధ దేశాల రాయబార కార్యాలయాలు ఉండే జాన్‌బాక్ స్క్వేర్ ప్రాంతంలో రద్దీ ఉన్న సమయంలో దాడి జరిగింది. ఈ దాడిలో తొంబై మందికి పైగా చనిపోగా, నాలుగు వందల మందికి పైగా గాయపడ్డారు. ఈ ఘటనలో ఎక్కువగా సాధారణ పౌరులు మరణించారు. టర్కీ, ఫ్రాన్స్, జర్మనీ, ఇరాన్, భారత్, అమెరికా రాయబార కార్యాలయాల సమీపంలో దాడి జరిగింది. ఇస్లామిక్ స్టేట్ ఈ దాడికి పాల్పడినట్లు ప్రకటించింది.

## పారిస్ ఒప్పందం నుంచి వైదొలిగిన అమెరికా

ప్రపంచ దేశాల పర్యావరణ ఒప్పందం 'పారిస్ పర్యావరణ ఒప్పందం' నుంచి అమెరికా వైదొలిగింది. జూన్ 1న అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ఈ నిర్ణయాన్ని ప్రకటించాడు. వాతావరణంలోకి కార్బన్ ఉద్గారాలను నియంత్రించి, తద్వారా భూతాపాన్ని తగ్గించాలన్నది ఒప్పందంలోని ప్రధాన లక్ష్యం. అమెరికాతో సహా దాదాపు రెండు వందల దేశాలు ఈ ఒప్పందంపై సంతకాలు చేశాయి. 2015లో ఐక్యరాజ్యసమితి నేతృత్వంలో ఈ ఒప్పందంపై అంగీకారం కుదిరింది. ప్రపంచంలోనే అధికంగా బొగ్గును, శిలాజ ఇంధనాన్ని ఉపయోగిస్తున్న అమెరికా భారీస్థాయిలో కార్బన్ ఉద్గారాలను విడుదల చేస్తున్నది. ఈ ఒప్పందానికి కట్టుబడి ఉంటే గనుక అమెరికా బొగ్గు, చమురు ఉత్పత్తిని, వాడకాన్ని తగ్గించుకోవాల్సి ఉంటుంది. పారిశ్రామికంగా నష్టం తెస్తుందని ట్రంప్ ఈ ఒప్పందం నుంచి వైదొలుగుతున్నట్లు ప్రకటించాడు.

## ఉత్తర కొరియాపై మరిన్ని ఆంక్షలు

ఉత్తర కొరియాపై మరిన్ని ఆంక్షలు విధిస్తూ ఐక్యరాజ్య సమితి భద్రతా మండలి జూన్ 3న తీర్మానం చేసింది. ఈ తీర్మానాన్ని భద్రతా మండలి ఏకగ్రీవంగా ఆమోదించింది. ఉత్తర కొరియా అణు కార్యక్రమంతో సంబంధమున్న పదిహేను కంపెనీలపైన, నాలుగు సంస్థలపైన ఈ ఆంక్షల్ని అమలు చేయాలని నిర్ణయించారు. తాజా తీర్మానం మేరకు ప్రపంచంలో ఏ దేశంలోనూ ఉత్తర కొరియా పౌరులు పర్యటించడానికి వీల్లేదు. ప్రపంచంలోని ఆ దేశానికి చెందిన ఆస్తులన్నిటినీ సీజ్ చేస్తాయి.

## నేపాల్ ప్రధానమంత్రి షేర్ బహదూర్ దేవ్‌బా

నేపాల్ ప్రధానమంత్రిగా నేపాలీ కాంగ్రెస్ చైర్మన్ షేర్ బహదూర్ దేవ్‌బా ఎన్నికయ్యారు. ప్రచండ రాజీనామా తరువాత జూన్ 6న జరిగిన ఓటింగ్‌లో పార్లమెంట్‌లో మొత్తం 593 సభ్యులకు గాను 388 మంది అనుకూలంగా, 170 మంది వ్యతిరేకంగా ఓటు వేశారు. దీంతో నాలుగోసారి నేపాల్ ప్రధానిగా దేవ్‌బా జూన్ 7న ప్రమాణస్వీకారం చేశారు.

## ఇరాన్‌లో ఆత్మాహుతి దాడులు

ఇరాన్‌లోని టెహ్రాన్ నగరంలో జూన్ 7న తీవ్రవాదులు దాడులు జరిపారు. ఈ దాడుల్లో పన్నెండు మంది మరణించగా, నలభై మందికి పైగా గాయపడ్డారు. ఐదుగురు తీవ్రవాదులు మారువేషంలో పార్లమెంట్‌లోకి దూసుకు వచ్చి కాల్పులు జరిపారు. కొద్దిసేపటికి తనను తాను పేల్చుకున్నాడు. అదే సమయంలో అక్కడి నుంచి కొద్దిదూరంలో ఉన్న ఇరాన్ విప్లవ నాయకుడు ఆయాతుల్లా ఖొమైనీ సమాధుల వద్ద మరో సాయుధుడు కాల్పులు జరిపాడు. అనంతరం తనను తాను పేల్చుకున్నాడు. ఈ రెండు దాడులకు పాల్పడింది తామేనని ఇస్లామిక్ స్టేట్ సంస్థ ప్రకటించింది.

## బంగ్లాదేశ్‌లో వరదలు

బంగ్లాదేశ్‌లో వరదలు బీభత్సం సృష్టించాయి. భారీవర్షాలతో బంగ్లాదేశ్ అస్తవ్యస్తమైంది. జూన్ 12న కురిసిన భారీ వర్షాలకు, ఈదురు గాలులు తోడవడంతో కొండచరియలు విరిగి పడి భారీ నష్టం సంభవించింది. దాదాపు నూట యాభై మందికి పైగా మరణించారు. మూడు లక్షల మందికి పైగా వరదల వల్ల తీవ్ర ఇబ్బందులకు గురయ్యారు. ఐదు వేల ఇళ్లు నేలమట్ట మయ్యాయి. కొండ చరియలు విరిపడడంతో సహాయక చర్యలకు తీవ్ర అంతరాయం కలిగింది.

## బ్రిటన్ పార్లమెంట్ ఎన్నికలు

బ్రిటన్ పార్లమెంట్ ఎన్నికలు జూన్ 8న జరిగాయి. 650 స్థానాలకు ఎన్నికలు జరగగా అధికార కన్జర్వేటివ్ పార్టీ 318 స్థానాల్లో (48.5 శాతం ఓట్లు) గెలిచింది. ప్రధాన ప్రతిపక్షం లేబర్ పార్టీ 261 స్థానాలు (40.2 శాతం ఓట్లు) గెలుచుకుంది. ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి 326 స్థానాలు అవసరం. ఈ నేపథ్యంలో కన్జర్వేటివ్ పార్టీ అధ్యక్షురాలు, దేశ ప్రధానమంత్రి థెరిస్సా మే డెమోక్రాటిక్ యూనియన్ పార్టీ (డియుపి)తో కలిసి సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు చేయనున్నట్లు ప్రకటించారు. ఐర్లాండ్‌లో డియుపికి పది స్థానాలు దక్కాయి. ఈ నేపథ్యంలో జూన్ 19 నుంచి యూరోపియన్ యూనియన్ నుంచి బయటకు వచ్చే ప్రక్రియ (బ్రెగ్జిట్)కు చర్చలు ప్రారంభ మయ్యాయి. సరిహద్దులు, వలసలు, ఉద్యోగాలు, వాణిజ్యం, రవాణా వంటి అనేక అంశాలపై బ్రిటన్-ఇయు కూటమి ప్రతినిధులు ఒక అవగాహన కుదుర్చుకోవాల్సి ఉంటుంది.

## క్యూబా పై మళ్లీ ఆంక్షలు

క్యూబాతో కుదిరిన ఒప్పందాన్ని అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ పాక్షికంగా రద్దు చేస్తున్నట్లు జూన్ 17న మియామీలో ప్రకటించారు. కొత్త ఒప్పందం ద్వారా వ్యాపారం, పర్యాటకంపై నిబంధనల్ని కఠినతరం చేస్తామనీ, అయితే దౌత్యపరమైన, వాణిజ్య సంబంధాలు అలాగే కొనసాగుతాయని తెలిపారు. ఈ నిర్ణయం వెంటనే అమల్లోకి వస్తుందని ప్రకటించాడు. రాజకీయ ఖైదీలను విడిచిపెట్టేంత వరకు క్యూబాపై ఆంక్షలు కొనసాగించాల్సిందేనని అన్నారు.

## పోర్చుగల్ అడవిలో అగ్ని ప్రమాదం

పోర్చుగల్‌లోని ఓ అడవిలో అగ్ని ప్రమాదం సంభవించింది. జూన్ 18న చెలరేగిన ఈ కార్చిచ్చులో 64 మంది సజీవంగా దహనమయ్యారు. అగ్ని ప్రమాదానికి వాయువేగం తోడవడంతో అడవికి దగ్గరలోని పెడ్రోగావ్ గ్రాండె అనే పట్టణాన్ని చుట్టుముట్టింది. దీంతో అక్కడ నివసిస్తున్న వారిని తరలించే ప్రయత్నంలో వారు అడవిబాటలో చిక్కుకొన్నారు. దీంతో ప్రాణ నష్టం భారీగా సంభవించింది. మంటలను అదుపు చేసేందుకు 160 అగ్నిమాపక యంత్రాలు, 600 మంది సిబ్బంది తీవ్రంగా కృషిచేశారు.

## ఖతార్‌పై అరబ్ దేశాల ఆంక్షలు

ఖతార్‌తో దౌత్య సంబంధాలు పూర్తిగా నిలిపివేస్తున్నట్లు అరబ్ దేశాలు జూన్ 5న ప్రకటించాయి. ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్), అల్‌ఖైదా తదితర వేర్పాటువాద గ్రూపులకు మద్దతు పలుకుతూ, చుట్టుపక్కల దేశాలను అస్థిరపరుస్తున్న కారణంగా ఈ నిర్ణయం తీసుకున్నట్లు ప్రకటించాయి. సౌదీ అరేబియా, ఈజిప్ట్, బహ్రెయిన్, యూనైటెడ్ అరబ్ ఎమిరేట్స్, లిబియా దేశాలు ఈ నిర్ణయం తీసుకున్నాయి. ఈ ఆరోపణల్ని ఖతార్ తీవ్రంగా ఖండించింది. ఇరాన్ వెనుకుండి నడిపిస్తున్న తీవ్రవాద గ్రూపులకు ఖతార్ మద్దతు ఇస్తుందనీ సౌదీ అరేబియా ఆరోపించింది. ఖతార్‌తో ఉన్న సరిహద్దులను, సముద్ర, వాయు మార్గాలను మూసివేసింది. ఆంక్షల్ని ఎత్తివేసేందుకు అరబ్ దేశాలు జూన్ 23న 13 డిమాండ్‌లు పెట్టాయి. ఇవి ఎంత మాత్రం ఆమోదయోగ్యం కావని ఖతార్ నిరసన తెలిపింది. ఆంక్షల వల్ల ఖతార్‌లో తీవ్ర ఆహార కొరత ఏర్పడింది. ఖతార్‌కు మద్దతుగా ఇరాన్ ఆహారం సరఫరా చేసింది.

## పాకిస్తాన్‌లో ఘోర ప్రమాదం

పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రంలో జూన్ 25న ఘోర ప్రమాదం సంభవించింది. పంజాబ్ రాష్ట్రం బహవాల్‌పూర్‌లోని అహ్మద్‌పూర్‌లో ఆయిల్ ట్యాంకర్ రోడ్డుపై బోల్తా పడిపోయింది. అందులో నుంచి ఆయిల్ బయటికి రావడం చూసిన చుట్టుపక్కల వాహనదారులు, ప్రాంతాల వారు ఆయిల్ పట్టుకుపోవడానికి చేరుకున్నారు. ఇంతలో పేలుడు సంభవించింది. ఈ పేలుడులో నూట యాభై మందికి పైగా చనిపోయారు. వంద మందికి పైగా తీవ్ర గాయలయ్యాయి. చుట్టుపక్కల నిలిపి ఉన్న కార్లు, వాహనాలు దగ్ధమయ్యాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(మే 1 నుండి మే 31, 2017 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1029), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (1134) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2163)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు: వ్యవసాయ రంగం | ఆత్మహత్యలు: చేనేత రంగం | ఆత్మహత్యలు: ఇతరాలు స్త్రీ | ఆత్మహత్యలు: ఇతరాలు పు. | చికిత్స అందక, అనారోగ్యం: స్త్రీ | చికిత్స అందక, అనారోగ్యం: పు. | చికిత్స అందక, అనారోగ్యం: పి. | గుర్తు తెలియని: స్త్రీ | గుర్తు తెలియని: పు. | హత్యలు: స్త్రీ | హత్యలు: పు. | ప్రమాదాలు: పనిచేసే స్థలంలో | ప్రమాదాలు: కరెంట్ | ప్రమాదాలు: రహదారి | ప్రమాదాలు: ఇతరాలు | పోలీసు కాల్పుల్లో: ఉద్యమ కారులు | పోలీసు కాల్పుల్లో: ఇతరులు | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 2 | – | 20 | 22 | 8 | 4 | 5 | 3 | 3 | 3 | 2 | – | 2 | 26 | 32 | – | – | – | 5 | 4 |
| హైదరాబాద్ | – | – | – | 11 | 7 | 4 | 3 | – | – | 1 | 2 | 5 | 1 | 1 | 22 | 16 | – | – | – | – | 2 |
| కరీంనగర్ | – | 4 | 2 | 6 | 5 | – | 4 | – | 1 | 1 | 1 | 2 | 2 | 1 | 26 | 12 | – | – | – | – | 29 |
| ఖమ్మం | – | 1 | – | 4 | 11 | 1 | – | 1 | – | – | 1 | 1 | 1 | 1 | 32 | 10 | – | – | – | – | 79 |
| మహబూబ్‌నగర్ | – | – | – | 15 | 8 | 4 | 5 | 3 | – | 5 | 4 | 6 | 14 | 8 | 54 | 3 | – | – | – | – | 10 |
| మెదక్ | 1 | 26 | – | 9 | 8 | 9 | 19 | 1 | 3 | 2 | 14 | 6 | 19 | 19 | 22 | 17 | – | – | – | 2 | 1 |
| నల్గొండ | 1 | 3 | – | 2 | 8 | 1 | 2 | – | 1 | – | – | 3 | 2 | 7 | 25 | 12 | – | – | – | – | 34 |
| నిజామాబాద్ | – | – | – | 7 | 2 | 1 | 3 | 1 | 1 | 1 | – | 1 | 2 | 2 | 12 | 14 | – | – | – | – | 4 |
| వరంగల్ | – | 1 | – | 5 | 2 | 1 | 4 | 1 | 1 | – | 1 | 1 | 2 | 2 | 24 | 12 | – | – | – | 1 | 9 |
| వికారాబాద్ | – | 1 | – | 1 | 1 | 2 | 1 | 1 | – | – | 2 | 1 | – | – | 17 | 4 | – | – | – | – | 7 |
| **తెలంగాణ** | **2** | **38** | **2** | **80** | **74** | **31** | **45** | **13** | **10** | **13** | **28** | **28** | **43** | **43** | **260** | **132** | **-** | **-** | **-** | **8** | **179** |
| అనంతపురం | – | 4 | – | 14 | 19 | – | 1 | 1 | 2 | 2 | 2 | 1 | 10 | 4 | 39 | – | – | – | – | – | 25 |
| చిత్తూరు | – | – | – | 4 | 4 | 4 | 8 | – | – | – | 3 | 9 | 9 | 1 | 22 | 4 | – | – | – | – | 6 |
| కడప | – | 3 | – | 3 | 3 | – | – | – | 1 | 2 | – | 1 | – | 3 | 5 | 6 | – | – | – | – | 3 |
| గుంటూరు | – | 1 | – | 3 | 4 | 2 | 4 | 1 | – | 2 | 1 | 3 | 2 | 2 | 16 | 9 | – | – | – | – | 10 |
| కృష్ణా | – | – | – | 5 | 1 | 1 | 1 | – | 2 | 2 | – | 1 | 3 | 4 | 24 | 14 | – | – | – | – | 8 |
| కర్నూలు | – | 8 | 1 | 3 | 5 | 4 | 7 | 6 | 3 | 4 | 4 | 8 | 8 | 4 | 18 | 20 | – | – | – | – | 11 |
| తూర్పు గోదావరి | – | – | – | 1 | 2 | 4 | 3 | – | – | 4 | – | 3 | 2 | 4 | 21 | 18 | – | – | – | – | 23 |
| ప్రకాశం | – | 1 | – | 7 | 8 | 3 | 5 | – | 1 | 3 | 3 | 2 | 3 | 1 | 24 | 12 | – | – | – | – | 13 |
| శ్రీకాకుళం | – | – | – | – | 4 | 4 | 5 | 12 | 2 | 1 | – | 1 | 4 | 4 | 44 | 11 | – | – | – | 1 | 22 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 2 | 3 | 4 | 4 | – | – | 2 | 4 | 4 | 1 | 6 | 15 | 9 | – | – | – | – | 17 |
| నెల్లూరు | – | – | – | 5 | 4 | 3 | 4 | 4 | 1 | 4 | 4 | 3 | 2 | 1 | 22 | 13 | – | – | – | – | 48 |
| విజయనగరం | – | – | – | 5 | 6 | 2 | 4 | 1 | – | 5 | 1 | 2 | 1 | 4 | 31 | 7 | – | – | – | – | 20 |
| విశాఖపట్నం | – | – | – | 3 | 12 | 3 | 8 | – | 2 | 8 | 1 | 2 | 8 | 3 | 15 | 5 | – | – | – | 10 | 22 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **17** | **1** | **55** | **75** | **34** | **54** | **25** | **14** | **39** | **23** | **40** | **53** | **41** | **296** | **128** | **-** | **-** | **-** | **11** | **228** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో శోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| గుజరాత్ ఫైల్స్ | రానా అయూబ్ | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | రు. 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |
| మార్క్సిస్టు నిఘంటువు-1 | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 350 |
| మార్క్సిస్టు పదకోశం | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 50 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఒయ్యి'ద్దకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 192 - July 2017 • **ISSN 2231-6892**
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/06/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19
Date of Posting : 29th, 30th

# వీక్షణంను ఆదుకోండి

## చందాలు చేర్పించండి, ప్రకటనలు, విరాళాలు సేకరించండి

### మళ్లీ ఒకసారి మీ స్నేహహస్తం కోసం వీక్షణం విజ్ఞప్తి

గత ఐదారు సంవత్సరాలుగా వీక్షణం ఆర్థిక పరిస్థితి దినదినగండంగా గడుస్తున్నదని మీ అందరికీ తెలుసు. వీక్షణం కార్యాలయాన్ని మామూలు కన్న సగం అద్దెకు ఇచ్చిన ఇంటి యజమాని, ఏనెలకానెల బిల్లు చెల్లించలేకపోయినా అరువుకు అచ్చువేసిపెట్టే ప్రింటింగ్ ప్రెస్ యజమానులు వంటివారి ఔదార్యం వల్ల, కనీసం ఐదుగురు సిబ్బంది అవసరమయ్యే చోట ముగ్గురు మాత్రమే మామూలుగా వచ్చే జీతంలో సగం జీతానికే పనిచేస్తున్న సిబ్బంది వల్ల వీక్షణం తక్కువ ఖర్చుతో నడుస్తున్నది. అయినా వీక్షణం వార్షిక ఖర్చు పన్నెండు లక్షల రూపాయలు కాగా, చందాలు, విడిప్రతి అమ్మకాలు, వీక్షణం దగ్గర అమ్మిన పుస్తకాల మీద వచ్చే ఆదాయం కలిసి సంవత్సరానికి ఆరు – ఏడు లక్షల రూపాయలు మాత్రమే తిరిగి వస్తున్నది. ఖర్చుకు సమానమైన ఆదాయాన్ని రాబట్టాలంటే పత్రిక విడిప్రతి ధర, చందా కనీసం రెట్టింపు చేయవలసి ఉంటుంది. పాఠకుల కొనుగోలు శక్తిని దృష్టిలో పెట్టుకున్నప్పుడు అది అసాధ్యం.

అందువల్లనే వీక్షణం ఆ లోటును విరాళాల ద్వారా, వ్యాపార ప్రకటనల ద్వారా పూరించుకోవడానికి ప్రయత్నిస్తున్నది. గతంలో లోటులో సగం దాకా పూరిస్తుండిన ప్రకటనలు కూడ ఇటీవల తగ్గిపోయాయి. వీక్షణం ప్రతి సంవత్సరం దాతల దగ్గరికి వెళ్లి విరాళాలు సేకరించి, అప్పులు తీర్చి, మరుసటి సంవత్సరానికి తనను తాను సిద్ధం చేసుకుంటున్నది. మూడు సంవత్సరాల కింద తెలుగు సామాజిక, సాహిత్య రంగాల ప్రముఖులు కొందరు వీక్షణంకు చేయూతనిమ్మని చేసిన విజ్ఞప్తికి ప్రతిస్పందించి ఎందరో దాతలు విరాళాలు ఇవ్వడానికి ముందుకొచ్చారు. అలా 2016లో వీక్షణం అభిమానుల నుంచి ఏనెలకానెల అందిన విరాళాలు రు. 2,59,500. అప్పటికీ ఆ సంవత్సరంలో ఏర్పడిన మరొక రెండున్నర లక్షల రూపాయల లోటును దాతల దగ్గరికి వెళ్లి తీర్చుకున్నాం.

ఈ సంవత్సరం మళ్లీ అదే పరిస్థితి కొనసాగుతున్నది. ఏనెలకానెల దాతల ఔదార్యంతో, విరాళాలతో, సహకారంతో పత్రిక క్రమం తప్పకుండా వెలువడుతూ వస్తున్నది. కాని ఆ ఆశావహ పరిస్థితి కూడ నానాటికీ తరిగిపోతున్నదని అనిపిస్తున్నది. ఇప్పుడిక వీక్షణం మరొకసారి పాఠకుల, అభిమానుల, దాతల వైపు చూడక తప్పడం లేదు. మాకేమీ శాశ్వత నిధి ఆశలు లేవు. పత్రిక ఒక సామాజిక, చారిత్రక అవసరాన్ని తీరుస్తున్నదని, దీన్ని క్రమం తప్పకుండా తీసుకురావాలని తప్ప మాకు గొంతెమ్మ కోర్కెలేమీ లేవు. ఈ కనీస అవసరాన్ని తీర్చే బాధ్యత తీసుకోవలసింది వీక్షణం పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు, దాతలు మాత్రమే... తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణావేదిక, రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ఆగిపోకుండా ఆదుకోవలసింది మీరే.

- **ప్రతి చందాదారూ మరొక చందాదారును చేర్పించవచ్చు**
- **తమ తమ ప్రాంతాల్లో న్యూస్ స్టాల్స్‌లో వీక్షణం అమ్మడానికి ఏర్పాట్లు చేయవచ్చు**
- **తమ తమ ప్రాంతాల్లో లైబ్రరీల్లో, కాలేజీల్లో, ఆఫీసుల్లో వీక్షణం చందాలు చేర్పించవచ్చు**
- **ప్రకటనలు, విరాళాలు ఇవ్వగలిగిన దాతలకు వీక్షణంను పరిచయం చేయవచ్చు**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao